శ్రీ తులసీదాసకృత

# శ్రీ రామచరిత మానసము

ప్రథమ భాగము

వ్యాఖ్యాత్రి
ఆర్. ఇందిరాదేవి



ప్రచురణ :
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
1984

శ్రీ తులసీదాసకృత

# శ్రీ రామచరిత మానసము

వ్యాఖ్యాత్రి

ఆర్ ఇందిరాదేవి




ప్రచురణ

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

1982

SRĪ RAMACARITA MANASAMU

*Telugu Translation by*
Smt R INDIRA DEVI

T T D Religious Publications Series No 140

First Edition 1982
Copies 2000

*Published by*
G Kumaraswamy Reddy I A S
Executive Officer
T T Devasthanams,
Tirupati

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati 517 501

శ్రీ వేంకటేశ్వరాయ నమః

శ్రీ తిరుమల శ్రీనివాసుని అనురాగ

రంజిత పదద్వయిపై నేనర్పించి

యర్పించు ప్రథమ రాగమయ

రమ్య కుసుమమాలిక

# ముందుమాట

భారతీయ సమాజం సంక్షోభానికి గురి అవుతున్న సంధిసమయంలో – పదహారవ శతాబ్దంలో అవతరించిన గోస్వామి తులసీదాసు వేయేళ్ల హిందీ వాఙ్మయాకాశంలో అద్వితీయ ఆదిత్యస్వరూపుడు. సంఘవ్యవస్థలో సడలిపోయిన కట్టుబాట్లను సరిదిద్దాలని ఆయన ఎంతో ఆరాటపడ్డాడు. ఆ వేదనాఫలితమే రామచరిత మానస రచన.

సంస్కృతంలో కాకుండా ఇతరభాషలలో కావ్యాలు వ్రాసేవారిని పండితులు అవహేళన అపహాస్యం చేసే రోజుల్లో సంస్కృతంలో మహాపండితుడై వుండి కూడా ప్రగతిశీలిగా, ప్రజాకవిగా, ప్రజలభాషలో రామాయణకావ్యం వ్రాసిన తులసీదాసు కేవలం హిందీ సాహిత్యానికే కాకుండా భారతీయ సాహిత్యానికే అనుపమ రత్నం. సమస్త జగత్తును సీతారామమయంగా భావించి, శ్రీరాముడిలో పరబ్రహ్మను దర్శించిన ఆ మహనీయుడు రామచరితకు సంబంధించిన ఎన్నో రచనలు చదివి వాటి సారాన్ని జీర్ణించుకుని, ఆ సంస్కారాన్ని తనభక్తిభావనకు అనుగుణంగా ఈ మహాకావ్యాన్ని రూపొందించాడు.

సమకాలీన సమాజానికి భక్తిమార్గాన్ని ప్రబోధించిన తులసీదాసు ప్రధాన లక్ష్యాలు సాంసారిక, సాంఘిక కర్తవ్యాలను ప్రోత్సహించడం, భగవద్భక్తిని ప్రేరేపించడం, మతసామరస్యాన్ని, సమన్వయాన్ని పెంపొందించడం. అందువల్లనే ఆదికవి వాల్మీకి తన రామాయణంలో ఒక ఆదర్శపురుషుడిగా, మహావీరుడిగా ధర్మజ్ఞుడిగా, సత్యవాక్పరిపాలకుడిగా తీర్చిదిద్దిన శ్రీరామచంద్రుడిని భక్తకవి తులసీదాసు ఒక అవతారపురుషుడిగా ఆరాధ్యదైవంగా అభివర్ణించాడు. అచంచలమానవత్వం స్ఫూర్తిగా లోపించిన ఆనాటి ప్రజాహృదయాలలో ఆత్మవిశ్వాసాన్ని పురికొల్పాడు.

ఈ రామచరిత మానస మహాకావ్యం తులసీదాసు అప్రమేయభక్తికి విశ్వశ్రేయోభావనకు, భక్తిపరాకాష్ఠకు, ఆదర్శౌన్నత్యానికి పరమావధి అని చెప్పడం

అతిశయోక్తి కాదు భక్తవత్సలుడూ అనంతగుణ సౌందర్యశక్తి సంపన్నుడూ, అయిన దశరథనందనుడి గుణగణాలనూ, లీలావినోదాలనూ వివరించే ఈ గ్రంథాన్ని శ్రీమతి ఆర్. ఇందిరాదేవి సరళసుందరశైలిలో అనువదించారు.

భక్తిజ్ఞాన ప్రబోధకాలైన ఉత్తమగ్రంథాలను ఇతోధికంగా ప్రచురించ డానికి తిరుమల తిరుపతి దేవస్థానముల వారు అవిరళకృషి చేస్తున్నారు. ఇలాంటి గ్రంథాలను అధ్యయనం చేయడంద్వారా ఆస్తికభక్తబృందం ఈశ్వరానుగ్రహం పొందుతుందని ఆశిస్తాము.

తిరుపతి,
21-10-1982

జి. కుమారస్వామిరెడ్డి,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు

# శుభాశంసనము

శ్రీమద్రామాయణము భారతీయులకు పరమపూజ్యమైనది శ్రీరామకథ ముక్తిప్రదాయకమైనది "శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్" అన్నమాట అనుభవపూర్వకమైనది ఈ రామకథ నెందరో మహానుభావులు కీర్తించిరి వాల్మీకిమహర్షి మొదలుగా ఈ కథ సమస్తభాషలందు వ్రాయబడినది శ్రీతులసీదాసు "రామచరితమానస్" అను పేర రచించిన మహాకావ్యమునకు ఉత్తరభారతము నందెంతో వ్యాప్తి కలదు హిందీభాషయందున్న ఈ గ్రంథము తద్భాషావిదులకు నిరంతర పఠనీయమై ఒక మంత్రరాజముగా విరాజిల్లుచున్నది భాషలో, భావములో, శైలిలో అత్యంతకీర్తినార్జించిన ఉద్గ్రంథమిది సంస్కృతమునందలి వాల్మీకి రామాయణము ఆ భాష తెలియని వారికొరకు అన్యభాషలలోని కనువదింపబడినట్లే తులసీదాస రామాయణము గూడ హిందీభాషానభిజ్ఞులకుపయోగపడు నిమిత్తమితరభాషలలోని కనువదింపబడినది వాల్మీకి రామాయణమునందలి కథకు వన్నెలుపెట్టునట్లుగా కథయందు గొన్నియపూర్వములైన మహత్త్వోపేతములైన మార్పులు చేర్పులు కనబడుచున్నవి ముఖ్యమైన, కథాభాగము మాత్రము సంపూర్ణముగా నిందున్నది

శ్రీమద్రామాయణమొక యాదర్శగ్రంథము శ్రీరామచంద్రుడాదర్శ మానవుడు ఆ మహాత్ముని కుటుంబమే ఆదర్శకుటుంబము నిత్యము శ్రీరామకథను జపించు సంప్రదాయము భారతీయులకు గలదు కనుక హిందీభాషయందుండు తులసీరామాయణము ననువదించుటకు పూనుకొనినవారియందు ప్రకృత గ్రంథకర్త్రి ఆర్. ఇందిరాదేవి గూడ ఒకరు ఈమెకుగల రామభక్తియే, ఈమెచేత నీగ్రంథమనువదింప జేయించినది తేటతెనుగుభాషలో-మృదుమధురమై భావానుగుణమై ఈ రచన యెంతో హృద్యముగానున్నదని చెప్పుటలో సందేహము లేదు ఎంతో కష్టపడి హిందీభాషను నేర్చుకొని మూలమునందలి భావము చెడకుండ - అక్కడక్కడ - పఠితల హృదయములను లోగొనజాలిన భక్తిభరిత భావములను వెల్లడించుచు ఈమె మానవోజ్జీవనమున కవసరమైన ఈ కార్యమును

నెరవేర్చుట చాలసంతోషకరమైన విషయము. ఇప్పటికీమె మూడుకాండ మాత్రమె ప్రచురించబడినవి. ఇక ముందు రావలసిన కాండ లన్నిటిని సులభ మూల్యముగా ప్రచురించి భక్తలోకమునకు మహోపకార మొనర్పగల రని యాశించుచున్నాను.

అచిరకాలములోనే మీ అభీష్టము నెరవేర్చుకొనునట్లు తిరుమలేశు డనుగ్రహించుగాక.

హైదరాబాద్,
12-1-81

పి. వి. చౌదరి,
దేవాదాయ-ధర్మాదాయ-శాఖామాత్యులు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

# కృతజ్ఞతాంజలి

అవధీభాషయందు శ్రీతులసీదాసవిరచితమైన శ్రీరామచరితమానసమును చదువుభాగ్యము నాకు కలిగినది ప్రతిదినము మా తండ్రిగారు నిర్మించిన శ్రీకృష్ణారవింద మందిరమునందు నిత్యభజన లొనర్చుచు శ్రీరామచరిత మానసమునుకూడ చదువుచు తన్మయత్వము నొందుచుంటిని ఒకనాడు శ్రీరామ చరితమానసము ననువదించుమన్న భగవత్ప్రేరణ నాకు కలిగెను కాని మహత్తరమైన మహానుభావునిచే రచింపబడిన శ్రీరామచరితమానసము నే ననువదించగలనా యన్న నిరుత్సాహముకూడ నాకు కలిగినది నాకు పాండిత్యము లేదే యని నేననుకొనుచుండ పోతనామాత్యుని వాక్కులు పలికెడిది భాగవతమట పలికించెడువాడు రామభద్రుండట నాకు జ్ఞప్తికి వచ్చినవి ఎట్టులైననేమి భగవానునిపై భారముమోపి, మద్గురువైన శ్రీసమర్థనారాయణమహారాజువారి పద్మములకు నమస్కరించి, కావ్యమనువదింప సాగితిని కొంతవఱకు కృత కృత్యురాలనైతిని

1972 వ సంవత్సరమున సెప్టెంబరుమాసమున "శ్రీరామచరితమానస చతుశ్శతీరాష్ట్రీయ సమితి" క్రొత్తఢిల్లీలో నెలకొల్పబడినది దానికి సంరక్షకులుగా రాష్ట్రపతి శ్రీ వి వి గిరిగారును, అధ్యక్షురాలుగా ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ గారును, ఇతర ప్రముఖులు సభ్యులుగాను నియమింపబడిరి పూజ్యశ్రీ తులసీదాసకృత శ్రీరామచరితమానస దివ్యకావ్యమును వివిధభాషల లోనికి అనువదించునట్లు అనువాదములను సమితివారు ముద్రించునటుల నిర్ణ యింపబడినది ఈ పనికి పూనుకొనినవారు పై సమితివారికి వ్రాయవలెనని ప్రకటింపబడినది

ఈ ప్రకటన చదివి నేను శ్రీమతి ఇందిరాగాంధీ గారికి 30-11-72 తేది, తెలుగుభాషలో అనువదించిన శ్రీరామచరితమానసమును ప్రచురింప వేడుకొనుచు ఒకజాబు వ్రాసికొంటిని ఆమె ఈ విషయమై మిగుల శ్రద్ధవహించి దీనిని పరిశీలించి ప్రచురించవలసినదిగా సమితివారికి వ్రాసిరి సమితివారు అనువాద

ప్రతిని పంపుమనగా కొంత భాగమును పంపితిని కేంద్ర ప్రభుత్వమువారు ఈ అనువాదమును ప్రచురింతుమని వ్రాసిరి ఈ విషయమై వారికి నాకు ఆంధ్ర ప్రభుత్వమునకు ఉత్తర ప్రత్యుత్తరములు జరిగి ఫలితమేమియు కలుగలేదు

ఇట్లుండగా పైవిషయములన్నియు ఆంధ్రరాష్ట్ర దేవాదాయములమంత్రి మాన్యశ్రీ ఎ వి చౌదరిగారికి విన్నవించి, వారిని నా పుస్తకము తిరుపతి దేవస్థానములవారిచె అచ్చువేయించు సహాయమును కోరితిని వారు కరుణార్ద్ర హృదయముతో నా విన్నపమంగీకరించి శ్రీరామచరిత మానసము అచ్చువేయుటకు అనుకూలించిరి తిరుపతి శ్రీవేంకటేశ్వర భగవానుని కృపతో శ్రీరామచరితమానసము తెలుగు అనువాదము వెలుగులోనికి వచ్చినది ఈ సద్గ్రంథ ప్రచురణకు జేయూత నొసగి వెలుగులోనికి దెచ్చినందులకు దేవాదాయ ధర్మాదాయశాఖామాత్యులైన మాన్యశ్రీ ఎ వి చౌదరిగారికి నా కృతజ్ఞతాంజలి నర్పించుకొనుచున్నాను శ్రీవేంకటేశ్వర భగవానుడాయనకు ఆయురారోగ్యము లొసంగి యింకను సారస్వతసేవ జేయుటకు శక్తిసామర్థ్యములు ప్రసాదించి అనుగ్రహించుగాక !

తమ ప్రకృతి పత్రికలో కొంతకాలము నా యీ రచనను ప్రచురించినందులకు శ్రీ డా॥ బి వెంకటరావు, శ్రీమతి విజయలక్ష్మిగారలకు నా కృతజ్ఞతాభివందనములు ఈ శ్రీరామచరిత మానసమును స్వీయప్రచురణగా స్వీకరించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారికిని, అందముగ అచ్చొత్తిన తి తి దేవస్థాన ముద్రణాలయమువారికిని నా హృదయపూర్వక ప్రణామములు

నేను ప్రథమముగా బాలకాండ ఆంధ్రుల కందించుచున్నాను భగవానుని కృపచే శీఘ్రకాలములో తక్కిన కాండలతో సంపూర్ణ రామచరితము ఆంధ్రలోకమునకు సమర్పింపగలనని విశ్వసించుచున్నాను

ఈ మహాకావ్యములో నైతిక, రాజకీయ, సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక విషయము లెన్నియో వివరింపబడినవి ఎల్లరు పఠించి ధన్యులగుదురుగాక !

అనంతపురం — ఆర్ ఇందిరాదేవి

21-10-82

# విషయసూచిక

# శ్రీ తులసీదాసు సంగ్రహజీవితము

భారతదేశము ఋషిపుంగవులకు, దివ్యకవులకు, సాధుజనులకు పుట్టినిల్లు ఈ పవిత్రభూమిలో అనాదిగ మహనీయు లుద్భవించి తమ నిర్మలప్రేమచే, సామాన్యమానవులకు కల్యాణసౌఖ్యములను ప్రసాదించి తరింపజేయుచుండిరి

15, 16 వ శతాబ్దములలో, భారతదేశము మతకల్లోలములతోను, రాజకీయకలహములతోను నిండి, ఎచ్చట జూచినను ప్రజలకు శాంతిభద్రతలు లేకుండినవి దేశములో పండితు లున్నను వీరి పాండిత్యము జ్ఞానరహితమైనందున కలహములను ఆపుటకు బదులు వానికి ప్రోద్బలమిచ్చి, అశాంతి నెక్కువ చేసినది అట్టితఱి, కొందరు మహనీయులు జన్మించి దేశోద్ధారము గావించిరి

ఉత్తరహిందూస్థానములో ఇట్టి క్లిష్టపరిస్థితులయందు అవతరించిన మహాపురుషులలో నొకరు పూజనీయులైన శ్రీ తులసీదాసు ఈ మహనీయుడు భక్తుడే కాదు, మరియు జ్ఞాని తులసీదాసు దీర్ఘకాలము జీవించి భారతీయసంస్కృతిని పెంపొందించెను యోగిపుంగవుల యంతర్గత్తు మన యూహకందరానిది వారి జీవితవిశేషములను చిత్రించుట కష్టతరమే! సత్పురుషుల జీవిత మెక్కువగా ఆంతరికముగా నున్నందున వారి బాహ్యచర్యల నవగాహనము చేసికొనుట కడుదుస్తరము ఐనను ఈ ఋషిపుంగవుడు స్వయముగా ధ్యానసీమలో నుపలబ్ధిపొంది దేశభాషలో శ్రీరామచరితమానసమును రచించెను దివ్యకావ్యమైన రామచరితమానసము కడు ప్రశంసనీయము, రమ్యము, జీవయాత్ర సలుపుటకు మార్గదర్శినియై యొప్పారుచున్నది ఈ మహానుభావుని సంపూర్ణ జీవితచరిత్ర

వ్రాయుట కష్టతరము కాన పాఠకులకు సంగ్రహముగ నందించు చున్నాను దీనిని చదివినవా రెల్లరును శ్రేయస్సు పొందుదురని ఆశించుచున్నాను

ప్రయాగక్షేత్రమున బాందాజిల్లాలో రాజపురమను గ్రామ మొకటి కలదు అక్కడ ఆత్మారామదూబే యను సద్బ్రాహ్మణుడు నివసించుచుండెను ఆతని భార్య హులసీదేవి ఆ పుణ్యదంపతులకు 1554 వ సంవత్సరమున అభుక్తమూల నక్షత్రమునందు శ్రావణశుక్ల సప్తమీదినసమునందు, పండ్రెండుమాసములు తల్లిగర్భములోనుండిన తర్వాత శ్రీతులసీదాసు జన్మించెను జన్మసమయమున ఆ శిశువు ఏడ్వ లేదు కాని వాని నోటినుండి రామ 'యన్న శబ్దము వచ్చెను అట్టి తటి ఆ శిశువునకు నోటిలో మల్లెమొగ్గలవంటిపండ్లు మొలచియుండెను వాని వైఖరిజూడ ఐదేండ్లబాలకుడుగా నుండెను ఆ బాలకునిగాంచి తండ్రియైన ఆత్మారామదూబే మిగుల భయము జెందెను కొందరు వీడు దయ్యపుపిల్లవా డనిరి అంతటితో ఆ బాలకునిగురించిన దిగులు ఆయన కధిక మాయెను ఆత్మారాముడు కొంత జ్యోతిష్కుడు జ్యోతిష్యము వలన ఆర్జించిన జ్ఞానము ఆ పిల్లవాని నుపేక్షించుటకే పనికి వచ్చినది అయన భార్యయైన హులసీదేవి ఆ బిడ్డను గన్నం దుకు మిగుల చింతిల్లెను అనిష్టబాలునివలన అనర్థములు సంభవించు నన్న శంకచే ఆమె దశమినాటిరాత్రి ఆ నవజాతశిశువును తనదాసికి ఒప్పజెప్పెను అప్పుడామె పొందిన దుఃఖ మామెకే ఎఱుక! దాసి యైన చునియా ఆ శిశువును అత్తవారింటికి గొనిపోయినది మరు సటి దినమున భరింపరాని దుఃఖముతో తల్లి ఈ అసారమైన ప్రపం చమునుండి నిష్క్రమించెను చునియా బాలకుని కడుప్రేమతో లాలించి పోషించెను, బాలుడైన తులసీదాసునకు సుమారు ఐదున్నర సంవత్సరముల ప్రాయము వచ్చినపుడు చునియాకూడ మరణించెను, బాలు డనాథు డయ్యెను తనపుత్రుడు నిరాశయుడని తండ్రికిం

దెలిసినను ఆతడు చెవిలో వేసికొనలేదు ఈ నిస్సహాయస్థితిలో బాలు డిల్లిల్లు తిరుగజొచ్చెను ఈ బాలకునిపై జగజ్జననియైన పార్వతికి దయ కలిగెను ఆమె బ్రాహ్మణజాతి ముత్తైదువు రూపమున ప్రతి దినము ఆ బాలకునివద్దకేగి, వానికి భోజన మిడుచు, అతిప్రేమతో లాలించుచుండెను అనాథుడగు తులసీదాసునకు సాక్షాత్ మహే శ్వరీసాన్నిధ్యమే లభించెను

ఇట్లు కొంతకాలము గడచిన తర్వాత ఈశ్వరుని ప్రేరణచే రామశైలమునందు నివసించు శ్రీ శతానంద ప్రియశిష్యుడైన శ్రీ నర హర్యానందుడు ఈ బాలకు నన్వేషించి కనుగొని వీనికి "రామబోలా" అన్న నామధేయ మొసగెను తదుపరి వానిని అయోధ్యకు బిలుచు కొనిపోయెను అచ్చట 1561వ సంవత్సరమున మాఘశుక్లపంచమీ శుక్రవారమునాడు ఆ బాలకునకు ఉపనయనము జేసెను ఉపదేశము చేయకయే గాయత్రీమంత్రమును రామబోలా యుచ్చరింపసాగెను, అదిమాచి అందరూ ఆశ్చర్యచకితులైరి యజ్ఞోపవీతసంస్కార మైనంతనే నరహరిస్వామి రామబోలాకు రామమంత్రదీక్ష నొసగెను అంతేకాదు, ఆయన అయోధ్యలోనే యుండి తులసీదాసునకు విద్యా భ్యాస మొనరించెను తులసీదాసు మిగుల బుద్ధిశాలి, ఏకసంథా గ్రాహి గురుశిష్యులు కొంతకాల మచ్చటనేయుండి తర్వాత సూకర క్షేత్రమున కేగిరి అక్కడ శ్రీ నరహరిస్వామి తులసీదాసునకు రామ చరితమును వినిపించెను తులసీదాసునకు గురుభక్తి మెండు, కనుకనే నరహరిస్వామిని కృపాసింధు వని ప్రశంసించెను 'నరరూపహరి' యనియు నుతించెను నరహరిస్వామి తులసీదాసుపై జూపిన ప్రేమయు అగాధమైనది కొన్నిదినములు గడచిన పిమ్మట వారిరు వురును కాశీక్షేత్రమును సందర్శింప వెడలిరి అచ్చట తులసీదాసు శేషసనాతునితోనుండి పదునైదువర్షముల పర్యంతము వేదవేదాంగ ముల నధ్యయన మొనరించెను ఇట్లు ఆధ్యాత్మికముగ పురోగమించు

చుండ ఖ రాత్రిగా తులసీదాసునందు లోకవాసన జాగృతి నొందెను
తత్క్షణమే అతడు గురువనుమతిని బడసి తన జన్మభూమికి మరలి
వచ్చెను. అచ్చట తన కుటుంబవాసులెల్లరును మరణించియుండిరి
తన బంధుమిత్రులకు విధిపూర్వకముగా శ్రాద్ధము నిడి అచ్చటనే
[illegible] రామకథను వినిపించసాగెను

ఇంతలో దీనబంధు అను బ్రాహ్మణుడు యమునా స్నానము
[illegible] మార్గమధ్యమున అతనికి తులసీదాసును జూచుట
[illegible] అతని కొక బిడ్డ యుండినది ఆమెపేరు రత్నావళి
1583 వ సంవత్సరమున జ్యేష్ఠశుక్ల త్రయోదశి గురువారమునాడు
భరద్వాజగోత్రమునకు సంబంధించిన సౌందర్యవతియైన యీ రత్నా
వళిని తులసీదాసు వివాహమాడెను నవవధువుతో తులసీదాసు
[illegible] కాలము సుఖముగ నుండెను రత్నావళియన్న తులసీదాసున
కమితప్రేమ క్షణకాలవియోగమును సహింపలేకుండెను ఒకసారి
ఆమె తన సోదరునితో పుట్టినింటి కేగినది ఆమెకు తెలియకుండ
తులసీదాసు ఆమెవెనుక మెల్లమెల్లగ వెంబడించి తుదకు గమ్య
స్థానము జేరెను తులసీదాసు ప్రవర్తన ఆమెకు వెగటాయెను
ఆశ్చర్యమును కలిగించెను ఆమె యిట్లు నుడివినది-

"లాజ్ నలాగత ఆప్ కొ దౌరే ఆయేహు సాథ్ ।
ధిక్ ధిక్ ఐసీ ప్రేమ్ కో కహా కహహు మై నాథ్ ॥
అస్థి చర్మమయ దేహ మమ తామెయి జైసీ ప్రీతి ।
తైసీ జౌ శ్రీరామమహ హోతి నతౌ భవభీతి ॥"

"ఛీ, ఛీ ఇట్లు నన్ను వెంబడించుట మీకు లజ్జాకరముగ లేదా!
ఎముకలతోగూడిన ఈ నా శరీరమునందు మీకెంత మక్కువ, ఆసక్తి
కలదో నా కిప్పు డవగత మైనది ఈ ప్రేమానురాగములలో సగమై
నను మీరు భగవానుని కర్పించియుండురేని మీరు సంసారసాగ
రమునుండి విముక్తి గాంచగలిగి యుందురు కదా!"

వ్యక్తిత్వమును, వేదాంతము నిమిడియున్న భార్య నుడివిన అర్థవంతములైన పలుకులు ఆయనను కదలించినవి స్థూలముగ ఆమె నుడివిన వాక్కులు సామాన్యములే యైనను తులసీదాసు భావిజీవితమున కవి ప్రథమసోపానములైనవి భార్య నోటినుండి యా మాటలువెలువడిన మరుక్షణము తులసీదాసామెను వదలి అక్కడనుండి వెడలిపోయెను తుదకు ప్రయాగక్షేత్రమునకు విచ్చేసెను ఆ మహాక్షేత్రమున తులసీదాసు గృహస్థవేషమును పరిత్యజించి సన్న్యాసమును స్వీకరించెను తీర్థయాత్రయు చేయుచు కాశీనగరమున కేతెంచెను మానససరోవరసమీపమున అతనికి కాకభుసుండియొక్క దర్శనము లభించెను

వారణాసియందు తులసీదాసు రామచరితమును జెప్పసాగెను అక్కడ అతనికి ఒకనాడు ప్రేత మగుపించెను ఆ ప్రేతము తులసీదాసునకు హనుమంతుని యునికిని గూర్చి దెలిపెను ప్రేత సూచన ప్రకారము తులసీదాసు హనుమంతుని దర్శించి, శ్రీరామదర్శనము తనకుజేయింపుమని ప్రార్థించెను తులసీదాసు భక్తితాత్పర్యములకు హనుమంతు డెంతయో సంతసించి "నీకు చిత్రకూటమునందు శ్రీరామదర్శనము లభింపగల"దనెను చిత్రకూటమున రామఘాటునందు తులసీదాసు అచంచలమైన భక్తివిశ్వాసములతో శ్రీరామపాదసేవాతత్పరుడై శ్రీరాముని నిరంతరము గొలుచుచుండెను ఒకనాడు హఠాత్తుగా శ్రీరామదర్శన మతనికి లభించెను ధనుర్బాణములను చేతఁబూని అశ్వారూఢులైన శ్రీరామలక్ష్మణులు శ్రీతులసీదాసునకు సాక్షాత్కరించిరి వారిని గాంచి తులసీదాసు ముగ్ధుడాయెనే గాని వారిని గుర్తింపజాలకపోయెను వారు వెడలిన తదుపరి హనుమంతుడు వారు రామలక్ష్మణులని చెప్పగా అతడు పశ్చాత్తాపము నొందుచు మిగుల వగచెను హనుమంతు డాతని నోదార్చి రామదర్శనము మరియు ప్రాతఃకాలమున లభింపగల దనెను

1607 వ సంవత్సరమున, అమావాస్య బుధవారమురోజున శ్రీరామచంద్రుడు తులసీదాసునకు ప్రత్యక్ష మాయెను అట్టితటి శ్రీతులసీదాసు రాములకై చందనము తయారుచేయుచుండెను శ్రీరాముడు బాలకరూపములో "స్వామీ! నా ఫాలపట్టికపై చందనము దిద్దుమా" యనెను తులసీదాసు ఆగ్రహాపూరితుడై వారిని గద్దించి తన్నుఁబోయెను ఈ పర్యాయము కూడ తులసీదాసు మోసపోకుండునటులు హనుమంతు డతిజాగరూకత వహించి, సమీపమున నున్న వృక్షముపై నాసీనుడై చిలుకరూపమున నిట్లు పల్కెను –

"చిత్రకూట కే ఘాటపర భఇ సంతన కీ భీర।
తులసీదాస చందన ఘిసే తిలక దేత రఘుబీర॥"

"చిత్రకూటమున సజ్జనబృందమునందు విరాజిల్లుచున్న తులసీదాసు రఘువీరునకు తిలకము దిద్దుటకై చందన మరుగతీసెను"

నర్మగర్భముగా పలికిన ఆ మాటలను విని తులసీదాసు భగవానుడైన శ్రీరామచంద్రుని గుర్తుపట్టగలిగెను అత్యద్భుతమైన, తేజోవంతమైన శ్రీరామరూపమును గాంచి తులసీదాసు తన్నుఁ తానే మరచెను రఘువీరుడు తన కరకమలములతో చందనము దీసికొని తులసీదాసు ఫాలపట్టికపై తిలకమును దిద్ది అంతర్ధాన మాయెను

1628 వ సంవత్సరమున హనుమంతుని ఆజ్ఞానుసారము తులసీదాసు మరల అయోధ్య కేతెంచెను ఆ దినములలో ప్రయాగయందు మాఘమాసోత్సవములు జరుగుచుండెను ఆ ఉత్సవములను జూచుచు తులసీదాసు కొన్నిదినము లక్కడ ఉండెను కొంతకాలమైన తర్వాత, ఒకవటవృక్షము క్రింద తులసీదాసునకు భరద్వాజ యాజ్ఞవల్క్యులు దర్శన మొసగిరి అతడు మరల వారణాసికి వచ్చి అక్కడ ప్రహ్లాదఘట్టమున ఒక బ్రాహ్మణగృహమునందు నివాసము నల్పెను ఇచ్చట తులసీదాసునకు కవితాశక్తి యలవడెను అంతనతడు సంస్కృతమునందు శ్లోకములను రచించెను కాని, పగలు

రచించిన శ్లోకములన్నియు రాత్రి లుప్తమగుచుండెడివి (తుడిచివేయబడుచుండెడివి) ఇట్లు ప్రతిదినము జరుగుచుండెడిది ఎనిమిదవ దినమున తులసీదాసునకు స్వప్నమునందు పరమేశ్వరుడు సాక్షాత్కరించి, "నీవు నీ స్వభాషలో కావ్యరచన గావింపు"మని నుడివి అంతర్ధానమాయెను తులసీదాసునకు మెలకువ గలిగెను అత డాసీనుడైనతోడనే శివపార్వతులు ప్రత్యక్షమైరి తులసీదాసు పార్వతీ పరమేశ్వరులకు సాష్టాంగనమస్కార మొనర్చెను అంత శివు డిట్లాదేశించెను "నీవు అయోధ్య కేగి దేశభాషయందు కావ్యరచన కొనసాగింపుము నాయాశీర్వాదప్రభావమువలన నీ కవిత్వము సామవేదముతో సమానముగ ఫలవంతమగును" అని నుడివి గౌరీశంకరు లంతర్ధానమైరి తులసీదాసు వారి అజ్ఞను శిరసావహించి, కాశినుండి అయోధ్య కేగెను

1631 వ సంవత్సరపు ప్రారంభమున, ఒక శుభముహూర్తమున శ్రీతులసీదాసు రామచరితమానస రచనను ప్రారంభించి దాదాపు దానిని రెండు సంవత్సరముల ఏడు మాసములలో పూర్తిగావించెను మార్గశిర శుక్లపక్షమునందు శ్రీరామకల్యాణ దినమున సప్తకాండలను సంపూర్ణ మొనర్చెను మరల భగవానుని ప్రేరణచే తులసీదాసు కాశీనగరమున కేతెంచెను, అక్కడ భగవానుడైన విశ్వనాథునికిని మాతాన్నపూర్ణేశ్వరికిని రామచరితమానసమును గానము చేసి వినిపించెను రాత్రి రామచరితమానసగ్రంథము దేవాలయమునందుంచబడెను ప్రాతఃకాలమున ద్వారమును తెఱచినంతనే ఆ గ్రంథముపై "సత్యం శివం సుందరం" అన్న మాటలును, దాని క్రింద పరమేశ్వరుని స్వహస్తలిపియు గానవచ్చెను దేవాలయమున అర్చనార్థము గుమిగూడిన జను లెల్లరకును "సత్యం శివం సుందరం" అను వాక్కులు వినిపించెను

ఈ మాహాత్మ్యమునుగూర్చి విన్నతోడనే పండితులకు ఈర్ష్యయుత్పన్న మాయెను వారెల్లరును గుమిగూడి తులసీదాసును నిందింపసాగిరి అంతేకాదు రామచరితమానసమును నిర్మూలించుటకు ప్రయత్నించిరి ఆ గ్రంథమును దొంగిలించుటకు గాను వారు ఇరువురు చోరులను బంపిరి ఆ చోరులు తులసీదాసుకుటీరమునకు బోయి చూడగా, అక్కడ ఇద్దరు వీరులు ధనుర్బాణములను చేత బట్టుకొని గస్తీ తిరుగుచుండిరి ఆ వీరు లత్యంత సుందరులు అందులో ఒకడు శ్యామల వర్ణుడు, ఇంకొకడు గౌరవర్ణము గలవాడు ఆ రము వీరుల దర్శనముచే చోరులబుద్ధి మారినది వారు చోరవృత్తిని మాని పవిత్రులై భగవద్భజనయందు లీనమైరి ఈ సంఘటనను గురించి తెలిసికొన్న తులసీదాసు తనవలన భగవానునికి కష్టము కలిగెనని భావించి కుటీరములోనున్న తన సామగ్రి నంతటిని నష్టము గావించి, తనగ్రంథమును తన మిత్రుడైన టోడర్ మల్ గృహమునం దుంచెను, తర్వాత నింకొకప్రతిని లిఖించెను దాని ఆధారముచే ప్రతిలిపులు తయారాయెను పుస్తకప్రచారము దినదినాభివృద్ధి గాంచెను

తులసీదాసుపతనమును వాంఛించిన పండితులకిప్పు డే యుపాయమును స్ఫురించలేదు వారెల్లరును శ్రీమధుసూదన సరస్వతీస్వామిని సమీపించి, ఆ గ్రంథమును పరిశీలించవలసినదిగ ప్రేరేపించిరి శ్రీ మధుసూదనసరస్వతీస్వామి ఆ గ్రంథమును గాంచి ప్రసన్నుడై తనసమ్మతి నీ విధముగ తెలియజేసెను

"ఆనందకాననే హ్యస్మిన్ జంగమస్తులసీ తరుః ।
**కవితామంజరీ భాతి రామభ్రమరభూషితా ॥**

"ఈ కాశీరూపమైన ఆనందవనములో తులసీదాసు వృద్ధియగుచున్న తులసిమొక్క అతని కవితారూపమైన మంజరి కడుసుందరమైనది దానియందు శ్రీరామరూపమైన భ్రమరములు సదా ఝుంకారములు చేయుచున్నవి "

ఈ ప్రశంస విన్న పండితులు కింకను ఈర్ష్య హెచ్చెను అంత పండితులెల్లరును సమిగూడి ఒక యుపాయము నాలోచించిరి అదేదన అన్నిటికంటెను పైన వేదములను, దానిక్రింద శాస్త్రములను, శాస్త్రముల క్రింద పురాణాదులను, అన్నిటికంటెను క్రింద రామచరిత మానసమును బెట్టి పండితులు ద్వారములను బంధించిరి ప్రాతః కాలమున దేవాలయపు తలుపులు దెఱచినంతనే శ్రీరామచరిత మానసము వేదములపై నుంచబడియుండెను ఇన్ని పరీక్షలకు తులసీదాసును గురిచేసినతర్వాత పండితులు లజ్జాన్వితులై తులసీ దాసును క్షమాభిక్ష వేడిరి, భక్తితో ఆయనచరణోదకమును సేవించిరి

ఒక బ్రాహ్మణుడు మరణించెను ఆతనిభార్య సహగమనము జేయుటకు వెళ్ళు సమయమున ఆమె తులసీదాసును జూచుట తటస్థించెను ఆమె ఆ మహానుభావుని ఆశీస్సుల నొందగోరి, భక్తితో ఆతనికి ప్రణమిల్లెను, తులసీదాసు "దీర్ఘ సుమంగళీ భవ" యని దీవించెను ఆశీర్వాద మొసగిన తదుపరి ఆమె భర్త మరణించెనని తెలిసెను తాము వచ్చువఱకు అతనని దహనము చేయవలదని చెప్పి, తులసీదాసు గంగానది కేగి అందు స్నానమాచరించి శ్రీరామ ప్రభువును ప్రార్థించగా మరణించిన వాడు సజీవు డాయెను

మరణించినవాడు సజీవుడాయెనన్న వార్త అక్బరు పాదుషాకు దెలిసి మహిమలు చూపుమని తులసీదాసు నడిగెను అంత తులసీదాసు శ్రీరామనామముదప్ప అన్య మెఱుగనని, యివ్విధ[illegible] సమాధాన మొసగెను




"లోక రసాతల భూతల మేం
రఘునాయక ఏక సహాయక మే[illegible]

"భూతలమునందును, రసాతలమునందు[illegible] సహా[illegible]రి రఘునాథు డొక్కడే"

అంత పాదుషా ఆగ్రహము బూని, తులసీదాసును ఖైదు చేసెను

"ఐసీ తోహి న బూఝియే హనుమాను హఠేలే—"

స్వామీ! అంజనేయా! నా పరిస్థితి నింకను నెఱుగవా అని అతిదీనముగా తులసీదాసు హనుమంతుని ప్రార్థించగనే హనుమంతుడు కోటనంతయు ధ్వంస మొనర్చెను అక్బరు చక్రవర్తివా శ్రీతులసీదాసుపాదములకు ప్రణమిల్లి శరణువేడెను అంత తులసీదాసు హనుమంతు నిట్లు ప్రార్థించెను

"అతి ఆరతి అతి స్వారథీ అతి దీన దుఖారీ" (వినయపత్రి

హనుమంతుడు చక్రవర్తిని కరుణించెను గోస్వామి తులసీదా మహాకవి, పరోపకారి, మహాపండితోత్తముడు, రామనామోపాసకుడ మహాయోగీశ్వరుడు తులసీదాసు దోహావలీ, కవితావలీ, గీతావ పార్వతీమంగళ్, జానకీమంగళ్, కృష్ణగీతావలీ, వైరాగ్యసంపాది ఇత్యాదిగ్రంథములను రచించి చరితార్థు డాయెను

ఒకసారి భక్తమీరాబాయి సంసారబాధలకు లోనయి త కష్టములను గూర్చి శ్రీతులసీదాసునకు ఉత్తరము ద్వారా విన్నవిం కొనెను భగవంతునిపై భక్తిలేని వారలను ఆత్మీయులైనను కో వైరులుగా భావించి, పరిత్యజించుటయే శ్రేయస్కరమని చెప్పుచు శ్రీతులసీదాసు అందులకు ఉదాహరణముగ భరతుని, విభీషణు ప్రహ్లాదుని పేర్కొని వారియడుగు జాడలలో ఆమెనుకూడ నడు మని ఆదేశించెను

శ్రీగోస్వామితులసీదాసు చూపిన మహిమ లనేకములు కొన్నింటినిమాత్ర మిందు చూపగలిగితిని శ్రీతులసీదాసకృతశ్రీరా చరితమానసమును సర్వులును భక్తిశ్రద్ధలతో జదివి శ్రీరామా గ్రహమునకు పాత్రులగుదురుగాక!

శ్రీరామచరితమానస

# పారాయణ విధి

శ్రీరామచరితమానసమును పారాయణచేయదలచినవారు ప్రథమమున శ్రీ తులసీదాసును, శ్రీ వాల్మీకిమహర్షిని, పరమేశ్వరుని ఆహ్వానించి మానసపూజ గావించి, తదుపరి సీతారాముల నాహ్వానించవలయును షోడశోపచార పూజగావించి వారిని ధ్యానించవలయును తదనంతరము రామాయణమును పారాయణము చేయవలయును ఇందుకు ఎలయు ధ్యానమంత్రములు క్రింద లిఖించుచున్నాను

అథ ఆవాహనమంత్రః

తులసీక నమస్తుభ్యమిహాగచ్ఛ శుచివ్రత ।
నైఋత్య ఉపవిశ్యేదం పూజనం ప్రతిగృహ్యతామ్ ॥

ఓం తులసీదాసాయ నమః

శ్రీవాల్మీకి నమస్తుభ్యమిహాగచ్ఛ శుభప్రద ।
ఉత్తరపూర్వయోర్మధ్యే తిష్ఠ గృహ్ణీష్వ మేఽర్చనమ్ ॥

ఓం వాల్మీకయే నమః

గౌరీపతే నమస్తుభ్యమిహాగచ్ఛ మహేశ్వర ।
పూర్వదక్షిణయోర్మధ్యే తిష్ఠ పూజాం గృహాణ మే ॥

ఓం గౌరీపతయే నమః

శ్రీలక్ష్మణ నమస్తుభ్యమిహాగచ్ఛ సహప్రియః ।
యామ్యభాగే సమాతిష్ఠ పూజనం సంగృహాణ మే ॥

ఓం శ్రీసపత్నీకాయ లక్ష్మణాయ నమః

శ్రీశత్రుఘ్న నమస్తుభ్యమిహాగచ్ఛ సహప్రియః ।
పీఠస్య పశ్చిమే భాగే పూజనం స్వీకురుష్వ మే ॥

ఓం శ్రీ సపత్నీకాయ శత్రుఘ్నాయ నమః

శ్రీభరత నమస్తుభ్యమిహాగచ్ఛ సహప్రియం ।
పీరకస్యోత్తరే భాగే తిష్ఠ పూజాం గృహాణ మే ॥

ఓం శ్రీ ఎపల్లకాయ భరతాయ । మః

శ్రీ హనుమన్ నమస్తుభ్యమిహాగచ్ఛ కృపానిదే ।
పూర్వభాగే సమాతిష్ఠ పూజనం స్వీకురు ప్రభో ॥

ఓం వాయుసుతే నమః

అథ ప్రధానపూజా చ కర్తవ్యా విధిపూర్వకమ్ ।
పుష్పాంజలిం గృహీత్వా తు ధ్యానం కుర్యాత్పరస్య ।

రక్తాంబోజదళాభిరామనయనం పీతాంబరాలంకృతం
శ్యామాంగం ద్విభుజం ప్రసన్నవదనం శ్రీసీతయా శోభిత
కారుణ్యామృతసాగరం ప్రియగణై ర్భ్రాతాదిభిర్భాషి
వందే విష్ణుశివాదిసేవ్య మనిశం భక్తేష్టసిద్ధిప్రదమ్ ॥

ఆగచ్ఛ జానకీనాథ జానక్యా సహ రాఘవ ।
గృహాణ మమ పూజాం చ వాయుపుత్రాదిభిర్యుతః ॥

ఇత్యావాహనమ్

సువర్ణరచితం రామ దివ్యాస్తరణశోభితమ్ ।
ఆసనం హి మయా దత్తం గృహాణ మణిచిత్రితమ్ ॥

ఇతి షోడశోపచారైః పూజయేత్

ఓం అస్య శ్రీమన్మానస రామాయణ శ్రీరామచరితస్య శ్రీ శివకాకభు
శుండియాజ్ఞవల్క్య గోస్వామి తులసీదాసా ఋషయః శ్రీ సీతారామో దేవతా శ్రీ
రామనామబీజం భవరోగహరా భక్తిః శక్తిః మమ నియంత్రితాశేషవిఘ్నః
శ్రీ సీతారామప్రీతి పూర్వక సకల మనోరథ సిద్ధ్యర్థే పాఠే వినియోగః

అథాచమనమ్

ఓం సీతారామాభ్యాం నమః । శ్రీరామచంద్రాయ నమః ॥
శ్రీరామభద్రాయ నమః

ఇతి మంత్రత్రితయేన ఆచమనం కుర్యాత్ ।
శ్రీ యుగళబీజమంత్రేణ ప్రాణాయామం కుర్యాత్ ।

అథ కరన్యాసః

జయ మంగల గుణ గ్రామ రామ కే ।
దాని ముకుతి దన దరమ ధామ కే ॥

అంగుష్ఠాభ్యాం నమః

రామ రామ కహి జే జముహాహీ ।
తిన్హహి న పాపపుంజ సముహాహీ ॥

తర్జనీభ్యాం నమః

రామ సకల నామన్హ తే అధికా ।
హోఉ నాథ అఘ ఖగ గన బధికా ॥

మధ్యమాభ్యాం నమః

ఉమా దారు జోషిత కీ నాఈ ।
సబహి నచావత రాము గోసాఈ ॥

అనామికాభ్యాం నమః

సన్ముఖ హోఇ జీవ మోహి జబహీ ।
జన్మ కోటి అఘ నాసహి తబహీ ॥

కనిష్ఠికాభ్యాం నమః

మామభిరక్ష రఘుకుల నాయక ।
ధృత ఖర చాప రుచిర కర సాయక ॥

కరతలకరపృష్ఠాభ్యాం నమః

ఇతి కరన్యాసః

అథ హృదయాది న్యాసః

జయ మంగల గున గ్రామ రామ కే ।
దాని ముకుతి ధన దరమ ధామ కే ॥

హృదయాయ నమః ।

రామ రామ కహి జే జముహా హీ ।
తిన్హహి న పాపపుంజ సముహాహీ ॥

శిరసే స్వాహా ।

రామ సకల నామన్హ తే అధికా ।
హోఉ నాథ అఘ ఖగ గన బధికా ॥

శిఖాయై వౌషట్ ।

ఉమా దారు జోషిత కీ నాఈ ।
సబహి నచావత రామ గోసాఈ ॥

కవచాయ హుమ్ ।

సన్ముఖహోఇ జీవమోహి జబహీ ।
జన్మ కోటి అఘ నాసహి తబహీ ॥

నేత్రాభ్యాం వౌషట్

మామభిరక్ష రఘుకులనాయక।
దృత బరచాప రుచిరకర సాయక ॥

అస్త్రాయ ఫట్ ।

ఇతి న్యాసయాదిన్యాసః

అథ ధ్యానమ్

మామవలోక్య పంకజలోచన ।
కృపా బిలోకని సోచ బిమోచన ॥
నీల తామరస స్యామ కామ అరి ।
హృదయ కంజ మకరంద మధుప హరి ॥
జాతుధాన బరూథ బల భంజన ।
ముని సజ్జన రంజన అఘ గంజన ॥
భూసుర ససి నవ బృంద బలాహక ।
అసరన సరన దీన జన గాహక ॥
భుజబల బిపుల భార మహి ఖండిత ।
ఖర దూషన బిరాధ బధ పండిత ॥
రావనారి సుఖరూప భూపబర ।
జయ దసరథ కుల కుముద సుదాకర ॥
సుజస పురాన బిదిత నిగమాగమ ।
గావత సుర ముని సంత సమాగమ ॥
కారునీక బ్యలీక మద ఖండన ।
సబ బిధి కుసల కోసల కోసలా మండన ॥
కలి మల మథన నామ మమతాహన ।
తులసిదాస ప్రభు పాహి ప్రనత జన ॥

ఇతి ధ్యానమ్

శ్రీః

# శ్రీరామచరిత మానసము

## మంగళాచరణము

వర్ణానామర్థసంఘానాం రసానాం ఛందసామపి ।
మంగళానాం చ కర్తారౌ వందే వాణీవినాయకౌ ॥ 1

తాత్పర్యము కవికుల శేఖరుడును, భక్తాగ్రేసరుడునగు శ్రీతులసీదాసు స్వకృతమైన 'శ్రీరామచరిత మానస' మహాకావ్యారంభమున నీ రీతి ఇష్టదేవతా ప్రార్థన చేయుచున్నాడు —

అక్షర సమామ్నాయమును అర్థముల సమూహములను, రసములను, ఛందస్సులను శుభపరంపరలను కలుగజేయు దేవతాశిరోమణులైన సరస్వతీ దేవికిని, విఘ్నేశ్వరునకును నే నిదే నమస్కరించుచున్నాను

విశేషము - వర్ణములు, అర్థములు, రసములు, ఛందస్సులు - వీనిని సరస్వతి కల్పించును గాన ఆ వర్ణాదులు తన కావ్యమున నిర్దుష్టముగా, నిరాతంకముగా రాణించుటకు కవితామతల్లియైన సరస్వతిని స్మరించుచున్నాడు ఈ మహత్తర కావ్యనిర్మితి నిర్విఘ్నముగా నెఱవేరుటకును, శుభపరంపరలిచ్చి బ్రోచుటకును విఘ్నరాజును ప్రార్థించుచున్నాడు

కవి పైరీతి స్తోత్రము చేయుటచే, ధ్వనిగర్భమున తన యీ కావ్యము వర్ణార్థములకు, రసచ్ఛందములకు స్థానమనియు, శుభ పరంపరల నొసగి శ్రోతలను, పఠితలను నానందపఱచగల దనియు సూచించుచున్నాడు

భవానీశంకరౌ వందే
శ్రద్ధావిశ్వాసరూపిణౌ ।
యాభ్యాం వినా న పశ్యంతి
సిద్ధాః స్వాంతఃస్థ మీశ్వరమ్ ॥ 2

తా॥ శ్రద్ధావిశ్వాసస్వరూపములకాధారభూతుడైన, కాలకూటవిషమును లోకహితార్థము గ్రోలిన వైరాగ్యనిధియగు శంకరునకు, నాతని యర్థాంగియు జగజ్జననియునగు పార్వతీదేవికిని నమస్కరించుచున్నాను వారి కృపలేనిదె సిద్ధజనులు వారి అంతఃకరణ స్థితుడైన సర్వేశ్వరుని గాంచలేరు

వి॥ భవానీశంకరులు శ్రద్ధావిశ్వాస స్వరూపులు క్రమాలంకారముచే, శబ్దములస్త్రీపుంవివక్షతచేత శ్రద్ధారూపిణి భవాని యనియు, విశ్వాసరూపుడు శంకరుడని యు సూచితము

నారుద్రః క్రమపారకః' అను న్యాయముచే పరమశివుడు లేనిదే కావ్యకర్తృత్వము సిద్ధింపదు అంతేగాక వారి దయలేనిదే యోగీంద్రులకునైన పరతత్త్వజ్ఞానము కలుగదు కాగా, కవి తన యీ కావ్యము పరతత్త్వజ్ఞాన ప్రబోధక మనియు, శ్రద్ధతోడను, విశ్వాసముతోడను దీనిని పఠించి, జీవన్ముక్తులు కావలెననియు ఆశంసించుచున్నాడు

తనకు పూర్వుడైన 'కాళిదాసు తన రఘువంశ మహాకావ్యారంభమున నొనర్చిన ఇష్టదేవతాప్రార్థనము "వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే, జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ" అనునది ఈ కవి దృష్టియందు దున్నట్లు సూచితము

## గురువందనము

వందే బోధమయం నిత్యం గురుం శంకరరూపిణమ్ ।
యమాశ్రితో హి వక్రోఽపి చంద్రః సర్వత్ర వంద్యతే ॥ 3

తా ॥ సాక్షాత్తు శంకరుడే యనఁగినట్టి, జ్ఞానస్వరూపుడైన, శాశ్వతుడైన గురుదేవునకు నమస్కరించుచున్నాను వక్రుడైన చంద్రుడేరీతిగా శంకర శిరోభూషణమై జగద్వంద్యు డగుచున్నాడో అట్లే మద్గురువు నాశ్రయించిన నేను వక్రగుణముకలిగినవాడనైనను మద్గురుసమాశ్రయణమున లోకప్రశస్తి గాంచ గోరుచున్నాను

వి ॥ ఇది గురుస్తోత్రము శంకరస్తోత్రమైనచో పునరుక్తి యగును కదా! శ్రీతులసీదాసు తన గురువును శంకరసన్నిభుడుగా భావించుచున్నాడు చంద్రు డిచ్చట వక్రుడుగాని కళంకితుడుగాడు శివుని తలపైనున్న చంద్రునిలో వక్రత గలదు కళంకము లేదు వక్రరూపుడయ్యు చంద్రుడు, శివుని తల నెక్కుటచేత సర్వలోక వంద్యు డగుచున్నాడు అట్లే వక్రతయుండినను (శ్రీతులసీదాసు గృహస్థజీవితము వక్రమున సూచితము) తాను గురువునాశ్రయించి జ్ఞానబోధ నందితిననియు, తత్కారణమున తనకు కావ్యశక్తి యల వడెననియు సూచించినాడు శ్రీతులసీదాసు

తన గురువును బోధమయుడని, నిత్యుడని విశేషించుటచే, తత్కృపాలబ్ధమైన అతని కవితయు నట్టిదే యనియు, తచ్ఛ్రోతలు పాఠకులు బోధ**మ**యాత్మకులై నిత్యకైవల్యప్రాప్తి నందుదురనియు కవి యాశంసనము

సీతారామ గుణగ్రామ పుణ్యారణ్యవిహారిణౌ ।
వందే విశుద్ధవిజ్ఞానౌ కవీశ్వరకపీశ్వరౌ ॥ 4

తా ॥ సీతారాముల యొక్క గుణసముదాయమనెడు పుణ్యోద్యానమున విహరించువారును, శుద్ధజ్ఞాన సంపన్నులునైన కవిశేఖరుడగు వాల్మీకికిని, కపిశేఖరుడగు నాంజనేయునికిని నే నిదే నమస్కరించుచున్నాను

వి ॥ ఇచట 'గ్రామ' శబ్దము సమూహవాచియయ్యు, 'అరణ్య' శబ్దము రూపకమున నుపమితమైనదయ్యు, ఈ గ్రామ, అరణ్య శబ్ద

ములు రెండును స్వస్వములైన అర్థములను 'ధ్వని' రూపమున భజించుచు, సీతారాములు గ్రామమునుండి అరణ్యములకు బయలుదేరిన వారనియు, వారిగుణములు గ్రామ గ్రామములందే కాక అరణ్యమున వనచరాదులకును స్తోత్రపాత్రములనియు, సహజముగా వనచరులైన కపీశ్వర, కపీశ్వరులు (వాల్మీకి హనుమానులు) అరణ్యమున (తమ నివాస స్థలముననే) వారిని కన్గొనిరనియు సూచితము సీతారాములు కవీశ్వర కపీశ్వరులు అనుక్రమమున, సీతాదేవి నరణ్యమున కనుగొన్నవాడు కవీశ్వరుడగు వాల్మీకియనియు, రాముల నరణ్యమున కన్గొన్నవాడు కపీశ్వరుడగు హనుమంతుడనియు సారస్యము

విశుద్ధవిజ్ఞానౌ' అనువిశేషణము సార్థకము కవీశ్వరకపీశ్వరులిరువురు వనచరులయ్యు మహాజ్ఞానమూర్తులనుట సర్వవిదితము ఇరువురు సాక్షాత్తు బ్రహ్మచే వరములు పొందిన సరస్వతీమూర్తులు "మోక్షే ధీర్జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః" అను అమరకారుని మతమున 'విజ్ఞాన' మనగా సర్వశాస్త్రపరిజ్ఞానము దానిని పొందినవారు వాల్మీకి హనుమంతులనుట ధ్రువము పైగా ఆవిజ్ఞానము విశుద్ధమైనది బ్రహ్మయొక్క ఆశీర్వచనముచేతను, సీతారాముల పుణ్యచరిత్రమును కీర్తించుట చేతను అట్లు జరిగినది విజ్ఞానము విశుద్ధమై పరబ్రహ్మజ్ఞానమిచ్చి, వారిని చిరంజీవుల నొనర్చినది

కవి తన అంతరంగమున, తన కావ్యమును పఠించువారు వాల్మీకి హనుమానులవలె విశుద్ధవిజ్ఞానులు కావలెనని ఆశించుచున్నాడు

ఉద్భవస్థితిసంహారకారిణీం క్లేశహారిణీమ్ ।
సర్వశ్రేయస్కరీం సీతాం నతోఽహం రామవల్లభామ్ ॥ 5

తా॥ సృష్టి స్థితి లయములకు కారణభూతురాలైనట్టియు, సకలకష్టములను నివారించునట్టియు, సమస్తశుభముల నిచ్చునట్టి దేవియైన శ్రీరాముని సహధర్మచారిణియగు సీతాదేవికి నే నిదే నమస్కరించుచున్నాను

వి॥ మాతృస్వరూపిణియైన సీతాదేవిని కవి పితృరూపుడగు శ్రీరాముని కంటె ముందు స్మరించుచున్నాడు. తల్లిదండ్రులలో తండ్రి కంటె తల్లి ప్రధానము గదా! కవి ఆ నియమమును పాటించినాడు. వాల్మీకియు "సీతాయాశ్చరితం మహత్" అని అన్నాడు. తద్వారా రామునికంటె సీతమ్మతల్లికే ప్రాముఖ్యము నిచ్చినాడు.

సీతాదేవి సృష్టిస్థితిలయ కారిణి. ఆమె భూలోకమున నుద్భవించి సర్వసజ్జనస్థితి నిమిత్తమై, దుష్టుల లయమునకు కారణభూతురాలైనది. ఆమె క్లేశహారిణి.

కవి తమకావ్యము సీతాచరిత్రమనియు తత్పఠనశ్రవణాదులచే సర్వక్లేశములు నశించి, శుభములు కలుగుననియు ధ్వనింపజేయుచున్నాడు.

యన్మాయావశవర్తి విశ్వమఖిలం బ్రహ్మాదిదేవాసురాః
యత్సత్త్వాదమృషైవ భాతి సకలం రజ్జౌ యథాహేర్భ్రమః।
యత్పాదప్లవమేకమేవ హి భవాంభోధేస్తితీర్షావతాం
వందేఽహం తమశేషకారణపరం రామాఖ్యమీశం హరిమ్॥ 6

తా॥ బ్రహ్మాదిదేవతలును రాక్షసులును, ఈ విశ్వమంతయును ఎవని మాయకు వశమై వర్తించునో (భ్రాంతి మాత్రమేయైనను రజ్జువునందు గన్పించు సర్పము రజ్జుసత్తచేత సత్యముగా గన్పించునట్లు) ఎవని సత్తాశక్తితో ఈ దృశ్య జగత్తంతయు, త్రాడు సర్పమనెడి భ్రాంతి కలిగించునట్లు మనకు తెలియుచున్నదో ఎవని పాదపద్మము ఈ భవసాగరమునుండి తరింప నిచ్ఛగించువారలకు ఏకైక నౌకగానున్నదో అట్టి సర్వశ్రేష్ఠుడైన పరమాత్మయగు విష్ణువుయొక్క అవతారమైన శ్రీరామచంద్రునకు నేను నమస్కరించుచున్నాను.

వి॥ శ్రీ తులసీదాసు ఇందు శ్రీరాముని అవతారమును స్తుతించుచున్నాడు. శ్రీరాముడు సర్వేశ్వరుడైన శ్రీమహావిష్ణువేయనియు, నాతనిపాదము లాశ్రయించి తథ్యమిథ్యా స్వరూపము లెఱింగి

మోక్షము నొందవలెననియు ప్రబోధించుచున్నాడు భక్తిమార్గమున భగవంతునిపాదము లాశ్రయించి మోక్షమునొందుట ఉత్తమమార్గమని ముముక్షువులకు హిత ముపదేశించుచున్నాడు అట్లే జగత్తంతయు మిథ్యయనియు, వైష్ణవమాయా విరచితమనియు, సంసారముదాటరానట్టి సాగరమనియు హెచ్చరికచేయుచు, భక్తిమార్గప్రబోధకమైన తన రామాయణకావ్యము జనులకు రామపాదాశ్రయత కల్పించి, ముక్తుల జేయుననియు నుద్బోధించుచున్నాడు

నానాపురాణనిగమాగమసమ్మతం యద్
రామాయణే నిగదితం క్వచిదన్యతోఽపి
స్వాంతస్సుఖాయ తులసీ రఘునాథగాథా -
భాషానిబంధ మతిమంజుల మాతనోతి ॥ 7

తా॥ సమస్త పురాణములందును, వేదశాస్త్రములందును చెప్పబడిన విధమును, అన్యత్ర ఉపలబ్ధియైన విధమును వివేచించి, క్రోడీకరించి శ్రీమద్రామాయణగాథను శ్రీతులసీదాసు తన ఆత్మానందము కొఱకు (మనస్తృప్తికై) అత్యంత మనోహరమైన భాషయందు మృదుమధురముగ విరచించుచున్నాడు

వి॥ రామాయణగాథ, సర్వపురాణాది వివిధశాస్త్రములలో ప్రస్తుతింపబడినది 'అన్యత్ర' అనుటచే ఆదికవి వాల్మీకి విరచిత రామాయణము, కాళిదాసాది మహాకవి విరచిత రఘువంశాదులనే కాక స్వచిత్తగతములై భగవత్ప్రేరితములైన అనేకాంశములునని తాత్పర్యము 'స్వాంతఃసుఖాయ' అనుటచే నిది తనకేగాక ప్రతి వ్యక్తికిని ఆత్మానందమును చేకూర్చునదియని కవిహృదయము

అవతారిక ఇచట మరల గణనాథుని ప్రత్యేకముగా స్మరించుచున్నాడు ఇతఃపూర్వము గీర్వాణమున స్తోత్రము, ఇపుడు స్వభాషలో ప్రవేశించుచున్నాడు గాన, మరల అవిఘ్నార్థము గణపతిస్తుతిచేయుచున్నాడు

జో సుమిరత సిధి హోఇ గననాయక కరిబర బదన ।
కరఉ అనుగ్రహ సోఇ, బుద్ధి రాసి సుభ గున సదన ॥ 8

తా॥ ఎవ్వని స్మరణమాత్రముచే సకలకార్యములు నిర్విఘ్నముగా నెఱవేరునో, అట్టి సకల జ్ఞాన రాశియు, శుభగుణాస్పదుడునగు గజరాజముఖుడైన గణనాయకుడు నాపై అనుగ్రహమును చూపుగాక ।

మూక హోఇ బాచాల పంగు చఢఇ గిరిబర గహన ।
జాసు కృపాఁ సో దయాల ద్రవఉ సకల కలిమల దహన॥ 9

తా॥ ఎవ్వని దయాలేశము చేతనే మూగవానిని వాచాలునిగను, కుంటివానిని దుర్గమ పర్వతారోహకునిగను చేయగలడో, ఆ కృపాస్వరూపుడును, కలిమల విధ్వంసయునగు పరమాత్ముడు (మాధవుడు) నాపై దయార్ద్రభావము వహించును గాక ।

నీల సరోరుహ స్యామ తరున అరున బారిజ నయన ।
కరఉ సో మమ ఉర ధామ సదా ఛీరసాగర సయన ॥ 10

తా॥ నీలసరోరుహములకు సమానమైన శ్యామలవర్ణము కలిగినవాడును, వికసించిన ఎఱ్ఱని కమలములవంటి కన్నులు గలవాడును, పాలసముద్రమున పవ్వళించువాడునగు శ్రీమన్నారాయణమూర్తి నా హృదయకమలమున సదా నివసించుగాక।

కుంద ఇందు సమ దేహ ఉమా రమన కరునా అయన ।
జాహి దీన పర నేహ కరఉ కృపామర్దన మయన ॥ 11

తా॥ మొల్లపూవువలెను చంద్రునివలెను ధవళమైన శరీరము గలవాడును, పార్వతీమనోహరుడును, కరుణాస్పదుడును దీనోద్ధారకుడును, మన్మథమర్దనుడునైన శంకరుడు నాపై దయ జూపుగాక ।

వి॥ శంకరుని శరీరమువలె ధవళమైన సాత్త్వికతత్త్వమును ప్రతిబోధించునది తనకావ్యమని కవి యుద్దేశము, సర్వమంగళయైన పార్వతివలె శుభదాయిని, అజ్ఞానుల నుద్ధరించునది, మరియు కామ చ్ఛేదకము అనియు స్ఫురించుచున్నది

బందఉ గురు పద కంజ కృపా సింధు నరరూప హరి ।
మహామోహ తమ పుంజ జాసు బచన రబి కర నికర ॥ 12

తా॥ (శ్రీ తులసీదాసు గురువందన మొనర్చుచున్నాడు)

దయాసముద్రుడును నరరూపధారియగు శ్రీ మహావిష్ణుమూర్తియే అయిన వాడును, అజ్ఞానరూపమగు తమోరాశిని నాశముజేయుటకు ఎవని వచనములు సూర్యకిరణసమూహమో ఆ గురుదేవుని పాదకమలములకు నమస్కరించు చున్నాను

వి॥ సూర్యుడు తనకిరణములను ప్రసరింపజేసినంతనే ఎంతటి గాఢాంధకారముగూడ త్రుటిలో మాయమైనట్లు, సద్గురువు నాశ్రయించిన వారలకు మోహమును, అజ్ఞానమును దూరమగునను భావము

మోహాంధకారమునకు సూర్యకిరణములైన వాక్కులుగల గురువును సేవించినవాడుగాన, తనకావ్యము నట్టిదే యగునని కవి హృదయము

చౌపాయి

బందఉఁ గురు పద పదుమ పరాగా
సురుచి సుబాస సరస అనురాగా ।
అమిఅ మూరిమయ చూరన చారూ
సమన సకల భవ రుజ పరివారూ ॥ 13

తా॥ నేను గురుపాదకమలరజమునకు నమస్కరించుచున్నాడను అతని పాదరజము కమలరజమువోలె సురుచియై (మంచి కాంతిగలదై, స్వాదువై), సువాసనగలదై అనురాగమయమైనది అంతేగాక సకల భవరోగములను నశింప జేయుటలో సంజీవనౌషధీచూర్ణమువంటిది

వి॥ గురువును 'నరరూపహరి' అని ప్రథమస్తోత్రమున పేర్కొన్నాడు తాను వ్రాయు గ్రంథము నరరూపహరియగు

శ్రీరామచంద్రుని గూర్చియే కదా! ఇచట గురుపాదములకు, రామ పాదములకు అభేదము, రామపాదరజోమహనీయత ఎంతో సురభిళము, సుకుమారము, సురాగము, సురసము, జడములను చేతనములుగా జేయు సంజీవనీచూర్ణసదృశము కాకున్నచో, నది జూతని నాతిగాజేయగలదా? ఇందు అహల్యావృత్తాంతము, సంజీవనీ వనౌషధీ వృత్తాంతము సూచితములు

చౌ॥ సుకృతి సంభు తన బిమల బిభూతీ
మంజుల మంగల మోద ప్రసూతీ।
జన మన మంజు ముకుర మల హరనీ
కిఏఁ తిలక గున గన బస కరనీ॥ 14

తా॥ పరమ పుణ్యస్వరూపుడగు శంకరుడు శరీరమున నలందిన స్వచ్ఛమైన భస్మము సకలకల్యాణములను సుఖములను కలుగజేయునది మరియు ఆనందదాయకమైన జనని వంటిది భక్తుల మనోరూపమైన సుందరమైనదర్పణము నందలిమాలిన్యమును దూరముజేయునటువంటిది (అనగా మనస్సు అనెడు అద్ధమును శుభ్రము చేయున అని భావము) తిలకముగా నొసట ధరించినంతనే సకల శుభగుణములను వశీకరింపజేయునది

వి॥ శంకరుడు దేహముననలందినవిభూతిని కవి స్మరించు చున్నాడు మనస్సునగల కలుషమును హరించునదనగా పాపచింత నలను తొలగించునది, సకలసద్గుణములను వశముచేయునది, అనగా ఇంద్రియనిగ్రహమును ప్రసాదించి, అంతశ్శత్రువులైన కామక్రోధాదుల నణచి శుద్ధసత్త్వమును నిరూపింపజేయునది

శ్రీతులసీదాసు శివునిదేహవిభూతి యెట్టిమహత్త్వముగలదో తనరామచరితమానస మట్టిదేయని సూచించుచున్నాడు

చౌ॥ శ్రీగురు పద నఖ మని గన జోతీ
సుమిరత దివ్య దృష్టి హియఁ హోతీ ॥
దలన మోహ తమ సో స్రప్రకాసూ
బడే భాగ ఉర ఆవఇ జాసూ ॥ 15

తా॥ శ్రీ తులసీదాసు గురుపాదనఖకాంతిని స్మరించుచున్నాడు

శ్రీ గురుమహారాజుపాదములయందుండెడి నఖముల జ్యోతి మణుల ప్రకాశముతో సమానమైనటువంటిది. ఆ నఖకాంతులు మణివలె దివ్యదృష్టిని ప్రసాదించునవి. మోహమనెడు చీకట్లను పారద్రోలునవి. అట్టి నఖకాంతు లెవని హృదయమున వ్యాపించునో అతడే ధన్యుడు గదా!

వి॥ కొన్ని దివ్యమణులు, ప్రపంచమున నేమి లనున్నవస్తువులనైనను దృగ్గోచరములుగా జేయును. తమ కాంతులచే చీకటులను నశింపజేయును. అట్టి దివ్యమణిగుణముగలది గురుపాదనఖము. రామపాదనఖముకూడ అట్టిదేయని వేరే వచింపవలెనా?

చౌ॥ ఉఘరహిఁ బిమల బిలోచన హీ కే
మిటహి దోష దుఖ భవ రజనీ కే ।
సూఝహి రామచరిత మని మానిక
గుపుత ప్రగట జహఁ జో జేహి ఖానిక ॥ 16

ఉ॥ ఇందు శ్రీతులసీదాసు తన శ్రీరామచరితమానస' మును దివ్యమణితో బోల్చుచున్నాడు. రామచరిత్రము దివ్యమణి. అది మానవులకు హృదయగతమైన అంతర్నేత్రమును తెఱపించును.

తా॥ జ్ఞానమనెడి వెలుగు ఆ విధముగ వానిహృదయమున ప్రవేశించిన తరువాత హృదయమునందు జ్ఞానచక్షువులు తెఱవబడును. అట్టితఱి ఈ విషయాసక్తుల రూపమైన అంధకారమునందుండు దోషములు, దుఃఖములు వాని నేమాత్రము బాధింపనేరవు. అంతేగాక, శ్రీరామచరిత్రరూపమైన మణిమాణిక్యములు గుప్తముగనున్నను, పైకగుపడుచున్నను, లేక యే గనియందున్నను అన్నియు వానికి ఒక్కొక్కటిగా గోచరించును.

వి॥ ఇచట కవి తన దివ్యగ్రంథము యొక్క మాహాత్మ్యమును దెలుపుచున్నాడు రామచరితమను దివ్యమణి గుప్తములైన గనులను ప్రదర్శించు మణివలె, మాయనతిక్రమించి, భగవత్తత్త్వము నెఱుంగ జేయును శ్రీరామచరితమానసము దివ్యమణి కాన దివ్య శక్తులను ప్రదర్శింపగలదు ఆ దివ్యశక్తులు మణికిసంబంధించినంత వఱకు భౌతికమైనవి, గ్రంథమునకు చెందినవి ఆధ్యాత్మికమైనవి

దోహా॥ జథా సుఅంజన అంజి దృగ సాధక సిద్ధ సుజాన ।
కౌతుక దేఖత సైల బన భూతల భూరి నిధాన ॥ 17

చౌ॥ గురు పద రజ మృదు మంజుల అంజన ।
నయన అమిఅ దృగ దోష బిభంజన ॥
తేహిఁ కరి బిమల బిబేక బిలోచన ।
బరనఉఁ రామ చరిత భవమోచన ॥ 18

తా॥ రససిద్ధులైన సాధుయోగులు దివ్యాంజనసహాయమున ప్రపంచము నందు మూలమూలలనున్న గిరిగహ్వరములను వనములను, భూగర్భమునందలి నిధులను చూడగలుగుచున్నారు అట్టి సిద్ధాంజనము వంటిదే గురుదేవుని పాద రజము అది అత్యంతమృదుల మనోహరమైన నయనామృతాంజనము ఈ అంజనము నేత్రదోషములన్నింటిని నివారించి స్వచ్ఛమైన దృష్టి నొసంగునది వివేకమును కలిగించునది అట్టి గురుచరణరజస్స్పర్శచే నా నేత్రద్వయమును విమలీకరించుకొని, భవబంధములను ద్రెంచివేయునట్టి శ్రీరామచంద్రమానసమను దివ్యప్రబంధమును రచింపబూనుచున్నాను

వి॥ రామచరితమానసము సిద్ధాంజనమువలె, తత్త్వ స్వరూపము నెఱుకపఱచి, వివేకోదయమును కలిగించి, పాపహారియై భవబంధములను ద్రెంచివేయగలదు

## బ్రాహ్మణులకును, సజ్జనులకును వందన సమర్పణము

చౌ॥ బందఉఁ ప్రథమ మహీసుర చరనా ।
మోహ జనిత సంసయ సబ హరనా ॥
సుజన సమాజ సకల గున ఖానీ ।
కరఉఁ ప్రనామ సప్రేమ సుబానీ ॥ 19

తా॥ ప్రప్రథమమున భూమికి దేవలైనటువంటి బ్రాహ్మణులకు నమస్కరించుచున్నాడను వారు అజ్ఞానమువలన కలిగిన సంశయము లన్నిటిని నివారింపజాలుదురు తరువాత సద్గుణశీలురైన సజ్జనసమూహమునకు ప్రేమ పూర్వకముగా సుందరమైన నా వాక్కుచే ప్రణతు లర్పించుచున్నాడను

వి॥ బ్రహ్మజ్ఞానులైనవారిపాదములకు నమస్కరింతుననీ, బ్రహ్మజ్ఞానియైన కవిపలుకుట, అతని వినయశీలతకు విజ్ఞతకు నిదర్శనము అంతేకాక ప్రియవాక్య విశారదులును, సద్గుణులైన వారికందరికి ప్రణతుడగుట, అతనికిగల వినయసంపత్తికి, వివేకమునకు నిదర్శనము

సాధు చరిత సుభ చరిత కపాసూ ।
నిరస బిసద గునమయ ఫల జాసూ ॥
జో సహి దుఖ పరచ్ఛిద్ర దురావా ।
బందనీయ జేహిఁ జగ జస పావా ॥ 20

తా॥ సాధువుల జీవనవిధానము ప్రత్తిచెట్టువలె శుభకరమైనది ప్రత్తి నీరసమైనదయ్యు, స్వచ్ఛమై గుణమయమైన ఫలితము నిచ్చునది అట్లే సజ్జన జీవితమును విషయములకు దూరమై, స్వచ్ఛమై, సుగుణభరితమై, సత్ఫలదాయకమై యున్నది సాధువులు తాము స్వయముగా దుఃఖమును సహించి ఇతరులదోషములను పోగొట్టుదురు అట్టి జగత్ప్రసిద్ధులైనవారు వందనీయులుగదా ।

వి॥ ప్రత్తి రసహీనమైనది సజ్జనులు రసహీనులే, అనగా ఇంద్రియ వ్యామోహములేనివారనుట ఇచట రసశబ్దము శృంగార

రసమునకు చెందినది ప్రత్తి తెల్లగా నిగనిగలాడుచు కలుషరహితముగ నుండును అటులే సజ్జనుల హృదయములు దుఃఖచ్ఛేదకముగా, నిర్మలముగా నుండును 'గునమయ' అనుటలో ప్రత్తి ఉపయుక్త గుణములు కలది అనగా భౌతికముగా నది మానవజీవితమున నుపకరించుచున్నది సజ్జనుడును గుణమయుడు మానవత్వమును కాపాడి లోకహిత మాచరించుచున్నాడు

ప్రత్తి సర్వులకు ఉపయోగకరమైనది ప్రత్తినుండి వచ్చెడి దారము సూది రంధ్రములో నిమిడి హింసకు గురియై, వడకునప్పుడు కూడ కష్టములను సహించి తుదకు వస్త్రరూపముగా పరిణతిజెంది ప్రజలకు మానభంగము గాకుండ రక్షించుచున్నది నూలుగా మారుట, మగ్గమునబడి నలుగుట మొదలగునవి క్లేశములే కదా! అట్లే సాధువుకూడ సంఘమున ననేకకష్టములకు గుఱియగుచున్నాడు ప్రత్తి వస్త్రరూపియై శరీరదోషముల నెట్లు మఱుగుపఱచునో, సజ్జనుడు సాధువుగా కష్టము లనుభవించియు, మానవుల హృదయములందలి దోషములను తనబోధామృతముచే దూరము చేయుచున్నాడు కావుననే సాధువులు వందనీయులు!

చౌ॥ ముద మంగలమయ సంత సమాజూ ।
జో జగ జంగమ తీరథరాజూ ॥
రామ భక్తి జహఁ సురసరి ధారా ।
సరసఇ బ్రహ్మ విచార ప్రచారా ॥ 21

తా॥ సజ్జనసమాజ మానందదాయకము మరియు మంగళకరమైనది అది ఒక పుణ్యతీర్థమువంటిది అానందమును, శుభమును కలిగించునది వారిలో రామ భక్తి అను గంగానది ప్రవహించుచుండును పరబ్రహ్మతత్త్వము అందు అంత ర్వాహినియై గంగానదిలో కలియు సరస్వతీనదివలె నుండును

వి॥ కవి కాశీనివాసి గాన, తత్సమీపమందలి పరమపుణ్య క్షేత్రమైన ప్రయాగను దృష్టియందుంచుకొని, సజ్జనుల సమాజమును

ఆ పుణ్యక్షేత్రముతో పోల్చుచున్నాడు ప్రయాగ త్రివేణీసంగమ ప్రదేశము, అందలి గంగాసరస్వతుల నిందుపేర్కొన్నాడు యమునా నదినిగూర్చి ముందు చెప్పబోవుచున్నాడు

రామభక్తి గంగాప్రవాహముచుటలో, అందలి స్వచ్ఛత, పవిత్రత వ్యక్తమగుచున్నవి పరబ్రహ్మవిచారమును సరస్వతిగా చెప్పుటచే, జ్ఞానోదయము సరస్వతీప్రసాదలబ్ధ మని యు విశద మగుచున్నది

ఇందు 'బ్రహ్మ' శబ్దము సృష్టికర్తృవాచకము కాకపోయినను సరస్వతీ శబ్దముచే తత్పతియు, స్రష్టయునగు బ్రహ్మ స్ఫురించుట యిందలిసారస్యము

చౌ॥ బిధి నిషేధమయ కలి మల హరనీ ।
కరమ కథా రబినందని బరనీ ॥
హరి హర కథా విరాజతి బేనీ ।
సునత సకల ముద మంగల దేనీ ॥ 22

తా॥ కర్తవ్యపరాయణత్వము, కర్తవ్యరాహిత్యములు వ్యాపించిన ఈ కలియుగమున పాపసంచయము పెరిగిపోవుచున్నది అట్టి పాపములను నశింప జేయునది సజ్జనసమాజము ఇది యమునానదితో పోల్చదగియున్నది హరిహర కథలు త్రివేణీసంగమమువలె పవిత్రములై, పాపహరములై విన్నమాత్రముననే సకల శోభనములను, బ్రహ్మానందము నొసంగునవి

వి॥ ముందు గంగాసరస్వతులను పేర్కొని, పిదప యమునా నదిని చెప్పుచున్నాడు ఈ క్రమము 'హరిహర' శబ్దముల క్రమముతో సార్థక మగుచున్నది హరి, గంగాసరస్వతులవలె శుద్ధ సత్త్వమూర్తి హరుడు యమునానదివలె తమోమూర్తి హరి మాహాత్మ్యమును, హరమాహాత్మ్యము వేర్వేరు శ్లోకములలో పేర్కొనుటచే ఈ సారస్యము కాన్పించుచున్నది ఈ ఇరువురినే గాక సరస్వతీ రూపమున లీలగా బ్రహ్మనుగూడ అతని తండ్రియగు విష్ణువుతోజేర్చి,

త్రిమూర్త్యాత్మకతను నిరూపించుచున్నాడు ఇంతకును సజ్జనులు త్రిమూర్త్యాత్మకతగలిగి, శుభగుణాస్పదులై, పవిత్రులై, పాపహరులై యుందురని తాత్పర్యము ఇందు హరిహరాభేదము సూచితము

చౌ॥ బటు బిస్వాస అచల నిజ ధరమా।
తీరథరాజ సమాజ సుకరమా॥
సబహి సులభ సబ దిన సబ దేసా।
సేవత సాదర సమన కలేసా॥ 23

తా॥ సజ్జనసమాజమనెడి ఆ ప్రయాగక్షేత్రము అచంచలమైన ధర్మనిష్ఠ గలది విశ్వాసములో వటవృక్ష సదృశమైనది ఆ సజ్జనరూపమైన ప్రయాగలో ఎవరికి స్వధర్మముపై స్థిరమైన విశ్వాసముగలదో వారే అక్షయవటులు వారు చేయు శుభకర్మ తీర్థరాజసమాజము (సమూహము) అట్టి ప్రయాగసదృశమైన సజ్జనసమూహము అన్నివేళల అన్నిచోట్ల సులభముగా లభించునదే। వారిని సేవించినచో ప్రయాగను సేవించినట్లే సకల మోహక్లేశనివారకము

వి॥ ఇటు వటవృక్ష ప్రసక్తి గయాక్షేత్రమును సూచించును మానవులు పుణ్యమునకై తీర్థయాత్రకే చేయనవసరములేదని యు, తీర్థస్వరూపులైన సజ్జనులను సేవించినచో తీర్థములను సేవించినట్లే అని భావము

చౌ॥ అకథ అలౌకిక తీరథరాఊ।
దేఇ సద్య ఫల ప్రగట ప్రభాఊ॥ 24

తా॥ ఆ తీర్థరాజము అలౌకికము అకథనీయము తత్కాలఫలము నొసగునది గాన దాని ప్రభావము ప్రత్యక్షముగా నున్నది

దో॥ సుని సముఝహిఁ జన ముదిత
మన మజ్జహిఁ అతి అనురాగ।
లహహిఁ చారి ఫల అఛత
తను సాధు సమాజ ప్రయాగ॥ 25

తా॥ సజ్జనసమాజరూపమైన తీర్థరాజము (ప్రయాగ) యొక్క ప్రభావ మునుగూర్చి యెవరు ముదితమనస్కులై యాలకింతురో, దానిని దెలిసికొన యత్నింతురో దానిని ప్రేమించి ఆ తీర్థరాజమున స్నానమాచరింతురో, అట్టి మానవులీశరీరమునందే పురుషార్థములైన ధర్మార్థకామ మోక్షముల ఫలమును పొందెదరు ఇందులకు సందేహములేదు

చౌ॥ మజ్జన ఫల పేఖిఅ తతకాలా ।
కాక హోహిఁ పిక బకఉ మరాలా ॥
సుని ఆచరజ కరై జని కోఈ ।
సతసంగతి మహిమా నహిఁ గోఈ ॥ 26

తా॥ సజ్జనసాంగత్యమనెడు తీర్థరాజమున మునిగినంతనే, యెట్టిదుష్టుడు, కష్టచరితుడైనను మహాత్ము డగుచున్నాడు ఏదో మహిమగల జలమునందు మునిగిన కాకి కోకిలగను, కొంగ రెమలిగను తత్క్షణమే మారినట్లుగా ఈ సజ్జన సహవాసముచే దుష్టుడును శిష్టు డగును ఇందు ఆశ్చర్యపడవలసిన దేమియు లేదు ఏలయన, సజ్జన సమూహముయొక్క మాహాత్మ్యము గుప్తమైనది కాదు సర్వజన విదితమైనదే

వి॥ ఇందు దుష్టుడు కాకితోడను, కొంగతోడను పోల్చబడినాడు కాకిలోని ఎంగిలి మెదుకుల కాశించు నీచత్వము, కొంగలోని మోసపుగుణము దుష్టవ్యక్తియం దారోపింపబడినవి తీర్థజల సేచనమున నవి కోకిలగను, మరాళముగను మారుట వానిలోని గుణములు మారుటే కోకిలవంటి ప్రియవక్తృత్వము, మరాళమునందలి ఆనందనర్తనము వానికి సిద్ధించి, పూర్వదుర్గుణములు రూపుమాయును ఈ మార్పు క్షణకాలములో జరుగుటయే విశేషము ఎట్టి క్రూరాత్ముడైనను, సజ్జనహితబోధచే నుత్తముడై ముముక్షువుగా మారునని కవి భావన

చౌ॥ బాలమీక నారద ఘటజోనీ ।
నిజ నిజ ముఖని కహీ నిజ హోనీ ॥
జలచర థలచర నభచర నానా ।
జే జడ చేతన జీవ జహానా ॥ 27

తా॥ వాల్మీకి, నారదుడు, అగస్త్యుడు వీరు ముగ్వురు మహాఋషులు వారు స్వయముగా తమ వాక్కులచేతనే, తమతమ జీవనతత్త్వములను వెల్లడించియున్నారు ఈ జగత్తులో నేలయందు నీటిలో, ఆకాశమునందు సంచరించు అనేక జీవరాశులున్నవి కదా ః వాని యన్నింటిలో నేయే జీవరాశులు సద్గతిపొంది నవో దానికంతటికిని మూలకారణము సత్సాంగత్యమే యని విశదమగుచున్నది

వి॥ వాల్మీకి, నారద, ఘటయోనిజులు మహనీయులగుటకు సత్సాంగత్యమే కారణమని కవి యుద్దేశము ఈ సత్యము వారు స్వముఖతః చెప్పిన వాక్యములవలననే విశద మగుచున్నది సత్సాంగత్యముచే వారెంతగొప్పవారైరో తెలిసికొన్నచో, మానవులకు సజ్జనసాంగత్య మెంతటి ఉపకారియో తెల్లమగును

కవి ఇచట జలచర, భూచర, నభచర అని పేర్కొని, వాల్మీకిని, నారదుని, అగస్త్యుని ఉదాహరించినాడు ఈ ముగ్వురు మహర్షులలో భూ, గగన, జల చారిత్వములు వ్యక్తమగుచున్నవి వాల్మీకి భూచరుడు, నారదుడు గగనచారి, 'ఘట' శబ్దము ఆశ్రయతా గుణముచే జలమునకు పర్యాయము ఘటయోని' అనగా అగస్త్యుడు జలచారిత్వమునకు నిదర్శనము అతనిలో జలచరభావము లేకున్న సముద్రమునే అపోశనము గొనగలడా! ఇది కవి చూపిన స్వారస్యము

అంతేకాక వీరి ముగ్వురి పుట్టుకలు చిత్రములైనవి ఒకడు పుట్టలో పుట్టగా, (భూమి) మరొకడు బ్రహ్మమానసమున (ఆకాశము) జన్మింపగా, మరొకడు కుండలో (జలములో) పుట్టినవాడు ఈ రీతిగా కూడ పై ప్రయోగస్వారస్యము వ్యక్తమగుచున్నది

ఘటజోనీ _ మిత్రవర్ణుడు తన తేజము నొక కుండయం దుంచియుండెను. ఆ తేజమునుండి అగస్త్యు డుత్పన్నమాయెను. కుండ యందుంచిన తేజమునుండి యుత్పన్నమైన వాడుగనుక అగస్త్యుని కుంభజుడందురు. నీచస్థానమున తా నుత్పన్నమైనను సత్సాంగత్య ప్రభావమువలన ఉన్నతపదవి తనకు ప్రాప్తించెనని అగస్త్యు డొకమారు శివునితో ననెను. అగస్త్యుని సతీమణిపేరు లోపాముద్ర. ఈ దంపతు లిరువురును వారణాసియందు వాసము జేయుచు శంకరు నుపాసింపఁ దొడగిరి.

'సూర్యచంద్రాదులు సుమేరు పర్వతమునకు ప్రదక్షిణము జేసెదరే నా కెందులకు చేయకూడదని' వింధ్యాచలమొకమా రట్లు తలచెను. అట్లూహించి ఆ మార్గమున కడ్డువచ్చెను. సూర్యుని మార్గమున కాటంకము కలిగినందున దేవలోకములో హాహాకారములు చెలరేగి, దేవతలెల్లరును గుమిగూడి అగస్త్యుని సమీపించి ఆతని శరణు వేడిరి. అగస్త్యుడు లోపాముద్రతో సహా వింధ్యాచలమున కేగెను. మునీశ్వరుని శాపమునకు గురికాకుండునటుల వింధ్యాచల మాతనికి సాష్టాంగ నమస్కారము జేసి, 'మీ సేవజేయుటకు నేను సర్వదా సంసిద్ధుడ' నని సవినయముగ బల్కెను. అంత అగస్త్యుడు 'నేను తిరిగి వచ్చువఱకు నివ్విధముగనేయుండు' మని ఆజ్ఞాపించి, దక్షిణా పథమున కరుదెంచి శివారాధన సలుపదొడగెను. అగస్త్యుడు తిరిగి రాలేదు, వింధ్యాచల మటులే యుండిపోయెను.

చౌ॥ మతి కీరతి గతి భూతి భలాఈ ।
జబ జేహిఁ జతన జహాఁ జేహిఁ పాఈ ॥
సో జానబ సత సంగ ప్రభాఊ ।
లోకహుఁ బేద న ఆన ఉపాఊ ॥ 28

తా॥ జడ చేతన జీవము లేవేవి యీ జగత్తునందున్నవో ఆ యా జీవులు ఏ సమయమునందుగాని యే ప్రయత్నమువలనగాని పొందిన బుద్ధి, కీర్తి, సద్గతి

విభూతి (ఐశ్వర్యము), గొప్పతనము—ఇవన్నియు సత్సాంగత్య ప్రభావమననే అని తెలిసికొనవలయును

కీర్తిసద్గతులు పొందుట కింతకన్న నుపాయములు వేదములలోకూడ జెప్పియుండలేదు

చౌ॥ బిను సతసంగ బిబేక న హోఈ ।
రామ కృపా బిను సులభ న సోఈ ॥
సతసంగతి ముద మంగల మూలా ।
సోఇ ఫల సిధి సబ సాధన ఫూలా ॥ 29

తా॥ సజ్జనసాంగత్య మానందమునకు, శుభపరంపరలకు మూలము సత్సహవాసములేనిదే వివేకము కలుగనేరదు శ్రీరామచంద్రుని కృపలేనిదే సత్సాంగత్యము సహజముగ దొరకదు బహుజన్మకృతసుకృతవిశేషముచేత సత్సాంగత్యము లభించును భగవద్దర్శనమగును అజ్ఞానము పటాపంచలగును దానిచే బ్రహ్మానందసిద్ధియగును ఆ సిద్ధియే సజ్జనులకు జీవనము ఆ సిద్ధియే ఫలమువంటిదనియు, ఆధ్యాత్మికసాధనలు పుష్పములవంటివని తులసీదాసు చెప్పుచున్నాడు పువ్వుపూసి కాయకాచి ఫలమైనట్లు సకలాధ్యాత్మికసాధనల యొక్క ఫలము సజ్జనసందర్శన సాంగత్యప్రాప్తియే।

వి॥ దేవతలు మందర పర్వతమును కవ్వముగా జేసికొని, వాసుకిని త్రాడుగానమర్చి క్షీరసముద్రమును మథించి చంద్రుని, కల్ప వృక్షమును, కామధేనువును, అమృతమును లభింపజేసికొనినట్లు సజ్జనులు దృఢమైనభక్తితోగూడిన మనస్సుద్వారా, ఆధ్యాత్మికసాధనలద్వారా కామధేనువు, కల్పవృక్షమువంటివాడైన భగవంతుని, శాశ్వతానందరూపమగు మోక్షసామ్రాజ్యలక్ష్మిని బడయుచున్నారు ఆనందసిద్ధిలేని బ్రతుకు బ్రతుకే కాదు 'భిద్యతే హృదయగ్రంథిః' అని శ్రుతి భగవదానందము పరిశుద్ధహృదయులకు – మంచిమనస్సు గలవారికి రామకృపావిశేషముచేత సిద్ధించునని కవిహృదయము

చౌ॥ సర సుధరహిం సతసంగతి పాఈ ।
పారస పరస కుధాతు సుహాఈ ॥
బిధి బస సుజన కుసంగత పరహీం ।
ఫని మని సమ నిజ గున అనుసరహీం ॥ 30

తా॥ దుర్జనో సజ్జనో భూయాత్ అన్నటుల దుర్జనులు సజ్జనులసాంగత్యమున చక్కబడదురు ఎటులు పరుసవేదిని తాకినంతనే ఇనుము బంగారమగునో, ఆ విధముగనే దుర్జనులకు సత్సాంగత్యము లభించినచో బాగుపడుదురు

దురదృష్టవశమున సజ్జనులు దుర్జనుల సహవాసము చేసినచో సర్పమణి వోలె స్వభావసిద్ధమైన సద్గుణములనే యనుసరింతురు

వి॥ సర్పముయొక్క సంసర్గమును పొందియు దానిఫణమందలి మణి విషమును గ్రహింపదు, తనసహజగుణమైన ప్రకాశమును ప్రసరించుట మానివేయదు ఆ విధముగనే సాధుపుంగవులు, సజ్జనులు విధివశమున దుష్టసహవాసములో నుండినను ఇతరులకు తేజస్సునొసగుచుందురు

చౌ॥ బిధి-హరి-హర-కబి-కోబిద-బానీ ।
కహత సాధు మహిమా సకుచానీ ॥
సో మో సన కహి జాత న కైసే ।
సాక బనిక మని గున గన జైసే ॥ 31

తా॥ బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, పండితులు, కవులు, సజ్జన సాంగత్యమును గూర్చి చెప్పుటకు సంకోచపడుదురు అంతటి మహిమగల సజ్జనమహిమను వర్ణింప నేనెంతటివాడను? ఎంతని వర్ణింతును? ఎట్లు వర్ణింతును?

ఆకుకూరలు, కాయగూర లమ్మువానికి మాణిక్యముల విలువనుగూర్చియు వాటి గుణములనుగూర్చియు చెప్పుమనిన వాడేమి చెప్పును? నేను (శ్రీతులసీదాసు) సజ్జనసాంగత్యమునుగూర్చి వర్ణనచేయు విధముగూడ నటులేయుండును

వి॥ ఇచ్చట శ్రీగోస్వామితులసీదాసు సత్సాంగత్యమున కత్యంత ప్రాధాన్యము నొసగినారు సజ్జనులగుణగణములనుగూర్చి వర్ణించుటకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల వాక్చాతుర్యమే చాలదని చెప్పినపుడు సజ్జనుల మహిమయెట్టిదో మన మూహించుకొనవచ్చును

దో॥ బందఉ సంత సమాన చిత హిత అనహిత నహిఁ కోఇ ।
అంజలి గత సుభ సుమన జిమి సమ సుగంధ కర దోఇ॥ 32

తా॥ సజ్జనుల దృష్టిధియులో శత్రుమిత్రు లిరువురు సమానులు వారు సమచిత్తము గలవారు కనుక నేను (శ్రీతులసీదాసు) సజ్జనులకు వందన మాచరించుచున్నాను

అంజలియందుంచిన ఇరువురకాధాయిష్టమై పుష్పములు సౌరభమునకు నిలయమై కరకమలములకు సమానముగా పరిమళమును నింపు చుండును సజ్జనులు వీరు శత్రువులు—వారు మిత్రులన్న భావములేక యిరుపక్షములకును సమానరూపమున హితము గోరెదరు

దో॥ సంత సరల చిత జగత హిత జాని సుభాఉ సనేహు ।
బాలబినయ సుని కరి కృపా రామ చరన రతి దేహు॥ 33

తా॥ సజ్జనులహృదయ మత్యంతకోమలమైనది జగత్తునకు హితము చేకూర్చువారు సజ్జనులు వారి స్వభావమును, స్నేహమును బాగుగా అవగాహన చేసికొన్నవాడను కాన వారియందు శ్రద్ధాభక్తులు నాకు గలవు

కనుక సరళచిత్తులైన సజ్జనులు నన్ను (తులసీదాసు) బాలకునిగా భావించి నా బాలవినతిని స్వీకరించి, శ్రీరామచంద్రుని పాదపద్మములపై భక్తిభావము కలుగునట్లు అనురాగము పెంపొందునట్లు నన్నాశీర్వదించెదరుగాక

దుష్టులకు వందనములు




చౌ॥ బహురి బంది ఖల గన సతి భాయేఁ ।
జే బిను కాజ దాహినేహు బాయేఁ ॥
పరహిత హాని లాభ జిన్హ కేరేఁ ।
ఉజరె హరష బిషాద బసేరేఁ ॥ 34

తా॥ ఇప్పుడు నేను సజ్జనులకే గాక దుర్జనులకుగూడ సత్యభావముతో ప్రణామము లర్పించుచున్నాడను దుర్జనులు లేక దుష్టులు తమకు మేలుచేయు వారికిగూడ కీడు సేయనెంతురు దుర్జనుల స్వభావమే కడువిచిత్రమైనది ఇత రులకు హానిజేయుటయే వారిదృష్టిలో లాభకర మైనది ఇతరులు కష్టపరంపర లకు లోనగుట దుర్జనులకు సంతోషదాయకము మరియు లాభదాయకము పరు లాపదలపాలై దుఃఖితులైనచో దుష్టు లానందింతురు పరు లెవరైన సంపద గలిగి పచ్చగనుండిన నోర్వలేక విషాదపూరితు లగుదురు దుష్టులు

చౌ॥ హరి హరజస రాకేస రాహు సే ।
పర అకాజ భట సహసబాహు సే ॥
జే పర దోష లఖహిఁ సహసాఖీ ।
పర హిత ఘృత జిన్హ కే మన మాఖీ ॥ 35

తా॥ హరిహర యశోరూపమైన పూర్ణచంద్రునకు రాహువుతో సమానులు దుష్టులు దుర్జనులు ఇతరులను పీడించుటయందు అగ్రగణ్యులు చెరుపు గోరుటలో సహస్రబాహునితో సమానులైన వారలు దుష్టులు ఇతరుల దోషములను వెయ్యి కన్నులతో జూచుచుందురు ఇతరుల యశోరూపమనెడి నేతిలో దుర్జనుల మనస్సు దోమతో సమానమైనటువంటిది

వి॥ ఇతరుల యశోరూపమైన నేతిలో దుర్జనులమనస్సు దోమతో సమానమైనదనగా దోమ యేవిధముగ నేతియందుపడి దానినంతయు పాడుచేసి తాను స్వయముగా ఐచ్చునో అదే విధముగా దుష్టులు సత్కార్యములకు హాని కలిగించి తుదకు పతనము నొందెదరు సహస్రబాహుడు జమదగ్ని మహర్షి గోవును దొంగిలించినట్లు దుష్టులు ఇతరులపతనమును వాంఛింతురు

సహస్రబాహువు సహస్రబాహువు కృతవీర్యునిపుత్రుడు ఇతనికి సహస్రభుజములు గలవు ఈత డత్యంతబలశాలి శివ భక్తుడు ఒకసారి సహస్రబాహువు రావణుని తనయింటియందు బంధించెను ఇతనిరాణులు రావణునిశిరములపై దీపములనుంచి

వినోదించుచుండిరి అంతమున పులస్త్యుడు విచ్చేసి రావణుని విడి పించెను ఇతడు జమదగ్నిమహర్షి గోవును దెచ్చినప్పుడు పరశు రాము డీతని సంహరించెను సహస్రబాహువునకు నూరుగురు కుమా రులు గలరు తండ్రినిజంపిన పగ దీర్చుకొనుటకు వీరు మరల జమ దగ్నిని జంపివైచిరి అంత పరశురాము డుగ్రుడై క్షత్రియుల నెన్నియో మారులు సంహరించెను

రాహుకేతువులు సముద్రమును జిలికినపుడు అన్యరత్న ములతోపాటు అమృతము వచ్చెను దేవతలు, రాక్షసులు వేరువేరుగ పంక్తులుదీరి గూర్చుండిరి సింహిక పుత్రుడైన రాహువు దేవతారూప మున సూర్యచంద్రుల నడుమ గూర్చుండెను సూర్యచంద్రు లిది గమనించి వారు రాక్షసులని చెప్పిరి శ్రీమహావిష్ణువు రాహువు శిరమును చక్రముతో ఖండించెను కాని అమృతమును పానముచేసి నందువలన అమృతము శిరమునుండి స్రవించెను, వాడు మరణింప లేదు ఆ నరుకబడిన శిరము పేరు 'రాహువు' మొండెము పేరు 'కేతువు' సూర్యచంద్రాదులపై పగదీర్చుకొను నిమిత్తము వారి నప్పుడప్పుడు బాధించుచుందురు అందువలననే గ్రహణము కలుగు చున్నది

చౌ॥ తేజ కృసాను రోష మహిషేసా ।
అఘ అవగున ధన ధనీ ధనేసా ॥
ఉదయ కేత సమహిత సబ హీకే ।
కుంభకరన సమ సోవత నీకే ॥ 36

తా॥ ఇతరుల మనస్సులో ఈర్ష్య, ద్వేషమును కలుగజేయుటయందు దుర్జనుల తేజము అగ్నివంటిది క్రోధములో యమునితో సమానమైన వారలు దుర్గుణరూపమైన ధనములో కుబేరునితో సమానమైన వారలు దుర్జనాభ్యుదయము తోకచుక్కవలె ఎల్లర హితమును నాశనము గావించును కుంభకర్ణునివలె వారు నిద్రింతురు

వి॥ అగ్ని స్పర్శమాత్రముననే దహించును అటులేదుర్జనులు ఇతరులను హింసింతురు క్రోధమావరించెనా వారివద్దనిలుచుటకు గూడ సాధ్యపడదు క్రోధములో యమునితో సమానమైనవారలు కుబేరునితో సమానమైన ధనవంతు లనగా దుర్జను లెన్నియోపాప కార్యములుచేసి సంపాదించిన సొమ్మని భావము వారియొక్క ఔన్నత్యము ఎల్లరసుఖశాంతులను నాశనముజేసి తోకచుక్క ప్రకాశించినట్లు అనర్థహేతువగును కుంభకర్ణుడు నిద్రించునట్లు, నిద్రయందే వారికేదో సుఖమున్నదని వారు భావింతురు

చౌ॥ పర అకాజు లగి తను పరిహరహీఁ ।
జిమి హిమ ఉపల కృషీ దలి గరహీఁ ॥
బందఉఁ ఖల జస సేష సరోషా ।
సహస బదన బరనఇ పరదోషా ॥ 37

తా॥ మిడుతలదండు పొలమును నాశనముజేసి మరల నెట్లు చచ్చునో, దుర్జనులు ఇతరులకార్యములను భంగపరచుటయందు తమ ప్రాణములసహాతము గోల్పోవుచున్నారు వారి స్వభావము చెడుపుగోరునదైనను వారిని సహస్ర ముఖములుగల ఆదిశేషునిగా భావించి వారికి నేను ప్రణామము లర్పించుచున్నాను

వి॥ దుర్జనులను శ్రీవారు సహస్రముఖములు గలిగిన శేషునితో నెందులకు పోల్చియున్నారనగా దుష్టులు ఇతరులగుణదోషముల నతి తీక్ష్ణముగను రోషముతోను వేనోళ్ళ వర్ణించెద రని భావము

చౌ॥ పుని ప్రనవఉఁ పృథురాజ సమానా ।
పర అఘ సునఇ సహస దసకానా ॥
బహురి సక్ర సమ బినవఉఁ తేహీ ।
సంతత సురానీక హిత జేహీ ॥ 38

తా॥ పునః దుష్టులను పృథురాజుతో సమానముగ భావించి నేను వారికి నమస్కరింతును వారిని సహస్రాక్షుడైన ఇంద్రునితో సమానులుగ భావించి

నేను నమస్కరింతును వారియెడ వినయముతో మెలగెదను ఇంద్రునకు మధు పాన మత్యంత ప్రీతికర మైనట్లే దుష్టులకుగూడ మద్య మత్యంత ప్రీతికరము

వి॥ పూర్వము పృథురాజు భగవత్కథలను వినవలయునన్న యాకాంక్షతో వేయివీనులను ప్రసాదింపుమని భగవంతుని ప్రార్థించి యుండెను పృథురాజు భగవానునిలీలలను సహస్రకర్ణములతో నాలకించుచందంబున దుష్టులు ఇతరులదోషములను సహస్రశ్రవణ ములతో నాలకించి పరమానందభరితు లగుదురని శ్రీవారు దుష్టులను పృథురాజుతో సమానులని చెప్పుచు వారి దుష్టస్వభావము ఉపద్రవ ములకు దారితీసినను తాము సమభావముతో వారికిగూడ నమస్క రించుచున్నామని చెప్పుచున్నారు

పృథురాజు - వేనుడను దుష్టుడైనరాజొకడుండెను అతడు ప్రహ్లాదవంశీయుడైన అంగరాజపుత్రుడు వాడు దుర్మార్గుడుగాన ఋషులు వానిని శపించిరి శపించినంతనే యతడు మరణించెను రాజులేనందున నలుదిశల అత్యాచారములు ప్రబలెను ఋషులు వేనునియొక్క సురక్షితశవమును మథన మొనర్చిరి దానినుండి కోయరా జుత్పన్నమాయెను వానిని మథన మొనర్చిన తరువాత పృథురాజు వచ్చెను

పృథురాజు ధర్మాత్ముడు ఆతడొనర్చిన యొక యజ్ఞమునకే భగవానుడు సంతుష్టుడై సాక్షాత్కరించి వర మడుగు మనెను అంత పృథురాజు పరమానంద భరితుడై 'భగవత్కథలను వినుటకు నాకు పదివేల వీనులను ప్రసాదింపు' మనెను

దేవతలకురాజైనఇంద్రునకు మధుపానము ప్రీతికరమైనట్లే దుష్టులకు మద్యమన్న అమితప్రీతి దుష్టులు మద్యపానము చేసెడి వారలైనను, వారిని ఇంద్రునితో సమానులుగ భావించి తాను ప్రణతు లర్పించుచుంటినని శ్రీవారిచట చెప్పుచున్నారు

చౌ॥ బచన బజ్ర జేహి సదా పిఆరా ।
సహస నయన పర దోష నిహారా ॥ 39

తా॥ ఇంద్రునకు వజ్రాయుధముపై నెంతమక్కువయో దుర్జనులకు పరుషవచనములాడుటయం దాసక్తి మెండు ఇంద్రునకు సహస్రాక్షులున్న చందంబున దుర్జనులు సహస్రాక్షులతో లోకుల గుణదోషములను గాంచెదరు

దో॥ ఉదాసీన అరి మీత హిత సునత జరహిఁ ఖల రీతి ।
జాని పాని జుగ జోరి జన బినతీ కరఇ సప్రీతి ॥ 40

తా॥ దుష్టులు శత్రుమిత్రులయెడ ఉదాసీనభావముతో నుండెదరు ఇతరుల శ్రేయస్సును విన్నచో, వారి హృదయమున అగ్నిజ్వాలలు చెలరేగునని తెలిసి గూడ లోకులు వారికి రెండుచేతులుజోడించి ప్రీతిపూర్వకముగ నమస్కరింతురు

చౌ॥ మైఁ అపనీ దిసి కీన్హ నిహోరా ।
తిన్హ నిజ ఓర న లాఉబ భోరా ॥
బాయస పలిఅహిఁ అతి అనురాగా ।
హోహిఁ నిరామిష కబహుఁ కి కాగా ॥ 41

తా॥ నేను నాబృత్పథములో దుష్టులను స్తుతించితిని కాని, వారు నా మార్గములను పొరపాటుననైన ననుసరించరు నీచపక్షియైన వాయసమును ప్రేమతో పెంచిన అది మాంసాహారమును త్యజించునా!

వి॥ నీచపక్షియైన కాకిని ప్రేమతో చిలుకను పెంచిన చందంబున పెంచినచో అది మాంసాహారమునుదినుట మానదుగదా! కాకి వలె దుష్టులు గూడ వారి ప్రవర్తన మార్చుకొనరని భావము

## సజ్జనులకును – దుర్జనులకును వందనములు

చౌ॥ బందఉఁ సంత అసజ్జన చరనా ।
దుఖప్రద ఉభయ బీచ కఛు బరనా ॥
బిఛురత ఏక ప్రాన హరి లేహీఁ ।
మిలత ఏక దుఖ దారున దేహీఁ ॥ 42

తా॥ ఇప్పుడు నేను సజ్జనదుర్జనుల పాదములకు ప్రణమిల్లుచున్నాడను ఇరువురును దుఃఖమొసంగువారే।

దీనిలో కొంత యంతరార్థ మిమిడియున్నది అంతర్యమేమనగా సజ్జనులనుండి యెడబాటు కలిగినపుడు శోకము కలుగును దుర్జనులను కలిసినపుడు దారుణమైన దుఃఖము ననుభవించును

చౌ॥ ఉపజహిం ఏక సంగ జగ మాహీ ।
జలజ జోంక జిమి గున బిలగాహీం ॥
సుధా సురా సమ సాధు అసాధూ ।
జనక ఏక జగ జలధి అగాధూ ॥ 43

తా॥ సజ్జన దుర్జను లిరువురును ఒకేసారి యీ ప్రపంచమునం దుద్భవించిరి క సరోవరమునందే బుట్టిన కమలములు - జలగలవలె వారిగుణములు విభిన్నముగ నుండును కమలముల దర్శనస్పర్శనమాత్రముననే జనులు సుఖమునొందెదరు కాని, జలగల స్పర్శచేతనే రక్తము స్రవించును

సాధువులు - సజ్జనులు అమృతముతో సమానముగ ఈమృత్యురూపమైన ప్రపంచమునుండి జనుల నుద్ధరించెదరు అసాధువులు - దుర్జనులు మధుపానము వోలె మోహము, భ్రాంతిని ఉత్పన్నముజేసెదరు కాని అమృతమును మధువును రెంటిని నుత్పన్నము చేసినది యగాధమైన సముద్రము

వి॥ సరోవరమున జల ముండును జలము పద్మములకు ఆధారము ఆ పద్మములు పరిమళభరితములై యెల్లరకు సుఖ సంతోషములను ప్రసాదించుచుండును వాటి మృదుస్పర్శ మనుజులను పులకితుల గావించును పద్మములు, పరిమళమును వెదజల్లి దుర్వాసనను దూరముచేయునట్లు, భగవత్పాదస్పర్శ దుష్ట సంస్కారములను దూరీకృతి మొనర్చునను మరిమొక భావమిచ్చట స్ఫురించుచున్నది

దేవతలు, రాక్షసులు సముద్రమథనము సల్పి కల్పవృక్షము కామధేనువు తమకభీష్టమైన అమృతమును లభింపజేసికొనిరి అందు

సురగూడ ఉత్పన్నమాయెను అమృతమును, సురను ఉత్పన్నము జేసినది సముద్రము అటులే సజ్జనులను, దుర్జనుల నుత్పన్న మొనర్చినది యీ జగత్తు ఈ విశాల ప్రపంచమున సజ్జనులును దుర్జనులును గలరని భావము

చౌ॥ భల అనభల నిజ నిజ కరతూతీ ।
లహత సుజస అపలోక బిభూతీ ॥
సుధా సుధాకర సురసరి సాధూ ।
గరల అనల కలిమల సరి బ్యాధూ ॥
గున అవగున జానత సబకో ఈ ।
జో జేహి భావ నీక తేహి సోఈ ॥ 44

తా॥ మంచితనము - అల్పత్వము, వారివారి యాచరణను బట్టియుండును ఆచరణానుసారము కీర్త్యపకీర్తులను, ఎంపదను పొందెదరు అమృతము చంద్రుడు, పవిత్రమైనగంగానది, సాధువులు హాలాహలము, అగ్ని కర్మ నాశనము (కలియుగపాపములన్ననది), బాధాకరమైనవ్యాధియొక్క గుణదోష ములను గూర్చి ప్రతియొకరికి విదితమే కాని యెవరికేది కావలయునో యది మాత్రము వారికి బాగుగా గోచరించును

వి॥ సత్కర్మచే సత్కీర్తియు, దుష్కర్మచే అపకీర్తియు కలుగును చంద్రుడు వెన్నెల వెదజల్లును గంగానది పాపములను హరింప జేయును అగ్ని దహించును వ్యాధి మానవుని క్రుంగదీయును ఎల్లర హితమునుగోరువారు సాధువులు అమృతసేవన మాహ్లాదకరము, విషసేవనము హానికరము సజ్జనులైనవారు సజ్జనులకు కావలసిన సన్మార్గము నవలంబింతురు దుర్జనులకు చెడుగే గోచరించునుగాన అపకీర్తి కరమైన దుర్మార్గమునకు బాల్పడెదరు

దో॥ భలో భలాఇహి పై లహఇ లహఇ నిచాఇహి నీచు ।
సుధా సురాహిఅ అమరతా గరల సరాహిఅ మీచు ॥ 45

తా॥ మంచివారు మంచితనమునే గ్రహింతురు నీచులు నీచత్వమునే గ్రహింతురు విషమును విడనాడి యమృతము గావలయునన్న అమరులు గావలయును

వి॥ విషముగాక అమృతము పానము జేయవలయుననిన విషయవాంఛలను వీడి రామనామామృతమును పానముజేయ వలయునని బావము

చౌ॥ ఖల అఘ అగున సాధు గున గాహా ।
ఉభయ అపార ఉదధి అవగాహా ॥
తేహి తేఁ కచుగున దోష బఖానే ।
సంగ్రహ త్యాగ న బిను పహిచానే ॥ 46

తా॥ దుష్టుల పాపములు మరియు దుర్గుణములు, సాధువులసద్గుణములను గూర్చినకథ లగాధసముద్రమువలె అనంతములు కొన్ని గుణదోషములు మాత్రమే యిందులో వర్ణింపబడియున్నవి ఏలని వానియొక్క స్వరూపము తెలిసికొనలేకపోయినయెడల వానిని గ్రహించుటయో త్యజించుటయో మనకు తెలియబోదు

చౌ॥ భలేఉ పోచ సబ బిధి ఉపజాయే ।
గని గున దోష బేద బిలగాయే ॥
కహహిఁ బేద ఇతిహాస పురానా ।
బిధి ప్రపంచుగున అవగున సానా ॥ 47

తా॥ మంచి చెడలు ఇత్యాదులు చతుర్ముఖుడగుబ్రహ్మ సృష్టించినవే। కాని యాసృష్టియొక్కగుణదోషములను బాగుగా పరిశీలించి వేదములు వానిని వేరుపరచినవి కనుక, వేదపురాణము లేమని యుద్ఘాటించుచున్న ఏనగా బ్రహ్మ యొక్కసృష్టి సద్గుణదుర్గుణమిశితమైనది అని

చౌ॥ దుఖ సుఖ పాప పున్య దిన రాతీ ।
సాధు అసాధు సుజాతి కుజాతీ ॥

దానవ దేవ ఊంచ అరు నీచూ ।
అమిఅ సుజీవను మాహురు మీచూ ॥
మాయా బ్రహ్మ జీవ జగదీసా ।
లచ్ఛి అలచ్ఛి రంక అవనీసా ॥
కాసీ మగ సురసరి క్రమనాసా ।
మరు మారవ మహిదేవ గవాసా ॥
సరగ నరక అనురాగ బిరాగా ।
నిగమాగమ గున దోష బిభాగా ॥ 48

తా॥ దుఃఖము - సుఖము, పాపము - పుణ్యము, సాధువులు - అసాధువులు, ఉన్నతజాతి - నీచజాతి, దానవులు - దేవతలు, ఎక్కువ - తక్కువ, అమృతము విషము, అమృతత్వము - మృత్యువు, మాయ - బ్రహ్మ, జీవుడు - ఈశ్వరుడు, ఐశ్వర్యము - దారిద్ర్యము, రాజు - పేద, కాశీ - మగధ, గంగ - కర్మనాశనము, మేవాడు - మాల్వా, బ్రాహ్మణుడు - కసాయి స్వర్గము - నరకము అనురాగము - వైరాగ్యము - ఇత్యాది ద్వంద్వములన్నియు బ్రహ్మయొక్క సృష్టియందు కలవు వేదశాస్త్రములే గుణదోషానుసారము వీనిని విభజించినవి

దో॥ జడచేతన గున దోష మయ బిస్వ కీన్హ కరతార ।
సంత హంస గున గహహిం పయ పరిహరి బారి బికార॥ 49

తా॥ విధాత యీ జడచేతనమయ విశ్వమునంతయు గుణదోషమాయిష్ఠముగనే సృష్టించినాడు కాని, సజ్జనరూపమైన హంస, దోషరూపమైనజలమును విడచి గుణరూపమైన క్షీరమును గ్రహించును

వి॥ పాలను నీటిని కలిపియుంచిన, హంస పాలను మాత్రమే గ్రహించి నీటిని విడచిపెట్టును అటులే సజ్జనుడు దోషములను విడచిపెట్టి సద్గుణము లలవఱచుకొనును

చౌ॥ అస బిబేక జబ దేఇ బిధాతా ।
తబ తజి దోష గునహిం మను రాతా ॥
కాల సుభాఉ కరమ బరిఆఈం ॥
భలేఉ ప్రకృతి బస చుకఇ భలాఈ ॥ 50

తా॥ విధాత యెప్పుడు హంస కొసగిన వివేకము (దోషరూపమైన జల మును విడచి గుణరూపమైన క్షీరమును గ్రహించుట) మానవులకు ప్రసాదించునో అప్పుడు దోషరహితమై మనస్సు గుణములయం దనురక్తమై యుండును

కాని కాలకర్మానుసారము వివేకవంతులు లేక సాధువులుగూడ మాయకు వశులై అప్పుడప్పుడు మంచితనమునువీడి పతనమై పోవుదురు

చౌ॥ సో సుధారి హరి జన జిమి లేహీం ।
దలి దుఖ దోష బిమల జసు దేహీం ॥
ఖలఉ కరహిం భల పాఇ సుసంగూ ।
మిటఇ న మలిన సుభాఉ అభంగూ ॥ 51

తా॥ భక్తజను లేవిధముగ తమ్ము తాము సంస్కరించుకొని, దుఃఖదోష ములను పరిహరించుకొని నిర్మలయశమును పొందెదరో ఆ విధముగ దుష్టులు కూడ అప్పుడప్పుడు ఉత్తమసాంగత్యమును పొంది మంచివా రగుచురు కాని వారి సహజమైన మలినస్వభావము మాత్రము వారిని వీడదు

వి॥ దుష్టులకు సజ్జనసాంగత్యమునం దప్పుడప్పుడు సద్భావ ములు పెంపొందును ఆ భావములు స్థిరముగనుండక నీటిబుడగల వలె మాయమైపోవునని భావము

చౌ॥ లఖి సుబేష జగ బంచక జేఊ ।
బేష ప్రతాప పూజ అహిం తేఊ ॥
ఉఘరహిం అంత న హోఇ నిబాహూ ।
కాలనేమి జిమి రావన రాహూ ॥ 52

తా॥ ఎవరు మునీశ్వరులవలె కమండలువు చేతనిడుకొని విభూతి బూసి కొని, రుద్రాక్షమాలలు ధరించి కపటవేషధారులై మోసముతో ప్రజలనొమ్మును దీసకొనుచున్నారో వారీ జగత్తునందు పూజింపబడుచున్నారు ఆ వేషము ప్రజల నాకర్షించుచున్నది అట్లు వేషధారులైనవారలు తమకపటత్వమును మరుగుపఱచు కొనలేరు కాలనేమి, రావణాసురుడు, రాహువులకు గలిగిన గతియే వేషధారు లైన మునీశ్వరులకు గలుగును

వి॥ రావణుడు, రాహువు, కాలనేమి మొదలగువారు రాక్షసులు రావణుని దుండగముల నంతమొనర్చుటకు విష్ణుమూర్తి రామావతారమెత్తి వానిని హతమార్చెను గంధర్వుడైన కాలనేమి అహంకార పూరితుడైనందువలన దుర్వాసమహర్షిచే శపింపబడెను ఆ విధముగ మనస్సునందు కపటభావము ఉత్పన్నముజేసికొని బాహ్యముగ సాధువులవలె నటించువారి చర్య లేనాటికైనను ప్రజల దృష్టికి గోచర మగునని భావము

కొందరు ఒడలి నిండుగ విభూతిపూసికొని యోగదండమును ధరించి యూరక కూర్చుండియుందురు కొందరు జటాజూటముపై రుద్రాక్షమాలలు చుట్టుకొనియుందురు కొందరు కేవలము కౌపీన మాత్రధారులైయుందురు వీనిని వలదని తులసీదాసు నిరసించుట లేదు ఇట్టివి యుండవలసినవే కాని వీనితోపాటు భగవత్పాదపద్మ స్మరణాసక్తమగు చిత్తము ఉండిననే వీనికి సార్థకత, జన్మకు కృతార్థత సిద్ధించును అపుడే యోగులు పరమయోగు లనబడుదురు లేనిచో అంతయు వ్యర్థము, లోకవంచన

రావణుడు — రావణుడు పులస్త్యబుషి పౌత్రుడు విశ్రవసుని పుత్రుడు బ్రహ్మవలన వరముపొంది దేవతలను తృణముతో సమానముగ జూచుచుండెను కుబేరుని పుష్పకవిమానమును దీసికొనివచ్చెను కైలాసమునకేగి నందిని పరాభవించుటచే నతడు శాపమొసగెను

కాలనేమి — మకరి ఇంద్రసభలో నాట్యమాడు అప్సరస కాలనేమి యనువాడు గానముచేయు గంధర్వుడు ఒకనాడు వారి నాట్యగానకళాప్రావీణ్యమును సభయం దెల్లరును ప్రశంసించిరి

కాని దుర్వాసమహర్షి మాత్రము వారి నభినందింపలేదు అది గమనించి అప్సరోగంధర్వులు ఆ బుషిని పరిహసించిరి అంత దుర్వాస మహర్షి యాగ్రహపూరితుడై మకరిని రాక్షసి గమ్మనియు, కాలనేమిని

రాక్షసుడవుగ మ్మనియు శపించెను మకరీ కాలనేములు భయకంపితులై యతిదీనులై మహర్షిని ప్రార్థించినందువలన వారికి అతడు శాప విమోచనమునుగూడ అనుగ్రహించెను

పర్యవసానముగా హనుమంతుడు వారిని సంహరించెను తుదకు వారికి శాపవిమోచన మాయెను

చౌ॥ కిపిహుఁ కుబేషు సాధు సనమానూ ।
జిమి జగ జామవంత హనుమానూ ॥
హాని కుసంగ సుసంగతి లాహూ ।
లోకహుఁ బేద బిదిత సబ కాహూ ॥ 53

తా॥ రామదూతలగు హనుమంతుడు, జాంబవంతుడు ఈ జగత్తునందు పూజింపబడు విధమున కమండలువు రుద్రాక్షమాలలు - మున్నగు అడంబరములు లేక నిరాడంబరులు నిర్మలహృదయులైన సాధువులకుగూడ సన్మానముజరుగుట కద్దు దుస్సాంగత్యమువలన దుర్బుద్ధులు, సత్సాంగత్యమువలన సద్భావములు కలుగును ఈ నిత్యసత్యమెల్లరు నెఱింగినదే, వేదములో సుప్రసిద్ధమైనదే

వి॥ హనుమంతుడు వానరుడైనను, జాంబవంతుడు భల్లూక శరీరములో నున్నను రామనామామృతమును గ్రోలినవా రగుటచే పూజనీయు లగుచున్నారు కనుక నిర్మలమైన హృదయము గలిగినవారే రామభక్తిసామ్రాజ్యమున కర్హులు కపటవేషధారులు ప్రజలను కొంతవరకు మెప్పింతురేమోగాని భగవంతుని మెప్పింపలేరు, భగవదనుగ్రహమును పొందలేరు భక్తితాత్పర్యములులేనిదే రాముడు ప్రసన్నుడు గాడు

చౌ॥ గగన చఢఇ రజ పవన ప్రసంగా ।
కీచహిఁ మిలఇ నీచ జల సంగా ॥
సాధు అసాధు సదన సుక సారీఁ ।
సుమిరహిఁ రామ దేహిఁ గని గారీఁ ॥ 54

తా।। తీవ్రమైన గాలి వీచినపుడు ధూళి యాకాశముపరకు వ్యాపించును ఆ ధూళియే పృథ్వీతలమున ప్రవహించు జలములో మిళితమై క్రమముగా బురదలో గలిసిపోవును సాధువులు లేక సజ్జనుల గృహమున పెంచబడు చిలుక 'రామ-రామ యని ముచ్చటగా పలుకుచుండును అసాధువులు లేక దుర్జనుల గృహమునందు పెంచబడు చిలుక దూషించుట నేర్చుకొనును

వి।। సజ్జన సాంగత్య మహత్వమును కవి ప్రస్తుతించుచున్నాడు పూర్వజన్మ సుకృతమును, వంశాను సరణియు— ఇవిమాత్రమే కాక, మానవులను తీర్చిదిద్దుటలో ఎరిసరప్రభావము కూడ ప్రాముఖ్యము వహించుచున్నది ఒకే గర్భమున పుట్టిన రెండు చిల్కలు, విభిన్న పరిసరములలో పెంచబడి విభిన్న తత్వమును పొందియున్నవి కావున జన్మతః మనుజు డెట్టివాడైనను, సజ్జనసాంగత్యము, పరుసవేది ఇనుమును బంగారుగా మార్చునట్లు, దుష్టుని కూడ ఉత్తమునిగా రూపొందించునని విదిత మగుచున్నది

చౌ॥ ధూమ కుసంగతి కారిఖ హోఈ ।
లిఖిఅ పురాన మంజు మసి సోఈ ॥
సోఇ జల అనల అనిల సంఘాతా ।
హోఇ జలద జగ జీవన దాతా ॥ 55

తా।। దుస్సాంగత్యము వలన ధూమము పొగగుమియగుచున్నది అదే పొగ సుసాంగత్యము వలన శ్రేష్ఠమైన సిరాగా మారి పురాణములను లిఖించుటకు పనికివచ్చుచున్నది అదే పొగ జలము, అగ్ని, వాయువులతో మిళితమై మేఘాకృతిని బొంది ప్రజలకు జీవనాధార మగుచున్నది

వి।। ఇందు కవి దుస్సాంగత్య, సుసాంగత్య ఫలితములను సోదాహరణముగా నిరూపించుచున్నాడు 'ధూమ' మనగా ఇచట కాలిమ అనగా నైల్యము ఈ నైల్యము సాధారణముగా తమోగుణమునకు ప్రతీక పొగరూపమైన నైల్యము హేయము, అనారోగ్య ప్రదము కూడ అదే మషిపంక రూపమైన నైల్యము ఒక సదాచరణ

మునకు ఉపకరణమైనది, విజ్ఞాన ప్రదమైనది అదే నైల్యము మేఘ రూపమై, చల్లని వృష్టిని ప్రసాదించుచున్నది ఇందు నైల్యము సర్వత్ర సామాన్యము తదాశ్రయ వస్తువులు మాత్రము భిన్నములు

'ధూమ కుసంగతి'—— అనుటలో కవి చెడ్డవస్తువు నుండి పుట్టినపొగ—— అనగా ప్రేత దూమము ఇత్యాదులను స్ఫురింప జేయుచున్నాడు మషీపంకరూప ధూమము జలాది సద్వస్తువు లాశ్రయముగా గలది ఇక మేఘరూప ధూమము, జల నలానిలా శ్రయము గాన సుఖదాయి యని వేరుగ వక్కాణింపబనిలేదు ఇంతకు 'కుసంగతి'—— చెడ్డసంసర్గము త్యాజ్యము—— అని కవి ఉద్బోధించుచున్నాడు

దో॥ గ్రహభేషజ జల పవన పట
పాఇ కుజోగ సుజోగ ।
హోహిఁ కుబస్తు సుబస్తు జగ
లఖహిఁ సులచ్ఛన లోగ ॥ 56

తా॥ గ్రహములు, ఓషదులు జలము, వాయువు, వస్త్రము—— మొదలగున వన్నియు సత్సంగమును మరియు దుస్సంగమును పొంది ప్రపంచమునందు మంచి— చెడు పదార్థములగుచున్నవి చతురులు, వివేక వంతులు, విచారశీలురైన పురుషులు మాత్రము పైని చెప్పని మాటల యందలి యర్థమును దెలిసికొందురు

వి॥ ఈ 'దోహా'యందు కవి ఉత్కృష్టవస్తు సముదాయమును పేర్కొని అవి 'కుసంగతి'చే నెట్లు దూష్యము లగుచున్నవో నిరూపించుచున్నాడు గ్రహములు— ఇవి మిత్రగ్రహములతోకూడి సత్ఫలిత మును, శత్రుసమూహముతో జేరి దుష్ఫలితమునిచ్చుట జ్యోతిశ్శాస్త్ర వేత్తలకును సర్వులకువిదితమే అట్లే ఓషధ్యాదులును కావున వస్తువు మంచిదైనను తదాశ్రయము నెఱిగి, వివేకవంతులు ఆయా వస్తువుల నపేక్షించుటగాని త్యజించుటగాని చేయవలయునని తాత్పర్యము

'అంగుళీవోరగక్షతా' అను కాళిదాససూక్తి ఇచట అను సంధేయము

దో॥ సమ ప్రకాస తమ పాఖ దుహుఁ నామ భేద బిధి కీన్హ ।
ససి సోషక పోషక సముఝి జగ జస అపజస దీన్హ ॥ 57

తా॥ మాసమునందు రెండు పక్షములయందు అనగా అమావాస్య, పూర్ణిమ నాడు తప్ప చీకటి వెలుగు ఇంచుమించు సమానముగనే యుండును కాని, ఒకటి శుక్లపక్షమనియు, ఇంకొకటి కృష్ణపక్షమనియు బ్రహ్మ వీని నామములలో కొంత భేదము కలిగించినాడు శుక్లపక్షచంద్రుడు దినదిన ప్రవర్ధమాను డగును కృష్ణపక్షచంద్రుడు దినదినమునకు క్షీణించును చంద్రుని ఒకపక్షము పెంపొందింపజేయును, మరొకపక్షము క్షీణింపజేయును

శుక్లపక్షమున రాత్రిప్రారంభమున వెలుగు తరువాత చీకటియు, కృష్ణపక్షమున మొదట చీకటియు తరువాత వెలుగు క్రమముగా వచ్చును అటులే యీ జగత్తు దినదిన ప్రవర్ధమానుడగు శుక్లపక్షచంద్రునివలె భావించి యొకరికి కీర్తిని, దినదినమునకు క్షీణించెడు కృష్ణపక్షచంద్రునివలె భావించి యింకొకరికి అపకీర్తిని కలిగించెను

## సర్వము రామమయమని భావించి సర్వజీవులకు వందన మొనరించుట

దో॥ జడచేతన జగ జీవ జత సకల రామమయ జాని ।
బందఉఁ సబకే పద కమల సదా జోరి జుగ పాని ॥ 58

తా॥ ఏకకాలమునందే జడమయము, చేతనము ఇట్లుభయాత్మకమైన ఈ జగత్తునందెన్నిజీవరాశులు కలవో అవి యన్నియు రామమయ మనుకొని నే నహర్నిశలు నా కరములను జోడించి వాని పాదపద్మములకు ప్రణమిల్లుచున్నాడను

దో॥ దేవ దనుజ నర నాగ ఖగ ప్రేత పితర గంధర్బ ।
బందఉఁ కింనర రజనిచర కృపా కరహు అబ సర్బ ॥ 59

తా॥ దేవదానవులు, మానవులు, నాగులు పక్షులు, ప్రేతములు, పితృదేవతలు, కిన్నరులు, నిశాచరులు — మొదలగు వారందరికి నేను నమస్కరించుచున్నాడను ఇట్టితటి వారెల్లరు నాయందు కృపజూపుదురుగాక।

చౌ॥ ఆకర చారి లాఖ చౌరాసీ ।
జాతి జీవ జల థల నభ బాసీ ॥
సీయ రామమయ సబ జగ జానీ ।
కరఉఁ ప్రనామ జోరి జుగ పానీ ॥ 60

తా॥ ఎనుబదినాలుగు లక్షల జీవరాశులందు నాల్గువిధములుగ (స్వేద అండజ, ఉద్భిజ్జ, జరాయుజ) జీవములు జలమునందు, భూమియందు ఆకాశమునం దున్నవి సమస్త జీవరాశులతోగూడిన యీ జగత్తును సీతారామమయముగ భావించి నేను నా రెండు కరములను జోడించి నమస్కరించుచున్నాడను

చౌ॥ జాని కృపాకర కింకర మోహూ ।
సబ మిలి కరహు ఛాడి ఛల ఛోహూ ॥
నిజ బుధి బల భరోస మోహి నాహీఁ ।
తాతేఁ బినయ కరఉఁ సబ పాహీఁ ॥ 61

తా॥ నన్ను రామదాసునిగా భావించి సర్వులును ఈర్ష్యాదిగుణములను త్యజించి నా యందు కృపజూపెదరుగాక। ఈ రచన గావించుటకు బుద్ధిబలము కలుగునన్న నమ్మకము నా కణుమాత్రములేదు అందులకే నే నెల్లర ప్రార్థించుచున్నాడను

## తులసీదాసు యొక్క దీనత్వము— రామభక్తియుతమైన కవితామహిమ

చౌ॥ కరన చహఉఁ రఘుపతి గున గాహా ।
లఘు మతి మోరి చరిత అవగాహా ॥
సూఝ న ఏకఉ అంగ ఉపాఊ ।
మన మతి రంక మనోరథ రాఊ ॥ 62

తా॥ నేను శ్రీరఘునాథుని గుణములను వర్ణింపగోరుచున్నాను కాని నా బుద్ధి స్వల్పమైనది శ్రీరామచరిత్ర మగాధమైనది, అనంతమైనది కనుక లేశ మాత్రముగూడ నుపాయము నాకు తోచుటలేదు నా మనోబుద్ధులు పేదవానితో సమానము కాని నా మనోరథము (అభిలాష) రాజు వంటిది

పేదవాడు రాజు గావలయుననిన్న సాధ్యమా? అత్యంతస్వల్పమైన నాబుద్ధి చాతుర్యముతో అగాధమైన శ్రీరామచరితమును అనంతమైన శ్రీరఘునాథుని సుగుణములను వర్ణింపతరమా?

వి॥ రఘువంశ కావ్యమునందు కాళిదాస మహాకవి ప్రారంభమున "క్వసూర్య ప్రభవో వంశః। క్వచాల్పవిషయా మతిః। తితీర్షుర్దుస్తరం మోహాత్ ఉడుపేనాస్మిసాగరమ్" అని రచించినాడు

అనగా సూర్యవంశ మెక్కడ? స్వల్పమైన నా బుద్ధిచాతుర్య మెక్కడ? నేను దీనినివర్ణింపగోరుట సముద్రమును తెప్పకొయ్యతో దాటగోరుటవంటిదే యని భావము

కాళిదాసమహాకవివలెనే యిచ్చట శ్రీగోస్వామి తులసీదాసు శ్రీరాముని సుగుణసంపత్తిని వర్ణించుటకు తనబుద్ధి స్వల్పమైనదనియు శ్రీరామునియశ మగాధమైన దనియు నుడివెను

చౌ॥ మతి అతి నీచ ఊంచి రుచి ఆఛీ ।
చహిఅ అమిఅ జగ జురఇ నఛాఛీ ॥
ఛమిహహిఁ సజ్జన మోరి ఢిఠాయీ ।
సునిహహిఁ బాలబచన మన లాయీ ॥ 63

తా॥ నాబుద్ధి అత్యంతనీచమైనది శ్రీరామచరితమును రచింపవలయు నన్న యభిలాష నాయందుత్పన్నమైనది కాని నాకోరిక యున్నతమైనది చల్లని మజ్జిగ దొరకుటయే దుర్లభమైన యీ జగత్తునందు అమృతమును పొందగోరుచున్నాను సజ్జనులు నా యీ ప్రయత్నమును క్షమించెదరుగాక। నేను చెప్పు మాటలను బాలవచనములుగా భావించి నిండుమనస్సుతో ప్రేమపూర్వకముగ విన వలయునని కోరుచున్నాను

చౌ॥ జౌఁ బాలక కహ తోతరి బాతా ।
సునహిఁ ముదితమన పితు అరు మాతా ॥
హఁసిహహిఁ కూర కుటిల కుబిచారీ ।
జే పర-దూషన-భూషనధారీ ॥ 64

తా॥ బాలకుడు ముద్దుపలుకులను బలుకుచుండ తల్లిదండ్రులు ప్రసన్న చిత్తముతో నాలకించుచు సంతోషింతురు కాని కుటిలాత్ములు, దుర్మార్గులు పర దూషణమే భూషణమని భావించు క్రూరులు హేళనగా నవ్వెదరు

చౌ॥ నిజ కబిత్త కేహి లాగ న నీకా ।
సరస హోఉ అథవా అతి ఫీకా ॥
జే పర భనితి సునత హరషాహీఁ ।
తే బర పురుష బహుత జగ నాహీఁ ॥ 65

తా॥ రసవంతముగాని, రసహీనముగాని యెవరెవరికవిత్వము వారివారికి నచ్చకపోవునా? తమ్ము తాము ప్రశంసించుకొనుట గాదు ఇతరుల కవిత్వమును గూర్చి సంతసించుట యుత్తమోత్తమము అటువంటి యుత్తమపురుషు లీ జగత్తు నం దరుదనియే చెప్పవచ్చును

చౌ॥ జగ బహు నర సర సరి సమ భాఈ ।
జే నిజ బాఢి బఢహిఁ జల పాఈ ॥
సజ్జన సకృత సింధు సమ కోఈ ।
దేఖి పూర బిధు బాఢఇ జోఈ ॥ 66

తా॥ సోదరులారా! ఈ జగత్తునందు నదీ తటాకములవంటి మనుజు లధికముగా నున్నారు నదులు, తటాకములలో అధికవర్షపాతముచే జల మధికమై పరవలువచ్చు చందంబున మానవు లున్నతిపొందునపుడు వారి యానందమున కవధు లుండవు

పూర్ణిమనాటి చంద్రునిగాంచి సముద్ర ముప్పొంగును అటులే సజ్జనుడు ఇతరుల యౌన్నత్యమును గాంచినపు డానందాబ్ధి నోలలాడును సముద్రమువంటి సత్పురుషు డొక్కడుండుటకూడ అరుదే

చౌ॥ రామ భగతి భూషిత జియఁ జానీ ।
సునిహహిఁ సుజన సరాహి సుబానీ ॥
కబి న హోఉఁ నహిఁ బచన ప్రబీనూ ।
సకల కలా సబ బిద్యా హీనూ ॥ 71

తా॥ ఈ రామచరిత మానసము రామభక్తియనెడి భూషణములచే విరాజిల్లుచున్నది కాన సజ్జనులు తమ యంతఃకరణమునం దదితెలిసికొని, సుందరాతి సుందరముగ మనోహరముగ దీనిని ప్రశంసింతురు నేను కవినిగాను అంతకు మించి వాక్చాతుర్యము గలవాడనుగాను పరికించిచూడ సర్వకళలయందును సమస్తవిద్యలయందును నాకు ప్రతిభలేదు నేను కళారహితుడను, విద్యాహీనుడను

చౌ॥ ఆఖర అరథ అలంకృతి నానా ।
ఛంద ప్రబంధ అనేక బిధానా ॥
భావ భేద రస భేద అపారా ।
కబిత దోష గున బిబిధ ప్రకారా ॥ 72

తా॥ అక్షరముల పొందికయందును అర్థాలంకారములందును, ఛందస్సులను వివిధములుగా వాడుటయందును, భావములందును, నవరసపోషణయందును, భేదములందును ఇంక నెన్నియో కవిత్వపు పోకడలయందు వివిధములైన గుణదోషములు కలుగుచుండును

వి॥ శ్రీవారు కావ్యమువ్రాయుట యెంతకష్టతరమో యిట సూచించినారు కవులు రసపోషణయందును, అక్షరములపొందిక యందును, ఇంకను వివిధకవిత్వపుపోకడలయం దెట్లు జాగరూకత వహింపవలసినది సూచించినారు ఎంత జాగ్రతవహించినను ఇంకను దోషముండునని చెప్పుచున్నారు

చౌ॥ కబిత బిబేక ఏక నహిఁ మోరేఁ ।
సత్య కహఉఁ లిఖి కాగద కోరేఁ ॥

తా॥ ఇందులో కావ్యసంబంధమైన జ్ఞానము నాకు లేదు నేను శపథపూర్వకముగా సత్యమునే ఎచించుచుంటిని దానిని వ్రాతమూలముగ లిఖించుచున్నాను

దో॥ భనితి మోరి సబ గున రహిత బిస్వ బిదిత గున ఏక ।
సో బిచారి సునిహహిం సుమతి జిన్హ కేం బిమల బిబేక ॥ 74

తా॥ నా రచన సమస్తగుణరహితమైనది కాని దానిలో జగత్ప్రసిద్ధమైన యొకగుణ మున్నది అంతేచాలును సద్బుద్ధిగలిగినవారయి, వివేకవంతులు ఇందలి నిర్మలజ్ఞానమునుగూర్చి వినెదరు

చౌ॥ ఏహి మహఁ రఘుపతి నామ ఉదారా ।
అతి పావన పురాన శ్రుతి సారా ॥
మంగల భవన అమంగల హారీ ।
ఉమా సహిత జేహి జపత పురారీ ॥ 75

తా॥ ఈ రామచరితమునందు శ్రీరామనామస్మరణ యున్నది కాన నత్యంతపవిత్రమైనది వేదపురాణముల సారమున్నది మంగళకరమైనది అమంగళమును హరింపజేయునది అందులకేగదా పార్వతీసమేతముగా శివుడు రామనామజపమును చేయుచుండును

చౌ॥ భనితి బిచిత్ర సుకబి కృత జోఊ ।
రామ నామ బిను సోహ న సోఊ ॥
బిధుబదనీ సబ భాఁతి సఁవారీ ।
సోహ న బసన బినా బర నారీ ॥ 76

తా॥ ఇందువదనయై, సర్వాభరణభూషితయై యొప్పారు యువతిలలామ వస్త్రములులేకుండిన రాజింపదు గదా ! అదేవిధముగ నెంతటి మహాకవిచే రచింపబడిన యుత్కృష్టమైన కవిత్వమైనను సరే రామనామములేక శోభిల్లదు

చౌ॥ సబ గున రహిత కుకబి కృత బానీ ।
రామ నామ జస అంకిత జానీ ॥
సాదర కహహిం సునహిం బుధ తాహీ ।
మధుకర సరిస సంత గునగ్రాహీ ॥ 77

తా॥ ఎంతటి కుకవికృతవాణియైనను, సర్వగుణరహితమైన కవిత్వమైనను శ్రీరామాంకితము చేయబడినచో, బుద్ధిమంతు లాదరపూర్వకముగ నాలకింతురు పఠింతురు భ్రమరములు పుష్పమునందుండు మకరందమును గ్రోలు చందంబున సజ్జను లందలిసుగుణములను గ్రహింతురు

చౌ॥ జదపి కబిత రస ఏకఉ నాహీఁ।
రామ ప్రతాప ప్రగట ఏహి మాహీఁ॥
సోఇ భరోస మోరేఁ మన ఆవా।
కేహిఁ న సుసంగ బడప్పను పావా॥ 78

తా॥ కాని, నా రచనలో కవిత్వమునకు వలయు రస మున్నది శ్రీరఘువీరుని ప్రతాపము ప్రకటితరూపమై యున్నది సత్సాంగత్యమువలన గొప్పతనమును పొందనివా రెవరు? రణధీరుడైన రామచంద్రుడండగ నుండగ భయము లేదనియు యశమునకు లోటులేదనియు శ్రీవారు చెప్పుచున్నారు

చౌ॥ ధూమఉ తజఇ సహజ కరుఆఈ।
అగరు ప్రసంగ సుగంధ బసాఈ॥
భనితి భదేస బస్తుభలి బరనీ।
రామ కథా జగ మంగల కరనీ॥ 79

తా॥ ధూమముగూడ అగరువత్తుల సంసర్గమువలన తన చిటచిటలాడు (కటు) స్వభావమును విడిచిపెట్టును నాకవిత్వము నిక్కముగ రసవత్తరమైనది గాదు కాని, యిందులో జగత్కల్యాణమును జేకూర్చు నుత్తమవస్తువు వర్ణింపబడియున్నది దీని నెల్లరు పఠింతురుగాక।

వి॥ పొగవచ్చునపుడు సామాన్యముగా కటువుగను నాసాపుటముబాధించు చిటచిటమను శబ్దమువచ్చుట మనకందరికి విదితమే కాని యాపొగయే అగరువత్తుల సంసర్గమున వచ్చినపుడు పరిమళము వెదజల్లును

శ్రీతులసీదాసు తనకవిత్వమును సాధారణముగవచ్చు పొగకు బోల్చినారు శ్రీరామకథను - అగరువత్తులకు బోల్చినారు తాము చేయుకవిత్వము(పొగ) శ్రీరామకథయనెడి అగరువత్తులతోకూడినది కాన తప్పక సుఖశాంతులనెడి పరిమళమును వెదజల్లుననిరి

ఛం॥ మంగల కరని కలిమల హరని తులసీ కథా రఘునాథ కీ ।
గతి కూర కబితా సరిత కీ జ్యోఁ సరిత పావన పాథ కీ ॥
ప్రభు సుజస సంగతి భనితి భలి హోఇహి సుజన మన
భావనీ ।
భవ అంగ భూతి మసాన కీ సుమిరత సుహావని పావనీ॥80

తా॥ శ్రీగోస్వామి తులసీదాసీ విధముగ జెప్పుచున్నారు శ్రీరఘునాథుని చరిత్రము కల్యాణప్రదమైనది కలియుగములోని పాపములను హరించునది ఈ రీతిలేని కవితారూపమైన నదియొక్కగతి పవిత్రమైన గంగానది గతివోలె వంకర టింకరగ నున్నది శ్రీరామచంద్రుని యశము గానముచేయబడుటచే ఈ కవిత్వము సుందరమై సజ్జనులమనంబును చూరగొనును శ్మశానమునందుండు నపవిత్రమైన బూడిదకూడ శ్రీమహాదేవుని యంగంబున బూయబడినపుడు పవిత్రమగును స్మరణమాత్రమున పవిత్రత చేకూర్చునదియగును శ్రీరామచంద్రుని గూర్చినగాథ కాన, ఇది అత్యంతపవిత్రమైనది

దో॥ ప్రియ లాగిహి అతి సబహి మమ భనితి రామ జస సంగ ।
దారు బిచారు కి కరఇ కోఉ బందిఅ మలయ ప్రసంగ॥ 81

తా॥ ఏ విధముగ మలయపర్వతపు మారుతనంసర్గమువలన ఆ ప్రదేశమున పెరుగు వృక్షములుగూడ చందనసువాసన వెదజల్లుచు వందనీయములై పరలునటుల శ్రీరామయశముతో నొప్పారు నా కవిత్వ మెల్లరకును ప్రీతిపాత్రమైనది

వి॥ మలయపర్వత మారుత సంసర్గమువలన సామాన్యవృక్షములుగూడ చందన పరిమళభరితములై యొప్పారు చందంబున

శ్రీరామయశముతోగూడిన కవిత్వము పవిత్రము మరియు ప్రీతికర మని భావము

దో॥ స్యామ సురభి పయ బిసద అతి గునద కరహిఁ సబ పాన ।
గిరా గ్రామ్య సియ రామ జస గావహిఁ సునహిఁ సుజాన॥82

తా॥ మంచిజాతికిచెందిన గోవు నల్లగనుండినను దాని క్షీరము తెల్లగను, శ్రేష్ఠముగ నుండును గోవు నల్లగనున్నదని తెలిసియు జనులు క్షీరమును సేవింతురు ఆ విధముగ గ్రామ్యభాషయందున్న యీ రచన శ్రీసీతారాముల యశమును చాటుచున్నది కనుక బుద్ధిమంతులైన వార లుత్సాహముతో దీనిని గానముచేసి యానందింతురు

చౌ॥ మని మానిక ముకుతా ఛబి జైసీ ।
అహి గిరి గజ సిర సోహ న తైసీ ॥
నృప కిరీట తరునీ తను పాఈ ।
లహహిఁ సకల సోభా అధికాఈ ॥ 83

తా॥ మణులు, మాణిక్యములు, ముత్యములు సహజముగ కాంతివంతమైనవి ఆ మణులు పాముపడగపై, పర్వతములపై, గజరాజుమస్తకముపై నున్నపు డనుకొన్నంత శోభ నీయవు మణులు రాజకిరీటమును పొందగబడినపుడును, యువతీమణి యాభరణరూపమును ధరించినపు డత్యంతశోభ నొనగును

చౌ॥ తైసేహిఁ సుకబి కబిత బుధ కహహీఁ ।
ఉపజహిఁ అనత అనత చబి లహహీఁ ॥
భగతి హేతు బిధి భవన బిహాఈ ।
సుమిరత సారద ఆవతి ధాఈ ॥ 84

తా॥ అటులనే ప్రతిభావంతుడైన కవియొక్క కవిత్వమొకచోట నుత్పన్నమై యొకచోటినుండి మరొకచోట శోభ నిచ్చునని వివేకవంతులు చెప్పెదరు

కవిత్వారంభమున కవి సరస్వతిని స్మరించును అట్లు వాగ్దేవియైన సరస్వతిని స్మరించినంతనే ఆమె బ్రహ్మలోకమును విడచి భక్తునియభీష్టము నెరవేర్చుటకై పరుగిడుచు వచ్చును

వి॥ సుకవియొక్క కవిత్వ మొకచోట నుత్పన్నమై యొకచోటి నుండి మరియొకచోట శోభనిచ్చుననగా కవియొక్క వాణిద్వారా వెలువడిన కవిత్వము ఎక్కడ ప్రచారము, సదాదర్శము, గ్రహణము అనుసరణయుండునో యక్కడ శోభించునని భావము

చౌ॥ రామ చరిత సర బిను అన్హవాఏఁ ।
సో శ్రమ జాఇ న కోటి ఉపాఏఁ ॥
కబి కోబిద అస హృదయఁ బిచారీ ।
గావహిఁ హరి జస కలి మల హారీ ॥ 85

తా॥ అట్లు పరుగిడుచువచ్చిన శారదాదేవి రామచరితరూపసరోవరములో స్నానమాచరింపనిదే కోటియుపాయముల చేతనైనను ఆమెకు కలిగిన యలసట తీరదు

కవులు, పండితు లావిధముగ విచారించినవారై కలియుగ పాపములను హరించు శ్రీహరియశమును గానము చేయుచున్నారు

వి॥ కవి పిలిచిన తోడనే బ్రహ్మలోకమునుండి విచ్చేసిన సరస్వతీదేవి, కావ్యము భగవానుని గూర్చినదగుట సంతసముతో ప్రసన్నురాలైనదనిభావము

చౌ॥ కీన్హేఁ ప్రాకృత జన గున గానా ।
సిర ధుని గిరా లగత పఛితానా ॥
హృదయ సింధు మతి సీప సమానా ।
స్వాతి సారదా కహహిఁ సుజానా ॥ 86

తా॥ ప్రాపంచికసంబంధులైన మానవులను కీర్తించినపుడు వాగీశ్వరియైన సరస్వతి నే నిత డాహ్వానించినంతనే యెందులకు వచ్చితినో యని చింతించి తాను వచ్చినందులకు పశ్చాత్తాపపడును

బుద్ధిమంతులైనవారి హృదయమును-సముద్రమునకు, బుద్ధిని-ముత్తెపు చిప్పకు, సరస్వతిని-స్వాతినక్షత్రమునకు బోల్చియున్నారు

వి॥ సముద్రమునందు ముత్తెపు చిప్పలుండును స్వాతి నక్షత్రమున ముత్తెపు చిప్పయందు పడు బిందువు ముత్యమగురీతి హృదయములో బుద్ధివికాసము కలిగి సరస్వతీదేవి ప్రసన్నురాలైనచో కావ్యము నవరసభరితమై యెల్లర హృదయములు చూరగొనునని కవి హృదయము

చౌ॥ జౌం బరషఇ బర బారి బిచారూ ।
హోహిం కబిత ముకుతామని చారూ ॥ 87

తా॥ ఈ ముత్తెపుచిప్పలలో శ్రేష్ఠకవితారూపమైన జలబిందువు లెప్పుడు పడునో అప్పుడు ముక్తామణితో సమానమైన మనోజ్ఞమైన కవిత్వ ముద్భవించును

దో॥ జుగతి బేధి పుని పోహిఅహిం రామ చరిత బర తాగ ।
పహిరహిం సజ్జన బిమల ఉర సోభా అతి అనురాగ ॥ 88

తా॥ కవితారూపమైన ముత్యపుచిప్పనుండి యుక్తితో భేదించుకొని మరల రామచరిత్ర సుందరమైన దారముగనై ముత్యములందు గ్రుచ్చబడిన తరువాత ఆ ముక్తాహారమును సజ్జనులు కంఠహారముగ ధరింతురు నిర్మలహృదయముగల సజ్జనులా హారమును ధరించినంతనే యనురాగరూపమైన శోభ కలుగును

వి॥ సూర్యవంశము - రత్నమువంటిది రామాయణాది గ్రంథములు - రంధ్రముల వంటివి వాల్మీక్యాది సూరులు - వజ్రసూచివంటివారు. తాను (కాళిదాసు) దారమువంటివాడని కాళిదాసు రఘువంశ కావ్యారంభమున రత్నవజ్రసూత్రోపమానములచే సూర్యవంశచరిత్రను రామాయణాది గ్రంథముల ప్రాశస్త్యమును విపులీకరించెను శ్రీరామ చరితమానసమునందు తులసీదాసు రామచరిత్రను - దారమునకును, కవిత్వమును - ముత్యపుచిప్పలకును బోల్చినారు ఇటు 'మణౌ వజ్ర సముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః' యన్న కాళిదాస సూక్తి అనుసంధేయము

శ్రీరామచరిత్రయన్న ముక్తాహారమును ధరించుటకు పాత్రులైన - వారలు శ్రీరామపాదసేవాతత్పరులే యన్న మరియొకభావమిచ్చట ధ్వనించుచున్నది

చౌ॥ జే జనమే కలికాల కరాలా ।
కరతబ వాయస బేష మరాలా ॥
చలత కుపంథ బేద మగ ఛ్చాండే ।
కపట కలేవర కలిమల భాండే ॥ 89

తా॥ కలియుగము పాపముల తాటపట్టయినది కల్మష భూయిష్ఠమైనది కలియుగమునందు జన్మించినవారలు వేదమార్గముల ననుసరించుట కిచ్ఛగింపక అధర్మపరులై అవినీతికి పాల్పడుదురు

వారి వేషము మాత్రము చూచుటకు హంసవలె రమణీయముగ నుండును కాని వారిచర్యలు వాయసము వలె నల్పముగను హేయముగ నుండును

వి॥ హంస పక్షిజాతులలో నుత్తమమైనది, వాయసము పక్షిజాతులలో హీనమైనది అటులే కలియుగమున నుండువారలు మానస సరోవరమునందు విహరించు హంసవలె, బాహ్యమున గొప్పవారుగను, ధర్మపరులుగ నగుపింతురు కాని, వారు చేయు పనులు మాత్రము వాయసము అశుచియైన ఆహారమును తినునట్లు హీనముగనుండి, ఇతరులకు వారు హాని కలిగించువారై యుందురు

చౌ॥ బంచక భగత కహాఇ రామ కే ।
కింకర కంచన కోహ కామ కే ॥
తిన్హ మహఁ ప్రథమ రేఖ జగ మోరీ ।
ధీంగ ధరమధ్వజ ధంధక ధోరీ ॥ 90

తా॥ శ్రీరామభక్తులమని చెప్పుచు నితరులను మోసగించి ధనమును స్వీకరించువారలు కామ, క్రోధ, లోభములకు దాసులైనవారలు కపటత్వముతో జీవనము సలుపువారలు ధర్మసంస్థాపన చేయుదుమని యధర్మపు ధ్వజముల నెగురవేయువారలు

కలుషాత్మునైన యీ ప్రాపంచిక జనులలో ప్రప్రథమముగ నన లెక్కించవచ్చును

వి॥ పై నుడివిన శ్రీ తులసీదాసస్వామివారి మాటలను బ చూడ ఆయన ఎంతటి నిరహంకారియో తెలియనగును ఇటువం భావములే శ్రీత్యాగరాజస్వామి రచించిన కీర్తనలయందు గా వచ్చును కలుషాత్ముడై దుష్కర్మయుతుడై, పలుమారు దుర్భాషిం ఇలలో భక్తాగ్రేసరులలో వేషియై త్యాగరాజ పూజిత "నే నెం వెదకుదురా హరి" యనివారు గానము చేసిరి పరమభక్తాగ్రేసరు విరాజిల్లుచు తాను భక్తాగ్రేసరులలో వేషధారియని నుడివిరి

కనుక మహాత్ముల జీవితము లత్యంతపవిత్రమైనవి వా స్మరణమాత్రముననే మనము కూడ సుఖశాంతులను పొందెదము

చౌ॥ జౌं అపనే అవగున సబ కహఊं ।
బాఢఇ కథా పార నహిं లహఊं ॥
తాతే మైं అతి అలప బఖానే ।
థోరే మహుं జానిహహిं సయానే ॥

తా॥ నేను నా దుర్గుణములను జెప్పుచు బోయిన యెడల కథ చాల పె ఒగును ఈ కథ సమాప్తిగావించలేను నేను కొన్నిదుర్గుణములను మాత్రమిం వర్ణన చేసితిని బుద్ధిమంతులకు కొంత చెప్పిన చాలును వారు చెప్పిన దానికన నధికముగనే యవగాహన చేసికొనెదరు

చౌ॥ సముఝి బిబిధి బిధి బినతీ మోరీ ।
కోఉ న కథా సుని దేఇహి ఖోరీ ॥
ఏతేహు పర కరిహహిं జే అసంకా ।
మోహి తే అధిక తే జడ మతి రంకా ॥ 9

తా॥ నా వివిధ ప్రార్థనలనాలకించి యెవరును నీకథను విని దోషము లారోపింపకుండెదరు గాక। ఇంత చెప్పినను వినక విమర్శించువారలు నాకన్న వారధికమూర్ఖులనియు బుద్ధిలో పేదవానివంటివారలనియు చెప్పవచ్చును

చౌ॥ కబి న హోఉఁ నహిఁ చతుర కహావఉఁ।
మతి అనురూప రాము గున గావఉఁ॥
కహఁ రఘుపతి కే చరిత అపారా।
కహఁ మతి మోరి నిరత సంసారా॥ 93

తా॥ నేను కవిని గాను, చతురుడను గాను నాబుద్ధ్యనుసారముగ శ్రీరామ చరితమును గానము చేయుచున్నాడను శ్రీరామచంద్రుని యపారమైనచరిత్ర ఎక్కడ? ప్రాపంచిక విషయములం దాసక్తిగల నాబుద్ధి ఎక్కడ?

వి॥ ఇక్కడ శ్రీకాళిదాస మహాకవి శ్రీ రఘువంశమునందు చెప్పిన మాటలు 'క్వ సూర్య ప్రభవో వంశః, క్వచాల్పవిషయా మతిః' అను వానిని మరల స్మరింప జేయుచున్నవి




చౌ॥ జేహి మారుతఁ గిరి మేరు ఉడాహీఁ।
కహహు తూల కేహి లేఖే మాహీఁ॥
సముఝత అమిత రామ ప్రభుతాఈ।
కరత కథా మన అతి కదరాఈ॥

తా॥ ఎంతటి సుడిగాలి వీచినను, సుమేరుపర్వత మెగురగలదా? అంతటి మహాపర్వతమునెదుట దూదితో నింపబడిన వస్తువే లెక్కలోనికి వచ్చును? అని భావించినవాడనై, శ్రీరామయశ మగాధమైనది, మహత్తరమైనదని బాగుగా దెలిసికొన్నవాడ నగుటచేత ఈ కథారచనయందు పురోగమించుటకు నేను సంకోచించు చున్నాడను

దో॥ సారద సేస మహేస బిధి ఆగమ నిగమ పురాన।
నేతి నేతి కహి జాసు గున కరహిఁ నిరంతర గాన॥ 95

తా॥ సరస్వతి, ఆదిశేషుడు శివబ్రహ్మాదులు, వేదశాస్త్రపురాణములు నిరంతరము నేతి నేతి (నీవిదికాదు, నీవిదికాదు) అని చెప్పుచు నెవని గుణగానము జేయుచున్నారో (ముందు దోహాతో అన్వయము),

చౌ॥ సబ జానత ప్రభు ప్రభుతా సోఈ ।
తదపి కహేఁ బిను రహా న కోఈ ॥
తహాఁ బేద అస కారన రాఖా ।
భజన ప్రభాఉ భాఁతి బహు భాషా ॥ 96

తా॥ శ్రీరామచంద్రునిమహిమ అందరికి విదితమైనదే! భక్తులు రామ భజన చేయనిదే జీవింపరు భజన ప్రభావమునుగూర్చి వేదములుగూడ జెప్పి యున్నవి భగవంతుని యపారగుణములను, మహిమను సంపూర్ణముగ వర్ణించుట ఎవ్వరికిని సాధ్యముకాదు ఎలనె, శ్రీరాము డనంతుడు, కాని కొంతవరకైనను భగవన్నామ ముచ్చరించుట శ్రేయస్కరము ఆవశ్యకము కనుక భగవానుని గుణగానరూపమైన భజన ప్రభావ మత్యద్భుతమైనది భజన ప్రభావమును గూర్చి వివిధశాస్త్రములలో జెప్పబడియున్నది భగవన్నామసంకీర్తనమును కొంతిసేపు చేసినచాలును భవసాగరమునుండి తరింతుము

చౌ॥ ఏక అనీహ అరూప అనామా ।
అజ సచ్చిదానంద పర ధామా ॥
బ్యాపక బిస్వరూప భగవానా ।
తేహిఁ ధరి దేహ చరిత కృత నానా ॥ 97

తా॥ పరమేశ్వరు డొక్కడు ఇచ్ఛారహితుడు రూపరహితుడు, నామ రహితుడు, అభవుడు, సచ్చిదానందుడు, పరంధాముడు విశ్వరూపుడు ఈ భగవానుడే దివ్యశరీరమునుదాల్చి యద్భుతలీలలను గావించెను కనుక లీలా మానుషస్వరూపుడు

చౌ॥ సో కేవల భగతన హిత లాగీ ।
పరమ కృపాల ప్రనత అనురాగీ ॥
జేహి జన పర మమతా అతి ఛోహూ ।
జేహిఁ కరునా కరి కీన్హ న కోహూ ॥ 98

తా॥ భగవానుని లీలలు కేవలము భక్తుల హితము కోరియే కనుకనే భగవానుడు కృపాసాగరుడు, శరణాగతవత్సలుడు భగవానునకు భక్తులపై ప్రేమానురాగములు మెండు కనుకనే భక్తులనొకసారి కటాక్షించిన తరువాత నెప్పుడను వారిపై నాగ్రహము వహించలేదు

వి॥ భక్తుల నుద్ధరించుటకే భగవానుడవతరించునది భగవంతునియందలి పరమప్రేమయే భక్తి యనబడును ఈ భక్తి భగవదనుగ్రహమువలన, మహాత్ములదయవలన మనకు కలుగును భక్తులను భగవంతు డొక్కమారు కరుణించెనేని మరల నెప్పుడును వారి నుపేక్షించడని శ్రీతులసీదాసు వచించుచున్నాడు భగవత్కృప సర్వత్ర ప్రసరించుగాక ! భగవద్భక్తి సర్వత్ర వృద్ధినొందుగాక !

చౌ॥ గయీ బహోర గరీబ నేవాజూ ।
సరల సబల సాహిబ రఘురాజూ ॥
బుధ బరనహిఁ హరి జస అస జానీ ।
కరహిఁ పునీత సుఫల నిజ బానీ ॥ 99

తా॥ శ్రీరామచంద్రప్రభువు పోగొట్టుకున్న వస్తువును మరల ప్రాప్తింప జేసెడివాడు, దీనబంధువు, సరళచిత్తుడు, సర్వశక్తిమంతుడు సర్వులకు ప్రభువు సర్వగుణసంపన్నుడని తెలిసికొన్నవారు గనుకనే బుద్ధిమంతులు శ్రీహరి యశమును వర్ణనచేసి తమవాణిని పవిత్రముచేసికొని యుత్తమఫలమగు మోక్షమును, దుర్లభమైన భగవత్ప్రేమను పొందుచున్నారు

చౌ॥ తేహిఁ బల మైఁ రఘుపతి గున గాథా ।
కహిహఉఁ నాఇ రామ పద మాథా ॥
మునిన్హ ప్రథమ హరి కీరతి గాయీ ।
తేహిఁ మగ చలత సుగమ మోహి భాయీ ॥ 100

తా॥ ఇది మహిమయొక్క యథార్థవర్ణనము గాదు కాని, మహాఫలము నొసగునది భజనయని దెలిసికొని భగవత్కృపయను బలముచేత నేను శ్రీరామ

పాదపద్మములకు నమస్కరించి శ్రీరఘునాథునియపార గుణగాథలను జెప్పెటిన శ్రీవాల్మీకి వ్యాసాదిమునులు పూర్వము వారికీర్తిని గానము చేసినారు సోదరలారా! ఆ మార్గమునందు నడుచుటయే నాకు శ్రేయస్కరము

దో॥ అతి అపార జే సరిత బర జౌఁ నృప సేతు కరాహిఁ।
చఢి పిపీలికఉ పరమ లఘు బిను శ్రమ పారహి జాహిఁ॥ 101

తా॥ అత్యంత శ్రేష్ఠమునైన పెద్దనదు లున్నవి ఆ నదులను దాటుటకు రాజులు వంతెన లేర్పరచియున్నారు కేవలము అల్పజీవులు చిన్నచీమలుకూడ ఆ వంతెనపై నారోహించి శ్రమలేకయే దాటిపోవుచున్నవి ఈ ప్రకారము మునులయొక్క వర్ణనాసహాయముతో నేనుకూడ శ్రీరామచరిత్రమును సహజముగ వర్ణించెదను

వి॥ వాల్మీకి మొదలయినకవులు రచించిన రామాయణాది గ్రంథముల ననుసరించి తానును రఘువంశమును వర్ణించెదనని కాళిదాసు రఘువంశకావ్యమును రచించెను వాల్మీకి వ్యాసాది మునులు నడచినమార్గమున బోవుటయే తనకు శ్రేయస్కరమని కవి హృదయము

అథ వా కృతవాగ్ద్వారే వంశేఽస్మిన్ పూర్వసూరిభి అన్న కాళిదాసయూక్తి ఇట అనుసంధేయము

చౌ॥ ఏహి ప్రకార బల మనహి దేఖాఈ।
కరిహఉఁ రఘుపతి కథా సుహాఈ॥
బ్యాస ఆది కబి పుంగవ నానా।
జిన్హ సాదర హరి సుజస బఖానా॥ 102

తా॥ ఈవిధముగ మనోధైర్యమును దెచ్చుకొని నా మనోబలముతో శ్రవణానందకరమైన శ్రీరఘునాథ చరితమును రచింతును భక్తిపూర్వకముగను

ఆదరముతోను శ్రీహరియశమును వర్ణించినారు కాన వ్యాసాదిమును ఉత్తమ కవులైరి

## కవులకు వందనములు

చౌ॥ చరన కమల బందఉఁ తిన్హ కేరే ।
పురవహుఁ సకల మనోరథ మేరే ॥
కలి కే కబిన్హ కరఉఁ పరనామా ।
జిన్హ బరనే రఘుపతి గున గ్రామా ॥ 103

తా॥ నేనటువంటి పరమశ్రేష్ఠులైన కవుల పాదపద్మములకు ప్రణమిల్లుచున్నాడను వారు నామనోరథమును పూరించెదరుగాక। కలియుగమునందుండు కవులకుకూడ నేను నమస్కరించుచున్నాడను వారుకూడ శ్రీరఘునాథునిసుగుణ సంపదనుకూర్చి వర్ణించియున్నారు కనుక వందనీయులే।

చౌ॥ జే ప్రాకృత కబి పరమ సయానే ।
భాషాఁ జిన్హ హరి చరిత బఖానే ॥
భయే జే అహహిఁ జే హోఇహహిఁ ఆగేఁ ।
ప్రనవఉఁ సబహి కపట సబ త్యాగేఁ ॥ 104

తా॥ ఎవడు వివేకవంతుడో వాడు స్వభావసిద్ధముగ ప్రాకృతికవియై శ్రీహరిచరిత్రను వర్ణించువాడుగ నున్నాడు అటువంటి కవులు పూర్వముగూడ నుండిరి వర్తమానకాలములో నున్నారు భవిష్యత్కాలమున నుండగలరు భూత, వర్తమాన, భవిష్యత్తుల నుండెడి కవులకు నేను నిష్కపట భావముతో ప్రణామము లర్పించుచున్నాడను

చౌ॥ హోహు ప్రసన్న దేహు బరదానూ ।
సాధు సమాజ భనితి సనమానూ ॥
జో ప్రబంధ బుధ నహిఁ ఆదరహీఁ ।
సో శ్రమ బాది బాల కబి కరహీఁ ॥ 105

తా॥ బుద్ధిమంతులైనవారు లే కవిత్వము నాదరింపరో, దానికొరకై మూర్ఖులైనకవులు వ్యర్థపరిశ్రమ చేసెదరు కావున సాధుసమాజములో కవిత్వమున కొకగౌరవస్థానము లభించునట్లు సన్మానము జరుగునట్లు నా మీరెల్లరు వరమును ప్రసాదించెదరుగాక!

చౌ॥ కీరతి భనితి భూతి భలి సోఈ ।
సురసరి సమ సబ కహఁ హిత హోఈ ॥
రామ సుకీరతి భనిత భదేసా ।
అసమంజస అస మోహి అఁదేసా ॥ 106

తా॥ ఎల్లరకు హితము చేకూర్చెడి పవిత్రమైన గంగవలె, కీర్తి, కవిత్వము, సంపద ఉత్తమోత్తమమైనవి శ్రీరామచంద్రునికీర్తి యనంత మైనది, మంగళకరమై, సర్వులకును ఆనందము నొసగునది నా కవిత్వ మసమంజసమైనది

శ్రీరామయశ మనంతమైనది నాకవిత్వ మసమంజసమైనది ఈ రెంటికిని పొత్తు కుదురదని నేను (శ్రీతులసీదాసు) చింతిల్లుచున్నాడను

చౌ॥ తుమ్హరీ కృపాఁ సులభ సోఉ మోరే ।
సిఅని సుహావని టాట పటోరే ॥ 107

తా॥ కాని, పండితోత్తములారా! మీ కృపవలన నాకన్నియు సుగమ మగును పట్టువస్త్రముపై జేసిన కుట్టుపని యందముగ నుండును అటులే మీ కృపవలన నాకవిత్వము రాణించును

వి॥ పట్టువస్త్ర మెల్లరచే నాకర్షింపబడును దానిపై జరీతో కుట్టిన పుష్పములు, లతలు, ఆకులు దానిశోభను ఇనుమడింప జేయును అటులే పండితుల కృపచే తమ కవిత్వ మధికముగ రాణించునని శ్రీ శ్రీతులసీదాసు నుడువుచున్నారు

దో॥ సరల కబిత కీరతి బిమల సోఇ ఆదరహిఁ సుజాన ।
సహజ బయర బిసరాఇ రిపు జో సుని కరహిఁ బఖాన॥108

తా॥ చతురులైన వారలు, సరళమైన శైలిలో నిర్మలచరిత్రమును వర్ణించు కవిత్వమునే యాదరింతురు అటువంటి కవిత్వమును విని శత్రువులుగూడ స్వాభావికమైన వైరమును మరచి ప్రశంసింతురు

దో॥ సో న హోఇ బిను బిమల మతి మోహి మతి బల అతి థోర ।
కరహు కృపా హరి జస కహఉఁ పుని పుని కరఉఁ
నిహోర ॥ 109

తా॥ అటువంటి కవిత్వము నిర్మలహృదయములేనిదే సాధ్యపడదు అయితే నాకు బుద్ధిబలము వికాసము చాలదు అందులకే మాటిమాటికిని మిమ్ము ప్రార్థించుచుంటిని కవులారా! సాధుసజ్జనులారా! మీరు నాయందు కృపజూపినచో శ్రీహరియశమును వర్ణింప గలుగుదును

దో॥ కబి కోబిద రఘుబర చరిత మానస మంజు మరాల ।
బాలబినయ సుని సురుచి లఖి మో పర
హోహు కృపాల ॥ 110

తా॥ కవి, పండితోత్తములారా! మీరు శ్రీరామచరిత్రమనెడి మానస సరోవరమునందు సుందరమైన హంసలవంటివారు నన్ను బాలకునిగా భావించి నా ప్రార్థనల నాలకించి, నాకోరికను మన్నించి నాయందు కృపజూపుదురుగాక!

వి॥ శాశ్వతసుఖమనెడి జలమునకు స్థానమైనదియు, మిక్కిలి నిర్మలమైనదియు, పద్మములకు ఆధారమైనదియు, నిత్యము రాజహంసలచేత సేవింపబడు మానస సరోవరమువోలె శ్రీరామచరిత్రమనెడి మానససరోవర మత్యంత పవిత్రమైనది ఇందుమునిగిన తాపము, పాపము, బంధమును తొలగును, శాశ్వతసుఖము ప్రాప్తించును రాజహంసలు సరోవరమునందే యెల్లప్పుడు విహరించునుగదా! రామనామామృతమును నిరంతరము పానము జేసెడివారలు రాజహంసలవంటి వా రన్న భావ మిచ్చట స్ఫురించుచున్నది

# వాల్మీకి, వేద, బ్రహ్మలకును, శివపార్వతులకును వందనసమర్పణము

సోరట బందఉఁ ముని పద కంజు రామాయన జేహిఁ నిరమయఉ ।
సఖర సుకోమల మంజు దోష రహిత దూషన సహిత ॥ 111

తా॥ నేను వాల్మీకిమహర్షి పాదములకు నమస్కరించుచున్నాడను వారు రామాయణమును ప్రథమముగ రచించిరి ఆ రామాయణమునందు ఖరదూషణాదులను గూర్చిన చరిత్ర కోమలముగను సుందరముగ నున్నది రాక్షసచరిత్ర గూడ అందులోనున్నను భూషణముగ దోషరహితముగ నున్నది

సో॥ బందఉఁ చారిఉ బేద భవ బారిధి బోహిత సరిస ।
జిన్హహి న సపనేహుఁ ఖేద బరనత రఘుబర
బిసద జసు ॥ 112

తా॥ నేను చతుర్వేదములకు నమస్కరించుచున్నాడను వేదములు మానవులను సంసారసాగరమునుండి తరింపజేయుటకు నావవంటివి ఎవరు శ్రీ రఘునాథుని నిర్మలయశమును వర్ణించుటకు ప్రారంభింతురో వారికి స్వప్నములో గూడ దుఃఖము సంభవింపదు

శ్రీరామస్మరణ సంసారసాగరమును తరింపజేయుటకు నావవంటిది

సో॥ బందఉఁ బిధి పద రేను భవ సాగర జేహిఁ కన్హ జహఁ ।
సంత సుధా ససి ధేను ప్రగటే ఖల బిష బారునీ ॥ 113

తా॥ నేను సృష్టికర్తయైన బ్రహ్మకు నమస్కరించుచున్నాడను బ్రహ్మయే భవసాగరము నుత్పన్నము చేసినాడు అందు (1) సజ్జనరూపమైన అమృతము, చంద్రుడు, కామధేనువు ఉద్భవించినవి (2) దుష్టమానుషరూపమైన విషము మదువు ఉత్పన్నమైనవి

వి॥ చతుర్ముఖుడైన బ్రహ్మ యీ ప్రపంచమును సృజించెను ఇందు అమృతము, చంద్రుడు, కామధేనువువంటి పవిత్రులైన

సజ్జనులుగలరు విషము, మధువువంటి దుర్జనులు గలరు దేవతలు క్షీరసముద్రమును మథించి అమృతమును, చంద్రుని, కల్పవృక్షమును బడసినట్లు సజ్జనులు వేదమును మథించి భగవానుని లభింపజేసికొను చున్నారని యభిప్రాయము

కోరినకోర్కె లొసగునది కామధేనువు, చీకటిని పాఱదోలి వెన్నెలను ప్రసరింపజేయువాడు చంద్రుడు, అమృతసేవనము వలన జన్మరాహిత్యమైన సచ్చిదానంద స్థితి కలుగును అమృతము, కల్ప వృక్షము, కామధేనువువంటివారు సజ్జనులు వారితరులకు హితము చేకూర్చుచు పరిశుద్ధహృదయులై శాశ్వతానందప్రదమైన భక్తియను సౌభాగ్యమును బడసినవారు

విషమునుసేవించినచో మృత్యువు తథ్యము మధువు సేవిం చనచో మత్తు కలుగును విషము, మధువువోలె దుష్టులు ఇతరులకు హాని చేసెడివారు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లకు దాసులైన వారన్న భావముకూడ ఇచ్చట ధ్వనించుచున్నది

దో॥ బిబుధ బిప్ర బుధ గ్రహ చరన బంది కహఉఁ కర జోరి ।
హోఇ ప్రసన్న పురవహు సకల మంజు
మనోరథ మోరి ॥ 114

తా॥ దేవతలు, బ్రాహ్మణులు, పండితులు గ్రహములు-వీరందరి పాద ములకు ప్రణమిల్లుచున్నాడను నా కర ములనుజోడించి నమస్కరించుచున్నాడను వీరు నాయందు ప్రసన్నులై నా మనోరథమును పూరించెదరుగాక ।

చౌ॥ పుని బందఉఁ సారద సుర సరితా ।
జుగల పునీత మనోహర చరితా ॥
మజ్జన పాన పాప హర ఏకా ।
కహత సునత ఏక హర అబిబేకా ॥ 115

తా॥ సరస్వతీదేవికిని దేవనదియైన గంగాదేవికిని నమస్కరించుచున్నాను. ఒకరు పవిత్రశీలముగలవారు మనోహరచరిత్రగలవారు

పుణ్యనదియైన గంగయందు స్నానమాచరించినను, ఆచమనముచేసినను సర్వపాపములనుండియు విముక్తులగుదురు ఇక సరస్వతీదేవి సుగుణసంపదను యశమును కీర్తించినను, ఆలకించినను అజ్ఞానమూలహరణమగును

చౌ॥ గురు పితు మాతు మహేస భవానీ ।
ప్రనవఉఁ దీనబంధు దిన దానీ ॥
సేవక స్వామి సఖా సియ పీకే ।
హిత నిరుపధి సబ బిధి తులసీకే ॥ 116

తా॥ మహేశ్వరునకును, భవానికిని భక్తిపూర్వకముగ నమస్కరించుచున్నాడను వీరే నా గురువులు జననీజనకులు దీనబాంధవులు నిత్యముదానము చేయువారలు శ్రీరామచంద్రుని సేవకుడు, స్వామి మరియు సఖుడగు ఆ శంకరుడు నన్ను (తులసిదాసుని) కపటరహితునిగా భావించి హితము చేకూర్చును

చౌ॥ కలి బిలోకి జగ హిత హర గిరిజా ।
సాబర మంత్ర జాల జిన్హ సిరిజా ॥
అనమిల ఆఖర అరథ న జాపూ ।
ప్రగట ప్రభాఉ మహేస ప్రతాపూ ॥ 117

తా॥ శివ పార్వతులు ఈ కలియుగమునుగాంచి లోకోపకారముకొఱకై ప్రాకృతభాషను నిర్మించినారు ఆ మంత్రాక్షరములు సంబంధములేకయుండును దానిలో అర్థముకూడ ఎక్కగా నుండదు జప తపముల విశిష్టతగూడ గానరాదు కాని శివానుగ్రహముంలన దానిప్రభావము ప్రత్యక్షముగ నున్నది

చౌ॥ సో ఉమేస మోహి పర అనుకూలా ।
కరిహిఁ కథా ముద మంగళ మూలా ॥
సుమిరి సివా సివ పాఇ పసాఉ ।
బరనఉఁ రామచరిత చిత చాఉ ॥ 118

తా॥ ఉమాపతియైన శివుడు నాయందు ప్రసన్నుడై పరమపవిత్రమైన శ్రీరామచరితమును మంగళకరమగునట్లు ఆనంద ముత్పన్నముచేయునటుల అనుగ్రహించుగాక

ఈ విధముగ పార్వతీపరమేశ్వరులను స్మరించి వారియనుగ్రహమును బొంది, అమితోత్సాహానురాగముతోగూడిన చిత్తముగలవాడనై శ్రీరామచరితమును వర్ణించుచున్నాడను

చౌ॥ భనితి మోరి సివ కృపాఀ బిభాతీ ।
ససి సమాజ మిలి మనహుఀ సురాతీ ॥
జే ఏహి కథహి సనేహ సమేతా ।
కహిహహిఀ సునిహహిఀ సముఝి సచేతా ॥
హోఇహహిఀ రామ చరన అనురాగీ ।
కలి మల రహిత సుమంగల భాగీ ॥ 119

తా॥ నక్షత్రములతోగూడి చంద్రుడు రాత్రులయందెంతశోభాయమానముగ నుండునో, అటులే శంకరుని కృపావిశేషమున నా కవిత్వము నవరస భరితమై, మనోజ్ఞమై యలరారుగాక।

ఈ రామకథను ఎవరు భక్తిశ్రద్ధలతో సావధానముగ జెప్పెదరో, వినెదరో, సంపూర్ణముగ తెలిసికొనెదరో వారు కలియుగమున ననుభవించు పాపములనుండివిముక్తులై, శ్రీరామచంద్రునికి ప్రీతిపాత్రు లగుదురు సర్వమంగళకరమైన కార్యములందు భాగస్వాము లగుదురు

దో॥ సపనేహుఀ సాచేహుఀ మోహి పర జౌఀ హర గౌరి పసాఉ ।
తౌ ఫుర హోఉ జో కహేఉఀ సబ భాషా భనితి ప్రభాఉ ॥ 120

తా॥ శివపార్వతులు నిజముగ నాకు స్వప్నమునందు సాక్షాత్కరించి యుండిరేని నే నీభాష (ప్రాకృతభాష) కవిత్వప్రభావమును జెప్పితినే అది అంతయు సత్యమే।

వి॥ వారణాసియందు ప్రహ్లాదఘాటు నందొకసద్బ్రాహ్మణు నింట శ్రీ తులసీదాసు కొంతకాలముండెను శ్రీరామానుగ్రహముచే

శ్రీవారికి కవితాశక్తి యలవడి సంస్కృతమునందు ఆయన పద్య రచన గావించెను కాని, పగలుచేసిన పద్యరచనయంతయు, రాత్రి యగుసరికి తుడిచివేయబడెడిది ఈ విధముగ ప్రతిదినము జరుగు చుండెడిది అష్టమ దివసమున శ్రీవారికి స్వప్నమునందు పరమేశ్వరుడు సాక్షాత్కరించి 'నీ స్వభాషయందు కావ్యము రచింపు' మని నుడువు చుండగ శ్రీవారికి మెలకువ వచ్చెను అంత పార్వతీ పరమేశ్వరులు సాక్షాత్కరించిరి తులసీదాసు వారికి సాష్టాంగనమస్కారము గావింపగ 'నీవు అయోధ్యకేగి ప్రాకృతభాషలో కావ్యరచన గావింపుము నా యాశీర్వాదబలమున నీ కవిత్వము సామవేదము వలె అత్యంత ఫలదాయకమగు నని చెప్పి యంతర్ధానమైరి వారి యాజ్ఞానుసారము తులసీదా సయోధ్యకేతెంచి శ్రీరామచరితమాన సమును రచించెను ఆ కావ్యమును కాశీనగరమునకు దీసికొనిపోయి యొకనాటి రాత్రి విశ్వనాథాలయమునం దుంచెను, ప్రాతఃకాలమున చూడగా ఆ పుస్తకమునందు 'సత్యం, శివం, సుందరం' అను పరమేశ్వరుని స్వహస్తలిఖితమైనయక్షరములు గోచరించినవి ఆమాటలు శ్రీ తులసీదాసునకు వినపడినవి

## శ్రీ సీతారామ ధామ పరికర వందనము

చౌ॥ బందఉఁ అవధ పురీ అతి పావని ।
సరజూ సరి కలి కలుష నసావని ॥
ప్రనవఉఁ పురనర నారి బహోరీ ।
మమతా జిన్హ పర ప్రభుహి న థోరీ ॥ 121

తా॥ నే నత్యంతపవిత్రమైన అయోధ్యాపురమునకును, కలియుగపాప ములను నాశనముచేయు సరయూనదికిని వందనము లాచరించుచున్నాడను అయోధ్యాపురవాసులనిన కరుణాకరుడైన శ్రీరామున కమితప్రీతి కనుక నేను వారికిగూడ ప్రణతు లర్పించుచున్నాడను

చౌ॥ సియ నిందక అఘ ఓఘ నసాయే ।
లోక బిసోక బనాఇ బసాయే ॥
బందఉఁ కౌసల్యా దిసి ప్రాచీ ।
కీరతి జాసు సకల జగ మాచీ ॥ 122

తా॥ శ్రీరాముడు తనపురమునందు నివసించు సీతాదేవిని నిందించిన చాకలిని వానిపక్షము వహించిన స్త్రీపురుషులపాపములను నాశముగావించి, శోకరహితులనుజేసి వారికికూడ మోక్ష మొసగెను

శ్రీరామజన్మస్థానమైన అయోధ్యానగరమున కౌసల్యారూపమైన తూర్పు దిశకు వందన మాచరించుచున్నాడను ఆమెకీర్తి యీ సమస్తజగత్తునందు చిరస్థాయి యైనది

చౌ॥ ప్రగటేఉ జహఁ రఘుపతి ససి చారూ ।
బిస్వ సుఖద ఖల కమల తుసారూ ॥
దసరథ రాఉ సహిత సబ రానీ ।
సుకృత సుమంగల మూరతి మానీ ॥
కరఉఁ ప్రనామ కరమ మన బానీ ।
కరహు కృపా సుత సేవక జానీ ॥
జిన్హహి బిరచి బడ భయఉ బిధాతా ।
మహిమా అవధి రామ పితు మాతా ॥ 123

తా॥ ఎప్పుడు కౌసల్యారూపమైన తూర్పుదిశనుండి విశ్వజగత్తున కానందము సుఖము నొసగువాడును దుష్టరూపమైన కమలములకు మంచువలె శ్రీరామచంద్రరూపమైన చంద్రుడుదయించెనో, అప్పుడు రాజ్ఞీసహితముగ దశరథమహారాజు సుకృతమునకు, మంగళమునకును మూర్తిగాభావించి, నేను మనో, వాక్కాయకర్మలతో వారికి నమస్కరించుచున్నాడను తనపుత్రుడైన నన్ను సేవకునిగా భావించి, నాయందు శ్రీరామప్రభువు కృపజూపుగాక ! శ్రీరామప్రభువును సృష్టించిన బ్రహ్మకైన పుణ్యము నేనెంతని వర్ణింతును ! శ్రీరాముని జననీజనకులైనందు వలన దశరథుడు-కౌసల్యయును మహామ కాటపట్టయినవారు వారిభాగ్యమే భాగ్యము ! శ్రీరామజననముతో అయోధ్యానగరముకూడ పావనమైనది

వి॥ కమలములు మంచు కురిసినచో ముకుళించును, చంద్ర కాంత సోకినను ముకుళించును కమలములకు మంచువోలె, చంద్రుని వోలె దుష్టశిక్షణార్థము శ్రీరామచంద్రుడవతరించెనన్న భావ మిందు స్ఫురించుచున్నది

సో॥ బందఉఁ అవధ భుఆల సత్య ప్రేమ జేహి రామ పద ।
బిచురత దీనదయాల ప్రియ తను తృన ఇవ పరిహరేఉ ॥ 124

తా॥ నేను అయోధ్యాపురాధీశ్వరుడైన శ్రీదశరథమహారాజునకు వందనము లర్పించుచున్నాడను అతనికి శ్రీరామచంద్రుని పాదపద్మములపై వాస్తవమైన ప్రేమానురాగము లుండెను

పితృవాక్యపరిపాలకుడైన శ్రీరామచంద్రు డరణ్యమునకేగిన మరుక్షణమే శ్రీరామునియెడబాటు సహించలేక యతడు తనదేహమును సైతము తృణముగా భావించి త్యాగముచేసెను

చౌ॥ ప్రనవఉఁ పరిజన సహిత బిదేహూ ।
జాహి రామ పద గూఢ సనేహూ ॥
జోగ భోగ మహఁ రాఖేఉ గోఈ ।
రామ బిలోకత ప్రగటేఉ సోఈ ॥ 125

తా॥ నేను పరివారసమేతుడైన జనకమహారాజునకు ప్రణామము లర్పించుచున్నాడను వారికి శ్రీరామపాదపద్మములపై గూఢమైన ప్రేమయుండెను జనకుడు తనయోగమును భోగవిలాసములతో సంపూర్ణమొనరించి, గుప్తముగనుంచి యుండెను శ్రీరామచంద్రుని చూచిన తరువాత దానిని ప్రకటితము చేసెను

చౌ॥ ప్రనవఉఁ ప్రథమ భరత కే చరనా ।
జాసు నేమ బ్రత జాఇ న బరనా ॥
రామ చరన పంకజ మన జాసూ ।
లుబుధ మధుప ఇవ తజఇ న పాసూ ॥ 126

తా॥ లక్ష్మణ, శత్రుఘ్నులతో ప్రథమముగ భరతుని చరణారవిందము లకు ప్రణతు లర్పించుచున్నాడను భరతుని నిష్ఠా, నియమములను వర్ణింపశక్యము కాదు ఏలన భరతుని మనస్సు శ్రీరామచరణకమలములలో భ్రమరమువోలె సమ ర్పణ గావింపబడినది భరతునిమ న్సు ఒకక్షణమైనను శ్రీరాముని వీడలేదు

వి॥ కమలములలో భ్రమరములుండి పరిమళ మాస్వాదించు రీతి, శ్రీరామపాదపద్మములయందు భరతుని మానస మంకితము గావింపబడెనన్న భావ మిందు స్ఫురించుచున్నది

చౌ॥ బందఉఁ లఛిమన పద జలజాతా ।
సీతల సుభగ భగత సుఖ దాతా ॥
రఘుపతి కీరతి బిమల పతాకా
దండ సమాన భయఉఁ జస జాకా ॥ 127

తా॥ నేను లక్ష్మణుని పాదపద్మములకు ప్రణమిల్లుచున్నాడను ఆ పాద ములు చల్లనివి సుందరమైనవి భక్తుల కానందమును సుఖశాంతుల నొసగునవి

శ్రీరఘునాథకీర్తిరూపమైన విమలపతాకములో లక్ష్మణునియశము, పతాక మును పైకెగురవేయుట కుపయోగించెడి దండముతో సమానమైనది

వి॥ పతాకము నెగురవేయుటకు దండ ముపకరించును దండములేనిదే పతాక ముండబోదు లక్ష్మణునికీర్తి, ప్రతిష్ఠలు శ్రీరామునియశస్సంపదలో మిళితమైయున్నవన్న భావము స్ఫురించు చున్నది

చౌ॥ సేష సహస్రసీస జగ కారన ।
జో అవతరేఉ భూమి భయ టారన ॥
సదా సో సానుకూల రహ మో పర ।
కృపాసింధు సౌమిత్రి గునాకర ॥ 128

తా॥ తన సహస్రశిరస్సులతో ఈ జగత్తును ధరించిన ఆదిశేషుడే భూ భారమును తగ్గించుటకు లక్ష్మణుడై యవతరించెను ఆదిశేషుడైన సద్గుణా

కరుడైన కృపాసాగరుడైన, సుమిత్రానందనుడైన లక్ష్మణుడు నాయందు ఎల్లప్పుడును ప్రసన్నుడగుగాక ।

చౌ॥ రిపుసూదన పద కమల నమామీ ।
సూర సుసీల భరత అనుగామీ ॥
మహాబీర బినవఉఁ హనుమానా ।
రామ జాసు జస ఆప బఖానా ॥ 129

తా॥ శత్రువులను తునుమాడువాడైన శత్రుఘ్నుని చరణకమలములకు ప్రణమిల్లుచున్నాడను శత్రుఘ్నుడు మహావీరుడు, సచ్ఛీలుడు భరతుని నిరంతరము వెంబడించువాడు

నేను మహావీరశిఖామణియైన హనుమంతునికి భక్తిపూర్వకముగ నమస్కరించుచున్నాడను మంగళకరుడైన ఆంజనేయుని యశస్సంపదను శ్రీరామచంద్రుడే స్వయముగ తనశ్రీముఖముతో ఎర్ణించెను.

సో॥ ప్రనవఉఁ పవనకుమార ఖల బన పావక గ్యానఘన ।
జాసు హృదయ ఆగార బసహిఁ రామసర చాప ధర ॥ 130

తా॥ నేను పవనకుమారుడైన హనుమంతునికి భక్తితో ప్రణమిల్లుచున్నాడను హనుమంతుడు దుష్టరూపమైన యరణ్యమును భస్మము గావించుట కగ్నిరూపమైనవాడు జ్ఞానమున కాటపట్టయినవాడు హనుమంతుని హృదయమనెడి మందిరములో కోదండపాణియైన శ్రీరాముడు సదా నివాసము చేయుచుండును

చౌ॥ కపి పతి రీఛ నిసాచర రాజా ।
అంగదాది జే కీస సమాజా ॥
బందఉఁ సబ కె చరన సుహాఏ ।
అధమ సరీర రామ జిన్హ పాయే ॥ 131

తా॥ వానరరాజైన సుగ్రీవునకును, భల్లూకరాజైన జాంబవంతునకును, రాక్షసరాజైన విభీషణునకును, అంగదాది వానరసమూహములకును భక్తితో వారి పాదపద్మములకు నమస్కరించుచున్నాడను వారి శరీరము లధమములైనను, వారా శరీరములందే శ్రీరామచంద్రుని సాక్షాత్కరింపజేసికొన్నారు

వి॥ ెనుబదినాలుగు లక్షల జీవరాసుల జన్మలలో మానవజన్మ శ్రేష్ఠమైనది మానవజన్మయందే మోక్షసాధనకు గావలసిన సామగ్రి పుష్కలముగ గలదు దేవలోకమునందును ఇట్టి స్థితి (అనుకూలత) లేదు ఐనను అదృష్టవశముచేత ఇతర జన్మలయందైనను ఒకవేళ భగవత్సేవ లభించినచో తరింపవచ్చునని తెలియవచ్చుచున్నది ఎట్లన వానరులు (హనుమంతుడు, సుగ్రీవుడు, అంగదుడు), భల్లూకములు(జాంబవంతుడు) మొదలగునవి శ్రీరాముని సేవచేసి తరించెను ఏనుగు, సర్పము, సాలెపురుగు ఇవి శ్రీకాళహస్తీశ్వరుని సేవించి తరించెను ఏ జన్మమెత్తినను తరించవచ్చునను శ్రీశంకరబగవత్పాదులు నుడివిరి

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।
స్త్రియోవైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాంగతిమ్ ॥

అని గీతయు వచించెను

చౌ॥ రఘుపతి చరన ఉపాసక జేతే ।
ఖగ మృగ సుర నర అసుర సమేతే ॥
బందఉఁ పద సరోజ సబ కేరే ।
జే బిను కామ రామ కే చేరే ॥ 132

తా॥ పశుపక్ష్యాదులు, దేవతలు, మనుజులు, అసురులు — ఇందు శ్రీరామ చరణోపాసకులెవరైనను సరే యెల్లర పాదపద్మములకు నమస్కరించుచున్నాదను ఏలన వారెల్లరు సుగుణధాముడైన శ్రీరామచంద్రుని నిష్కామసేవకులు

చౌ॥ సుక సనకాది భగత ముని నారద ।
జే మునిబర బిగ్యాన బిసారద ॥
ప్రనవఉఁ సబహి ధరని ధరి సీసా ।
కరహు కృపా జన జాని మునీసా ॥ 133

తా॥ శుకయోగి, సనకాదిమునులు, నారదముని — మొదలగు పరమజ్ఞానులు శ్రేష్ఠులైన మును లెందరున్నారో అందరికిని నేను సాష్టాంగనమస్కారము చేయుచున్నాడను ఓ మునీశ్వరులారా! మీరందరు నన్ను మీ దాసునిగా భావించి కృపజూపెదరు గాక!

చౌ॥ జనకసుతా జగ జనని జానకీ।
అతిసయ ప్రియ కరునానిధానకీ॥
తాకే జుగ పద కమల మనావఉఁ।
జాసు కృపాఁ నిరమల మతి పావఉఁ॥ 134

తా॥ జనకపుత్రియు, జగజ్జననియు, కరుణాకరుడైన శ్రీరామచంద్రుని ప్రియపత్నియునగు సీతాదేవి పాదపద్మములకు సాష్టాంగనమస్కారము చేయుచున్నాడను ఆ జగజ్జనని కృపాకటాక్షమువలన నిర్మలజ్ఞానమును పొందెదనుగాక!

చౌ॥ పుని మన బచన కర్మ రఘునాయక।
చరన కమల బందఉఁ సబ లాయక॥
రాజివనయన ధరేఁ ధను సాయక।
భగత బిపతి భంజన సుఖదాయక॥ 135

తా॥ నేను మనో, వాక్కాయకర్మలతో కమలనయనుడు, ధనుర్బాణధారియు, భక్తులవిపత్తులను దూరీకృతమొనర్చి సుఖశాంతుల నిచ్చువాడును, సాక్షాత్ భగవానుడును, సర్వసమర్థుడైన శ్రీరఘునాథుని పాదారవిందములకు ప్రణమిల్లుచున్నాడను

దో॥ గిరా అరథ జల బీచి సమ కహిఅత భిన్న న భిన్న।
బందఉఁ సీతా రామ పద జిన్హహి పరమ ప్రియ ఖిన్న॥ 136

తా॥ జలము-జలతరంగములవలె, వాక్కు-దానియొక్క అర్థము చెప్పుటకు భిన్నభిన్నముగా నున్నను వాస్తవముగ అభిన్నమైనవి అటువంటి యభిన్నరూపమైన సీతారామచరణకమలములకు వందనము లర్పించుచున్నాడను ఆ పాదయుగళము దీనజనులకు, దుఃఖితులకు ప్రీతికరము

వి॥ "యశ్శివో నామరూపాభ్యాం యా దేవీ సర్వమంగళా, తయో స్సంస్మరణా త్పుంసాం సర్వతో జయమంగళమ్" నామమును బట్టియు, రూపమునుబట్టియు ఏ దేవుడు శివుడో (మంగళకరుడో), ఏ దేవి (పార్వతి) సర్వమంగళయో వారిరువురి స్మరణము సర్వత్ర జయమును మంగళముకలిగించునని శంకరభగవత్పాదులు 'శివా నందలహరి' కావ్యారంభమున శ్రీ విద్యాస్వరూపులైన తన ఇష్ట దేవతలైన పార్వతీ పరమేశ్వరులను "శివాభ్యాం" అనుచు స్తుతించెను

నీరు-నీటితోకూడిన అలలు, సూర్యుడు-సూర్యప్రభ, చంద్రుడు-చంద్రప్రభ, వాక్కు - దాని యర్థము, చూచుటకు భిన్నముగా నున్నను వాస్తవముగా అభిన్నమైనవి అటులే సీతారామపాద యుగళము వేరైనను అభిన్నరూపమై, దీనజనులకు ఆశ్రితులకు పెన్నిధి యైనదని చెప్పుచు తులసీదాసు ఇష్టదేవతా ప్రార్థనను జేయుచున్నాడు

లక్ష్మీనారాయణులు, సీతారాములు, రాధాకృష్ణులు - ఇట్లు యుగళమూర్తి ఉపాసింపదగియుండును ఒకరిని విడిచి ఒకరిని ఉపాసింపరాదు అనెడి ధర్మము ఇటు సూచింపబడినది

## నామవందనము _ నామమహిమ

చౌ॥ బందఉఁ నామ రామ రఘుబర కో ।
హేతు కృసాను భాను హిమకర కో ॥
బిధి హరి హరమయ బేద ప్రాన సో ।
అగున అనూపమ గున నిధాన సో ॥ 137

తా॥ నేను శ్రీరఘునాథుని రామ అనునామమునకు వందనమాచరించు చున్నాడను అది కృశానుడు(అగ్ని), భానుడు(సూర్యుడు) మరియు హిమకరునకు (చంద్రునకు) హేతువైనది అనగా ర , అ , మ నుండి హేతువు అ రాపు

[illegible]మే బ్రహ్మ, విష్ణు మహేశ్వర స్వరూపమైనది రామనామము వేదములకు (ప్రణవము[illegible]) ప్రాణమైనది నిర్గుణమై, ఉపమారహితమై సమస్తగుణముల [illegible]యినది

చౌ॥ [illegible] మహామంత్ర జోఇ జపత మహేసూ ।
కాసీం ముకుతి హేతు ఉపదేసూ ॥
[illegible] మహిమా జాసు జాన గనరాఊ ।
ప్రథమ పూజిఅత నామ ప్రభాఊ ॥ 138

తా॥ రామనామము మహామంత్రరాజము రామనామమును పరమశివుడు సదా జపించుచుండును శివునిద్వారా యుపదేశింపబడిన రామమంత్రమే కాశిలో మరణించువారికి ముక్తి నొసగుచున్నది రామనామమహిమ గణేశునకు బాగుగా విదితమే। గణేశు రామనామప్రభావమువలననే సమస్తదైవములకన్న ప్రథమముగా తానే పూజింపబడుచున్నాడు

[illegible] మహిమా [illegible] జాసు జాన గనరావూ" అన్న శబ్దము [illegible] చను గణేశుని ఏ ధన్యులు భజింతురో వారిపూపర [illegible] దురు

[illegible] పుత్రుడు గజాననుడు ఒకనాడు శివపార్వతులు [illegible] ద్వారముకడనే యుండుమనియు, ఎవరిని లోనికి రానీయకు [illegible] ఆ సమయమున పరశురాముడేతెంచెను గణేశు [illegible] రించెను ఇరువురకు యుద్ధము సంభవించెను గణేశున [illegible] అప్పటినుండి గజాననుడు ఏకదంతుడాయెను

[illegible] భూమండలమును చుట్టి వచ్చెదరో వారు ముందు [illegible] తెలుసుకొన్నవారై దేవతలందరు తమతమ [illegible] లను తీసికొని [illegible]ప్రదక్షిణమునకు బయలుదేరిరి [illegible] మూషికవాహనముపై ఆసీనుడై నిరాశతో బయలుదేరెను [illegible] నారదమునీంద్రుడు దగ్గరకు వచ్చి యిట్లనెను – "పృథ్వీమండలమున

రామనామమును లిఖించి ప్రదక్షిణ మొనర్చుము భగవన్నామమున బ్రహ్మాండ మంతయు సన్నిహితమై యున్నది" నారదమునీంద్రుడు చెప్పినరీతి గణేశుడొనర్చి మిగిలిన దేవతలందరిని ఓడించి యెల్లరచే ప్రథమముగా పూజలందుకొనుచున్నాడు రామనామమహిమ గణేశునకు బాగుగా విదితము

చౌ॥ జాన ఆదికబి నామ ప్రతాపూ ।
భయఉ సుద్ధ కరి ఉలటా జాపూ ॥
సహస నామ సమ సుని సివ బానీ ।
జపి జేఈఁ పియ సంగ భవానీ ॥ 139

తా॥ ఆదికవియైన వాల్మీకిమహర్షికి రామనామప్రభావము బాగుగా దెలియును వాల్మీకి మరా, మరా అని జపించి దానిని పవిత్ర మొనరించినాడు ఒకరామనామము సహస్రనామములకు ఎమానమైనది శంకరుడు రామనామమహిమనుగూర్చి చెప్పినాడు పార్వతీసమేతుడై రామనామమును సదా జపించుచుండును

చౌ॥ హరషే హేతు హేరి హర హీ కో ।
కియము భూషన తియ భూషన తీ కో ॥
నామ ప్రభాఉ జాన సివ నీకో ।
కాలకూట ఫలు దీన్హ అమీ కో ॥ 140

తా॥ పార్వతీదేవి హృదయాంతరాళమున శ్రీరామనామమంటలి శ్రద్ధాభక్తులనెఱిగినవాడై పరమేశ్వరుడు వార్షించి, పతివ్రతాశిరోమణియైన పార్వతిని తన భూషణముగను అర్ధాంగినిగను జేసికొనెను శ్రీరామనామప్రభావము శంకరునకు బాగుగా విదితమే। ఆ రామనామ ప్రభావమువలననే శివుడు కాలకూటవిషమును లోకహితార్థము గ్రోలినపుడు విష మమృతమాయెను

వి॥ అమృతమును బడయుటకై దేవతలు అసురులు గలసి క్షీరసముద్రమును మథించినపుడు ముందుగా బయల్వెడలినది ప్రళయాగ్నివంటి కాలకూటవిషము మిక్కిలి జ్వాలలుగలిగి బయంకర

మైన కాలకూటవిషమును శివుడు కంఠములో నుంచుకొని దేవతల హితార్థమై దానిని లోపలికి మ్రింగివేయకయు, వెలుపల ఉమియకయు కంఠకూపమున నిలిపి సకలలోకములను కాపాడిన విషయము జగద్విదితము ఇట్టి మహత్తరశక్తి శివునకు రామనామమును జపించుట వలననే కలిగినదని కవి విశదీకరించుచున్నాడు

దో॥ బరషా రితు రఘుపతి భగతి తులసీ సాలి సుదాస ।
రామ నామ బర బరన జుగ సావన భాదవ మాస ॥ 141

తా॥ శ్రీరఘునాథునియందలి భక్తి తాత్పర్యము [illegible]ర్షఋతువనియు భక్తబృందములు వరిధాన్యమనియు, శ్రవణానందకమైన రా మ యను రెండక్షరములు శ్రావణ భాద్రపదమాసములనియు శ్రీతులసీదాసు చెప్పుచున్నాడు

వి॥ ఇందు తులసీదాసు 'రా మ' యను రెండక్షరము [illegible] శ్రావణ భాద్రపద మాసములకు పోల్చినారు భక్తిని వర్షఋతు [illegible] చి యున్నారు శ్రావణ, భాద్రపద మాసములలో వర్షము [illegible]కమై, [illegible]ముచేత చెఱువులు నిండి పంటలు పండును

[illegible] గవత్పాదమునందుండునదియై ఆనందమును వర్షించు [illegible] అత్యంత సుఖకరమైన, శ్రవణానందకరమైన శ్రావణ, భాద్రపద [illegible] రామనామమును భక్తియను వర్షఋతువునందు [illegible], వర్షములధికమై వరిధాన్యము సమృద్ధియగునట్లు, వరిధాన్యమువంటి [illegible]మామృతమును పానముచేసి భక్తబృందములు [illegible] ల్లెదరు

[illegible]గవత్పాద [illegible]క్తి చేతనే [illegible] ప్తి, ఆనందప్రాప్తిచేతనే జన్మ [illegible] నని యర్థము "మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసా[illegible] [illegible] వాక్యము

జననమరణమను భయమును, శోకమును బాపునట్టువంటిది సకలశాస్త్ర నిగమాగమ సారమైన రామనామమే భక్తులకు జీవనాధారమని శ్రీతులసీదాసు చెప్పుచున్నారు

చౌ॥ ఆఖర మధుర మనోహర దోఊ ।
బరన బిలోచన జన జియ జోఊ ॥
సుమిరత సులభ సుఖద సబ కాహూ ।
లోక లాహు పరలోక ని బాహూ ॥ 142

తా॥ శ్రీరామనామ మహిమ యెంతయైనది అగాధమైనది రా మ అను రెండక్షరములు శ్రవణానందకరమైనవి, మనోహరమైనవి అవి వర్ణమాలా రూపమైన శరీరమునకు నయనములవంటివి రామనామమే భక్తులకు జీవనాధారము స్మరణచేయుటకు రామనామ మత్యంతసులభము రామనామము సుఖశాంతులను, ఇహపరసుఖముల నొసంగును

చౌ॥ కహత సునత సుమిరత సురి నీకే ।
రామ లఖన సమ ప్రియ తులసీ కే ॥
బరనత బరన ప్రీతి బిలగాతీ ।
బ్రహ్మ జీవ సమ సహజ సఁఘాతీ ॥ 143

తా॥ రామనామ ముచ్చరించుటకును, శ్రవణము సల్పుటకును, మృదు మధురమై యొప్పారుచున్నది శ్రీతులసీదాసునకు రా మ అను రెండక్షరము లతో కూడిన రామనామము శ్రీరామలక్ష్మణులతో సమానముగ ప్రీతిపాత్రమైనది రా మ అను రామనామమును భిన్నభిన్నముగా వర్ణనచేసినచో ప్రీతివేరగు చున్నది అనగా బీజమంత్రవ్యృష్టియందు దాని యుచ్చారణ, అర్థము ఫలమునందు భిన్నముగ నగుపడును ఐనను జీవ, బ్రహ్మాదులతో సమానముగ రామనామము స్వాభావికముగ అభిన్నమైనది అహర్నిశము ఏకరూపమై, ఏకరసమైనది

వి॥ రామనామము పాపమును తాపమును హరించి దివ్యమైన ఆనందమును ప్రసాదించునని యభిప్రాయము

చౌ॥ నర నారాయన సరిస సుభ్రాతా ।
జగ పాలక బిసేషి జన త్రాతా ॥
భగతి సుతియ కల కరన బిభూషన ।
జగ హిత హేతు బిమల బిధు పూషన ॥ 144

తా॥ రా మ యను రెండక్షరములు నరనారాయణులతో సమానమైనటు వంటివి అవి సమస్త జగత్తును పరిపాలించుచు విశేషముగ భక్తులను సంరక్షించు చున్నవి అవి భక్తిస్వరూపిణియైన, సౌందర్యవతియైన యువతీలలామ వీనుల యందు విరాజిల్లెడి కర్ణాభరణములవంటివి సమస్త జగత్తున కాధారభూతములై ప్రజలహితార్థము వెలుగు వెన్నెలల నొసగు నిర్మలసూర్యచంద్రాదుల వంటివి

చౌ॥ స్వాద తోష సమ సుగతి సుధా కే ।
కమఠ సేష సమ ధర బసుధా కే ॥
జన మన మంజు కంజ మధుకర సే ।
జీహ జసోమతి హరి హలధర సే ॥ 145

తా॥ రామనామము మోక్షరూపమైన అమృతము నాస్వాదింపగా గలిగిన తృప్తితో సమానమైనటువంటిది రా మ అను రెండక్షరములు కచ్ఛప శేషులతో సమానముగ ఈ భూభారమును మోయుచున్నవి అవి భక్తులమనో రూపమైన కమలములయందు విహరించునటువంటి భ్రమరములవంటివి రామ నామస్మరణచేయు భక్తాగ్రేసరుల జిహ్వల కానందమునొసంగెడి శ్రీకృష్ణబలరాము లతో సమానమైనటువంటివి

వి॥ యశోదాదేవిని శ్రీకృష్ణబలరాములు తమ బాల్యక్రీడలచే నెట్లు లానందపరచిరో 'రా' 'మ' అను రెండక్షరములు బలరామ కృష్ణులవలె భక్తుల కానందము నొసగునన్న మహత్తరభావమిందు స్ఫురించున్నది

దో॥ ఏకు ఛత్రు ఏకు ముకుటమని సబ బరనని పర జోఉ ।
తులసీ రఘుబర నామ కే బరన బిరాజత దోఉ ॥ 146

తా॥ శ్రీరామనామము సుశోభితమైనది. అందులో ఒకటి రకారము ఛత్రరూపమున రేఫ నుండి, రెండవది మకారము నుండి కలిగినది మకుట మణివలె అనుస్వారరూపములో అన్నియక్షరముల కతీత మైనది

చౌ॥ సముఝత సరిస నామ అరు నామీ ।
ప్రీతి పరసపర ప్రభు అనుగామీ ॥
నామ రూప దుఇ ఈస ఉపాధీ ।
అకథ అనాది సుసాముఝి సాధీ ॥ 147

తా॥ బాగుగా పరికించిచూడ రామనామము-రూపము రెండును ఒకటే రెంటిలోను స్వామిసేవకులలో నుండిన పరస్పరానురాగము గలదు స్వామిని సేవకుడు వెంబడించుచుండుటున నామము వెనుక రూపము గలదు నామ-రూపములు రెండును ఈశ్వరుని ఉపాదులు రెండును అనిర్వచనీయమైనవి, అనాదియైనవి. పృథమైన భక్తివిశ్వాసములుండిన దివ్యమైన అవినాశియైన భగవానుని స్వస్వరూపము చూడనగును

చౌ॥ కో బడ ఛోట కహత అపరాధూ ।
సుని గున భేదు సముఝిహహిఁ సాధూ ॥
దేఖిఅహిఁ రూప నామ ఆధీనా ।
రూప గ్యాన నహిఁ నామ బిహీనా ॥ 148

తా॥ ఈ నామరూపములలో ఇది గొప్పది, అది చిన్నదని చెప్పుటనాడి అపరాధమే వానిగుణముల తారతమ్యములనుగూర్చి విని సాధువులు స్వయముగ దెలిసికొందురు రూపము నామముయొక్క అధీనములోనుండుట జూడనగును నామము లేకపోయిన రూపజ్ఞానము కలుగనేరదు

వి॥ నామరూపములపరస్పర సంబంధమునుగూర్చి కవి యిచట విశదీకరించుచున్నాడు భగవానుని యాకృతిని మనస్సుద్వారా సేవించుట, దివ్యమంగళ విగ్రహమును మనోవాక్కాయములద్వారా యథాశక్తి భజించుటను నామసంకీర్తన మందురు

శ్రీనాథు వర్ణించు జిహ్వా జిహ్వా' యని ప్రహ్లాదుడు భగవన్నామ వైశిష్ట్యమునుగూర్చి వ్యక్తముచేసియుండెను ఇట్లు నిరంతరము శ్రద్ధాభక్తులతో శ్రవణ, మనన నిదిధ్యాసములు చేయుటచేత జ్ఞానము సిద్ధించును నామోచ్చారణ భగవద్దర్శనలాలసను పెంపొందించును, భగవానుని సాక్షాత్కరింపజేయును

చౌ॥ రూప బిసేష నామ బిను జానేఁ ।
కరతల గత న పరహిఁ పహిచానేఁ ॥
సుమిరిఅ నామ రూప బిను దేఖేఁ ।
ఆవత హృదయఁ సనేహ బిసేషేఁ ॥ 149

తా॥ ఏ విశేషమైన రూపమైనను, దాని నామము తెలుపబడక, అరచేతియందుంచబడినను మనము దానిని కనుగొనలేము కాని, రూపము గాంచకపోయినను నామస్మరణమాత్రముననే అమితానురాగము, భక్తిప్రేమలు మనలో ఉప్పొంగును అంత అమితప్రేమ కాటపట్టయిన ఆ రూపమును మన యంతరంగమున గాంచగలుగుదుము

వి॥ శ్రీతులసీదాసు పరమభక్తాగ్రేసరుడైన శ్రీపురందరదాసు వోలె, రామనామమున కధికప్రాశస్త్యము నొసగినారు శ్రీపురందరదాసు తమ కీర్తనలయందు "నీ నాకో నిన హంగాకో రంగా! నిన నామదబల వొందిద్దరే సాకో" అని నుడివిరి అనగా "నీవెందులకు, నీ నామబలముంటే చాలు" నని యర్థము

శ్రీతులసీదాసు ఇచ్చట శ్రీరాముని రూపమునకన్న నామమునకే మిగుల ప్రాధాన్య మొసగినారు రామమంత్రము భక్తితో జపించిన శ్రీరామ సాక్షాత్కారము కలుగునని నుడివినారు

చౌ॥ నామ రూప గతి అకథ కహానీ ।
సముఝత సుఖద న పరతి బఖానీ ॥
అగున సగున బిచ నామ సుసాఖీ ।
ఉభయ ప్రబోధక చతుర దుభాషీ ॥ 150

తా॥ నామయాపముల గతులను చెప్ప కథలు అగాధమైనవి అవి తెలిసి కొనుట సుఖదాయకమే। అవి యనంతములైనవి కాన వర్ణనచేయుటకు సాధ్యము కానేరదు నిర్గుణము-సగుణము మధ్య నామము సుందరమైన సాక్షివంటిది రెంటికిని యథార్థజ్ఞానము నొసగు చతురుడైన భాషాంతరీకరణము చేయువాని వంటిది

దో॥ రామ నామ మనిదీప ధరు జీహ దేహరీం ద్వార।
తులసీ భీతర బాహేరహుం జౌం చాహసి ఉజిఆర॥ 151

తా॥ "నీవు బాహ్యముగాను, అంతరంగికముగాను ప్రకాశింపగోరుదువేని ముఖరూపమైన ద్వారమునందు, జిహ్వారూపమైన ఇంటిగడపయందు రామనామ రూపమైన మణిదీపమును బెట్టుము" అని శ్రీగోస్వామితులసీదాసు నుడువుచున్నారు

వి॥ (1) ద్వారమునందు గడపపై దీపమునుంచిన ఇంటి లోపలను, ఇంటివెలుపలియందును ప్రకాశించుచు అత్యంతశోభనిచ్చును అటులే బాహ్యముగను ఆంతరంగికముగను జ్ఞానోదయమును వాంఛింపగోరుదువేని జిహ్వారూపమైన యింటిగడపయందు రామ నామరూపమైన మణిదీపమును బెట్టుమని శ్రీవారు చెప్పుచున్నారు

(2) అనగా మనోవాక్కాయ కర్మలతో రామదాసుడవై నిరంతరము రామనామమును జపించుచు నిష్కామభక్తిని పెంపొందించుకొని సాఫల్యము నొందుమని కవి యిచ్చట ఉద్బోధించుచున్నాడు

చౌ॥ నామ జీహం జపి జాగహిం జోగీ।
బిరతి బిరంచి ప్రపంచ బియోగీ॥
బ్రహ్మసుఖహి అనుభవహిం అనూపా।
అకథ అనామయ నామ న రూపా॥ 152

తా॥ బ్రహ్మచే సృజింపబడిన యీ దృశ్యజగత్తునందు, వైరాగ్యవంతులైనవారు జిహ్వచే రామనామమును జపించుచు తత్త్వజ్ఞానముదయించిన దిగాముని మేల్కొని రూపరహిత, అనుపమ, అనిర్వచనీయ అనామయ బ్రహ్మసుఖము ననుభవింతురు

చౌ॥ జానా చహహిం గూఢ గతి జేఊ ।
నామ జీహఁ జపి జానహిం తేఊ ॥
సాధక నామ జపహిం లయ లాఏఁ ।
హోహిం సిద్ధ అనిమాదిక పాఏఁ ॥ 153

తా॥ పరమాత్మనిగురించిన నిగూఢరహస్యములను, యథార్థమహిమలను దెలిసికొన్నవారే జిజ్ఞాసువులు వారు రామనామము జపింతురు లౌకికసిద్ధులను పొందవలయునని వాంఛించు సాధకులు అణిమాదిసిద్ధులు (అష్టసిద్ధులు) పొందు నరకు రామనామమును జపించి సిద్ధులను పడయుదురు

చౌ॥ జపహి నాము జన ఆరత భారీ ।
మిటహిం కుసంకట హోహిం సుఖారీ ॥
రామ భగత జగ చారి ప్రకారా ।
సుకృతీ చారిఉ అనఘ ఉదారా ॥ 154

తా॥ అనేక సంకటములు దుఃఖములతో బాధపడు ఆర్తులైన భక్తులు రామనామమును జపింతురు అట్లు రామనామస్మరణచేయుటవలన ఘోరవిపత్తులనుండి విముక్తులగుదురు సుఖశాంతులను బొందెదరు జగత్తునందు నాల్గువిధములైన భక్తులు గలరు

1 ధనాపేక్షతో శ్రీరామచంద్రుని భజించువారలు

2 ఆర్తినివృత్తి లేక సంకటములను బాపుకొనుటకు శ్రీరామచంద్రుని నాశ్రయించువారలు

3 భగవానుని దెలిసికొను నిచ్ఛతో శ్రీరఘునాథుని భజించువారలు వీరే జిజ్ఞాసువులు

4 భగవత్తత్త్వమును సంపూర్ణముగా గ్రహించి స్వాభావికమైన ప్రేమతో శ్రీరాముని భజించువారలు వారే జ్ఞానులు

అందరు రామభక్తులే నాల్గువిధములైన భక్తులును పుణ్యాత్ములు, పాపరహితులు మరియు ఉదారులు

వి॥ (1) ధనాపేక్షతో శ్రీరాముని భజించువారలు — క్షుణ్ణముగ పరికించినచో భూమియందు మనకెట్టిరుచియు గనపడదు ఐనను అత్యంత మధురఫలసముదాయములు భూమినుండియే ఉత్పన్నము లగుచున్నవి ఒక ధనవంతునికడ ధనమేమియు నుండదు, ఐనను అతని సంతకముగల ఒకచీటీ లేదా చెక్కు వందలు, వేలు వర్షింపగలదు అట్లు భగవానుని యొద్ద ఏమియునుండదు, అతడనుగ్రహించెనేని ధన ధాన్యములు, ఆలుబిడ్డలు సమస్త భోగభాగ్యములు అన్నియు భక్తులకు లభింపగలవు

ఆరాధితో హరిస్సమ్యగైశ్వర్యాదిప్రదో భవేత్ । ఆరాధితో హరిస్సమ్యగపవర్గప్రదో భవేత్ చక్కగా ఆరాధించినచో భగవంతుడు ఐశ్వర్యాదుల నిచ్చును చక్కగా ఆరాధించినచో మోక్షము నిచ్చును పూర్వజన్మమున ఇంద్రాదులు భగవంతుని భక్తిశ్రద్ధలతో ఆరాధించినందున వారికి స్వర్గాద్యైశ్వర్యము లభించెను దీనినే సకామభక్తి యందురు

(2) ఆర్తినివృత్తికొఱకు శ్రీరాముని భజించువారలు – సామాన్యముగ జనులు వ్యాధులు సంభవించెనేని వ్యాధినివారణకొఱకు వేంకటేశ్వరునకో లేక వారివారి యిష్టదైవములకో మ్రొక్కుకొనుట పరిపాటి దారిద్ర్యబాధనుండి విముక్తు లగుటకు సామాన్యముగ భగవంతు నారాధింతురు, ఆశ్రయింతురు భగవానుడు ఎవ రేవిధముగ ప్రపత్తిచేయుచున్నారో (ప్రపత్తియనగా శరణాగతి) వారిని ఆర్తి లేక సంకటములకు దూరముచేసి కాపాడుచున్నాడు

(3) జిజ్ఞాసువులు – కేవలము ముక్తిని ఇతర ప్రాపంచికసుఖములను కోరక భగవానుని దెలిసికొనగోరు నాకాంక్షాపరులను జిజ్ఞాసువు లందురు

(4) జ్ఞానులు - ఉత్తములైన భక్తులు, విరక్తులు భోగభాగ్యములను లక్ష్యపెట్టరు వారు భగవత్పాదపద్మములయందలి యనన్యమైనభక్తినే కోరుకొనెదరు దీనినే ప్రేమభక్తి యందురు

చౌ॥ చహూ చతుర కహుఁ నామ అధారా ।
గ్యానీ ప్రభుహి బిసేషి పిఆరా ॥
చహుఁ జుగ చహుఁ శ్రుతి నామ ప్రభాఊ ।
కలి బిసేషి నహిఁ ఆన ఉపాఊ ॥ 155

తా॥ నాల్గువిధములైన చతురులైన, వివేకవంతులైన భక్తుల కాధారము ఏకమాత్రమైన శ్రీరామనామమే కాని యిందులో జ్ఞానులైనభక్తులు శ్రీరామ ప్రభువున కత్యంతప్రియులైనవారు

నాల్గుయుగములలోను, చతుర్వేదములలోను, భగవన్నామమునకును ప్రభావమునకును ప్రాశస్త్య మొసగబడినది కాని, భగవన్నామము, కలియుగమున విశేషముగ సంసారసాగరమును దాటించుటకు నావవలె నలరారుచున్నది కలియుగమున జ్ఞానోపార్జన చేయవలయుననిన రామనామముతప్ప మానవునికి తరణోపాయము లేదు

వి॥ జ్ఞానులు శ్రీరామప్రభువున కత్యంత ప్రియులని చెప్పుచు పరోక్షముగ ఆత్మనివేదననుగూర్చి శ్రీవారు విశదీకరించినారు

ఆత్మనివేదనము గావించుకొన్న ప్రపన్నునకు భగవంతుడు తననే ఇచ్చుకొనును అతనికి భగవంతుడు సేవచేయును అంధుడైన భక్తసూరదాసునకు భగవంతుడు సేవచేసెనుగదా! వానినే స్మరించుచుండును "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్" ఎవరు ఎట్లు నాప్రపత్తిచేసెదరో వారినట్లు భజించుచుందును (సేవించుచుందును) అని భగవద్వాక్యము

దో॥ సకల కామనా హీన జే రామ భగతి రస లీన ।
నామ సుప్రేమ పియూష హ్రద తిన్హహుఁ కిఏ మన
మీన ॥ 156

తా॥ ఎవరైతే, కామనారహితులై శ్రీరామభక్తియను సర్వభోగ, మోక్ష రసమునందు లీన మయ్యెదరో, అటువంటివారు నామమను సుందరప్రేమరూపమైన అమృతసరోవరములో వారిమనస్సును మత్స్యముగా జేసికొన్నవారు అనగా నామరూపమైన యమృతమును నిరంతరము ఆస్వాదించువారలు ఒకక్షణముగూడ వారు భగవన్నామమును జపింపక, ఊరకుండలేరు

వి॥ నీటియందు చేప యున్నంతకాలము బాగుగానుండును నీటినుండిగట్టునకు వచ్చిన మరుక్షణమే అదిచచ్చును అటులే భక్తులు నీటియందుండు చేపవలె నొకక్షణమైనను రామనామమును వీడరని భావము

చౌ॥ అగున సగున దుఇ బ్రహ్మ సరూపా ।
అకథ అగాధ అనాది అనూపా ॥
మోరేఁ మత బడ నాము దుహూ తేఁ ।
కిఏ జేహిఁ జుగ నిజ బస నిజబూతేఁ ॥ 157

తా॥ నిర్గుణము-సగుణము-రెండును బ్రహ్మస్వరూపములు ఆ రెండును అకథనీయము, అగాధము, అనాది, అనుపమానమైనవి నా దృష్టియందు నామమే రెంటికన్నను అధికమైనది నామము తనబలముతో రెంటిని వశముగావించుకొన్నది

చౌ॥ ప్రౌఢి సుజన జానహి జన కీ ।
కహఉఁ ప్రతీతి ప్రీతి రుచి మన కీ ॥
ఏకు దారుగత దేఖిఅ ఏకూ ।
పావక సమ జుగ బ్రహ్మ బిబేకూ ॥

ఉభయ అగమ జుగ సుగమ నామ తేఁ ।
కహేఉఁ నాము బడ బ్రహ్మ రామ తేఁ ॥
వ్యాపకు ఏకు బ్రహ్మ అబినాసీ ।
సత చేతన ఘన అనంద రాసీ ॥ 158

తా॥ సజ్జనబృందమా! నా పలుకులను దాసుని యవినయమనియు, చేష్టలను కావ్యోక్తియనియు భావింపవద్దు. నా మనోవిశ్వాసమును ప్రేమతో నాకు రుచించిన మాటలను వ్యక్తపఱచుచున్నాను, నిర్గుణసగుణములు రెండును, రెండు విధములైన బ్రహ్మజ్ఞానములు. ఇవి అగ్నితో సమానమైనవి.

నిర్గుణము అప్రకటితమైన అగ్నితో సమానము. అది కొయ్యలోపలనే యుండును కాని అగుపించదు. సగుణము ప్రకటితమైన అగ్నితో సమానమైనది. ప్రత్యక్షముగ గాంచగలము. తత్త్వతః రెండును నొక్కటే. కేవల ప్రకటితము అప్రకటితమన్న భేదముతో భిన్నభిన్నముగా దెలియబడుచున్నవి. నిర్గుణము-సగుణము తత్త్వతః రెండును నొకటియయ్యును వానిస్వరూపమును దెలిసికొనుట చాల కష్టమగుచున్నది. కాని నామముతో రెండును సులభమగుచున్నవి. కనుక నేను నామము, నిర్గుణపరబ్రహ్మకన్న, సగుణరాముని కన్న అధికమని చెప్పితిని. బ్రహ్మ సర్వవ్యాపకుడు, అఖండుడు, అవినాశి, సర్వశక్తిమంతుడు. చైతన్యస్వరూపుడు. ఆనందఘను. (ఇందు దోహలో అన్వయము)

చౌ॥ అస ప్రభు హృదయ అఛత అబికారీ ।
సకల జీవ జగ దీన దుఖారీ ॥
నామ నిరూపన నామ జతన తేఁ ।
సోఉ ప్రగటత జిమి మోల రతన తేఁ ॥ 159

తా॥ అటువంటి వికారరహితుడైన ప్రభువు హృదయమునందు వాసము చేయుచున్నను, జగత్తునందుండెడి జీవులెల్లరును దీనులై, దుఃఖితులై యున్నారు. నామము నిరూపణచేసి, అనగా నామముయొక్క యథార్థస్వరూపము, మహిమ రహస్యము ప్రభావమును దెలిసికొని, నామమును జపించినచో, శ్రద్ధాభక్తులతో నామితరూపమైన సాధనచేసి ఎన్నవిధి తెలిసికొనిన దానివెల తెలియునట్లు, అక్కడి బ్రహ్మ ప్రకటిత మగును

దో॥ నిరగున తేఁ ఏహి భాఁతి బడ నామ ప్రభాఉ అపార ।
కహాఉఁ నాము బడ రామ తేఁ నిజ బిచార అనుసార॥160

తా॥ ఈ విధముగ నిర్గుణముకంటె నామప్రభావమపారమైనది ఇప్పుడు నేను (శ్రీతులసీదాసు) నా యభిప్రాయానుసారముగ జెప్పుచున్నాను నామము శ్రీరామునికన్న నధికమైనది

చౌ॥ రామ భగత హిత నర తను ధారీ ।
సహి సంకట కిఏ సాధు సుఖారీ ॥
నాము సప్రేమ జపత అనయాసా ।
భగత హోహి ముద మంగల బాసా ॥ 161

తా॥ శ్రీరామచంద్రుడు భక్తులహితము గోరి మానవశరీరమును దాల్చి స్వయముగ కష్టములనుసహించి సాధువులకు సుఖశాంతుల నొసగెను కాని భక్తబృందములు భక్తిప్రేమానుభవము లుట్టిపడ నామమును జపించుచు సహజముగనే ఆనందమునకును కల్యాణమునకును ఆటపట్టగుచున్నారు

చౌ॥ రామ ఏక తాపస తియ తారీ ।
నామ కోటి ఖల కుమతి సుధారీ ॥
రిషి హిత రామ సుకేతుసుతా కీ ।
సహిత సేన సుత కీన్హి బిబాకీ
సహిత దోష దుఖ దాస దురాసా ।
దలఇ నాము జిమి రబి నిసి నాసా ॥
భంజేఉ రామ ఆపు భవ చాపూ ।
భవ భయ భంజన నామ ప్రతాపూ ॥ 162

తా॥ శ్రీరామచంద్రుడు ఒకతాపసస్త్రీయైన అహల్యను తరింపజేసెను కాని రామనామము కోట్లకొలది దుష్టుల దుర్బుద్ధులను చక్కజేసెను శ్రీరామచంద్రుడు ఋషియైన విశ్వామిత్రుని యాగసంరక్షణార్థమై, సుకేతుయక్షుని కన్యయైనతాటకిని పుత్రుడైన సుబాహుని సేనాసహితముగ హతమార్చెను కాని సూర్యు డంధ

కారమును బొంనట్లు రామనామము భక్తులదోషములను, దుఃఖములను, దురాశలను నాశనముచేసినది శ్రీరామచంద్రుడు స్వయముగ ధనుస్సును విరిచెను కాని రామనామప్రతిభ ప్రపంచములోని సర్వభయములను నాశనముజేసిన దగుచున్నది

వి॥ భగవంతుని పూజగాని, స్తుతిగాని, స్మరణముగాని, దర్శనముగాని, భగవత్సేవ ఏదియైనను సరే ముక్తిదాయకమని చెప్పుచు తులసీదాసు భగవన్నామమహిమను గూర్చి సహేతుకముగ వివరించినారు

పరమభక్తాగ్రేసరుడైన శ్రీపురందరదాసు భగవన్నామమహిమను గూర్చి పెక్కుకీర్తనలను రచించినారు ఒకకీర్తనయందు "సభియని ద్రౌపది శీరె యు సెళవాగ కృష్ణకృష్ణ' యంబో నామలె కాయితో ॥నీనాకో ఎన హంగేకో॥ అని నుడివిరి అనగా సభయందు ద్రౌపది నవమానపరచుటకు దుర్యోధన దుశ్శాసనాదులు గుమిగూడినప్పుడు ద్రౌపది 'కృష్ణ, కృష్ణ' యని వేడుకొన్ననామమే ఆమెను కాపాడినదని భావము అటులే 'అజమీళన యమదూతరు సెళవాగ నారాయణ యాబో నామకె కాయితో ॥నీ నాకో నిన హంగేకో॥ అజామీళుని యమదూతలు బంధించినపుడు 'నారాయణ' యను నామము కాపాడినదని చెప్పినారు కనుక నామమహిమ లనంతములు

ఇచ్చట శ్రీగోస్వామి తులసీదాసు రామనామమున కధిక ప్రాశస్త్యమొసగినారు రామనామమే సంసారసాగరమునుండి తరింపజేయుటకు నావ వంటిదనియు, భక్తులకు నామమే సంపదయనియు నుడివిరి

చౌ॥ దండక బను ప్రభు కీన్హ సుహావన ।
జన మన అమిత నామ కిఏ పావన ॥
నిసిచర నికర దలే రఘునందన ।
నాము సకల కలి కలుష నికందన ॥ 163

తా॥ శ్రీరామచంద్రుడు, క్రూరమృగములు సంచరించెడి భయంకరమైన దండకారణ్యమును పావనముచేసెను నామము, అసంఖ్యాకులైన మానవుల మనంబులను పవిత్ర మొనర్చినది ధనుర్ధారియైన శ్రీరఘునాథుడు రాక్షససమూహములను సంహరించెను కాని, రామనామము కలియుగమునందు సకలపాపములను బాపుటకు సాధనభూత మైనది

దో॥ సబరీ గీధ సుసేవకని సుగతి దీన్హ రఘునాథ ।
నామ ఉధారే అమిత ఖల బేద బిదిత గునగాథ ॥ 164

తా॥ శ్రీరఘునాథుడు శబరి, జటాయువు ఇత్యాది ఉత్తమభక్తులకు ముక్తి నొసగినాడు కాని నామ మగణితదుష్టుల నుద్ధరించినది శ్రీరామనామ గుణాధిక్యములను గురించిన గాథ లనేకములు వేదములలో సుప్రసిద్ధమైనవి

చౌ॥ రామ సుకంఠ బిభీషన దోఊ ।
రాఖే సరన జాన సబు కోఊ ॥
నామ గరీబ అనేక నేవాజే ।
లోక బేద బర బిరిద బిరాజే ॥ 165

తా॥ శ్రీరామచంద్రుడు సుగ్రీవుని, విభీషణుని శరణుజొచ్చిన బ్రోవవచ్చెను ఈ విషయ మెల్లరెఱిగినదే। కాని, నామమసంఖ్యాకులైన దరిద్రులను, దుఃఖితులను కాపాడినది నామముయొక్క కీర్తి లోకములోను వేదములలోను ప్రఖ్యాతి గాంచినది

చౌ॥ రామ భాలు కపి కటకు బటోరా ।
సేతు హేతు శ్రము కీన్హ న థోరా ॥
నాము లేత భవసింధు సుఖాహీం ।
కరహు బిచారు సుజన మన మాహీం ॥ 166

తా॥ శ్రీరామచంద్రుడు భల్లూక-వానరసేనల నొకచో సమకూర్చి సముద్రముపై సేతువును నిర్మించుట కేమంతపరిశ్రమ నొనర్పలేదు కాని శ్రీరామనామస్మరణమాత్రముననే సంసారమను సాగరము ఎండిపోవును కనుక ఓ సజ్జనబృందమా। రెంటిలో ఏది గొప్పదో, మీరే వితర్కించి చూడుడు

చౌ॥ రామ సకుల రన రావను మారా ।
సీయ సహిత నిజ పుర పగు ధారా ॥
రాజా రాము అవధ రజధానీ ।
గావత గున సుర ముని బర బానీ ॥
సేవక సుమిరత నాము సప్రీతీ ।
బిను శ్రమ ప్రబల మోహ దలు జీతీ ॥
ఫిరత సనేహఁ మగన సుఖ అపనేఁ ।
నామ ప్రసాద సోచ నహి సపనేఁ ॥ 167

తా॥ రఘువీరుడైన శ్రీరామచంద్రుడు పరివారసమేతముగ రణరంగమున రాక్షసరాజైన రావణుని హతమార్చి, సీతాసమేతముగ అయోధ్యానగర ప్రవేశమొనర్చెను రాముడు రాజయ్యెను అయోధ్యానగరము రాజధానియయ్యెను. ఈ మహాకావ్యమైన రామాయణమునే దేవతలు, మునులు అమదివ్యవాణితో గానము చేయుచుండిరి

కాని భక్తాగ్రేసరులు మాత్రము ప్రేమ, భక్తితాత్పర్యము లుట్టిపడ నామస్మరణమను అమృతపానముచే పరిశ్రమలేకయే మోహముయొక్క ప్రబలసేనను (కామ, క్రోధ, మోహ, మద, మాత్సర్యములు) జయించి, ప్రేమలో నిమగ్నులై తమ అంతఃకరణసుఖమునందు విహరింతురు శ్రీరామనామప్రసాదమువలన వారు స్వప్నమునందుగూడ చింతారహితులై విరాజిల్లెదరు (నిశ్చింతులై నిరహంకారులై యుందురని భావము)

దో॥ బ్రహ్మ రామ తేఁ నాము బడ బర దాయక బర దాని ।
రామ చరిత సత కోటి మహఁ లియ మహేస జియఁ
జాని ॥ 168

తా॥ ఈ విధముగ నామము, నిర్గుణమైన బ్రహ్మ మరియు సగుణస్వరూపుడైన రాముని కన్న మిన్నయైనది అది వరము లొసగువారలకుగూడ వరదానమిచ్చునది ఈ విషయమును క్షుణ్ణముగ నెఱిగి శంకరుడు నూరుకోట్ల రామచరిత్ర సారము నవగాహన చేసికొని రామ నామమును సారరూపముగ గ్రహించెను

చౌ॥ నామ ప్రసాద సంభు అబినాసీ ।
సాజు అమంగల మంగలరాసీ ॥
సుక సనకాది సిద్ధముని జోగీ ।
నామ ప్రసాద బ్రహ్మ సుఖ భోగీ ॥ 169

తా॥ శ్రీరామనామప్రభావము వలననే శంకరుడు అవినాశియైనను అమంగళవేషధారియైనను మంగళకరుడు అగుచున్నాడు. శుకదేవుడు, సనకాది సిద్ధమునీశ్వరులు యోగిబృందములు నామప్రభావమువలననే బ్రహ్మానందమను పరమసుఖము ననుభవించుచున్నారలు

వి॥ కాశీక్షేత్రమున శివుడు రామనామము జపించుచు ఎల్లరి కుపదేశించుచుండుటచే అచ్చట మరణించినవా రెల్లరును మోక్షము నొందుచున్నారు బ్రహ్మానందమును గూర్చి అవధూతోపనిషత్తునం దీవిధముగ చెప్పబడియున్నది "బ్రహ్మానందో విభాతి మే స్పష్టమ్, దుఃఖం సాంసారికం న వీక్షేఽద్య, తృప్తేర్మే కోపమా భవేల్లోకే" "బ్రహ్మానందము నాకు స్పష్టముగా కనబడుచున్నది నాకు దుఃఖ మనునది లేశమాత్రమును లేదు ఎక్కడజూచినను ఆనందమే! నా కుడి యెడమవైపులను, లోపల వెలుపల ఆనందమే! ఆహా! నా తృప్తికి సాటి యేమున్నది! అన్నివైపుల ఆనందమే" "అహోజ్ఞానమహో జ్ఞాన మహో సుఖమహో సుఖమ్," (అవధూత-ఉ) "ఆహా! బ్రహ్మజ్ఞాన మెంత మంచిది! ఎంత మంచిది! ఆహా! ఎంత అద్భుతసుఖము!!"

అటువంటి బ్రహ్మానందమును నామప్రభావముచే శుకసనకాది సిద్ధ మునీశ్వరులును యోగిబృందములును ననుభవించుచున్నారన్న యథార్థము నీ దోహయందు విశదీకరింపబడినది

చౌ॥ నారద జానేఉ నామ ప్రతాపూ ।
జగ ప్రియ హరి హరి హర ప్రియ ఆపూ ॥
నాము జపత ప్రభు కీన్హ ప్రసాదూ ।
భగత సిరోమని భే ప్రహ్లాదూ ॥ 170

తా॥ నామమహిమనుగురించి శ్రీనారదమునీంద్రునకు బాగుగా తెలియును ఎగత్తునందు సర్వులకు శ్రీహరి ఇష్టదైవము హరికి హరుడన్న ప్రీతి భగవ ల్లీలలను నిరంతరము గానముచేయు శ్రీనారదమహర్షి హరిహరులకు ప్రీతిపాత్రుడు

శ్రీహరినామమును అహర్నిశముల జపించుచు నామసంకీర్తనము చేయుచుం టవలనే కదా భక్తప్రహ్లాదుడు శ్రీహరికృపకు పాత్రుడై భక్తశిరోమణి యైనది

వి॥ ప్రహ్లాదుడు - హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడను రాక్షసు లిరువు రుండిరి వారివలని భయముచే దేవత లిడుమలబడిరి భగ వానుడు వరాహావతారమెత్తి హిరణ్యాక్షుని సంహరించెను సోదరుని మరణానంతరము హిరణ్యకశిపుడు ఖిన్నుడై ఘోరతప మాచరింప దొడగెను అదేసమయమని యెంచి దేవతలు దైత్యులను హత మార్చిరి హిరణ్యకశిపుని భార్యయైన గర్భవతియైన లీలావతిని కూడచెరబెట్టదలచి ఆమెను ఈడ్చుకొనివచ్చుచుండిరి మార్గమధ్య మున నారదమునీంద్రుడు డడ్డుపడి ఆమెగర్భమున నున్నవాడు పరమ భక్తాగ్రేసరుడుగాన ఆమెను విడువవలసినదిగ ఆదేశించెను దేవత లట్లుయొనర్చిరి నారదమునీంద్రుడు లీలావతిని తనయాశ్రమమునకు తీసుకొనిపోయి జ్ఞానమును బోధించెను ఆ గర్భస్థశిశువున కప్పటి [illegible] దియే హరినామము పట్టుపడెను ఇతడే ప్రహ్లాదుడు

హిరణ్యకశిపుడు తపముజేసి వచ్చి దేవతలను జయించి ముల్లో కములకు [illegible] కధిపతియయ్యెను అతని కుమారుడైన ప్రహ్లాదుడు బాల్య మునుండి హరిభక్తుడు "కమలాక్షునర్చించు కరములు కరములు శ్రీ [illegible] ఘు [illegible] జిహ్వా జిహ్వా, సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము, విష్ణునాకర్ణించు వీనులు వీనులు [illegible] వైరి దవిలిన మనము మనము, భగవంతువలగొను పదములు [illegible] పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి, దేవదేవుని చింతించు [illegible] ము, చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు," అని [illegible] ప్రహ్లాదుడు 'చదువులలో మర్మమెల్ల జదివితి తండ్రీ!' [illegible] శాస్త్రసారమును తండ్రికి వ్యక్త మొనరించెను

వి॥ హరిభక్తి మానుమని తండ్రి యెంత చెప్పినను వినడాయెను అందులకు తండ్రి శిక్షింపగా శిక్షల ననుభవించుటకు సిద్ధపడెను విష్ణుభగవానుని ప్రార్థించినంతనే ప్రహ్లాదుడు సంరక్షింపబడుచుండెను హిరణ్యకశిపు డొక్కనాడు 'భగవాను డెక్కడున్నాడు? నాకు చూపెదవా?' యని యడుగగా ప్రహ్లాదుడు 'భగవానుడు నాలోను, నీలోను ఉన్నాడు అతడు సర్వాంతర్యామి అనగా 'అయితే యీ స్తంభములో నుండెనని యందువేని ఇచ్చటనే చూపు' మని హిరణ్యకశిపు డా స్తంభమును గొట్టెను ఆ స్తంభమునుండి భగవానుడు నరసింహావతారములో ప్రత్యక్షమై ప్రహ్లాదుని రక్షించి హిరణ్యకశిపుని హతమార్చెను

చౌ॥ ధ్రువఁ సగలాని జపేఉ హరి నాఊఁ ।
పాయఉ అచల అనూపమ ఠాఊఁ ॥
సుమిరి పవనసుత పావన నామూ ।
అపనే బస కరి రాఖే రామూ ॥ 171

తా॥ ధ్రువుడు తన సవతితల్లిచే తిరస్కరింపబడి, దుఃఖముతోను సకాంభావముతోను శ్రీహరినామమును జపించి, ఆ నామసంకీర్తన ప్రభావమువలన శ్రీహరిని సాక్షాత్కరింపజేసికొని అచలము అనుపమస్థానమునైన ధ్రువలోకమును ప్రాప్తింపజేసికొనెను పరమభక్తాగ్రేసరుడైన హనుమంతుడు రామనామమును స్మరణచేసి శ్రీరాముని తనవశునిజేసికొనెను, శ్రీరామకృపకు పాత్రుడాయెను

వి॥ ధ్రువుడు - స్వాయంభువ మనువు పుత్రుడైన యుత్తానపాదునకు సునీతి, సురుచి యను భార్యలు గలరు ఉత్తానపాదుడు సురుచి నతిగాఢముగా ప్రేమించుచుండెను సునీతి పుత్రుడు ధ్రువుడు సురుచిపుత్రు డుత్తముడు ఒకనాడు సురుచి సంభ్రమమున ఉత్తానపాదుని తొడపై తన తనయుడైన యుత్తముని గూర్చుండజేసి యానందించుచుండెను ఆ సంతోషసమయమున తండ్రియొద్దిజేరనెంచి ధ్రువుడుకూడ ఉత్తానపాదునికడ కేగుచుండ సురుచి ధ్రువుని

కారులైన యమదూత లగుపించిరి ఆయాకారములను గాంచి యతడు భయముజెందెను మరణమాసన్నమైనదని తలచి తన పుత్రుడైన నారాయణుని రమ్మని పిలిచెను మరణసమయమున భగవన్నామ ముచ్చరించినందువలన విష్ణుదూత లాతనికడకు విచ్చేసిరి 'ఈతడు ఘోరమైన పాపము జేసినాడు కాన మేము వీనిని తీసికొని పోవుటకు వచ్చితి' మని యమదూతలు నుడివిరి 'మరణకాలమున ఈతని నోటినుండి 'నారాయణ' యన్న భగవన్నామము వెలువడినది కాన ఈతని పాపము పరిహారమైనది' యని విష్ణుదూతలు నుడివిరి ఈ మాటలను విన్న యమదూత లదృశ్యమైరి అజామిళుడు బ్రతికెను, తానుచేసిన పాపములకు పశ్చాత్తాపము నొంది హరిద్వారమున కేగి తపస్సుచేసి ముక్తిని పొందెను

గజుడు లేక గజేంద్రుడు - ఇంద్రద్యుమ్నుడు శాపవశమున గజరాజ మాయెను ఒకనాడు గజేంద్రుడు తక్కిన గజములతో పాటు సరోవరములో క్రీడించుచుండెను ఆ సరోవరములోనే యొక మొసలియుండెను అది హూహూ' అను గంధర్వుడు, శాపవశ మున మకర మాయెను అది గజేంద్రుని పట్టుకొనెను ఆ పట్టును విడిపించుకొనుకొఱకు గజేంద్రు డెంతయో యత్నించెను కాని ప్రయోజనము లేక పోయెను ఆర్తుడై భగవానుడైన విష్ణువును శరణువేడెను ఆ యార్తనాదమును విన్నవాడై విష్ణుభగవానుడు గజేంద్రుని సంరక్షించెను మకరమునకుకూడ శాపవిమోచనమాయెను

గణిక - ఈమె యొక వేశ్య, పేరు జీవంతి ఈవేశ్యప్రేమాల శయముతో నొకచిలుకను పెంచుచుండినది ఒక మహాత్ముడు అది వేశ్యాగృహమని తెలియక భిక్షకై వచ్చెను చిలుకకు రామనామము పలుకుట నేర్పుమని యామహాత్ముడు ఆమె నాదేశించెను ఆమె యటు లొనర్చి క్రమముగ రామనామము నుచ్చరించుట యభ్యాస మొనర్చు

కౌసెను మరణకాలమునకూడ ఆమె పవిత్రమైన రామనామో చ్చారణతో తరించి ముక్తినొందెను

దో॥ నాము రామ కో కలపతరు కలి కల్యాన నివాసు ।
జో సుమిరత భయో భాంగ తేం తులసీ తులసీదాసు ॥ 173

తా॥ కలియుగమునందు శ్రీరామనామము కల్పతరువువంటిది ఇది సమస్త కల్యాణముల కాటపట్టయినది మోక్షమొసగునది అటువంటి పవిత్రమైన నామ స్మరణమువలన నికృష్ట తులసీదాసుకూడ తులసీదళమువలె పవిత్రుడాయెను

వి॥ "తులసీదళములచే సంతోషముగా పూజింతు"నని శ్రీత్యాగరాజస్వామి వచించిరి సర్వులకు ఆరాధ్యదేవత తులసి పుష్పములు భోగములు నెన్ని సమర్పించినను, తులసీదళములతో పూజించనిదే శ్రీహరి కానందము కలుగనేరదు తులసి చాలపవిత్రమైనది తులసి హారమనిన శ్రీకృష్ణున కత్యంత ప్రీతి ప్రతిహైందవగృహమున తులసి కోట యుండితీరును వనితలు తులసితీర్థమును ప్రతదినమును పింతురు భవరోగవైద్యమునకు తులసి యుపకరించును ఇంటి ముందారణమున జనులు తులసిమొక్కల నమితముగా పెంచెదరు దాని పవిత్రత నెంతైనను వర్ణింపవచ్చును

శ్రీరామనామ ప్రభావమువలన శ్రీతులసీదాసు తులసివలె అత్యంతపవిత్రుడాయెను సామాన్యముగ దైవారాధన, జపము మానవు నత్యంతపవిత్రునిగ నొనరించును శ్రీరామపాదసేవకే సర్వస్వము త్యాగముచేసిన శ్రీగోస్వామి తులసీదాసు విషయమున, శ్రీరామ ... ము, ఉపారము ఆయనకీర్తి తులసివలె చిరస్థాయిగ ... టల ...దియములేదు

చౌ॥ చహుం జుగ తీని కాల తిహుం లోకా ।
భే నాము జపి జీవ బిసోకా ॥
బేద పురాన సంత మత ఏహూ ।
సకల సుకృత ఫల రామ సనేహూ ॥

తా॥ రామనామము కేవలము కలియుగమునందు మాత్రమే ప్రభావము కలిగినది కాదు నాల్గుయుగములలోను, మూడుకాలములయందును, ముల్లోకములలోను నామమును జపించి సకలజీవులు శోకరహితు లయ్యెదరు సమస్తపుణ్యముల ఫలము శ్రీరామనామమును భక్తితో జపించుటయందే కలదని సజ్జనులు, వేదములు పురాణములయొక్క నిశ్చితమైన యభిప్రాయము

చౌ॥ ధ్యాను ప్రథమ జుగ మఖబిధి దూజేఁ ।
ద్వాపర పరితోషత ప్రభు పూజేఁ ॥
కలి కేవల మల మూల మలీనా ।
పాప పయోనిధి జన మన మీనా ॥ 175

తా॥ మొదట సత్యయుగము ధ్యానమునకు ప్రాధాన్య మొసంగబడినది సత్యయుగములో నుండిన ప్రజలు ధ్యానమార్గముచే ముక్తినొందుచుండిరి రెండవది త్రేతాయుగము, యజ్ఞయాగాదులకు ప్రాముఖ్యము గలది మోక్షాపేక్షగలవారు ధనవ్యయముజేసి శ్రమకోర్చి యజ్ఞయాగాదులను జేయుచుండిరి ద్వాపరయుగమున పూజచేత భగవానుని ప్రసన్నుని గావించుకొనుచుండిరి కలియుగము కేవలము పాపభూయిష్ఠమైనది కలియుగములో మానవులహృదయములు సముద్రములోని మీనములవంటివి

వి॥ "రఘువంశము" నందు కాళిదాసమహాకవి యజ్ఞయాగాదులప్రాశస్త్యమునుగూర్చి విపులముగ వర్ణించిరి దిలీపమహారాజు యజ్ఞయాగాదులను చేయుచుండుటనుగూర్చి యీవిధముగ నుడివిరి

దుదోహ గాం స యజ్ఞాయ సస్యాయ మఘవా దివమ్ ।
సంపద్వినిమయేనోభౌ దధతు ర్భువనద్వయమ్ ॥

అనగా దిలీపమహారాజు భూమినుండి పన్నుగ్రహించి దానితో ఇంద్రాది దేవతలకు హవిర్భాగము నిచ్చుటకు యజ్ఞములు చేయుచుండెను ఇంద్రుడు సంతుష్టుడై, సస్యములు పెరుగునట్లు వర్షము గురియుచుండెను ఇరువురును పరస్పరము ఇచ్చుటచేతను, పుచ్చుకొనుట చేతను రెండులోకములను పోషించుచుండిరి

త్రేతాయుగము - త్రేతాయుగమున యజ్ఞములచే దేవతలను ...ంతుష్టుల గావించు చుండిరి ధనధాన్యములను వినియోగించి క్రమకోరి ... యజ్ఞములనుజేసి ముక్తి బడయుచుండిరి కనుకనే, ఆ ...గమున యజ్ఞములకు ప్రాధాన్య మొసగబడినది హవిర్భాగముల ... దేవతలను తృప్తిపరచినచో వారు కరుణించి, భూమిని సస్య ...మలముగ చే ...దురని త్రేతాయుగమున పలువురు యజ్ఞములను ...ండిరి

... (బ్రహ్మదేవుడు) యజ్ఞములతోగూడ ప్రజ ... వి యిట్లు పలికెను- "మీరు యజ్ఞముచేత వృద్ధి చెందుడు ... మీకు కోరినకోరికల నిచ్చునది యగుగాక "

భగవద్గీతయందు శ్రీకృష్ణపరమాత్ముడు కర్మయోగమునుగూర్చి ... బోధించునప్పు డిట్లనెను —

దేవాన్భావయతానేన తే దేవా భావయంతు వః ।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ॥

"... యజ్ఞము లొనర్చి దేవతల నారాధింపుడు వారు ... ములచే పోషింతురు ఇట్లు మీ రెండొరుల వలన ...శ్రేయ... ..."

... శ్రీకృష్ణపరమాత్ముడు యజ్ఞములు మొదలగు శాస్త్రీయ ... మని ప్రబోధించెను యజ్ఞయాగాదుల నొనర్చినచో ... భగవంతుడు అనాదికాల ప్రవృత్తంబగు కర్మ ... సగిగొల్పి ... యాత్మావలోకనమును కలుగజేయు ...

... యుగము - ... ద్వాపరయుగములో భగవంతుని ... సాక్షాత్కరింప జేసికొనుచుండిరి కేవలము ... భగవానుడు ప్రసన్ను డగుచుండెను

కలియుగము - కలియుగము పాపముల పుట్ట ఈ యుగమున జనులు మాలిన్యముతో గూడినవారలై యితరుల శ్రేయస్సును భంగ పఱచువారలై యున్నారు కలియుగములో మానవులహృదయములు పాపరూపమైన సముద్రములోని మీనముల వంటివి చేప నీటినుండి వెలుపలికిరాదు అటులే పాపములనుండి విముక్తిబొందుటకు కలి యుగ మానవుల మనస్సు లంగీకరింపవు కనుక ధ్యానము, యజ్ఞము, అర్చన యిత్యాదులను జేయుటకు జనులిచ్ఛగింపరు

చౌ॥ నామ కామతరు కాల కరాలా ।
సుమిరత సమన సకల జగ జాలా ॥
రామనామ కలి అభిమత దాతా ।
హిత పరలోక లోక పితు మాతా ॥ 176

తా॥ ఇటువంటిభయంకరమైన కలియుగములో నామము కల్పవృక్షముతో సమానమైనది స్మరణమాత్రముననే ప్రపంచములోని జంజాటములన్నియు నాశ మొనర్పబడును కలియుగములో రామనామము మనోవాంఛిత ఫలము నొసగు నది పరలోకములో హితము చేకూర్చునది అనగా ముక్తినొసగునది ఈ లోక మున నామమె తల్లి మరియు తండ్రి

వి॥ నామస్మరణవలన ముక్తి కలుగును నామము, పరలోక మున ముక్తిని ప్రసాదించును ఇహలోకమున తల్లిదండ్రులవలె మనలను సంరక్షించును

చౌ॥ నహిఁ కలి కరమ న భగతి బిబేకూ ।
రామ నామ అవలంబన ఏకూ ।
కాలనేమి కలి కపట నిధానూ ।
నామ సుమతి సమరథ హనుమానూ ॥ 177

తా॥ కలియుగములో భక్తి, జ్ఞాన, కర్మలకు తావులేదు ఈ యుగము నందు రామనామ మొకటే యాధారము కుటిలత్వములకు పుట్టయగు కలియుగ రూపమైన కాలనేమిని జంపుటకు రామనామమే బుద్ధిమంతుడైన హనుమంతుడు

వి॥ కాలనేమి వృత్తాంతమునుగూర్చి యిదివరలో చెప్పబడినది

కాలనేమిని హానుమంతుడు సంహరించెను కాలనేమిని హనుమంతుడు సంహరించినట్లు, కలి యుగమున పాపములను బోగొట్టుటకు రామనామమే సర్వత్ర సాధనమైనదన్న మహత్తరభావ మిందు [illegible]రించుచున్నది

దో॥ రామ నామ నర కేసరీ కనక కసిపు కలికాల ।
జాపక జన ప్రహలాద జిమి పాలిహి దలి సురసాల ॥ 178

తా॥ రామనామము-నరసింహభగవానుడు, కలియుగము-హిరణ్యకశిపుడు రామనామమును జపించువారలు ప్రహ్లాదునితో సమానులు ఈ రామనామము దేవతలకు శత్రువులైనవారిని సంహరించి శ్రీరామనామమును జపించువారలను రక్షించును

వి॥ పవిత్రమైన శ్రీరామనామము దేవాదిదేవుడైన నరసింహభగవాను డనిరి శ్రీతులసీదాసస్వామి ఇక పాపభూయిష్ఠమైన కలియుగము క్రూరుడైనహిరణ్యకశిపుడనియు, రామనామామృతమును పానము చేయువారలు భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదునితో సమానులనియు [illegible] నరసింహభగవానుడు ప్రహ్లాదుని హిరణ్యకశిపునిబారినుండి రక్షించిన చందంబున, రామనామము దేవతలకు శత్రువులు అనగా కలియుగ దైత్యులను సంహరించి, భక్తులను కాపాడునని భావము

[illegible] కశిపుడు - నరకేసరి - కనకకశిపుడనగా హిరణ్యకశిపుడు [illegible] నరసింహుడు

ఎవ్వరివలన మరణము సంభవింపకుండునట్లు వరమును [illegible] హిరణ్యకశిపుడు బ్రహ్మను వేడియుండెను ' జన్మ [illegible] మెన్నటికిని అమరుడు కాజాలడు, ఇంకొకవరము వేడు ' [illegible] బ్రహ్మ అంత హిరణ్యకశిపుడు రాత్రియందుగాని పగటి [illegible]గాని, భూమ్యాకాశములందుగాని, మనుష్యులవలన మృగముల [illegible], దేవతలవలనగాని, రాక్షసులవలనగాని, సృష్టిలోని యే జీవి

వల్లకూడ నాకు మరణము కలుగకుండునట్లు వరము ప్రసాదింపు' మనెను. బ్రహ్మ యా వరమును ప్రసాదించెను. ఈ ప్రకారము వరమునుబొంది దేవతలకమితమైన దుఃఖము కలుగజేయుచు తుదకు తన పుత్రుడైన ప్రహ్లాదునికూడ హింసింపమొదలిడెను. భగవాను డెక్కడ నున్నాడో చూపుము లేకపోయినచో నిన్ను హతమార్చెదననెను. భగవానుడు సర్వాంతర్యామి యని ప్రహ్లాదుడు నుడివెను. హిరణ్యకశిపుడుగ్రుడై యొకస్తంభమును గొట్టెను. అంతవిష్ణుభగవానుడు స్తంభము నుండి నరసింహావతారమున గనబడి హిరణ్యకశిపుని జంపి ప్రహ్లాదుని రక్షించెను.

చౌ॥ భాయఁ కుభాయఁ అనఖ ఆలసహూఁ ।
నామ జపత మంగల దిసి దసహూఁ॥
సుమిరి సో నామ రామ గున గాదా ।
కరఉఁ నాఇ రఘునాథహి మాథా ॥ 179

తా॥ సద్భావ ంచో లేక ప్రేమతో వైరభావముతో, క్రోధముతో, ఏవిధముగ రామనామమును జపించినను పదిదిశలయందును మంగళము చేకూరును. కల్యాణప్రదమైన రామనామమునుస్మరించి శ్రీరామునకు సాష్టాంగనమస్కారము నుజేసి నేను శ్రీరాముని సుగుణములను వర్ణించుచున్నాడను.

వి॥ సకామ భావముతోను, నిష్కామ భా ముతోను తుదకు వైరభావముతోనైనను రామనామమును జపింపవలయునని భావము. ఎట్లు చేసినను రామనామమువలన దేశమునకు క్షేమమే కలుగునని శ్రీవారు నుడువుచున్నారు.

## శ్రీరాముని గుణగణములు _ శ్రీరామ మహిమ

చౌ॥ మోరి సుధారిహి సో సబ భాఁతీ ।
జాసు కృపా నహిఁ కృపాఁ అఘాతీ ॥
రామ సుస్వామి కుసేవక మోసో ।
నిజ దిసి దేఖి దయానిధి పోసో ॥ 180

తా॥ సుకవులు-కుకవులు, స్త్రీ పురుషులెల్లరును వారి బుద్ధ్యనుసారము రాజును ప్రశంసించెదరు సచ్ఛీలురై, ఈశ్వరాంశభూతులైన రాజులు-(ముందు దోహతో అన్వయము)

చౌ॥ సుని సనమానహిఁ సబహి సుబానీ ।
భనితి భగతి నతి గతి పహిచానీ ॥
యహ ప్రాకృత మహిపాల సుభాఊ ।
జాన సిరోమని కోసల రాఊ ॥ 183

తా॥ సర్వుల వాక్చాతుర్యమును, భక్తిని, వినయమును, చతురత్వమును కనుగొన్నవారై అందరిని మృదుమధురవచనములతో యథాయోగ్యముగ సత్కరింతురు ఈ స్వభావము ఇహలోకసంబంధులైన రాజుల కన్వయించును కాని, కోసలాధీశ్వరుడైన శ్రీరామచంద్రుడు చతురశిరోమణి

చౌ॥ రీఝత రామ సనేహ నిసోతేఁ ।
కో జగ మంద మలిన మతి మోతేఁ ॥ 184

తా॥ శ్రీరామచంద్రుడు పరిశుద్ధమైన ప్రేమానురాగములున్ననే ముగ్ధడగును కాని, జగత్తున నెన్నిమించిన మూర్ఖులు మలినబుద్ధిగల వారింకెవరైనను గలరా!

దో॥ సఠ సేవక కీ ప్రీతి రుచి రఖిహహిఁ రామ కృపాలు ।
ఉపల కియే జలజాన జేహిఁ సచివ సుమతి కపి భాలు ॥185

తా॥ ఐనను కృపాసాగరుడైన శ్రీరాముడు, దుష్టసేవకుని ప్రీతి నవశ్యము స్వీకరించును శిలలను (సేతువును కట్టుట నుపయోగించిన రాళ్ళను) నౌకలుగను వానరభల్లూకములను మంత్రులుగాను చేసికొనిన శ్రీరఘుకుల భూషణుడు నన్నుపేక్షించునా!

వి॥ సుగ్రీవాంగదాదులను మృగములని యెంచక వారిని మంత్రులుగాజేసికొని రాళ్ళను కేవలము జడపదార్థములని భావింపక వాటినికూడ సేతువుగట్టుట కుపయోగించి, సముద్రమును దాటుటకు

సాదరముగ చేర్చిన కరుణాసముద్రుడైన శ్రీరఘువీరుడు తమను కనికరించి తీసుకొను శ్రీతులసీదాసు స్పష్టముగ, సవినయముగ విన్న వించుకొనుచున్నా

దో॥ చాహహుఁ రిహావత లఖ కహత రాము సహత ఉపహాస ।
సాహిబ సీతానాథ సో సేవక తులసీదాస ॥ 186

తా॥ సకలజనులు నన్ను శ్రీరామభక్తుడందురు నేనుకూడ వంచుకి లజ్జయు సంకోచమును లేక రామభక్తుడని చెల్లించే ప్రశంసింపబడుచున్నాను కాని సీతాపతియైన శ్రీరాముని వంటి స్వామికి, తులసీదాసువంటి సేవకుడన్న నిందను కృపా సాగరుడైన శ్రీరామచంద్రుడు సహించుచున్నాడు

వి॥ 'దంభో దర్పోఽభిమానశ్చ' దంభము, దర్పము, అభిమానము - ఇత్యాదులు అసుర గుణములని, ఇవే నరకమునకు కారణ మను గీతావాక్యము

శ్రీతులసీదాసు తాము సర్వ జనులను భగవత్సన్నిధానమున [illegible] గావించుచున్నారు 'ఈశ్వరస్యాప్యభిమాని ద్వేషిత్వాత్ దైన్య ప్రియత్వాచ్చ' కులాభిమానము, ధనాభిమానము [illegible] వారిని భగవంతుడు ప్రేమింపడు, ద్వేషించు [illegible] ప్రేమించును [illegible] నారద భక్తి సూత్రములలో చెప్పబడి యున్నది

చౌ॥ అతి బడి మోరి ఢిఠాఈ ఖోరీ ।
సుని అఘ నరకహుఁ నాక సకోరీ ॥
సముఝి సహామ మోహి అపడర అపనే ।
సో సుధి రామ కీన్హి నహిఁ సపనే ॥ 187

తా॥ నేను చాల అవినయముగ ప్రవర్తించుచున్నాను అపరాధములను [illegible] పాపకార్యములను గురించి విన్నచో యముడుకూడ నన్ను [illegible] అన్న అనేకకల్పనలతో కూడిన భయముచే నేను

క్రుంగి కృశించి పోవుచున్నాను కాని కరుణాళువైన శ్రీరామచంద్రుడు మాత్రము స్వప్నములోఁగూడ నా గుణదోషములను గాని యవినయభావముల నెంచలేదు

చౌ॥ సుని అవలోకి సుచిత చఖ చాహీ ।
భగతి మోరి మతి స్వామి సరాహీ ॥
కహత న సాఇ హోఇ హియఁ నీకీ ।
రీఝత రామ జాని జన జీ కీ ॥ 188

తా॥ నే చేసిన అపరాధము లన్నియు మన్నించి, నా ప్రభువైన శ్రీరామచంద్రుడు నన్ను గూర్చి తెలిసికొని అతి సుచిత్తరూపమైన దివ్యచక్షువులతో నిరీక్షించుచు అటువాతఁగూడ నా భక్తి, జ్ఞాన వైరాగ్యములనుగూర్చి ప్రశంసించినారు కాని బాహ్యదృష్టిని సన్నెల్లరు భగవద్భక్తుడని కొనియాడవచ్చును కాని హృదయమున సద్భావముండవలయును దాసుని హృదయభావములను క్షుణ్ణముగా నెఱిగి, వాస్తవస్థితిని తెలిసికొని, రఘూత్తముడు రక్షించును

వి॥ సామాన్యముగా పేరుప్రతిష్ఠలు కాంక్షించి జనులు భగవద్భక్తులమని విఱ్ఱవీగుట పరిపాటి హృదయాంతరాళమున భగవానుని చింతింపక, రామదాసు లగుటకు యోగ్యతలేకయే బాహ్యాడంబర పూరితులై తాము భక్తాగ్రేసరుల మనుచున్నారు కొందరు గుహలలోనే నివాసము చేయుచుందురు కొందరు జడలు, గోళ్ళు పెద్దవిగా పెంచుకొని యుందురు కొందరు జటాజూటముపై రుద్రాక్షమాలలు చుట్టుకొని, పులితోలు కట్టుకొని యుందురు కొందరు అడవులలో ఆకులు అలములు తిని యేకాంతముగ నుండెదరు ఈ వేషధారణ ఉదరనిమిత్తము కాకుండ ఉండవలయును ఈ బాహ్యాడంబరపూరితులైన వారి చర్యలను ప్రజ లెఱిగినను, ఎఱుగకున్నను సర్వాంతర్యామియైన శ్రీరామచంద్రుడు తెలిసికొనును హృదయమున సద్భావము లుండి, మనోవాక్కాయములతో తనదాసులైనచో శ్రీరామచంద్రుడు దాసుల హృదయభావనల నెఱిగి, రక్షించునన్న భావమిచ్చట ప్రస్ఫుటమగుచున్నది

శ్రవణము చేయవలసినదిగా శ్రీతులసీదాసస్వామి సజ్జనులను ప్రబోధించుచున్నారు

చౌ॥ సంభు కీన్హ యహ చరిత సుహావా ।
బహురి కృపా కరి ఉమహి సునావా ॥
సోఇ శివ కాగభుసుండిహి దీన్హా ।
రామ భగత అధికారీ చీన్హా ॥ 195

తా॥ శంకరుడు పూర్వము మనోజ్ఞమైన రామచరితమును నిర్మాణము చేసెను తరువాత పార్వతీదేవి కోర్కెపై ఆ కథ నామెకు వినిపించెను ఆ చరిత్రనే శివుడు, కాకభుసుండి రామభక్తుడనియు, రామనామామృతమును గ్రోలుట కధికారియని భావించి, అతనికి సమగ్రముగా తెలియజేసెను

చౌ॥ తేహి సన జాగబలిక పుని పావా ।
తిన్హ పుని భరద్వాజ ప్రతి గావా ॥
తే శ్రోతా బకతా సమసీలా ।
సవఁదరసీ జానహిఁ హరి లీలా ॥ 196

తా॥ ఈ కథను కాకభుసుండివలన యాజ్ఞవల్క్యుడు విని దానిని భరద్వాజునకు గానముచేసి వినిపించెను వక్తయైన యాజ్ఞవల్క్యుడును, శ్రోతయైన భరద్వాజుడును ఇరువురును సచ్ఛీలురు, సమదర్శనులే। శ్రీహరిలీలలను సమగ్రముగా తెలిసిన వారలు

వి॥ భగవత్సేవయే ముక్తి భగవంతుని పూజగాని, స్మరణముగాని, భగవత్కథాశ్రవణము-ఇత్యాదులు ముక్తికి మార్గములు ఈకథాశ్రవణమునందు వక్తయు, శ్రోతయు ఇరువురును మనోవాక్కాయకర్మలతో భగవద్భక్తులైనచో కథ రక్తికట్టి శాశ్వతానందమును కలుగజేయును

చౌ॥ జానహిఁ తీని కాల నిజ గ్యానా ।
కరతల గత ఆమలక సమానా ॥
ఔరఉ జే హరి భగత సుజానా ।
కహహిఁ సునహిఁ సముఝహిఁ బిధి నానా ॥ 197

చౌ॥ తదపి కహీ గురు బారహిఀ బారా ।
సముఝి పరీ కఛు మతి అనుసారా ॥
భాషాబద్ధ కరబి మైఀ సోఈ ।
మోరేఀ మన ప్రబోధ జేహిఀ హోఈ ॥ 200

తా॥ ఐనను గురువు మాటిమాటికిని చెప్పిన కథలు కొన్ని నాకు దెలియ వచ్చినవి అవియే ఇప్పుడు నేను చక్కనిశైలిలో రచించెదను ఇట్లు రచించుట వలన నా హృదయము కలుగుగాక!

వి॥ బాల్యచాపల్యమువలన శ్రీగురుమహారాజు తమకు వివరించిన కథలను శ్రద్ధగా నాలకింపకపోయినను, ఆ గురుదేవుని యను గ్రహమువలన లియుకు సర్వము అవగతమై, శ్రీరామచరితమానసమును బహురంజకముగ రచించుట కా కథలెంతయో తోడ్పడినవని శ్రీతులసీ దాసిచటు నివ్వచించుచున్నాడు

దో॥ జస కఛు బుధి బిబేక బల మేరేఀ ।
తస కహిహఉఀ హియఀ హరి కే ప్రేరేఀ ॥
నిజ సందేహ మోహ భ్రమ హరనీ ।
కరఉఀ కథా భవ సరితా తరనీ ॥ 201

తా॥ నా బుద్ధిబలము ననుసరించి శ్రీహరి ప్రేరణానుసారముగ ఈ కథను వివరించెదను నా సందేహములు, అజ్ఞానము, మోహమును హరించు పవిత్ర మైన శ్రీరామకథను రచించుచున్నాను ఇది సంసారసాగరమును తరింపజేయు టకు నావవంటిది

వి॥ శ్రీతులసీదాస స్వామి యీకృతిని భగవదర్పితము చేయు చున్నాడు

'శ్రీరామచంద్రా! పరమపవిత్రమైన నాయొక్క యీ కవిత యనెడి కన్యను నీ కొసగుచున్నాను ఈమె సర్వలక్షణసంపన్నురాలు ఈమెను ప్రేమతో పరిగ్రహింపుము ఈమె వలన నీకు సంతోషము

మఱియు మంచిఖ్యాతులయి, నారు కృతార్థత్వము లభించును ' అని శ్రీతులసీదాసు నిర్వచించుచున్నాడు

దో॥ బుధ బిశ్రామ సకల జన రంజని ।
రామకథా కలి కలుష బిభంజని ॥
రామకథా కలి పంనగ భరనీ ।
పుని బిబేక పావక కహుఁ అరనీ ॥ 202

తా॥ శ్రీరామకథ పండితులకు శాంతి నొసగునది సర్వజనరంజకమైనది సర్వులను ప్రసన్నులను జేయునది కలియుగములోని పాపములను హరింపజేయునది వివేకరూపమైన అగ్నిని ప్రకటితము జేయుటకు అరణివంటిది

వి॥ హంసి సర్పమును సంహారించు చందమున, శ్రీరామకథ కలియుగములోని పాపములను హరింపజేయును అరణియనగా అగ్ని పుట్టించుటకు నుపయోగించుకఱ్ఱ అంత అగ్నిహోత్రమై యజ్ఞ యాగాదులు కొనసాగినట్లు పవిత్రమైన రామకథ సద్విద్యా కాలవాలమై వివేకమును పెంపొందింపజేసి, సుఖశాంతుల నొసంగి జ్ఞానమును ప్రాపింపజేయుటకు సాధన మగునని భావము

దో॥ రామకథా కలి కామద గాఈ ।
సుజన సజీవని మూరి సుహాఈ ॥
సోఇ బసుధాతల సుధాతరంగిని ।
భయ భంజని భ్రమ బేక భుఅంగిని ॥ 203

తా॥ రామకథ కలియుగములో సకలమనోరథములను సఫలము గావించుటకు కామధేనువువంటిది సజ్జనులకు సంజీవనివంటిది రామకథ యీ పృథ్వీతలమున అమృతప్రవాహముతో కూడిన నదివంటిది జననమరణభయశోకములను నాశనముజేయునది రామకథ భ్రమరరూపమండూకములను భక్షించుటకు సర్పము వంటిది

వి॥ సకలశాస్త్రనిగమాగమసారమైన శ్రీరామకథ జననమరణ భయమును దూరము చేయునటువంటిది, సకలమనోరథముల నీడేర్చు కామధేనువు వంటిది, పవిత్రమైననది వంటిది కప్పలను పాము అనునట్లు మోహమును బాపుటకు రామకథ పాము వంటిదని భావము

చౌ॥ అసుర సేన సమ నరక నికందిని ।
సాధు బిబుధ కుల హిత గిరినందిని ॥
సంత సమాజ పయోధి రమా సీ ।
బిస్వ భార భర అచల ఛమా సీ ॥ 204

తా॥ ఈ రామకథ అసురసేనతో సమానమైన నరకమును నాశనమొనర్చుటకును సాధుస్వభావులైన దేవతలకు హితమొనగూర్చుటకును పర్వతరాజ కుమారియైన పార్వతివంటిది శ్రీరామకథ సజ్జనసమాజరూపమైన క్షీరసముద్రమున వెలయు లక్ష్మీదేవితో సమానము మరియు సంపూర్ణవిశ్వభారమును భరించు అచంచలమైన పృథ్వితో సమానము

వి॥ దుష్టశిక్షణము, శిష్టరక్షణముచేయుటకు దుర్గ ఎటులో, కలియుగములోని పాపములను హరింపజేయుటకు రామకథగూడ అటువంటిదే క్షీరసాగరమునసే లక్ష్మీదేవి వెలయును అట్లే సజ్జనసమాజమున రామకథకు ప్రాశస్త్యము మెండు భూభారమును వహించుటయందు, క్షమాగుణమునందు భూదేవివలె శ్రీరామకథామృతమును గ్రోలినవారు దయ, క్షమ, ఓర్పు ఇత్యాది సుగుణములతో విరాజల్లెదరన్న భావ మిచ్చట స్ఫురించుచున్నది

చౌ॥ జము గన ముహఁ మసి జగ జమునా సీ ।
జీవన ముకుతి హేతు జను కాసీ ॥
రామహి ప్రియ పావని తులసీ సీ ।
తులసిదాస హిత హియఁ హులసీ సీ ॥ 205

తా॥ యమదూతల ముఖములపై మసిబూయుటకు రామకథ యమునానది వంటిది జీవులకు ముక్తినొసగుటకు వారణాసివంటిది ఈ రామకథ శ్రీరామునికి పవిత్రమైన తులసితో సమానముగ ప్రియమైనది తులసీదాసునకు తాలసితో (శ్రీతులసీదాసు జనని) సమానముగ హాయి చేకూర్చునది

వి॥ పవిత్రమైన యమునానదిలో స్నానమాచరించినచో సమస్త పాపములనుండి విముక్తి బడయు చందంబున, రామకథ ను శ్రవణము చేసినచో యమదూతల వలన బియపడునిత్యము లేదు కాశిలో మరణించిన వారికి ముక్తి కలుగునుకదా! అట్టులే జీవులకు ముక్తినొసగుటకు రామకథ పుణ్యక్షేత్రమైన వారణాసి వంటిది పవిత్రమైన తులసీదళము భగవానునకు ఎట్లు ప్రీతికరమో రామకథ శ్రీరామునకు ప్రీతికరమైనది శ్రీతులసీదాసునకు ఆతని జనని హులసి వలె హితము చేకూర్చునది రామకథ యని భావము

'భజనపరులకేల దండపాణి బియము మనసా' అని శ్రీత్యాగ రాజస్వామి ఒక కీర్తనయందు శ్రీరామభజన చేయువారికి మృత్యు వనిన బియము లేదనిరి

ఇచట రామకథాశ్రవణము శోకభయాదులనుండి టీఘని విముక్తినొందించునని శ్రీతులసీదాసు నుడివిరి

చౌ॥ సివప్రియ మేకల సైల సుతా సీ।
సకల సిద్ధి సుఖ సంపతి రాసీ॥
సదగున సురగన అంబ అదితి సీ।
రఘుబర భగతి ప్రేమ పరమితి సీ॥ 206

తా॥ శ్రీరామకథ శంకరునకు పవిత్రమైన నర్మదానదితో సమానముగ ప్రియమైనది సకలసిద్ధులకు సుఖసంపత్తులకు రాశియైనది సద్గుణరూపమైన దేవ తల యుద్భవము మరియు పాలన పోషణగావించుటకు మాతయైన అదితితో సమాన మైనది శ్రీరఘునాథునియందలి భక్తిప్రేమల కాటపట్టయినది

దో॥ రామ కథా మందాకినీ చిత్రకూట చిత చారు ।
తులసీ సుభగ సనేహ బన సియ రఘుబీర బిహారు ॥ 207

తా॥ శ్రీగోస్వామితులసీదాసు ఈవిధముగ నిర్వచించుచున్నాడు శ్రీరామ కథ పవిత్రమైన మందాకినీనది నిర్మలచిత్తమే చిత్రకూటము అందలి స్నేహమే లేక యేకాగ్రతయే అరణ్యము అందులో శ్రీసీతారాములు విహరింతురు

వి॥ చిత్రకూటము నిర్మలచిత్తముతో పోల్చబడినది చిత్ర కూటమున పవిత్రమైన మందాకినీ నది ప్రవహించును మందాకిని వోలె పవిత్రమైనరామకథను మనోహరమైన చిత్రకూట సదృశ నిర్మల చిత్తముతో గానముచేసిన వారి హృదయములలో శ్రీ సీతారాముడు విహరించునన్న భావ మిందు గానవచ్చుచున్నది

చౌ॥ రామచరిత చింతామని చారూ ।
సంత సుమతి తియ సుభగ సింగారూ ॥
జగ మంగల గునగ్రామ రామ కే ।
దాని ముకుతి ధన ధరమ ధామ కే ॥ 208

తా॥ శ్రీరామచరిత్ర అమూల్యమైన చింతామణి సజ్జనులకు సుబుద్ధిరూప మైనది స్త్రీకి శృంగారము శ్రీరాముని సుగుణసంపద జగత్కల్యాణము చేకూర్చు నది ధర్మార్థకామమోక్షముల నొసగునది

చౌ॥ సదగురు గ్యాన బిరాగ జోగ కే ।
బిబుధ బైద భవ భీమ రోగ కే ॥
జనని జనక సియ రామ ప్రేమ కే ।
బీజ సకల బ్రత ధరమ నేమ కే ॥ 209

తా॥ జ్ఞాన వైరాగ్య యోగమును ప్రసాదించుటకు శ్రీరామచరిత్ర సద్గురువు వంటిది ప్రపంచసంబంధమైన భయంకరవ్యాధులను (భవరోగములను) నాశనమొనర్చుటకు దేవతలకు వైద్యులైన అశ్వినీకుమారుల వంటిది శ్రీసీతా రాములయందలి భక్తిప్రేమలను పెంపొందింపజేయుటకు జననీజనకులతో సమాన మైనటువంటిది వ్రత, ధర్మ, నియమనిష్ఠలకు బీజమువంటిది

వి॥ 'యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితాహ్యర్థా ప్రకాశంతే మహాత్మన — దేవునియందు ఎవనికి గొప్పభక్తిగలదో గురుదేవుని యందును అంతటిభక్తిగల మహాత్మునకే నిగూఢమైన వేదార్థములు కరతలామలక మగుచున్న వని శ్రుతి వచించినది గదా! గురువాక్యమే భగవద్వాక్యము గురు దేవునిసేవ బహువిశిష్టమైనది కాన శ్రీరామచరిత్రము సద్గురువువంటి దనుచున్నాడు శ్రీతులసీదాసు జ్ఞాన, వైరాగ్య యోగములను ప్రసా దించుటకు సద్గురు వే విధముగ తోడ్పడునో, భగవత్తత్త్వము నెఱుంగ జేయుటకు తన దివ్యగ్రంథమైన శ్రీరామచరితమానస మటులే తోడ్ప డునని చెప్పుచు, తన దివ్యగ్రంథముయొక్క మాహాత్మ్యమును దెలుపు చున్నాడు కవి

తల్లిదండ్రులు బిడ్డల నతిప్రేమతో బెంచెదరు బిడ్డలప్రేమయే తల్లిదండ్రులకు కావలసినది తమసర్వస్వమును బిడ్డలకు ఇచ్చి వేసెదరు బిడ్డలయందు తల్లిదండ్రుల కెట్టి వాత్సల్యము దినదినాభి వృద్ధిగాంచునో, అట్లే తన శ్రీరామ దివ్యగ్రంథ పఠనమువలన రాముని యందలి భక్తిప్రేమలు పెంపొంది మనస్సు భగవదర్పితమగునని శ్రీతులసీదాసస్వామి వచించుచున్నాడు

అశ్వినీకుమారులు -

సూర్యపత్నియైన సంజ్ఞాదేవి పతితేజమునకు తట్టుకొనజాలక అశ్వినియై కురుక్షేత్రమునకు విచ్చేసెను ఈమెకు ఇరువురశ్వినీ కుమారులు జన్మించిరి అశ్వినీకుమారులు దేవతలకు వైద్యులు వీరు చ్యవన ఋషికి దృష్టి, శక్తి, నవయౌవనము, సౌందర్యమును దాన మొనర్చిరి

ఇట్టితటి, దధ్యుడు అను ఋషి ఇంద్రునిచే బ్రహ్మవిద్యను బొందెను ఆ విద్య నొసంగ సమయమున ఇంద్రుడీవిధముగ ఋషితో

ననెను ' ఈవిద్యను నీవెవరికైన నొసగితివేని నీ శరీరమునుండి నీ శిరస్సు వేరగును ' అని

ఆ బ్రహ్మవిద్యను పొందుని మిత్తమై అశ్వినీకుమారులు దధ్యుని కడకేగి యిట్లనిరి

' మునీశ్వరా ! బ్రహ్మవిద్యను పొందునిమిత్తము మేమిట కరుదెంచితిమి మీ శిరమును మీ శరీరమునుండి వేరుచేసి ఆ స్థానమున అశ్వశిరస్సును జోడించెదము బ్రహ్మవిద్య నుపదేశించుతటి మీ శిరస్సు వేరైనచో మీ నిసర్గశిరస్సును మీ మొండెమునకు జోడించెదము '

ఇందులకు దధ్యుడంగీకరించి అశ్వశిరస్సుతో బ్రహ్మవిద్య నుపదేశించెను అప్పుడాతని అశ్వశిరస్సు మొండెమునుండి వేరయ్యెను అశ్వినీకుమారులు ఋషియొక్క శిరస్సును తెచ్చి మరల అతని మొండెమునకు జోడించిరి

పాండురాజు పత్నియైన మాద్రీదేవి అశ్వినీకుమారుల అనుగ్రహమువలన నకులసహదేవు లను పుత్రులను బడసినది

చౌ॥ సమన పాప సంతాప సోక కే ।
ప్రియ పాలక పరలోక లోక కే ॥
సచివ సుభట భూపతి బిచార కే ।
కుంభజ లోభ ఉదధి అపార కే ॥ 210

తా॥ శ్రీరామచరిత పాపము, సంతాపము, శోకము నాశనము గావించి, ఈ లోకమును, పరలోకమును ప్రియముగా పాలన చేయునట్టిది (ఇహపర సాధనమైనది) ఇహపరసౌఖ్యము నొసగునది జ్ఞానరూపమైన రాజునకు పరాక్రమశాలియైన అమాత్యునివంటిది లోభరూపమైన అపారసముద్రమును ఇంకింప జేయుటలో అగస్త్య మహాముని వంటిది

వి॥ బుద్ధిమంతుడైన విశాలహృదయముగల రాజనకు శౌర్యవంతుడైన మంత్రి యెంతటి సహాయకారియో, శోకసంతాపములను బాపుటకు రామకథ యట్టిదని భావము

కుంభజుడు – కుండయందుంచిన తేజమునుండి యుత్పన్న మైన వాడు గనుక అగస్త్యుని కుంభజుఁడందురు వృత్రాసురుని మరణా నంతరము రాక్షసులెల్లరు సముద్రమున దాగియుండి రాత్రి వేళలందు వెలుపలికివచ్చి ఋషులనెల్ల భక్షించుచుండిరి అట్టితఱి అగస్త్యమహర్షి ఆచమనమొనరించి సముద్రమును శోషింపజేసెను

లోభరూపమైన భయంకరరూపమైన సంసార సాగరమును ఇంకింపజేయుటకు రామకథ సాక్షాత్ అగస్త్యమహాముని వంటిది

చౌ॥ కామ కోహ కలిమల కరిగన కే ।
కేహరి సావక జన మన బన కే ॥
అతిథి పూజ్య ప్రియతమ పురారి కే ।
కామద ఘన దారిద దవారి కే ॥ 211

తా॥ శ్రీరామకథ భక్తులమనోరాజ్యమైన వనములో విహరించునది కామ క్రోధములను కలియుగములోని పాపములనెడి గజరాజమును సంహరించుటకు సింగపుపిల్లవంటిది శివునకు ఆరాధ్యమై ప్రియమైన అతిథి దారిద్ర్యమనెడి కార్చిచ్చు నార్పివేయుటకు సాధనమైన మేఘము

చౌ॥ మంత్ర మహామని బిషయ బ్యాల కే ।
మేటత కఠిన కుఅంక భాల కే ॥
హరన మోహ తమ దినకర కర సే ।
సేవక సాలి పాల జలధర సే ॥ 212

తా॥ శ్రీరామకథ విషయాసక్తియనెడి సర్పముయొక్క విషమును దింపుటకు మంత్రములు మరియు మహామణివంటిది శ్రీరామగుణగానము ప్రారబ్ధమునుండి విముక్తులను గావించును మోహమనెడి అంధకారమును హరించుటకు రామకథ సూర్యకిరణములతో సమానమైనది భక్తియనెడి సస్యసంపదను పాలన పోషణలు గావించుటకు మేఘమువంటిది

వి॥ మహామంత్రము వలెను, మహామణివలె, బ్రహ్మము కట్టువడును అటులే విషయాసక్తులగు వారలకు శ్రీరామకథ, మహామంత్రము మరియు మహామణి వలె సూర్యుడుదయించినతోడనే యెంతటి దట్టమైన అంధకారముగూడ త్రుటిలో మాయమగురీతి శ్రీరామకథ అజ్ఞానాంధకారమును బాపి జ్ఞానసూర్యుని ప్రకాశింపజేయును పశుసంపద వృద్ధిగాంచవలయునన్న పుష్కలపాత మావశ్యకము వర్షముచేత పైరులు పచ్చబడి గడ్డి సమృద్ధిగ పెరిగిన పశుసంపద అభివృద్ధి గాంచును పశుపోషణకు మేఘము వలె శ్రీరామకథ సజ్జనసంపదను వృద్ధిజేయుటకు మేఘము వంటిది భావము

వాహా ప్రాష్టమ్య విస్పృద్ధమన్యు-
రబ్యర్థ మాగస్కృత మస్పృశ ద్బిః ।
గ వ్యాకేజోభి రిదమ్యాతాన్త-
క్యోగిమ మ న్త్రౌషధ రుద్ధవీర్య

అన్న కాళిదాసుసూక్తి ననుసరించును

చౌ॥ అభిమత దాని దేవతరు బర సే ।
సేవత సులభ సుఖద హరిహర సే ॥
సుకవి సరద నభ మన ఉడగన సే ।
రామ భగత జన జీవన ధన సే ॥ 213

తా॥ శ్రీరామచరిత్రము మనోవాంఛిత ఫలము నొసగుటలో శ్రేష్ఠమైన కల్పవృక్షముతో సమానమైనటువంటిది సేవచేయుటకు హరిహరులతో సమానముగ సులభమైనది సుకవిరూపమై శరదృతువు నందు మనోరూపమై ఆకాశమును సుశోభిత మొనర్చుటను తారాగణములతో సమానమైనది భక్తులకు జీవనాధారమైనది

చౌ॥ సకల సుకృత ఫల భూరిగ భోగ సే ।
జగ హిత నిరుపధి సాధు లోగ సే ॥
సేవక మన మానస మరాల సే ।
పావన గంగ తరంగ మాల సే ॥ 214

తా॥ శ్రీరామకథ సంపూర్ణ పుణ్యముల ఫలము అనంతభోగములతో సమానమైనది జగత్తునందు హితమొనర్చుటకు సాధు సజ్జనులతో సమానమైనది సేవకుల మనోరూపమైన మానస సరోవరమునందు హంసతో సమానమైనది పవిత్రమొనర్చుటకు గంగాతరంగములతో సమానమైనది

వి॥ మానససరోవరమునందే హంస విహరించునది! మానస సరోవరములోని స్వచ్ఛమైన జలమువోలె సజ్జనుల మనస్సు నిర్మలముగా నుండును శ్రీరామకథ మానససరోవరమునందు విహరించు రాజహంసవోలె పవిత్రమైనది మానససరోవరపు స్వచ్ఛమైన జలమును గ్రోలు రాజహంసవలె ఎవరు నిర్మలహృదయముతో శ్రీరామనామామృతమును పానముచేసెదరో వారు పరమపవిత్రులు, చరితార్థులన్న ఒకానొక మహాత్ముని వాక్యమిందు స్ఫురించుచున్నది

తు గంగే గంగే ... హారీకృత జన పాపసమూహే'
అని గంగామాహాత్మ్యమును గూర్చి చెప్పబడినది పాపులనుగూడ పావనులచేయు గంగవోలె ఈ మహిమ పాపులను పవిత్రుల నొనర్చుచున్నది

## శ్రీరామ చరిత మహిమ

దో॥ కుపథ కుతరక కుచాలి కలి కపట దంభ పాషండ ।
దహన రామ గున గ్రామ జిమి ఈంధన అనల ప్రచండ ॥ 215

తా॥ దుర్మార్గము, కుతర్కము, దురాచరణము, మరియు కలియుగమున ప్రజ్వలించు కపటము, లోభము, బూటకములను రూపుమాపుటకు శ్రీరాముని గుణసమూహము ప్రచండాగ్నివంటిది

దో॥ రామచరిత రాకేస కర సరిస సుఖద సబ కాహూ ।
సజ్జన కుముద చకోర చిత హిత బిసేషి బడ లాహూ ॥ 216

తా॥ శ్రీరామచరితము పూర్ణచంద్రుని కిరణములతో సమానముగ ఎల్లరకు సుఖము నొసగునది కాని సజ్జనములకు, వారి చిత్తములనెడి చకోరములకు విశేషముగా హితము చేకూర్చునదై లాభదాయకమైనది

వి॥ పూర్ణచంద్రుడు సర్వప్రాణికోటికిని చల్లదనము నొసగును చంద్రుడుదయించుచుండగనే కుముదములు వికసించును చకోరపక్షులు చంద్రోదయము చూచుటచే అమితానందము నొందును కుముదపుష్పములకు, చకోరములకు బోల్పబడిన సజ్జనులు శ్రీరామకథాశ్రవణమున కలుగు అధ్యయనమువలన బ్రహ్మానందమును బొందినవారగుచున్నారు

చౌ॥ కీన్హి ప్రస్న జేహి భాఁతి భవానీ ।
జేహి బిధి సంకర కహా బఖానీ ॥
సో సబ హేతు కహబ మైఁ గాఈ ।
కథా ప్రబంధ బిచిత్ర బనాఈ ॥ 217

తా॥ ఏ విధముగ పార్వతీదేవి ఈశ్వరుని ప్రశ్నించినది, ఈశ్వరు డేవిధముగ సవిస్తరముగ వ్యాఖ్యానించెనో ఆ సమస్త విషయములను లేక కారణములను నేను విచిత్రగాథలతో నొప్పారునట్లు రచించి గానము చేసి వినిపింతును

చౌ॥ జేహిఁ యహ కథా సునీ నహిఁ హోఈ ।
జని ఆచరజ కరై సుని సోఈ ॥
కథా అలౌకిక సునహిఁ జే గ్యానీ ।
నహిఁ ఆచరజు కరహిఁ అస జానీ ॥
రామ కథా కై మితి జగ నాహీఁ ।
అసి ప్రతీతి తిన్హ కే మన మాహీఁ ॥
నానా భాఁతి రామ అవతారా ।
రామాయన సతకోటి అపారా ॥ 218

తా॥ ఈ కథను మరుపొందుగా వినినను మరల దీని నాలకించి ఆశ్చర్యపడవలదు జ్ఞానులైనవారు ఈ విచిత్రమంతయు తెలిసికొన్న తరువాత ఆశ్చర్యపడబోరు ఏలన ప్రపంచమునందు రామకథ యొకటే కాదు రామకథ లనంతములనియు, శ్రీరామచంద్రుని అవతారములు పెక్కు గలవనియు, కోట్లకొలది రామాయణములు ఉన్నవనియు ఎల్లరు విశ్వసింతురు

చౌ॥ కలప బేద హరి చరిత సుహాయే ।
భాంతి అనేక మునీసన్హ గాయే ॥
కరియ న సంసయ అస ఉర ఆనీ ।
సునిఅ కథా సాదర రతి మానీ ॥ 219

తా॥ కల్ప భేదానుసారముగ శ్రీహరి సుందరచరిత్రములను మునీశ్వరులనేక ప్రకారములుగా గానముచేసినారు కనుక మీరిట్టి సందేహములకు చోటీయక ఆదరముతో ప్రేమతో ఈ కథ నాలకింపుడు

దో॥ రామ అనంత అనంత గున అమిత కథా బిస్తార ।
సుని ఆచరజు న మానిహహిఁ జిన్హ కే బిమల బిచార ॥ 220

తా॥ శ్రీరామచంద్రు డనంతుడు శ్రీరామగుణము లనంతములు। శ్రీరామ కథల విస్తృతి గూడ అనంతమైనది। ఉన్నతమైన నిర్మలభావములుకలవారీకథను విని ఆశ్చర్యమను మాటను ఒప్పుకొనరు

చౌ॥ ఏహి బిధి సంసయ కరి దూరీ ।
సిర ధరి గుర పద పంకజ ధూరీ ॥
పుని సబహీ బినవఉఁ కర జోరీ ।
కరత కథా జేహిఁ లాగ న ఖోరీ ॥ 221

తా॥ ఈ విధముగ సమస్తసందేహనివృత్తిని గావించుకొన్నవాడనై శ్రీగురుచరణసరోజరజమును శిరస్సునందు ధరించి, ఈ కథారచనయందు ఎవరును దోషముల నెంచకుండుటకై, నా కరకమలములను జోడించి సర్వులను

చౌ॥ సాదర సివహి నాఇ అబ మాథా ।
బరనఉఁ బిసద రామ గున గాథా ॥
సంబత సోరహ సై ఏకతీసా ।
కరఉ కథా హరి పద ధరి సీసా ॥ 222

తా॥ ఇప్పుడు నేను (శ్రీతులసీదాసు) భక్తిపూర్వకముగ శంకరునకు నమస్కరించి శ్రీరామచంద్రుని సుగుణములతో నిండిన నిర్మల శ్రీరామచరితమానసమును వర్ణించుచున్నాను. శ్రీహరిపాదములకు సాష్టాంగనమస్కారమొనర్చి 1631వ సం॥ మున ఈ కథారచనను ప్రారంభించుచున్నాను.

చౌ॥ నౌమీ భౌమ బార మధు మాసా ।
అవధపురీ యహ చరిత ప్రకాసా ॥
జేహి దిన రామ జనమ శ్రుతి గావహిఁ ।
తీరథ సకల తహాఁ చలి ఆవహిఁ ॥ 223

తా॥ చైత్రమాసమునందు నవమితిథి, మంగళవారమునాడు అయోధ్యలో ఈ చరిత్ర ప్రకాశితమైనది. శ్రీరామచంద్రుడు జన్మించిన శుభదినమునందే సకల తీర్థములు అయోధ్యకు తరలివచ్చునని వేదములు ఉద్ఘాటించుచున్నవి గదా!

చౌ॥ అసుర నాగ ఖగ నర ముని దేవా ।
ఆఇ కరహిఁ రఘునాయక సేవా ॥
జన్మ మహోత్సవ రచహిఁ సుజానా ।
కరహిఁ రామ కల కీరతి గానా ॥ 224

తా॥ ఆ శుభదినమునందే అసురులు, నాగులు, పక్షులు, మానవులు, మునులు దేవతలెల్లరును అయోధ్యకు విచ్చేసి శ్రీరఘునాథుని సేవించెదరు. జ్ఞానవంతులును వివేకవంతులైనవారలు శ్రీరామజన్మమహోత్సవమును దిలకించి స్తుతించి శ్రీరాముని యశమును గానము చేయుదురు.

వి॥ ఏ జన్మమెత్తినను తరింపవచ్చునని శ్రీతులసీదాసిట తెలియజేసిరి 'బృందావనమున చెట్టుగనో, పుట్టగనో, గుట్టగనో జన్మించినచో నన్ను ధన్యునిగా భావించుకొందును' అని ఉద్ధవుడు పలికెను.

దో॥ మజ్జహిఁ సజ్జన బృంద బహు పావన సరజూ నీర ।
జపహిఁ రామ ధరి ధ్యాన ఉర సుందర స్యామ సరీర ॥ 225

తా॥ సజ్జనబృందములయ్యు ఆ పవిత్రమైన సరయూనదీ పవిత్ర జలమునందు స్నానమాచరించెదరు మరియు మనోహరమైన నీలమేఘశ్యామమైన శ్రీరఘునాథుని ధ్యానించి రామనామమును జపింతురు

చౌ॥ దరస పరస మజ్జన అరు పానా ।
హరఇ పాప కహ బేద పురానా ॥
నదీ పునీత అమిత మహిమా అతి ।
కహి న సకఇ సారదా బిమలమతి ॥ 226

తా॥ సరయూ నదీ దర్శన స్పర్శనములు, స్నానాచమనములు జలపానము పాపమును హరించునని వేదపురాణములు చెప్పుచున్నవి కదా! సరయూ నది పవిత్రమైనది దాని మహిమ యనంతమైనది సరయూనది మహిమను విమలమతియైన సరస్వతీదేవిగూడ వర్ణింపజాలదు

[వాగ్దేవియైన సరస్వతికే అసాధ్యమైనచో సామాన్యులేపాటియని భావము ]

చౌ॥ రామ ధామదా పురీ సుహావని ।
లోక సమస్త బిదిత అతి పావని ।
చారి ఖాని జగ జీవ అపారా ।
అవధ తజేఁ తను నహిఁ సంసారా ॥ 227

తా॥ అత్యంత శోభాయమానమైన అయోధ్యాపురము శ్రీరామసాన్నిధ్యము నొసగునది ముక్తినొసగునది లోకములో ప్రసిద్ధిగాంచినది అత్యంత పవిత్రమైనది జగత్తునందు అండజ, స్వేదజ ఉద్భిజ్జ, జరాయుజములు - ఇట్లు నాల్గుప్రకారములైన అనంత జీవరాశులున్నవి ఇందులో ఎవరు అయోధ్యానగరమున కాలధర్మము నొందెదరో వారలకు పునర్జన్మమనునది లేదు

వి॥ జన్మ మృత్యుచక్రమున చిక్కక భగవత్సాన్నిధ్యమున నివసించుటకు పునర్జన్మము లేక భగవత్సాన్నిధ్యమున చిరకాలముండ గలరన్న భావమందు స్ఫురించుచున్నది

చౌ॥ సబ బిధి పురీ మనోహర జానీ ।
సకల సిద్ధిప్రద మంగల ఖానీ ॥
బిమల కథా కర కీన్హ అరంభా ।
సునత నసాహిఁ కామ మద దంభా ॥ 228

తా॥ ఈ అయోధ్యాపురము మనోహరమై విరాజిల్లుచు, సకలసిద్ధుల నొసగునదై కల్యాణమునకు కాటపట్టయి యని తెలిసికొని నేను నిర్మలకథ నారంభించినాను ఈ కథను శ్రద్ధాభక్తులతో శ్రవణము చేసినచో వారి క్రోధ, మద మాత్సర్యములెల్ల నశించును

## శ్రీరామ చరిత మానస మాహాత్మ్యము

చౌ॥ రామచరితమానస ఏహి నామా ।
సునత శ్రవన పాఇఅ బిశ్రామా ॥
మన కరి బిషయ అనల బన జరఈ ।
హోఇ సుఖీ జౌఁ ఏహిఁ సర పరఈ ॥ 229

తా॥ దీనిపేరు రామచరితమానసము వినులవిందొనర్చు ఈ కథాశ్రవణము వలన మనశ్శాంతి లభించును మనోరూపమైన గజరాజము విషయరూపమైన దావానలములో దహించబడుచున్నను ఈ రామచరితమానస రూపమైన సరోవరమున కేతెంచినచో సుఖము నొందును

వి॥ గజరాజము దురదృష్టవశమున కార్చిచ్చులోబడి తల్లడిల్లినను, దైవానుగ్రహముతో సరోవరమున కేతెంచినచో బాధనుండి విముక్తి గాంచును అటులే మానవులు విషయాసక్తులనెడి దావానలములో చిక్కుకొని దహింపబడుచున్నను, దైవకటాక్షమువలన శ్రీరామ చరితమానసము నవగాహన చేసికొను నవకాశము కలిగినచో వారు తప్పక సుఖశాంతులను పొందెదరని కవి ధ్వనింపజేయుచున్నాడు

సరోవరమున నీరు స్వచ్ఛముగ నుండును ఇచ్చట శ్రీవారు రామచరితమానస మొక సరోవర మనినారు సరోవరమున స్వచ్ఛమైన

తొంయ్యని జలమును సేవించిన వారెల్లానందింతురో శ్రీరామచరిత మానసమును వినినవారుకూడ జ్ఞానవైరాగ్యములదలచే భాసిల్లెదరని శ్రీతులసీదాసు సెలవిచ్చుచున్నాడు

చౌ॥ రామచరితమానస ముని భావన ।
బిరచేఉ సంభు సుహావన పావన ॥
త్రివిధ దోష దుఖ దారిద దావన ।
కలి కుచాలి కుతి కలుష నసావన ॥ 230

తా॥ ఈ రామచరితమానసము మునులకు ప్రియమైనటువంటిది. పవిత్రమైన మానసమును శివుడు మున్ను రచించెను. ఇది త్రివిధములైన దోషములను, దుఃఖములను నివారింపజేయును. కలియుగమునందు జరుగుచున్న దురాచారములను, సకలపాపములను నాశనము గావించును.

వి॥ శం – సుఖమును, భావయతి – కలుగజేయువాడు, గాన శివుడు 'శంభు' అనబడును. ఆశ్రితులకు సుఖకరుడగు సాక్షాత్ శంకరుడే రామచరితమానసమును విరచించెను. కాన ఈ మానసము పాపమును, తాపమును హరించి, యెల్లరకు జ్ఞాననిష్ఠ నెట్టుచు, దివ్యానందమును ప్రసాదించునని కవిహృదయము.

చౌ॥ రచి మహేస నిజ మానస రాఖా ।
పాఇ సుసమఉ సివా సన భాషా ॥
తాతేఁ రామచరితమానస బర ।
ధరేఉ నామ హియఁ హేరి హరషి హర ॥ 231

తా॥ ఈ రామచరిత్రను, మహేశ్వరుడు మనమునందు దాచియుంచి గుప్తముగ నుంచుకొనెను. సమయ మేతెంచినపుడు పార్వతీదేవికి ఈ మానసమును వినిపించెను. శంకరుడు దీనిని తనహృదయకమలమున గాంచి ప్రసన్నుడై దీనికి రామచరితమానసము అను నామధేయమును సార్థకము జేసెను.

చౌ॥ కహఉఁ కథా సోఇ సుఖద సుహాఈ ।
సాదర సునహు సుజన మన లాఈ ॥ 232

తా॥ ఇప్పుడు నేను (శ్రీతులసీదాసు) సుఖసంతోషముల నొసగు దివ్యమైన శ్రీరామకథను జెప్పెదను ఓ సజ్జనులారా! ఆదరపూర్వకముగా దీనియందు మనస్సుంచి శ్రద్ధాభక్తులతో ఆలకింపుడు

దో॥ జస మానస జేహి బిధి భయఉ జగ ప్రచార జేహి హేతు ।
అబ సోఇ కహఉఁ ప్రసంగ సబ సుమిరి ఉమా బృషకేతు ॥ 233

తా॥ శ్రీరామచరితమానసము స్వస్వరూపమునుగూర్చియు ఏవిధముగ నిర్మాణము గావింపబడినది ఏ హేతువువలన జగత్తునందు ఇది ప్రచారము గావింపబడినది - ఇత్యాదిగాథలనుగూర్చి నేను (శ్రీతులసీదాసు) ఉమామహేశ్వరులను స్మరణచేసి చెప్పుచున్నాడను

చౌ॥ సంభు ప్రసాద సుమతి హియఁ హులసీ ।
రామచరితమానస కబి తులసీ ॥
కరఇ మనోహర మతి అనుహారీ ।
సుజన సుచిత సుని లేహు సుధారీ ॥ 234

తా॥ శంకరుని కృపాకటాక్షమువలన తనకు బుద్ధివికాసము కలిగెను దానితో తులసీదాసు శ్రీరామచరితమానసకవిగా ప్రసిద్ధిగాంచెను తనబుద్ధ్యనుసారముగా అతడు మనోహరగాథను వివరింపబోవుచున్నాడు కనుక సజ్జనులారా! నిర్మలచిత్తముతో దీనిని శ్రవణముచేసి శ్రీరామనామామృతమును గ్రోలుడు

చౌ॥ సుమతి భూమి థల హృదయ అగాధూ ।
బేద పురాన ఉదధి ఘన సాధూ ॥
బరషహి రామ సుజస బర బారీ ।
మధుర మనోహర మంగలకారీ ॥ 235

తా॥ సుమతి లేక సాత్త్వికబుద్ధియే - యీ ధరాతలము! హృదయమే - దానిలోని అగాధమైన లేక గంభీరమైన స్థానము వేదపురాణములు - సముద్రములు సజ్జనులు, మేఘములు సాధు సజ్జనరూపమైన మేఘముల శ్రీరామయశోరూపమైన మధుర మనోహర మంగళకరమైన జలమును కురియించును

వి॥ సముద్రమునుండి మేఘములు జలము సేకరించి వర్షరూపమున విడుచునట్లు లవణమైన యగాధమైన సముద్రమువంటి వేదపురాణములనుండి మేఘరూపమైన సజ్జనులు శ్రీరాముని యశోసంపదను తత్త్వాది వేదాంత విషయములను గ్రహించి, మేఘములు వర్షము గురియునట్లు శ్రీరామయశమును చాటుదురని భావము

'దుదోహా గాం స యజ్ఞాయ, సస్యాయ మఘవా దివమ్ ।
సంపద్వినిమయేనోభౌ దధతుర్భువనద్వయమ్ ॥

అన్న శ్రీకాళిదాస సూక్తి యనుసంధేయము

చౌ॥ లీలా సగున జో కహహిఁ బఖానీ ।
సోఇ స్వచ్ఛతా కరఇ మల హానీ ॥
ప్రేమ భగతి జో బరని న జాఈ ।
సోఇ మధురతా సుసీతలతాఈ ॥ 236

తా॥ ఎవరు సగుణలీలలను సవిస్తరముగ వర్ణింతురో - అక్కడనే రామ సుయశోరూపమైన జలముయొక్క నిర్మలత్వముండి మాలిన్యము నాశనము గావింపబడునది

సగుణోపాసనయొక్క ప్రేమ భక్తి విశ్వాసములు వర్ణనాతీతములు రామ యశోరూపమైన యీజలము మధురముగా శీతలముగా నుండును

చౌ॥ సో జల సుకృత సాలి హిత హోఈ ।
రామ భగత జన జీవన సోఈ ॥
మేధా మహి గత సో జల పావన ।
సకిలి శ్రవన మగ చలేఉ సుహావన ॥

భరేఉ సుమానస సుథల థిరానా ।
సుఖద సీత రుచి చారు చిరానా ॥ 237

తా॥ రామ సుయశోరూపమైన యీ జలము సత్కర్మరూపమైన పశుసంప దకు హితము చేకూర్చునటువంటిది శ్రీరామభక్తులకు జీవనాధార మైనటువంటిది ఆ పవిత్ర జలము బుద్ధిరూపమైన పృథ్విపై బడి కూర్చబడి అందమైన యుండ్యా మార్గమున ప్రవహించి హృదయరూపమైన శ్రేష్ఠస్థానమున నింపబడి స్థిరమైనది అదియే పురాణమై సుందరముగా రచింపబడి శీతలమై సుఖదాయక మైనది

వి॥ వర్షపాతము పశుసంపదకు సుఖదాయకము అట్లే శ్రీరామసుయశము సత్కర్మ చేయువారలకు హితము జేకూర్చును శ్రీరామసుయశ మనుజలము సజ్జనుల హృదయములో స్థిరమై, పురాణముగా లభింపబడి శ్రేష్ఠస్థానమున నిర్మలజలము సర్వులను చల్లపర చునట్లు, రామసేవాతత్పరుల కమితానందము నొసగునని కవి హృదయము

దో॥ సురి సుందర సంబాద బర బిరచే బుద్ధి బిచారి ।
తేఇ ఏహి పావన సుభగ సర ఘాట మనోహర చారి ॥ 238

తా॥ ఈ కథయందు బుద్ధివికాసముతో నెలరారు అత్యంతమనోహరము లైన నాల్గుఉత్తమ సంవాదము లున్నవి అవియే పవిత్రసరోవరమునకు నాల్గు మనోహరమైన గట్లు

వి॥ శ్రీరామ సుయశోరూపమైన జలము పృథ్విపైబడి యుండ్యా మార్గమున ప్రవహించినది అది ఒక సరోవరమున సుస్థిరముగ నింప బడినది శ్రీరామచరితమానసము సరోవరమునకు బోల్చబడినది

రామచరితమానసమున నున్న నాల్గు సంవాదములు—

(1) కాకభుసుండి గరుత్మంతునకు శ్రీరామచరితమానసమును బోధించిన సంవా

కింపొందగు చౌపాయిలు-సరోవరములో దట్టముగ వ్యాపించి కమలములు కవి ఋత్వాంకము — ముత్యముల నుత్పత్తిచేయు అందమైన ముత్యపు చిప్పలు

వి॥ అమృతతుల్యమైన, స్వచ్ఛమైన జలమువోలె శ్రీ సీతా రాముల యశస్సంపద పవిత్రమైనది సరోవరముల సోపానములు మనోహరముగ నుప్పొంగుచున్నట్లు, రామచరితమానసమునందు వాడుపరచిన యుపమానములు వర్ణనాతీతములు సరోవరములోని కమలముల దర్శన స్పర్శములే పరమానందసంధాయికములు గదా! సరోవరము లోని కమలములు, పరిమళభరితమై, సర్వజనరంజకమై యొప్పారు చందంబున రామచరితమానసమున నున్న దోహాలు, చౌపాయిలు (శ్లోకములు) పీనులకు ఇంపొసగుచున్న నావ విచ్చట స్ఫురించు చున్నది ముత్యపుచిప్ప వలె అందముగనుండునో కవిచమత్కారము లంత శోభాయమానముగ, నున్నవన్న మఱియొక విషయిందు పొందుపఱచబడి యున్నది

చౌ॥ ఛంద సోరఠా సుందర దోహా ।
సోఇ బహురంగ కమల కుల సోహా ॥
అరథ అనూప సుభావ సుభాసా ।
సోఇ పరాగ మకరంద సుబాసా ॥ 241

తా॥ సుందరమైన ఛందము, సోరఠలు మరియు దోహాలు—సరోవరములో పలురంగులలో నున్న కమలములవలె సుశోభితములు అనుపమానమైన అర్థములు, ఉన్నతభావములు సుందరము మనోజ్ఞమైన భాషయే పరాగము (పుష్ప రజము) మకరందము (పుష్పరసము) పరిమళము సుమధురమైనది

వి॥ సరోవరము పద్మములకు ఆధారము ఇది దేవతల యు, ఋషుల యు హృదయము లనెడి పద్మములకు ఆధారమైనది మిక్కిలి నిర్మలమైనది యగుటచే దీనిని రాజహంసలు ఆశ్రయించును ఇందు మునిగిన తాపము, పాపము తొలగును అందుకే శ్రీతులసీదాసు

శ్రీరామచరితమానసము నొక సరోవరమునకు పోల్చి యున్నాడు
పరిమళభరితమైనది యును స్థిరమైనదియును శ్రీరామధ్యాన మనెడి
యుత్తమపుణ్యస్సు నాశ్రయించిన మునుల సుద్బోధించుచున్నాడు

చౌ॥ సుకృతి పుంజ మంజుల అలి మాలా ।
గ్యాన బిరాగ బిచార మరాలా ॥
ధుని అవరేబ కబిత గున జాతీ ।
మీన మనోహర తే బహుభాంతీ ॥ 242

తా॥ సత్కర్మలు లేక సుకృతఫలములే-తుమ్మెదలగుంపులు జ్ఞాన, వైరాగ్య
విచారమే-హంస కవితాధ్వని, వక్రోక్తి, గుణము జాతియే-పలురకములైన
మీనములు

చౌ॥ అరథ ధరమ కామాదిక చారీ ।
కహబ గ్యాన విగ్యాన బిచారీ ॥
నవ రస జప తప జోగ బిరాగా ।
తే సబ జలచర చారు తడాగా ॥ 243

తా॥ ధర్మార్థకామ మోక్షములు-ఈ నాల్గును జ్ఞాన, విజ్ఞాన వర్ణన-రాజ్య
మును పోషింపబడు నవరసములు జప తపో యోగ వైరాగ్య ప్రసంగములు
ఈ సరోవరమందలి మనోహర జలచరజీవములు (నీటియందు సంచరించు
జీవములు)

చౌ॥ సుకృతీ సాధు నామ గున గానా ।
తే బిచిత్ర జల బిహగ సమానా ॥
సంతసభా చహుఁ దిసి అవఁరాఈ ।
శ్రద్ధా రితు బసంత సమ గాఈ ॥ 244

తా॥ సుకృతము చేసికొన్నవారు లేక పుణ్యాత్ములు, సాధువులు చేసెడి
రామనామసంకీర్తనము-విచిత్ర జలపక్షులు సజ్జనులతోగూడిన సభయే-సరోవర
ప్రాంతమున నాల్గువైపులనున్న మామిడితోటలు శ్రద్ధ-వసంత ఋతువుతో
సమానము

వి॥ భగవదానందము పరిశుద్ధ హృదయులకు సిద్ధించునని స్మృతి ఆ బ్రహ్మానంద సిద్ధియే సజ్జనులకు జీవనము అందులకే కాబోలు నిర్మలపుణ్యులగు సజ్జనులను శ్రేష్ఠమైన జలపక్షులకు కవి పోల్చియున్నాడు !

జలపక్షులు నీటియందు మనోజ్ఞముగ విహరించును అటులే పుణ్యాత్ములు, సాధువులు శ్రీరామనామసంకీర్తనముతో విరాజిల్లెదరు సరోవర ప్రాంతమున మామిడితోటలు ఫలభరితమై యొప్పారు చుండును ఆ ఫలములు గోరువారికి కివి అందుబాటులో నుండును మామిడితోటలవలె సజ్జను లొకచో సమూహవేశమై, ఫలమునుయువారికి సజ్జనసాంగత్య ఫలము నొసంగుచుండురని భావము

వసంత ఋతువున వృక్షములు చిగురించి పళ్ళతోను, ఫలములతోను, పుష్పవికాసముతోను మనోహరముగ నుండును వసంతఋతువు రాగానే వృక్షములు చిగురించి, పుష్పించి ఫలించి ఫలము నొసగు చుండును సజ్జనులకు శ్రద్ధాసక్తులు కలిగినచో తన్మయత్వము నొందుచు తుదకు జన్మసాఫల్యము నొందెదరు

చౌ॥ భగతి నిరూపన బిబిద బిధానా ।
ఛమా దయా దమ లతా బితానా ॥
సమ జమ నియమ ఫూల ఫల గ్యానా ।
హరి పద రతి రస బేద బఖానా ॥ 245

తా॥ నానావిధములైన భక్తినిరూపణము మరియు క్షమ దయ, దమము (ఇంద్రియనిగ్రహము) లతలతో పాదిరి మంటపము మనోనిగ్రహము యమము, నియమము ఇత్యాదులు-రామచరితమానసమను సరోవరప్రాంతమున వికసించిన పుష్పములు జ్ఞానమే - ఫలములు శ్రీహరి పాదపద్మములయందలి ప్రేమయే - జ్ఞానరూపమైన ఫలముల రసము ఇట్లు వేదములు చెప్పుచున్నవి

వి॥ యమము - అనగా అహింస, సత్యము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము నియమము - అనగా శౌచము, సంతోషము, తపము, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము పుష్పములు పరిమళములను వెదజల్లి యెల్లర నానందపఱచు రీతి ఆధ్యాత్మిక సాధనలు నిష్కల్మష మగుభక్తిని పెంపొందించి మనశ్శాంతి నొసగును భగవత్సేవకంటె ఇతరము నపేక్షింపనందువలన భక్తి స్థిరమై శాశ్వతసుఖమును సజ్జను లకు కలుగజేయును

దో॥ ఔరఉ కథా అనేక ప్రసంగా ।
తేఇ సుక పిక బహు బరన బిహంగా ॥ 246

తా॥ ఈ రామచరితమానసము ం దనేకకథలు వర్ణింపబడియున్నవి అవియే చిలుకలు, కోయిలలు ఇంకను వివిధములైన అత్యంతసుందరపక్షిసము దాయములు

దో॥ పులక బాటికా బాగ బన సుఖ సుబిహంగ బిహారు ।
మాలీ సుమన సనేహ జల సించత లోచన చారూ ॥ 247

తా॥ కథలలోని సన్నివేశములను పరికించినపుడు గగుర్పాటు గలుగును అవియే ఉద్యానవనములు, పూలతోటలు ఆ కథలను వినునప్పుడు గలిగెడు సుఖ సంతోషములే సుందరమైన పక్షులవిహారమువంటివి నిర్మలమైన మనస్సు - తోటమాలి ఆ మనస్సనెడి తోటమాలి సుందరనేత్రములద్వారా ప్రేమరూపమైన జలము తోటకు పెట్టును

వి॥ భగవద్భావనలో గొప్పసుఖము గలదు ఇందు ఆనంద బాష్పములును, రోమాంచముగూడ సహజమై యుండును శాశ్వత పదవిని గోరువారు ఈ భావన నాశ్రయింతురు ఇట్టి భావనను శరణు వేడుమని శ్రీతులసీదాసస్వామి మన కుపదేశించు చున్నారు

శ్రీవారు నిర్మలమైన మనస్సు - తోటమాలి యని చెప్పినారు తోటలోని మొక్కల సంరక్షణతోట మాలిది తోటమాలి సకాలమునకు

నీరుపెట్టి త్రవ్వకము మొదలైన శ్రమ కోర్చినచో మొక్కలు వృద్ధిలోనికివచ్చి తగినఫలము నిచ్చును మొక్కలసంరక్షణ తోటమాలిచేతిలో నున్నటులు మానవులు ఆధ్యాత్మికముగ పురోగమింపవలయు నన్న మనస్సే ప్రధానము మనస్సనగా నిర్మలమైన మనస్సు నిర్మల మనస్సుతో జేసిన భగవత్సేవ తోటమాలిపెంచిద వృక్షములు ఫలము నిచ్చినట్లు మోక్షము నొసగును వనాభివృద్ధి తోటమాలిదైనట్లు భగవత్కథా శ్రవణము నిర్మలమనస్సుపై నాధారపడియుండును నిర్మలమైన మనస్సులేక యెన్ని అనుష్ఠానములు (జప, తపములు) చేసినను తుదకవి నిష్ఫలములగును, కనుక నిర్మలమనస్సే భగవంతుని చేరుటకు సాధనము

శ్రీవారు గొప్పసత్యములను చిన్నయుపమానముల ద్వారా వ్యక్తపఱచిరి

చౌ॥ జే గావహిఁ యహ చరిత సఁభారే ।
తేఇ ఏహి తాల చతుర రఖవారే ॥
సదా సునహిఁ సాదర నర నారీ ।
తేఇ సురబర మానస అధికారీ ॥ 248

తా॥ ఎవరు ఈ రామచరితమానసమును హృదయరంజకముగ గానము జేయుదురో వారు పైని వివరించిన సరోవరము నతిచాతుర్యముతో కదుపులో నుంచుకొన్నవా రగుదురు స్త్రీపురుషులెవరు దీని నత్యంతభక్తితో వినెదరో వారలీ సరోవరమున కధికారులైన యుత్తమదేవతలు

చౌ॥ అతి ఖల జే బిషఈ బగ కాగా ।
ఏహి సర నికట న జాహిఁ అభాగా ॥
సంబుక భేక సేవార సమానా ।
ఇహాఁ న బిషయ కథా రస నానా ॥ 249

తా॥ కొంగలు, కాకులవంటి దుష్టులీ సరోవరము చెంతకు రానేరారు ఈ మానససరోవరములో నత్తగుల్లలు, కప్పలు, పాచి-ఇత్యాదులులేవు ఈ రామచరితమానసమను సరోవరములో నత్తగుల్లలు, కప్పలు, పాచితో సమానమైన విషయాసక్తులను గూర్చిన కథలు లేవు

వి॥ ఇందు దుష్టులు కాకులతోడను, కొంగలతోడను పోల్చబడినారు కాకులు కొంగలు నీచజాతికి చెందినపక్షులు అవి యే బురదగుంటలోనైన ఉండును కాని రాజహంసలు విహరించు సరోవరముచెంతకు రానేరావు కొంగలు, కాకులవంటి దుష్టస్వభావముగలిగినమానవులు విషయాసక్తులలో నిమగ్నులైనవారలు వారలీ పవిత్రమైన రామచరితమానసమును జదువరు వారికి దీనియందాసక్తి గలుగదు

నత్తగుల్లలను, కప్పలను, పాచిని విషయాసక్తులకు బోల్చినాడు కవి కేవలము జ్ఞానప్రధానమైన కథలేగాని విషయాసక్తులతోగూడిన కథ లిందులేవని భావము

చౌ॥ తేహి కారన ఆవత హియఁ హారే ।
కామీ కాక బలాక బిచారే ॥
ఆవత ఏహిఁ సర అతి కఠినాఈ ।
రామ కృపా బిను ఆఇ న జాఈ ॥ 250

తా॥ ఈ కారణమువలననే దిక్కులేనికాకులు కొంగలరూపమైన విషయాసక్తులతోకూడిన మానవు లిచ్చటికి వచ్చినతోడనే జీవితమున ఓటమి బొందినవారగుదురు ఈ మానససరోవరమువరకు రావలయునన్న అడ్డంకులు పెక్కుగలవు శ్రీరాముని కృపలేనిదే యిచ్చటకు రాజాలరు

వి॥ విషయాసక్తులతోకూడిన (కామ, క్రోధ, లోభ, మోహములకు దాసులైన వారలు) వారలకు జ్ఞానమార్గము రుచింపదనియు ఈ మానససరోవరమునకు రావలయునన్న కఠినమైన పరీక్షలకు

లోనగుదురని శ్రీవారు చెప్పుచున్నారు శ్రీరాముని కృపలేనిదే, యడ్డంకులు తొలగిపోవనియు నిర్వచించుచున్నారు

చౌ॥ కరిన కుసంగ కుపంథ కరాలా ।
తిన్హ కే బచన బాఘ హరి బ్యాలా ॥
గృహ కారజ నానా జంజాలా ।
తే అతి దుర్గమ సైల బిసాలా ॥ 251

తా॥ ఘోరమైన దుస్సాంగత్యమే భయంకరమైన చెడ్డత్రోవ దుర్జనుల పలుకులు—పెద్దపులి, సింహము, సర్పముపంటివి గృహమునకు సంబంధించిన నానావిధములైన కార్యములు జంజాటములే యత్యంతదుర్గమమైన పెద్ద పెద్ద పర్వతములు

వి॥ ఒకరిని తిట్టుట, కొట్టుట మొదలైన అపచారములుచేయు వారిని దుర్మార్గు లందురు చెడుత్రోవయందు బోయిన క్రూరమృగ ముల బారినుండి తప్పించుకొనలేముకదా! అందులకే చెడుత్రోవ దుస్సాంగత్యమునకు బోల్చబడినది పెద్దపులి, సింహములచేజిక్కి నచో జంపక విడుచునా? పాము కాటువేయక మానునా? అటులనే దుర్మార్గుల సహవాసము జేసినచో వారాడు పరుషవచనములకుగురి కావలసివచ్చును గృహమునకు సంబంధించిన నానావిధములైన కార్యములు జంజాటములే! అత్యంతదుర్గమమైన పెద్దపెద్ద పర్వత ములవలె గృహకార్యములుగూడ చాల క్లిష్టమైనవి

చౌ॥ బన బహు బిషమ మోహ మద మానా ।
నదీం కుతర్క భయంకర నానా ॥ 252

తా॥ మోహము మద మాత్సర్యములే యెగుడుదిగుడులతో గూడుకొన్న అరణ్యము నానావిధములైన కుతర్కములే భయంకరమైన నదులు

వి॥ అరణ్యమునందు ఎగుడుదిగుళ్ళతోగూడిన భూభాగముం డును అందు భయంకరమైన నదులును గలవు అరణ్యము వసించు

టకు యోగ్యమైనది గాదు అటులే మోహ, మద మాత్సర్యముల నాశ్రయించిన వారి జీవితములుగూడ ఎగుడుదిగుళ్ళతో గూడినవై, పాపమునకు తావై దురాశతోగూడినవై దుర్భరముగ నుండును

దో॥ జే శ్రద్ధా సంబల రహిత నహిఁ సంతన్హ కర సాథ ।
తిన్హ కహుఁ మానస అగమ అతి జిన్హహి న ప్రియ
రఘునాథ ॥ 253

తా॥ బహుజన్మ సుకృతఫలము నొందని సజ్జనసాంగత్యము జేయనివారు శ్రద్ధాభక్తులు లేనివారలు శ్రీరామచంద్రునకు ప్రీతిపాత్రులుగారు అటువంటి వారలకీమానస మత్యంతదుర్లభమైనది

వి॥ 'తిన్హ కహు మానస అగము' అని యీ దోహాయందు కవి పేర్కొన్నాడు అనగా శ్రద్ధ, సజ్జనసాంగత్యము, భగవత్ప్రేమ లేక ఎవ్వరును ఈ మానసమును పొందలేరు

చౌ॥ జౌ కరి కష్ట జాఇ పుని కోఈ ।
జాతహిఁ నీద జుడాఈ హోఈ ॥
జడతా జాడ బిషమ ఉర లాగా ।
గఏహుఁ న మజ్జన పావ అభాగా ॥ 254

తా॥ ఒకవేళ ఎవడైనను అతికష్టముతో రామచరితమానససరోవరమున కేగ నెంచుకొనుచుండును అప్పుడు వానికి నిద్రారూపమైన చలిజ్వరము వచ్చును హృదయములో మూర్ఖతారూపమైన అప్రియమైన చలిమంచు వ్యాపించును ఆ భాగ్యహీను డందు స్నానమాచరింపజాలడు

వి॥ జ్ఞానమార్గము ననుసరించుట కష్టము జ్ఞానమార్గమునం దనేకమైన ఆటంకములు కలుగుచుండును అన్నింటిని ఓర్చుకొని భగవంతుని జేరుట సామాన్యమానవులకు సాధ్యము కాదు ప్రయత్నించినను పతనము తప్పదు

చౌ॥ కరి న జాఇ సర మజ్జన పానా ।
ఫిరి ఆవఇ సమేత అభిమానా ॥
జౌఁ బహోరి కోఉ పూఛన ఆవా ।
సర నిందా కరి తాహి బుఝావా ॥ 255

తా॥ స్నానము జేయకపోవడమేగాక వాడు నీటినైనను సేవించలేడు అహంకారియై వెనుకకు మరలివచ్చును ఎవరైనను సరోవర వృత్తాంతము నడిగినచో, తన నిర్భాగ్యస్థితిని గూర్చి చెప్పక సరోవరమును నింద జేయుచు వారికి తెలియజెప్పును

(తన ప్రయత్నము సఫలము కాకపోయినందున పగవక యితరులకు గూడ దురోధజేయునని భావము)

చౌ॥ సకల విఘ్న బ్యాపహిఁ నహిఁ తేహీ ।
రామ సుకృపాఁ బిలోకహిఁ జేహీ ॥
సోఇ సాదర సర మజ్జను కరఈ ।
మహా ఘోర త్రయతాప న జరఈ ॥ 256

తా॥ ఎవనిని సర్వభూతహితరతుడైన శ్రీరామచంద్రుడు కృపాదృష్టితో జూచునో వానికి కష్టములు, విఘ్నములు కలుగనేరవు వాడు పరమాదరపూర్వకముగ ప్రేమ, భక్తి తాత్పర్యములతో ఈ సరోవరమునందు స్నాన మాచరించును

వానికి అధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతికములనెడు భయంకరత్రితాపము లంటవు

చౌ॥ తే నర యహ సర తజహిఁ న కాఊ ।
జిన్హ కేఁ రామ చరన భల భాఊ ॥
జో నహాఇ చహ ఏహిఁ సర భాఈ ।
సో సతసంగ కరఉ మన లాఈ ॥ 257

తా॥ శ్రీరామపాదసేవాతత్పరులిట్టి సరోవరము నే స్థితిలోగూడ విడువరు కాన ఓ సోదరులారా! యీ సరోవరమున స్నానమాచరింప నిచ్ఛగించినచో [illegible]

వి॥ ఆవుపాలు ఆవుయొక్క నాడులయందంతటను ఉండినను పొదుగునుండియే అవి పిండుకొనవలెను నీటిగొట్టములు భూమియందంతటను అమర్చియున్నను కుళాయినుండియే నీరు పట్టుకొందుము కృపామయుడు భగవంతుని కృప సాధారణముగ అంతటను నిండియున్నను విశేషముగ వాని పాదపద్మముల నుండియే మన కది లభింపవలెను కరుణాసముద్రుడైన భగవంతుని పాదములను శరణు జొచ్చుట యెంతటి భాగ్యము! అట్లు శరణు జొచ్చినవారినే భగవత్పాద సేవాతత్పరు లందురు వారు శ్రీరామచరితమానసమనెడి సరోవరము నెట్టి పరిస్థితులలోగూడ విడువరు

కాన, అటువంటి భగవదనుగ్రహపాత్రులును, నిర్మలహృదయులునైన సజ్జనులతో సాంగత్య మొనర్పుడని శ్రీతులసీదాసు మనల నుద్బోధించు చున్నాడు

చౌ॥ అస మానస మానస చఖ చాహీ ।
భఇ కబి బుద్ధి బిమల అవగాహీ ॥
భయఉ హృదయఁ ఆనంద ఉఛాహూ ।
ఉమగేఉ ప్రేమ ప్రమోద ప్రబాహూ ॥ 258

తా॥ ఇటువంటి మానససరోవరమును హృదయమనెడి దివ్యచక్షువులతో జూచి, దాని లోతుపాతులను దెలిసికొన్న కవియొక్క బుద్ధి నిర్మలమైనది హృదయ మానందోత్సాహములతో నిండి ప్రేమానందముల ప్రవాహమున ఉబికివచ్చినది

చౌ॥ చలీ సుభగ కబితా సరితా సో ।
రామ బిమల జస జల భరితా సో ॥
సరజూ నామ సుమంగల మూలా ।
లోక బేద మత మంజుల కూలా ॥ 259

తా॥ దానినుండి సుందర కవితారూపమై నదిగా పారినది ఆ నది శ్రీరాముని నిర్మలమైన యశోరూపమైన జలముతో నిండియున్నది ఈ కవితారూపిణి

యైన నదియొక్క నామధేయము సరయువు ఇది సంపూర్ణానందికల్యాణములకు మూలమువంటిది లోక వేద సిద్ధాంతము లన్నె రెండ గట్లు దీని కున్నవి

చౌ॥ నదీ పునీత సుమానస నందిని ।
కలిమల తృన తరు మూల నికందిని ॥ 260

తా॥ ఈ సుందరమానససరోవరపు కన్య సరయూనది ఇది చాల పవిత్ర మైనది కలియుగమున ప్రజ్వలించు స్వల్పమైన, భయంకరమైన పాపరూపమైన గడ్డిపోచలు మరియు వృక్షసముదాయములను వేళ్ళతోసహా పెకలించుటకు సాధన మైనది

వి॥ స్వల్పమైనపాపములను గడ్డిపోచలుకును, ఘోరపాపములను వృక్షములకు బోల్చినాడు కవి రాజహంసలచేత సేవింపబడునది యును, పరిమళమును వెదచల్లునదియును, స్థిరమైనదియునైన మానస సరోవరపు కన్య సరయూనది యైనందువలన ఈ పాపరూపమైన గడ్డిపోచలను వృక్షములను వేళ్ళతోసహా పెకలించుటకు సామర్థ్యము గల దాయెను

దో॥ శ్రోతా త్రిబిధ సమాజ పుర గ్రామ నగర దుహుఁ కూల ।
సంతసభా అనుపమ అవధ సకల సుమంగల మూల ॥ 261

తా॥ త్రివిధములైన శ్రోతలసమాజములే యీ నదియొడ్డున ఇరువైపుల నుండు చిన్నగ్రామములు, పురములు, నగరములు సజ్జనులతోగూడిన సభయే సౌందర్యమునకు, మంగళమునకు హేతువైన సాటిలేని అయోధ్యానగరము

వి॥ అయోధ్యాపట్టణమందు ప్రజలెల్లరును మనస్సంతోషము గలిగి ధర్మస్వభావులై, యధికముగ శాస్త్రాభ్యాసముచేసి, వర్ణాశ్రమ ధర్మమునకు దగినట్లు తమకు దొరకుధనంబుతో దృప్తి బొందుచు సత్యవాదులైయుండిరి పురుషులును, స్త్రీలందరును ధర్మగుణము నింద్రియనిగ్రహమును గలవారై పుట్టిననాటనుండి మంచిస్వభావ మును మంచియాచారమును గలిగి మహాత్ములుంబోలె బరిశుద్ధులుగా

నుండిరని వాల్మీకిరామాయణమునందు చెప్పబడినది మంచిమనస్సు గలవారిని సజ్జనులందురు పరిశుద్ధహృదయులైన సజ్జనసమాగమ మెంత సుఖకరము! కనుకనే సజ్జనసభను, ధర్మాత్ములకు నిలయమైన అయోధ్యకు బోల్చినాడ కవి

చౌ॥ రామభగతి సురసరితహి జాఈ।
మిలీ సుకీరతి సరజు సుహాఈ॥
సానుజ రామ సమర జసు పావన।
మిలేఉ మహానదు సోన సుహావన॥ 262

తా॥ సుందరకీర్తిరూపమైన మనోహరమైన సరయూనది రామభక్తిరూపమైన గంగానదిలో గలిసెను లక్ష్మణసహితముగా శ్రీరామచంద్రుని యుద్ధకౌశలమును పవిత్రముజేయు యశోరూపమైన శోణానది దానిలోవచ్చి కలిసెను

చౌ॥ జుగ బిచ భగతి దేవధుని ధారా।
సోహతి సహిత సుబిరతి బిచారా॥
త్రిబిధ తాప త్రాసక తిముహానీ।
రామ సరూప సింధు సముహానీ॥ 263

తా॥ రెండింటికినిమధ్య భక్తిరూపమైన గంగాధార జ్ఞానము మరియు వైరాగ్యముతో శోభ నిచ్చుచుండును ఇటువంటి త్రితాపములను భయముగొల్పు త్రిమార్గములచే వచ్చిన యీ నది రామస్వరూపమైన సముద్రమును వైపునకు బోవు చున్నది

చౌ॥ మానస మూల మిలీ సురసరిహీ।
సునత సుజన మన పావన కరిహీ॥
బిచ బిచ కథా బిచిత్ర బిభాగ।
జను సరి తీర తీర బన బాగా॥ 264

తా॥ ఈ కీర్తిరూపమైన సరయూనదికి మూలమైనది శ్రీరామచరితమానసము, రామభక్తిరూపమైన గంగానదిలో గలిసినది కనుకనే ఇది శ్రవణముచేయు

సజ్జనులనన్నును పవిత్రము చేయును దీనిలో నడుమనడుమ వివిధప్రకారము లైన విచిత్రకథ లున్నవి అవియే నదీతటమున సమీపమునందు వనములు, తోటలు

చౌ॥ ఉమా మహేస బిబాహ బరాతీ ।
తే జలచర అగనిత బహుభాఁతీ ॥
రఘుబర జనమ అనంద బధాఈ ।
భవఁర తరంగ మనోహరతాఈ ॥ 265

తా॥ ఇచ్చట వర్ణింపబడిన శివపార్వతుల వివాహమహోత్సవమునకు పెరపక్షమున తరలివచ్చువారు- ఈ నదిలోనున్న బహుప్రకారములైన అసంఖ్యాకములైన జలచరజీవములు

శ్రీరఘునాథుని జన్మదినమహోత్సవములే యీనదిలోని సుడిగుండములు మరియు తరంగముల మనోహారత్వము

దో॥ బాలచరిత చహు బంధు కే బనజ బిపుల బహురంగ ॥
నృప రానీ పరిజన సుకృత మధుకర బారిబిహంగ ॥ 266

తా॥ శ్రీరామ, లక్ష్మణ, భరత శత్రుఘ్నుల బాలచరిత్రమే ఇందు వికసించిన వివిధవర్ణముల కమలములు శ్రీదశరథమహారాజును, కౌసల్యాకైకేయీ సుమిత్రాదులును, వారి కుటుంబవాసులును ఒనర్చిన సుకృతములే-భ్రమరములు, జలపక్షులు

చౌ॥ సీయ స్వయంబర కథా సుహాఈ ।
సరిత సుహావని సో ఛబి ఛాఈ ॥
నదీ నావ పటు ప్రస్న అనేకా ।
కేవట కుసల ఉతర సబిబేకా ॥ 267

తా॥ సీతాదేవి స్వయంవరము-ఇత్యాది సుందరగాథ లీనదిని కాంతివంతముగ శోభిల్లగ [illegible] చేయునవి అనేకసుందరమైన విచారములు

మైన ప్రశ్నలే యీ నదిలోని నౌకలు అప్రశ్నలకు తగిన వివేకయుక్తమైన ప్రత్యుత్తరములే చతురులైన నావికులు

చౌ॥ సుని అనుకథన పరస్పర హోఈ ।
పథిక సమాజ సోహ సరి సోఈ ॥
ఘోర ధార భృగునాథ రిసానీ ।
ఘాట సుబద్ధ రాము బర బానీ ॥ 268

తా॥ ఈ కథలను విన్నతరువాత పరస్పరము జరిగెడి చర్చ—నదీసమీప మునబోవు బాటసారులు పరశురాముని క్రోధము—ఈ నదియొక్క తీవ్రధార

శ్రీరామచంద్రుని శ్రేష్ఠవాణి—సుందరమైన రేవు

చౌ॥ సానుజ రామ బిబాహ ఉఛా హూ ।
సో సుభ ఉమగ సుఖద సబ కాహూ ॥
కహత సునత హరషహి పులకాహీం ।
తే సుకృతీ మన ముదిత నహాహీం ॥ 269

తా॥ సహోదరసహితముగా శ్రీరామచంద్రుని వివాహమహోత్సవము— ఈ కథానదికి కల్యాణకరములైన వెల్లువలు అవియే యెల్లరకు సుఖసంపదల నొసగునవి దీనిని చెప్పుటవలన వినుటవలన ఎవరు హర్షపులకితు లయ్యెదరో వారే పుణ్యాత్ములు। నిర్మలచిత్తముతో ఈ నదిలో స్నానమాడునది ఆ పుణ్య పురుషులే।

చౌ॥ రామ తిలక హిత మంగల సాజా ।
పరబ జోగ జను జురే సమాజా ॥
కాఈ కుమతి కేకఈ కేరీ ।
పరీ జాసు ఫల బిపతి ఘనేరీ ॥ 270

తా॥ శ్రీరామచంద్రుని పట్టాభిషిక్తునిజేయుటకు సేకరింపబడిన మంగళ ద్రవ్యములే—పర్వదినములయందు నీ నదివద్ద గుమిగూడిన యాత్రికులు

కైకేయికిగలిగిన దుర్బుద్ధియే-ఈ నదిలోనున్న నాచు లేక పాచి దాని ఫలస్వరూపమే గొప్పవిపత్తులను దెచ్చిపెట్టినది

దో॥ సమన అమిత ఉతపాత సబ భరతచరిత జపజాగ ।
కలి అఘ ఖల అవగున కథన తే జలమల బగ కాగ ॥ 271

తా॥ అగణితోత్పాతములను శాంతిజేయుటకు భరతునిచరిత్రము-నది యొడ్డునజేసెడి జపయజ్ఞములు కలియుగములోని పాపములు, దుష్టులదుర్గుణము లేవి వర్ణింపబడియున్నవో అవి జలమునందు బురదలో సంకటమున జిక్కుకొని యున్న కొంగలు కాకులు

చౌ॥ కీరతి సరిత ఛహూ రితు రూరీ ।
సమయ సుహావని పావని భూరీ ॥
హిమ హిమసైలసుతా సివ బ్యాహూ ।
సిసిర సుఖద ప్రభు జనము ఉఛాహూ ॥ 272

తా॥ ఈ కీర్తిరూపమైననది, అన్నిఋతువులలోను శోభాయమానముగ నుండును ఎల్లవేళల మనోహరముగను నత్యంతపవిత్రముగ నుండును

ఇందులో శివపార్వతుల వివాహము-హేమంత ఋతువు శ్రీరామచంద్రుని జన్మమహోత్సవము-సుఖదాయకమైన శిశిరఋతువు

చౌ॥ బరనబ రామ బిబాహ సమాజూ ।
సో ముద మంగలమయ రితురాజూ ॥
గ్రీషమ దుసహ రామ బనగవనూ ।
పంథకథా ఖర ఆతప పవనూ ॥ 273

తా॥ శ్రీరామచంద్రుని వివాహసమాజముయొక్క వర్ణనమే-ఆనందకరము మంగళమయమైన ఋతురాజమైన వసంతఋతువు శ్రీరామవనగమనము-దుస్సహమైన గ్రీష్మఋతువు మార్గమునందు జరిగిన సంఘటనలు-తీవ్రమైన ఎండయు మరియు వడగాడ్పులు

చౌ॥ బరషా ఘోర నిసాచర రారీ ।
సురకుల సాలి సుమంగలకారీ ॥
రామరాజ సుఖ బినయ బడాఈ ।
బిసద సుఖద సోఇ సరద సుహాఈ ॥ 274

తా॥ రాక్షసులతో నొనర్చిన ఘోరయుద్ధమే-వర్షఋతువు దేవతారూపమైన పళులంపవు కానందదాయకమైనది, మంగళకరమైనది శ్రీరామచంద్రుడయోధ్యనుపాలించుసమయమున లేక రామరాజ్యమున ప్రజల సుఖసంపదలు, వినయవిధేయతలు, గొప్పతన మనునవేవి యున్నవో - అవియే నిర్మలసుఖము నొసగు మనోహరమైన శరదృతువు

చౌ॥ సతీ సిరోమని సియ గునగాధా ।
సోఇ గున అమల అనూపమ పాదా ॥
భరత సుభాఉ సుసీతలతాఈ ।
సదా ఏకరస బరని న జాఈ ॥ 275

తా॥ సతీశిరోమణి, పరమసాధ్వియైన సీతాదేవి సుగుణములను గురించిన గాథలు- ఈ జలముయొక్క నిర్మలత్వము, అనుపమగుణము భరతుని సాధుస్వభావము, సచ్ఛీలము-ఈ నదియొక్క శీతలత్వము సదా యేకరసముగ నుండుటచే అది వర్ణనాతీతము

దో॥ అవలోకని బోలని మిలని ప్రీతి పరసపర హాస ।
భాయప భలి చహు బంధు కీ జల మాధురీ సుబాస ॥ 276

తా॥ నల్వురు సహోదరులును పరస్పరము వీక్షించుట, సంభాషించుట కలియుట, ఒకరినొకరు ప్రేమించుట, నవ్వుట-ఇత్యాదిసోదరప్రేమయే జలము యొక్క మాధుర్యము, సురభిళత్వము

చౌ॥ ఆరతి బినయ దీనతామోరీ ।
లఘుతా లలిత సుబారి న థోరీ ॥
అదభుత సలిల సునత గునకారీ ।
ఆస పిఆస మనోమల హారీ ॥ 277

తా॥ నా యార్త భావము, వినయము, దీనత్వము - ఈ సుమధుర, నిర్మల జలము నత్యంతముగా తుచ్ఛ మొనరించుచున్నవి ఈ జల మద్భుతమైనది ఈ కీర్తి రూపమైన జలమునుగూర్చి వినిన చాలును, ఆనందమును శుభమును కలుగ జేయును ఆశారూపమైన దాహమును, మనోమాలిన్యమును దూరీకృత మొనర్చును

చౌ॥ రామ సుప్రేమహి పోషత పానీ ।
హరత సకల కలి కలుష గలానీ ॥
భవ శ్రమ సోషక తోషక తోషా ।
సమన దురిత దుఖ దారిద దోషా ॥ 278

తా॥ ఈ జలము శ్రీరామచంద్రునియందలి సుందర ప్రేమను పెంపొందించును కలియుగములోని సమస్త పాపములను దుఃఖములను హరించును ప్రాపంచికసంబంధమైన జన్మమృత్యురూపమైన శ్రమను లేకుండచేయును దారిద్ర్యాదిదోషములను హరింపజేయును

చౌ॥ కామ కోహ మద మోహ నసావన ।
బిమల బిబేక బిరాగ బఢావన ॥
సాదర మజ్జన పాన కిఏ తేం ।
మిటహిం పాప పరితాప హిఏ తేం ॥ 279

తా॥ ఈ జలము కామ, క్రోధ, మద మోహములను నాశన మొనరించును నిర్మలజ్ఞానవైరాగ్యములను పెంపొందించును అత్యాదరముతోను, భక్తితో నిందు స్నానమొనర్చినను, సేవించినను సమస్తపాపములు తాపములు, బంధములు తొలగును శాశ్వతసుఖము ప్రాప్తించును

చౌ॥ జిన్హ ఏహిం బారి న మానస ధోఏ ।
తే కాయర కలికాల బిగోఏ ॥
తృషిత నిరఖి రబి కర భవ బారీ ।
ఫిరిహహిం మృగ జిమి జీవ దుఖారీ ॥ 280

తా॥ ఎవరు రాముయశోరూపమైన జలముతో వారి హృదయమాలిన్యము కడుగుకొనరో వారు భీరుత్వముతోకూడిన యీ కలికాలముద్వారా మోసగింప బడి దురు

ఎప్పుడుగొన్ని జింకపల్ల యెండమావులను గాంచి, భ్రమతో జలముగా భావించి, ఆ నీటినిత్రాగుటకు పరుగిడి నీటిని గాంచలేక దాహముతో నెట్లు దుఃఖము జెందునో అటులనే కలియుగమునందు మోసగింపబడి ప్రాణులు విషయాసక్తుల వెనుక పరుగిడి తుదకు దుఃఖించెదరు

దో॥ మతి అనుహారి సుబారి గున గన గని మన అన్హవాఇ ।
సుమిరి భవానీ సంకరహి కహ కబి కదా సుహాఇ ॥ 281

తా॥ తన బుద్ధ్యనుసారముగ ఈ సుమధురజలముయొక్క గుణములను విచారించి, ఇందు తన మనంబును స్నానమాడించి, భవానీశంకరులను స్మరించి కవీశ్వరుడైన శ్రీతులసీదాసు దివ్యజ్ఞాన ప్రబోధాత్మకమైన రసవత్తరమైన శ్రీరామచరితమానసమును జెప్పుచున్నాడు

దో॥ అబ రఘుపతి పద పంకరుహ హియ ధరి పాఇ ప్రసాద ।
కహఉ జుగల మునిబర్య కర మిలన సుభగ సంబాద ॥ 282

తా॥ నేను (శ్రీతులసీదాసు) శ్రీరఘునాథుని చరణకమలములను నా హృదయపీఠమున నలంకరింపజేసి, ఆ పాదయుగళానుగ్రహమునుబొంది యిరువురు శ్రేష్ఠులైన మునీశ్వరుల కలయికను, వారొనర్చిన సుందరసంవాదమును గూర్చి వివరింతును

# యాజ్ఞవల్క్య భరద్వాజ సంవాదము

## ప్రయాగ మాహాత్మ్యము

చౌ॥ భరద్వాజ ముని బసహి ప్రయాగా ।
తిన్హహి రామబద అతి అనురాగా ॥
తాపస సమ దమ దయా నిదానా ।
పరమారథ పథ పరమ సుజానా ॥ 283

తా॥ భరద్వాజమహాముని ప్రయాగనివాసి అతనికి శ్రీరామచంద్రునిపాద పద్మములపై నత్యంత ప్రేమానురాగములు గలవు అతడు తపస్సంపన్నుడు, నిగ్రహీతచిత్తుడు, జితేంద్రియుడు, దయాసముద్రుడు అంతికుమించి పరమార్థమునందు చతురుడై యుండెను

చౌ॥ మాఘ మకరగతి రబి జబ హోఈ ।
తీరథ పతిహిఁ ఆవ సబ కోఈ ॥
దేవ దనుజ కింనర నర శ్రేనీఁ ।
సాదర మజ్జహిఁ సకల త్రిబేనీఁ ॥ 284

తా॥ మాఘమాసమున సూర్యుడెప్పుడు మకరరాశిని జేరునో అప్పుడు జనులు తీర్థరాజమైన ప్రయాగకు ఏత్తురు

చౌ॥ పూజహిఁ మాధవ పద జలజాతా ।
పరసి అఖయ బటు హరషహిఁ గాతా ॥
భరద్వాజ ఆశ్రమ అతి పావన ।
పరమ రమ్య ముని బర మన భావన ॥ 285

తా॥ శ్రీవేణీమాధవుని పాదపద్మములకు పూజచేసెదరు అక్షయవట స్పర్శచే నారితనువులు పులకితము లగును అటువంటి పుణ్యస్థలమైన ప్రయాగ యందుండు భరద్వాజాశ్రమము పరమ పవిత్రమైనది అత్యంతరమణీయమైనది మునిమనంబులను హరించునది

చౌ॥ తహాఁ హోఇ ముని రిషయ సమాజా ।
జాహిఁ జే మజ్జన తీరథరాజా ॥
మజ్జహిఁ ప్రాత సమేత ఉచాహా ।
కహహిఁ పరసపర హరి గున గాహా ॥ 286

తా॥ మును లెల్లరును తీర్థరాజమైన ప్రయాగయందు స్నాన మాచరించుట కేగెదరు ప్రప్రథమమున భరద్వాజాశ్రమమునం దెల్లరును గలియుదురు ప్రాతఃకాలమున నెల్లరును సుత్సాహముతో స్నాన మాచరించి, యేకాగ్రముగ భగవానుని గూర్చినకథలను పరస్పరము చెప్పుకొందురు

దో॥ బ్రహ్మ నిరూపన ధరమ బిధి బరనహిఁ తత్త్వ బిభాగ ।
కహహిఁ భగతి భగవంత కై సంజుత గ్యాన బిరాగ ॥287

తా॥ వారు బ్రహ్మ నిరూపణము ధర్మవిధానము మరియు తత్త్వవిభాగములను వర్ణనచేసికొనుచుండిరి జ్ఞానవైరాగ్యయుక్తమైన భగవద్భక్తి నిరూపణము గావించుకొనుచుండిరి

చౌ॥ ఏహి ప్రకార భరి మాఘ నహాహీఁ ।
పుని సబ నిజ నిజ ఆశ్రమ జాహీఁ ॥
ప్రతి సంబత అతి హోఇ అనందా ।
మకర మజ్జి గవనహిఁ మునిబృందా ॥ 288

తా॥ ఈ విధముగ మునులెల్లరును మాఘమాసమునందు మాఘస్నానము లాచరించి నిజనివాసములైన ఆశ్రమముల కేగుచుండిరి ప్రతి సంవత్సర మివ్విధముగ జప, తప స్నానాదులచే ఆనందకరముగ నుండును సదా ఆనందముగ భగవద్గోష్ఠి నడచుచునేయున్నది మకర మాసమునందు స్నానమాచరించి మునిబృందములు వెడలిపోవుచుండిరి

చౌ॥ ఏక బార భరి మకర నహాఏ ।
సబ మునీస ఆశ్రమన్హ సిధాఏ ॥
జాగబలిక ముని పరమ బిబేకీ ।
భరద్వాజ రాఖే పద టేకీ ॥ 289

తా॥ ఒకసారి మకరమాసపర్యంతము మునులు స్నానమాచరించి వారి వారి ఆశ్రమముల కేగిరి కాని పరమజ్ఞానియైన భరద్వాజుడు, వేదాంతవిశారదుడైన యాజ్ఞవల్క్యమహాముని చరణకిమలములకు నమస్కరించి అతని నక్కడనే కొంతకాల ముండవలయునని ప్రార్థించెను

చౌ॥ సాదర చరన సరోజ పఖారే ।
అతి పునీత ఆసన బైఠారే ॥
కరి పూజా ముని సుజసు బఖానీ ।
బోలే అతి పునీత మృదు బానీ ॥ 290

తా॥ అత్యంత వినయముతో, పరమభక్తితో మునీశ్వరుని పాదపద్మములను గడిగి పవిత్రాసనముపై నాసీనుని గావించెను పూజించెను అర్చించిన తరువాత భరద్వాజుడు యాజ్ఞవల్క్యుని యశమును కీర్తించెను

అత్యంతమృదుమధురముగ మునీశ్వరుడైన యాజ్ఞవల్క్యమహామునితో భరద్వాజు డిట్లనియె

(ముందు దోహతో నన్వయము)

చౌ॥ నాథ ఏక సంసఉ బడ మోరేం ।
కరగత బేదతత్త్వ సబు తోరేం ॥
కహత సో మోహి లాగత భయలాజా ।
జౌం న కహఉం బడ హోఇ అకాజా ॥ 291

తా॥ ఓ స్వామీ! నామనస్సులో నొకసందేహము ఎన్నిమితముగ పీడించుచున్నది ఆ సందేహమును మీకు వ్యక్తపఱచవలయునన్న నా కెందులకో భయమగుచున్నది

వేదములలోని తత్త్వము లన్నియు మీకు కరతలామలకములుకదా! మీరు వేదములలోని తత్త్వములను బాగుగా నవగాహన జేసికొన్నవారు! నా సందేహ నివృత్తి జేయుటకు కడుసమర్థులు కాని నా సంశయములను మీకెఱింగింపవలయునన్న ఎందుకో నాకు భయమును, లజ్జయును కలుగుచున్నవి నేను మిమ్ము పరీక్షించుట కిట్లడుగుచున్నానని మీ రనుకొందురేమో యను భయమును, ఇంత

ఆయుఃపరిమాణమును పొందియును ఇంకను నాకు జ్ఞానము కలుగలేదని మీరు భావింతురేమో యన్న లజ్జయును ఒకేసారి నన్నావరించినవి ఒకవేళ భయముచే నూరకుంటినేని నా సంశయములు నివారింపబడవు నేను నా జీవితాంతము అజ్ఞానినై యుండవలసివచ్చును

దో॥ సంత కహహి అసి నీతి ప్రభు శ్రుతి పురాన ముని గావ ।
హోఇ న బిమల బిబేక ఉర గురు సన కిఏఁ దురావ ॥ 292

తా॥ కాన గురుమహారాజా ! నా సంశయములను మీకడ వెల్లడింప నుద్యుక్తుడనైతిని సద్గురుసమక్షమున తమ సంశయములను వ్యక్తపరచక పోయినచో నిర్మలజ్ఞానము కలుగనేరదని వేదపురాణము లుద్ఘాటించినవి సజ్జనులు గూడ ఈ నీతినే చెప్పుచున్నారు మునులుగూడ నిట్లు చెప్పుచున్నారు

చౌ॥ అస బిచారి ప్రగటఉఁ నిజ మోహూ ।
హరహు నాథ కరి జన పర ఛోహూ ॥
రామ నామ కర అమిత ప్రభావా ।
సంత పురాన ఉపనిషద గావా ॥ 293

తా॥ అని ఆలోచించిన తరువాత గూడ నా యజ్ఞానమును ప్రకటించుటకు సాహసించుచున్నాను స్వామీ ! దాసుడైన నన్ను కరుణించి కృపజూపి నా యజ్ఞానమును దొలగింపుడు సజ్జనులు, పురాణములు, ఉపనిషత్తులు రామనామము యొక్క యనంతమైన ప్రభావమును చాటినవి

చౌ॥ సంతత జపత సంభు అబినాసీ ।
సివ భగవాన గ్యాన గున రాసీ ॥
ఆకర చారి జీవ జగ అహహీఁ ।
కాసీఁ మరత పరమ పద లహహీఁ ॥ 294

తా॥ మంగళకరుడైన, జ్ఞానవైరాగ్యముల కాటపట్టయిన, అవినాశియైన, సర్వశ్రేష్ఠుడైన, సర్వేశ్వరుడైన శంకరుడు నిరంతరము రామనామమును జపించు

ప్రపంచమునందుం చతుర్విధములైన జీవులకు, పుణ్యక్షేత్రమైన వారణాసియందు మరణించినవారికిని, శంకరుడు మోక్షము నొసగుచున్నాడు

చౌ॥ సోపి రాము మహిమా మునిరాయా ।
సివ ఉపదేసు కరత కరి దాయా ॥
రాము కవన ప్రభు పూఛఉఁ తోహీ ।
కహిఅ బుఝాఇ కృపానిధి మోహీ ॥ 295

ఓ మునీశ్వరా? అది రామనామ మహిమయే! శివుడు దయార్ద్రహృదయుడై కాశియందు మరణించిన జీవులకు రామనామమే ఉపదేశించుచున్నాడు కనుక వారు మోక్షమును బొందుచున్నారు

మునిరాజా! ఆ రాముడెవరు? కృపాసాగరా! ఈ దీనుని కరుణించి సమగ్రముగ నా కెఱింగింపుడు

చౌ॥ ఏక రాము అవదేస కుమారా ।
తిన్హ కర చరిత బిదిత సంసారా ॥
నారి బిరహఁ దుఖు లహేఉ అపారా ।
భయఉ రోషు రన రావను మారా ॥ 296

తా॥ ఒక్క రాము డయోధ్యాధిపతియైన దశరథుని కుమారుడు ఆ శ్రీరామ చరిత్రము ప్రపంచమంతటను ప్రసిద్ధి గాంచినది ఆ రాముడు పత్నీ విరహముచే నపారమైన దుఃఖము ననుభవించెను క్రోధముతో యుద్ధమున రావణుని హతమార్చెను

దో॥ ప్రభు సోఇ రాము కి అపర కోఉ జాహి జపత త్రిపురారి ।
సత్యధామ సర్బగ్య తుమ్హ కహహు బిబేకు బిచారి ॥ 297

తా॥ ఓ ప్రభూ! ఆ రాముడేనా లేక వేరొకడెవడైనను గలడా? ఆ రామ నామమునేనా నిరంతరము శివుడు జపించునది? మీరు సత్యసంధులు, సర్వము నెఱింగినవారలు అంతయు నాలోచించి, జ్ఞానవివేకయుక్తమైన విషయములను నాకు జెప్పుడు

చౌ॥ జైసేఁ మిటై మోర భ్రమ భారీ ।
కహహు సో కథా నాథ బిస్తారీ ॥
జాగబలిక బోలే ముసుకాఈ ।
తుమ్హహి బిదిత రఘుపతి ప్రభుతాఈ ॥ 298

తా॥ స్వామీ! ఏవిధముగ నా కావరించిన జ్ఞానము దూరీకృత మగునో ఆ విషయములను, ఆ గాథలనుగూర్చి సవిస్తరముగ నా కెఱింగింపుడు

అని భరద్వాజుడు చెప్పగా విని యాజ్ఞవల్క్యమహాముని దరహాసవదనముతో నిట్లనియె —

శ్రీరాము చరిత్రము నీకు దెలిసియుండ నోపును
(ముందు దోహాతో నన్వయము)

చౌ॥ రామభగత తుమ్హ మన క్రమ బానీ ।
చతురాఈ తుమ్హారి మైఁ జానీ ॥
చాహహు సునై రామ గున గూఢా ।
కీన్హిహు ప్రస్న మనహు అతి మూఢా ॥ 299

తా॥ నీవు మనోవాక్కాయ కర్మలతో శ్రీరామ భక్తుడవు నీ చమత్కారము నేను దెలిసికొంటిని నీవు శ్రీరాము రహస్యమయ గుణములను వినుట కిచ్ఛగించినవాడవై మూఢునివోలె ప్రవర్తించుచున్నావు

చౌ॥ తాత సునహు సాదర మను లాఈ ।
కహఉ రాము కై కథా సుహాఈ ॥
మహామోహు మహిషేసు బిసాలా ।
రామకథా కాలికా కరాలా ॥ 300

తా॥ నాయనా! వినుల కింపగు, దివ్యానందమును ప్రసాదించు శ్రీరామ చరితమును నీ కెఱింగించెదను శ్రద్ధాభక్తులతో నాలకింపుము

అజ్ఞానమనునదే మహిషాసురుడు శ్రీరామకథ ఆ మహిషాసురుని కాళికా [illegible]

వి॥ అక్రమము, అన్యాయము ప్రబలినప్పుడు పార్వతీదేవి చాముండేశ్వరి యవతారమునెత్తి మహిషాసురుని హతమార్చెను అటులె అజ్ఞానమన్ను మహిషాసురుని రామకథయను చాముండేశ్వరి రూపుమాపును

తన దివ్యజ్ఞానప్రబోధాత్మకమైన రామచరితమానస పఠనము వలన, శ్రవణమువలన అజ్ఞానమూలవారణమగునని కవి తులసీదాసు సూచించుచున్నాడు

చౌ॥ రామకథా ససి కిరన సమానా ।
సంత చకోర కరహిఁ జేహి పానా ॥
ఏసేఇ సంసయ కీన్హ భవానీ ।
మహాదేవ తబ కహా బఖానీ ॥ 301

తా॥ శ్రీరామకథ చంద్రకిరణములతో సమానముగ చల్లదనము నిచ్చును దానిని సజ్జనచకోరము నిరంతరము పానము చేయుచుండును సీకుగలిగిన సంశయమే పూర్వము జగజ్జననియైన పార్వతీదేవికి గలిగెను మహాదేవు డాసంశయమును దీర్చెను

వి॥ ఇట కవి రామకథను-చంద్రకిరణములకును, సజ్జనులను-చకోరములకును బోల్చినాడు చకోరములు నిరంతరము వెన్నెల నాస్వాదించుచుండును అవ్విధముగనే ఎగవదానందము బొందుచు పరిశుద్ధహృదయులైన సజ్జనబృందము శ్రీరామకథామృతమును నిరంతరము పానము చేయుచుందురు ఈ రామచరిత మానసము సర్వులకును మనశ్శాంతి నొసగును గాన 'రామకథా ససి కిరన సమానా' యని చెప్పుచున్నాడు కవి శ్రీరామకథ సజ్జనులకు సుఖ శాంతుల, నొసగి చంద్రకిరణములవలె చల్లదనము నిచ్చునని నుడువుచు శ్రీరామ కథా వైశిష్ట్యము నిచ్చట స్పష్టముగ పొందుపరచినాడు శ్రీతులసీదాసు

దో॥ కహఉఁ సో మతి అనుహారి అబ ఉమా సంభు సంబాద ।
భయఉ స మయ జేహి హేతు జేహి సును ముని మిటిహి
బిషాద ॥ 302

తా॥ ఇప్పుడు నేను నా బుద్ధ్యనుసారము పార్వతీపరమేశ్వరుల సంవాదమును జెప్పుచున్నాడను ఏ సమయము ఏ కారణమువలన పార్వతికి సంశయము గలిగినదొ అను విషయములనుగూర్చి సవిస్తరముగ నీ కెఱింగించెదను ఓ మునివరా! నీవు శ్రద్ధాభక్తులతో నాలకింపుము నీకుగలిగిన సంశయవిషాదములు దూరమగును

వి॥ జగత్తునకు మాతాపితలైనవారును, ముల్లోకములకు అత్యంత క్షేమకారణముగా నుండువారును, భక్తులైనవారికి ఫలములను గోచరింపజేయువారును, భక్తుల మనోమందిరమున మరల మరల ప్రకటమగుచుండువారును, ఒకరికొకరు తప ఫలముగ నేర్పడిన వారైన పార్వతీపరమేశ్వరుల దివ్యసంవాదమును కవి యిచ్చట పొందుపంచెను

ఈ రామకథ కేవలము సంశయమును దీర్చునదే కాదు జనన మరణ రూపమైన సంసారచక్రమున పరిభ్రమించుటచే కలిగిన తాపమును చల్లార్చునన్న మరొకభావముకూడ ఇచ్చట స్ఫురించుచున్నది

చౌ॥ ఏక బార త్రేతా జుగ మాహీఁ ।
సంభు గయే కుంభజ రిషి పాహీఁ ॥
సంగ సతీ జగ జనని భవానీ ।
పూజే రిషి అఖిలేస్వర జానీ ॥

తా॥ త్రేతాయుగమున నొకసారి శివు డగస్త్యమునీశ్వరునికడ కేగెను ఈశ్వరుని జగజ్జననియైన సతీదేవి వెంబడించెను ఈ జగత్తునకు మాతాపితలైన భవానీశంకరులను మునీశ్వరు డత్యంతభక్తితో పూజించెను

చౌ॥ రామకథా మునిబర్జ బఖానీ ।
సునీ మహేస పరమ సుఖు మానీ ॥
రిషి పూఁఛీ హరిభగతి సుహాఈ ।
కహీ సంభు అధికారీ పాఈ ॥ 304

తా॥ పరమభక్తితో పూజించినతరువాత అగస్త్యుడు రామకథను పరమేశ్వరునకు సవిస్తరముగ జెప్పెను శ్రవణానందకరమైన రామకథ పరమసుఖదాయకమని యెఱింగినవాడై, శంకరుడు దాని నత్యంతశ్రద్ధతో నాలకించెను

అంత అగస్త్యమునీశ్వరుడు హరికథామృతమును గ్రోల నిచ్చగించినవాడై శ్రీహరిభక్తిని గూర్చి సమగ్రముగ నెఱింగింపవలసినదిగ శంకరుని ప్రార్థించెను అగస్త్యుడు భగవదనుగ్రహపాత్రుడనియు, హరిభక్తినాలకించుటకర్హుడనియు భావించి శివుడు పరమరహస్యయుక్తమైన శ్రీహరిభక్తిని గూర్చి ఆ మునీశ్వరునకు జెప్పెను

చౌ॥ కహత సునత రఘుపతి గున గాథా ।
కఛు దిన తహాఁ రహే గిరినాథా ॥
ముని సన బిదా మాగి త్రిపురారీ ।
చలే భవన సంగ దచ్ఛకుమారీ ॥ 305

తా॥ శ్రీరఘునాథుని సుగుణసంపదనుగూర్చిన కథలను జెప్పుచు, వినుచు గిరినాథుడైన శంకరుడు కొన్నిదినములవఱ కచ్చటనేయుండెను కొంతకాలము మునీశ్వరునితో గడపిన తరువాత దక్షకుమారియైన సతితోకూడినవాడై శంకరుడు నిజనివాసమైన కైలాసమునకు పయన మాయెను

చౌ॥ తేహి అవసర భంజన మహిభారా ।
హరి రఘుబంస లీన్హ అవతారా ॥
పితా బచన తజి రాజు ఉదాసీ ।
దండక బన బిచరత అబినాసీ ॥ 306

తా॥ ఆ సమయమున భూభారమును తగ్గించుటకును గో, బ్రాహ్మణ, మునిజన హితార్థమై శ్రీహరి రఘువంశమున అవతరించెను అవినాశియైన సాక్షాత్ పరబ్రహ్మస్వరూపుడైన శ్రీరామచంద్రుడు తండ్రి యాజ్ఞానుసారము రాజ్యమును త్యజించి మునివేషధారియై దండకారణ్యములో సంచరింప దొడగెను

దో॥ హృదయఁ బిచారత జాత హర కేహి బిధి దరసను హోఇ ।
గుప్త రూప అవతరేఉ ప్రభు గయేఁ జాన సబు కోఇ ॥ 307

తా॥ సతీదేవితో కైలాసమునకు బోవుతఱి, మార్గమధ్యమున పరమేశ్వరు డీ విధముగ నాలోచింప సాగెను లోకహితార్థము, గో బ్రాహ్మణసంరక్షణార్థము శ్రీమన్నారాయణుడు మానవజన్మ మెత్తెనుగదా। శ్రీరామప్రభువు గుప్తరూపములో నవతరించెను నే నచ్చటి కేగినచో ఎల్లరు నన్ను దెలిసికొందురేమో।

సో॥ సంకర ఉర అతి ఛోభు సతీ న జానహిఁ మరము సోఇ ।
తులసీ దరసన లోభు మన డరు లోచన లాలచీ ॥ 308

చౌ॥ రావన మరన మనుజ కర జాచా ।
ప్రభు బిధి బచను కీన్హ చహ సాచా ॥
జౌఁ నహిఁ జాఉఁ రహఇ పఛితావా ।
కరత బిచారు న బనత బనావా ॥ 309

తా॥ తనకు మృత్యువు మానవునిచేతిలో సంభవించునటులు రావణుడు బ్రహ్మచే వరము బొందియున్నాడు బ్రహ్మవాక్కును సఫలము జేయవలయునని శ్రీరాముడు కోరుచున్నాడు నే నిప్పుడు శ్రీరాముని కడకు బోనైతినేని చాల పశ్చాత్తాపపడును ఏ యుక్తియు నాకు సమంజసముగ దోచుటలేదు

చౌ॥ ఏహి బిధి భఏ సోచబస ఈసా ।
తేహీ సమయ జాఇ దససీసా ॥
లీన్హ నీచ మారీచహి సంగా ।
భయఉ తురత సోఇ కపట కురంగా ॥ 310

తా॥ ఇవ్విధమైన చింతకు లోనయ్యెను మహాదేవుడు ఈ సమయమున నీచుడైన రావణుడు మారీచుని సహాయమును గోరెను మారీచుడు వెంటనే కపట మృగముగా మారెను

ఈ విధముగ నాలోచించు శంకరుని హృదయము కలత నొందెను ఈ మర్మమును సతీదేవి కనుగొనలేకపోయెను తనయందు గలిగిన మార్పును సతీదేవి కనిపెట్టునేమో యన్న భయము శంకరు నిమనంబును పీడించుచుండెను శంకరుడు శ్రీరామదర్శన లాలసు డాయెను శ్రీరాముని దర్శించుకొనుటకై శంకరుడు ఉత్కంఠగలవా డాయెనని శ్రీతులసీదాసు వచించుచున్నాడు

వి॥ సాక్షాత్ శంకరుడే శ్రీరాముని సందర్శింపవలయునని ఆరాటపడుచుండ శ్రీరామమహిమ యెంత యుండునో మనమూహించు కొనవచ్చును ఇందు భక్తులు భగవంతుని దివ్య భవ్యరూపమును ప్రత్యక్షముగా జూచుటకై తహతహలాడుట స్పష్టము చేయబడినది

శ్రీరామదర్శనమునకై శబరి ఉత్కంఠ గలదాయెను గోపికలు శ్రీకృష్ణుని దర్శింప పరితపించిరి జగన్మాతయైనకాళిని సందర్శింప వలయునని శ్రీరామకృష్ణపరమహంస మిక్కిలి ఆరాటపడెను ఎన్నడు చూతునో ఇనకులతిలక, నిన్నెన్నడు చూతునో' అని శ్రీత్యాగరాజు శ్రీరామదర్శనమునకై తహతహలాడెను భగవద్దర్శన విషయకమగు ఆరాటము ఇతరమైన ఆరాటముల నంతమొందించును ఇట్టి ఉత్కంఠ ఇతరమైనఉత్కంఠలను ఎటాపంచలు గావించును ఇట్టి భగవద్దర్శనము భక్తుల కవశ్యముండవలయునని శంకరుడే దానిని స్వయముగా నాచరించి తరణోపాయమును మన కుపదేశించెను

చౌ॥ కరి ఛలు మూఢ హరీ బైదేహీ ।
ప్రభు ప్రభాఉ తస బిదిత న తేహీ ॥
మృగ బధి బంధు సహిత హరి ఆఏ ।
ఆశ్రము దేఖి నయన జల ఛాఏ ॥ 311

తా॥ మూర్ఖుడైన రావణుడు మోసముతో సీతాదేవి నపహరించెను శ్రీరాము ప్రభావమును, పరాక్రమమును గూర్చి యేమియు తెలియదు గనుకనే రావణు డట్లొనరించెను

మాయలేడిని వెంటాడి తుదకు దానిని హతమార్చి, లక్ష్మణసహితముగా శ్రీహరి (రాముడు) తనపర్ణశాల కేతెంచెను పర్ణశాలయందు సీతనుగానక దుఃఖితుడాయెను

చౌ॥ బిరహ బికల నర ఇవ రఘురాఈ ।
ఖోజత బిపిన ఫిరత దోఉ భాఈ ॥
కబహుఁ జోగ బియోగ న జాకేఁ ।
దేఖా ప్రగట బిరహ దుఖు తాకేఁ ॥ 312

తా॥ శ్రీరఘునాథుడు సామాన్యమానవునివలె విరహముతో వ్యాకులత నొందెను అన్నదమ్ము లిరువురును సత్యాన్వేషణతత్పరులై ముందుకు బోవు చుండిరి శ్రీరామునకు సంయోగవియోగములు లేవు కాని, విరహావేశ ప్రత్యక్షముగ గానవాయెను

వి॥ స్థావరజంగమాత్మకమగు సమస్తప్రపంచము పరమాత్మకు దేహముగా చెప్పబడినది అఖండ, అజన్మ, నిర్వికార, నిరంజనుడైన భగవానున కసాధ్యమైన దేదియు లేదు ఐనను తనకొసగిన పాత్రకు తగినట్లు నటుడు నటించు భంగి భగవానుడు మానుషలీలగావించు చున్నాడు వియోగములేకున్నను వియోగమును బొందుచున్నాడు

దో॥ అతి బిచిత్ర రఘుపతి చరిత జానహిఁ పరమ సుజాన ।
జే మతిమంద బిమోహ బస హృదయఁ ధరహిఁ కఛు
ఆన ॥ 313

తా॥ శ్రీరఘునాథునిచరిత్రము కడువిచిత్రమైనది ఆ రామచరితమును పరిపూర్ణజ్ఞానులు దెలిసికొందురు నేను మందబుద్ధియై మోహమునకు వశీభూతు డనైనందువలన హృదయ మన్యభావములకు నిలయ మగుచున్నది

వి॥ శ్రీతులసీదాసు తాను మహానుభావు డయ్యును భగవ త్సాన్నిధిని నైచ్యానుసంధానము గావించుచున్నాడు 'ఈశ్వరస్యా ప్యభిమాని ద్వేషిత్వాత్ దైన్య ప్రియత్వాచ్చ' కులాభిమానము, ధనాభిమానము, విద్యాభిమానము గలవారిని భగవంతుడు ప్రేమిం పడు, ద్వేషించును

దీనులను ప్రేమించును అని నారదభక్తి సూత్రములలో జెప్ప బడినది 'నీవు దీనులకు బంధుబాంధవుడవు నేనో దీనులలో అగ్రేసరుడనై యున్నాను నాహృదయమున అన్యభావములు లేవు కనుక నన్ను కాపాడు' మనుచున్నాడు శ్రీతులసీదాసు

చౌ॥ సంభు సమయి తేహి రామహి దేఖా ।
ఉపజా హియఁ అతి హరషు బిసేషా ॥
భరి లోచన ఛబిసింధు నిహారీ ।
కుసమయ జాని న కీన్హి చిన్హారీ ॥ 314

తా॥ అదె సమయమని తలచి రఘువంశభూషణుడైన శ్రీరామచంద్రుని, సకలజీవులకు గతియును, జ్ఞానమునకు ఆధారమైనవాడును, అనుకరింప నశక్యమైన వాడును పార్వతీసమేతుడైన శివుడు నయనోత్సవముగా దిలకించుచు నపరిమితా నందమును పొందుచుండెను సుందరసుకుమారమైనదియగు శ్రీరామరూపము సాక్షాత్కరించి నయనద్వయమునకు విందు గావించుచుండ అది సమయముకాదని యెంచి, దానినిగూర్చి శంకరుడు వ్యక్తపరచలేదు

చౌ॥ జయ సచ్చిదానంద జగపావన ।
అస కహి చలేఉ మనోజ నసావన ॥
చలే జాత సివ సతీ సమేతా ।
పుని పుని పులకత కృపానికేతా ॥ 315

తా॥ జగత్తును పవిత్రముజేయు సచ్చిదానందునికి జయము కలుగుగాక యని నుడివి, మన్మథుని భస్మమొనరించిన శివుడు ముందుకు పోవుచుండెను

కృపానిధియైన శివుడు మాటిమాటికిని ఆనందముతో పులకితుడై సతీసమేతుడై వెడలుచుండెను

వి॥ సతీసమేతుడై కైలాసమున కేగు శంకరునకు మార్గమధ్యమున శ్రీరామునిదివ్యమంగళస్వరూపము సాక్షాత్కరించెను ఆ రామ తేజస్సునుగాంచి శంకరుడు 'త్రిభువనమంగళ దివ్యనామధేయా! మనోనయనామృతావతారా! నీకు జయము జయము' అని నుడివెను త్రిపురాసురులను సంహరించినవాడును, త్రినేత్రములుగలవాడును, గొప్పజటాజూటము, ఔదార్యము గలవాడును, మహాదేవుడనబడు దేవుడు మాటిమాటికిని నమస్కరించుచుండుట సతీదేవి గాంచినతోడనే ఆమెకు సందేహ ముత్పన్నమాయెను

## సతీదేవికి అజ్ఞాన మావరించుట

చౌ॥ సతీ సో దసా సంభు కై దేఖీ ।
ఉర ఉపజా సందేహు బిసేషీ ॥
సంకర జగతబంద్య జగదీసా ।
సుర నరముని సబ నావత సీసా ॥ 316

తా॥ సర్వజ్ఞుడైన శంకరు డాటకలో నుండుట గాంచిన సతీదేవి హృదయము సందేహమునకు నిలయ మయ్యెను అంత నివ్విధముగ మనంబున తలపోసెను

త్రిభువన మంగళదివ్యనామధేయుడు శంకరుడు ఈ జగత్తున కింతటికిని వందనీయుడు, సర్వేశ్వరుడు జగదీశ్వరుడు పరమేశ్వరుని దేవతలు, మానవులు మునులు సర్వులు ఆరాధింతురు

చౌ॥ తిన్హ నృపసుతహి కీన్హ పరనామా ।
కహి సచ్చిదానంద పరధామా ॥
భఏ మగన ఛబి తాసు బిలోకీ ।
అజహుఁ ప్రీతి ఉర రహతి న రోకీ ॥ 317

తా॥ చంద్రశేఖరుడైన, జ్ఞాననిధియైన పరమేశ్వరుడు కేవల మొకరాజ పుత్రుని సచ్చిదానందా! పరంధామా! యనుచు ప్రణమిల్లెనే! ఆ సౌందర్యాతిశయము నా నాథుని ప్రేమనిమగ్నుని గావించినది నా నాథుని హృదయకుహరమందు గాఢముగా నెలకొన్న ప్రేమ నరికట్ట సాధ్యమా!

దో॥ బ్రహ్మ జో వ్యాపక బిరజ అజ అకల అనీహ అభేద ।
సో కి దేహ ధరి హోఇ నర జాహి న జానత బేద ॥ 318

తా॥ ఏ బ్రహ్మ సర్వవ్యాపకుడు, మాయారహితుడు జన్మరహితుడు, అగోచరుడు, ఇచ్ఛారహితుడు, భేదరహితు డనబడుచున్నాడో యెవనినిగూర్చి వేదములకుగూడ సరిగాదెలియదో అతడు దేహధారణముచేత మానవుడు కాగలడా!

చౌ॥ బిష్ణు జో సుర హిత నరతను ధారీ ।
సోఉ సర్బగ్య జథా త్రిపురారీ ॥
ఖోజఇ సో కి అగ్య ఇవ నారీ ।
గ్యాన ధామ శ్రీపతి అసురారీ ॥ 319

తా॥ ఒకవేళ దేవతలహితముగోరి మానవావతార మెత్తిన విష్ణుభగవాను డనుకొందుమా శంకరునివలె సర్వజ్ఞుడనుకొందుము జ్ఞాననిధియైన, లక్ష్మీపతియైన అసురారియైన, భగవానుడైన విష్ణుదేవుడు అజ్ఞానివలె విరహవేదన ననుభవించుచు భార్యకోసము తపించునా? దుఃఖించునా!

చౌ॥ సంభుగిరా పుని మృషా న హోఈ ।
సివ సర్బగ్య జాన సబు కోఈ ॥
అస సంసయ మన భయఉ అపారా ।
హోఇ న హృదయఁ ప్రబోధ ప్రచారా ॥ 320

తా॥ కాని శంకరునివచనము లసత్యములు కానేరవు శివుడు సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి యైనవిషయ మందరికి విదితమే! అని తలపోయుచున్న సతీదేవి హృదయ మపార సంశయమునకు నిలయమాయెను ఏ విధముగను ఆమె హృదయములో జ్ఞానప్రబోధము కలుగ దాయెను

వి॥ 'అస సంసయ మన బయఉ అపారా' అని కవి విరచించి నాడు కాలకర్మవశాత్తు సామాన్యమానవులకు గలిగెడు సంశయములే జగజ్జననియైన సతీదేవికిగూడ కలిగిన వనుచున్నాడు సామాన్యజనుల మనంబు లపారసంశయిములకు, బయములకు ఎలయములు ఆ క్షణమున సతీదేవి మనోమందిరము నిర్మలముగ నుండక సంక్షోభ సంశయముల కాటపట్టయిన దన్న భావ మందు స్ఫురించుచున్నది

చౌ॥ జద్యపి ప్రగట న కహేఉ భవానీ ।
హర అంతరజామీ సబ జానీ ॥
సునహి సతీ తివ నారి సుభాఊ ।
సంసయి అస న ధరిఅ ఉర కాఊ ॥ 321

తా॥ తన మనోభావములను భవాని శంకరునకు వ్యక్తపరచలేదు కాని, అంతర్యామియైన శంకరు ఒది గ్రహించి సతీః నీవు నీ స్త్రీస్వభావమును విడ నాడవైతివి ఇటువంటి సంశయముల కెప్పటికిని నీ మనస్సునందు చోటొసగకుము (ముందు దోహాతో నన్వయము)

చౌ॥ జాసు కథా కుంభజ రిషి గాఈ ।
భగతి జాసు మైఁ మునిహి సునాఈ ॥
సోఇ మమ ఇష్టదేవ రఘుబీరా ।
సేవత జాహి సదా ముని ధీరా ॥ 322

తా॥ శ్రీరామచరిత్రమును అగస్త్యుడు గానముచేసెను శ్రీరామభక్తిని గూర్చి నేను మునికి వినిపించితిని

శ్రీరాముడే నా యిష్టదైవము పరమజ్ఞానులైన మునులు శ్రీరాముని నిత్యము సేవించుచుందురు

వి॥ బగవంతుని పూజగాని, స్తుతిగాని, స్మరణముగాని, దర్శనముగాని, ఆ బగవత్సేవ యేదియైనను సరే ముక్తిదాయకము బగవత్సేవలో సాలోక్యము, సామీప్యము, సారూప్యమును ఇమిడియే

యున్నవి శంకరుడు తనయిష్టదైవము శ్రీరాముడే యని స్పష్టముగ నుడివెను 'సోఇ మమ ఇష్టదేవ రఘుబీర' అనగా శంకరుని యిష్ట దైవము శ్రీరాముడేయని కవి యిచ్చట ప్రస్తుతించుచున్నాడు

ప్రతియొకరును తమయిష్టదైవములను గొలుచుట పరిపాటి శ్రీత్యాగరాజు శ్రీరామచంద్రుని, మీరాబాయి శ్రీకృష్ణుని, కన్నప్ప శ్రీకాళహస్తీశ్వరుని గొలిచిరి మహానుభావులైనవా రెల్లగును భగవ ద్విగ్రహములను విగ్రహములనుగాగాక సాక్షాత్ భగవంతునిగనే దర్శించి సేవించి రనునది యు స్పష్టమే! ఇష్టదేవతాప్రార్థనము సలిపి అట్టి అసాధారణమైన భగవద్భక్తియు, విశ్వాసమును పెంపొందింప జేసికొనుడని శ్రీతులసీదాసు మనల నుద్బోధించు చున్నాడు

ఛం॥ ముని ధీర జోగి సిద్ధ సంతత బిమల మన జేహి
ధ్యావహీఁ।
కహి నేతి నిగమ పురాన ఆగమ జాసు కీరతి గావహీఁ॥
సోఇ రాము బ్యాపక బ్రహ్మ భువన నికాయ పతి మాయా
ధనీ।
అవతరేఉ అపనే భగత హిత నిజతంత్ర నిత
రఘుకులమనీ॥ 323

తా॥ పరమజ్ఞానులైన మునులు, యోగులు, సిద్ధులు నిరంతరము నిర్మల చిత్తముతో ఎవనిని ధ్యానముచేసెదరో, వేదశాస్త్రములు నేతి-నేతి యని యెవనికీర్తిని గానముచేయుచున్నవో ఆ సర్వవ్యాపకుడు, పరబ్రహ్మస్వరూపుడు, మాయాధీశుడు, నిత్యుడు, పరమస్వతంత్రుడు తనభక్తుల హితార్థము రఘుకుల మునందు అవతరించెను

సో॥ లాగ న ఉర ఉపదేసు జదపి కహేఉ సివఁ బార బహు।
బోలే బిహసి మహేసు హరిమాయా బలు జాని జియఁ॥ 324

తా॥ ఇట్లు రఘుకులభూషణుడైన శ్రీరామునిగూర్చి శంకరుడు భవాని కెన్నియోమారు లుపదేశించెను కాని, విధివశమున ఆ యుపదేశమామెకు రుచించ

లేదు అట్టితలి, హరిమాయ బలపత్తరమైనదని మహేశ్వరుడు మనంబున భావించి ఎరహాసవచనముతో నిట్లనియె — (ముందు దోహాతో నన్వయము)

చౌ॥ జౌం తుమ్హరే మన అతి సందేహూ ।
తౌ కిన జాఇ పరీచా లేహూ ॥
తబ లగి బైఠ అహఉం బటఛాహీం ।
జబ లగి తుమ్హ ఇహహు మోహి పాహీం । 325

తా॥ పరికించి చూడ నిశ్చయంబు సందేహాస్పదమై యున్నటుల నాకు దోచుచున్నది నీ సందేహనివృత్తికై నీ వెందులకు శ్రీరాముని పరీక్షించ కూడదు? నీవు పరీక్షించి యిట కేతెంచువరకు నేనీ వటతరుచ్ఛాయ నాసీనుడనై యుండెదను (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ జైసేం జాఇ మోహ భ్రమ భారీ ।
కరేహు సో జతను బిబేక బిచారీ ॥
చలీం సతీ సివ ఆయసు పాఈ ।
కరహిం బిచారు కరౌం కా భాఈ । 326

తా॥ అజ్ఞానజనితమైన నీ భ్రమ యేవిధముగ దూరమగునో పెక్కుభంగుల నీ వివేకముద్వారా ఆలోచించి నీకేది సమంజసమని తోచునో యట్లే యొనరింపుము అని సర్వజ్ఞుడైన శివుడు చెప్పగా విని శంకరునాజ్ఞ శిరసా వహించి, పరీక్షార్థమై పయనమైపోవుచు, మార్గమధ్యమున నాకు పెద్ద చిక్కే వచ్చినది ఏమి చేయుదును? ఏ విధముగ పరీక్షింతు? ననుకొనెను,

చౌ॥ ఇహాం సంభు అస మన అనుమానా ।
దచ్ఛసుతా కహుం నహి కల్యానా ॥
మోరేహు కహేం న సంసయ జాహీ ।
బిధి బిపరీత భలాఈ నాహీం ॥ 327

తా॥ ఇచట శివుడు వటవృక్షముక్రింద ఆసీనుడై మనంబున పెక్కు భంగుల నిటు లాలోచించెను —

దక్షసుతయైన సతీదేవి కింత మూర్ఖత్వమును పట్టుదలయు తగవు నేన న్యాయముగా సంశయములను వీడుము, ఇట్టి విషయములందు భ్రాంతి నొందవల దని చెప్పినను వినక యిటనుండి వెడలిపోయినదే! ఇట్లు నన్నుపేక్షించి పోవుట ఆమెకు శ్రేయస్కరము కాదు ఈ జరిగిన సంఘటనను పరికించిచూడ, విధాత విపరీతమైనటుల తోచుచున్నది నా మాటవినక యిట్లు పోవుట సతి కెంత మాత్రమును క్షేమకరము గాదు ఏమి యుపద్రవము వాటిల్లునోగదా! (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ హోఇహి సోఇ జో రామ రచి రాఖా ।
కో కరి తర్క బఢావై సాఖా ॥
అస కహి లగే జపన హరినామా ।
గఈఁ సతీ జహఁ ప్రభు సుఖధామా ॥ 328

తా॥ ఏ విధముగ జరుగవలయునని యిచ్ఛగించునో అట్లే జరుగును తర్కవితర్కములతో దీని నింకను విస్తరించుకొను టెందులకు! అని మనంబున దలచినవాడై శంకరుడు శ్రీహరినామమును (రామనామమును) జపింపసాగెను సుఖధాముడు రఘువీరుడైన శ్రీరామచంద్రుడుండు అరణ్యప్రాంతములకు సతీదేవి పోయెను

దో॥ పుని పుని హృదయఁ బిచారు కరి ధరి సీతా కర రూప ।
ఆగేఁ హోఇ చలి పంథ తేహిఁ జేహిఁ ఆవత నరభూప ॥329

తా॥ సతీదేవి మాటిమాటికిని మనంబున వితర్కించుకొనుచు సీతారూప మునుదాల్చి ముందుకు బోవుచుండెను సతీదేవి అనుకొన్నట్లే నరవరుడు దశ రథనందనుడైన శ్రీరామచంద్రుడు ఆ మార్గముననే వచ్చుచుండెను

చౌ॥ లఛిమన దేఖ ఉమాకృత బేషా ।
చకిత భయే భ్రమ హృదయఁ బిసేషా ॥
కహి న సకత కఛు అతి గంభీరా ।
ప్రభు ప్రభాఉ జానత మతిధీరా ॥ 330

తా॥ సతీదేవి ధరించి యాపమును జూచి లక్ష్మణుడు చకితు డాయెను అతి నిహ్వలయయును భ్రమయుత్పన్నమాయెను కాని, గంభీరవదనుడై యేమియు చెప్పనేర కుండెను ఏలన యాత్మబుద్ధిగల లక్ష్మణుని కాశ్చర్యకరమైన శ్రీరామ ప్రభావము విదితమే।

చౌ॥ సతీ కపట జానేఉ సురస్వామీ ।
సబదరసీ సబ అంతరజామీ ॥
సుమిరత జాహి మిటఇ అగ్యానా ।
సోఇ సర్బగ్య రాము భగవానా ॥ 331

తా॥ సమస్తముకు అంతర్యామి, దేవతలకు స్వామియునైన శ్రీరామ చంద్రుడు కపటవేషములోనున్న సతీదేవిని గూర్చి తెలిసికొనెను ఎవ్వనిస్మరణ మాత్రముచే అజ్ఞానము పటాపంచలగునో ఆ సర్వజ్ఞుడే భగవానుడైన శ్రీరామ చంద్రుడు

చౌ॥ సతీ కీన్హ చహ తహఁహుఁ దురాఊ ।
దేఖహు నారి సుభావ ప్రభాఊ ॥
నిజ మాయా బలు హృదయఁ బఖానీ ।
బోలే బిహసి రాము మృదు బానీ ॥ 332

తా॥ సర్వజ్ఞుడైన సర్వాంతర్యామియైన శ్రీరామచంద్రుని సమక్షమున సతి దాచ ప్రయత్నించుచున్నది స్త్రీస్వభావ మిటులే యుండునేమో। ఆ ప్రభావము నించుక పరికింపుడు

నిజమాయాప్రభావమునుగూర్చి అంతరంగమున నెఱింగినవాడై శ్రీరామ చంద్రుడు చిరహాసవదనముతో మృదుమధురముగ సతీదేవిని బలుకరింప నుద్యుక్తు డాయెను

చౌ॥ జోరి పాని ప్రభు కీన్హ ప్రనామూ ।
పితా సమేత లీన్హ నిజనామూ ॥
కహేఉ బహోరి కహాఁ బృషకేతూ ।
బిపిన అకేలి ఫిరహు కేహి హేతూ ॥ 333

తా॥ ప్రథమమున తనకరకమలములను జోడించి సతారూపములో నున్న సతీదేవికి ప్రణమిల్లెను ప్రణమిల్లిన తరువాత మాతా! నేను పశరథనందను డైన శ్రీరాముడను వృషకేతుడైన శివు డిప్పు డెట నున్నాడు? తా మొంటరిగా ఈ ఘోరారణ్యమునం దెందులకు సంచరించుచున్నా రని యడిగెను

దో॥ రామ బచన మృదు గూఢ సుని ఉపజా అతి సంకోచు।
సతీ సభీత మహేస పహిఁ చలీఁ హృదయఁ బడ సోచు॥334

తా॥ రహస్యయుక్తమైన శ్రీరామచంద్రుని మృదుమధుర వచనముల నాలకించి సతీదేవి చాల సంకోచపడెను భయకంపితయై సతీదేవి మహేశ్వరుని కడకేగదలచి పయనమాయెను కాని, ఆమె చేసిన పరీక్ష సఫలము కానందున అత్యంతచింతకు లోనయ్యెను

చౌ॥ మైఁ సంకర కర కహా న మానా।
నిజ అగ్యాను రామ పర ఆనా॥
జాఇ ఉతరు అబ దేహఉఁ కాహా।
ఉర ఉపజా అతి దారున దాహా॥ 335

తా॥ మార్గమున బోవుచు నిట్లు చింతింపదొడగెను నేను శంకరుని మాటను వినలైతిని నేను నా యజ్ఞానమును శ్రీరామచంద్రునిపై ఆరోపించితిని ఇప్పుడు శివునకు నేనేమని ప్రత్యుత్తర మీయగలను? ఇట్లు చింతించు సతీ హృదయమున భయంకరమైన యగ్నిజ్వాల లుద్భవించెను

చౌ॥ జానా రామ సతీఁ దుఖు పావా।
నిజ ప్రభాఉ కఛు ప్రగటి జనావా॥
సతీఁ దీఖ కౌతుక మగ జాతా।
ఆగేఁ రాము సహిత శ్రీ భ్రాతా॥ 336

తా॥ సతీదేవి దుఃఖిత యైనదని శ్రీరామచంద్రుడు గ్రహించెను తన ప్రభావమును కొంత ఆమెకు జూపెను అంత మార్గమున సతీదేవి పోవునపుడు శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణసహితముగ ముందుకు బోవుట గాంచెను

ఇట్టితఱి సీతారాములు సతీదేవికి సచ్చిదానందమయ స్వరూపులుగా సాక్షాత్కరించిరి శ్రీరామచంద్రుడు వియోగములో దుఃఖముతో నున్నాడన్న ప్రాకృత కల్పన లామెకు దూరమైనవి

## శ్రీరామ విశ్వరూప సందర్శనము

చౌ॥ ఫిరి చితవా పాఛేఁ ప్రభు దేఖా ।
సహిత బంధు సియ సుందర బేషా ॥
జహఁ చితవహిఁ తహఁ ప్రభు ఆసీనా ।
సేవహిఁ సిద్ధ మునీస ప్రబీనా ॥ 337

తా॥ సతీదేవి మరల వెనుకకు జూచెను అక్కడకూడ శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సమేతముగా సుందరాతి సుందరుడై కనపడెను ఎందెందు వెదకి చూచిన నందందే గల డన్నటులు ఎటుచూచినను శ్రీరామచంద్రుడే।

విశాలవక్షస్థల మందును, విపుల నయనోత్పలములయందును మందస్మిత మందును, మధురవాక్యమందును కోమలాతికోమలమైనవాడును, జ్యోతిస్స్వరూపుడైన శ్రీరామచంద్రుని చతురులైన సిద్ధులు, మునీశ్వరులు సేవించుచుండ టను జూచెను

చౌ॥ దేఖే సివ బిధి బిష్ణు అనేకా ।
అమిత ప్రభాఉ ఏక తేఁ ఏకా ॥
బందత చరన కరత ప్రభు సేవా ।
బిబిధ బేష దేఖే సబ దేవా ॥ 338

తా॥ సతీదేవి అగణిత బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను గాంచెను అందులో నొకరిని మించి యింకొక రమితమైన ప్రభావముగల వారుగా నుండిరి వివిధ వేషధారులై దేవత లెల్లరును మనోనయనోత్సవ కరుండును సగు నేత్రాభిరాముని లోకాభిరాముని, రణరంగధీరుని పాదపద్మములను సేవించుచుండిరి

దో॥ సతీ బిధాత్రీ ఇందిరా దేఖీఁ అమిత అనూప ।
జేహిఁ జేహిఁ బేష అజాది సుర తేహి తేహి తన అనురూప॥339

తా॥ అగణిత అనుపమ సతులను (పార్వతులను), సరస్వతులను, ఇంది రాదులను సతీదేవి గాంచెను ఏ రూపములో బ్రహ్మాదిదేవత లున్నారో అందు కనురూపమైన శక్తులు వారిలో నుండెను

చౌ॥ దేఖే జహఁ తహఁ రఘుపతి జేతే ।
సక్తిన్హ సహిత సకల సుర తేతే ॥
జీవ చరాచర జో సంసారా ।
దేఖే సకల అనేక ప్రకారా ॥ 340

తా॥ సతిదేవి శ్రీరామచంద్రుల నెందరిని గాంచెనో శక్తిమంతులైన దేవత లనుగూడ నందరినే గాంచెను ప్రపంచములోని చరాచర జీవరాశులన్నింటిని గాంచెను

చౌ॥ పూజహిఁ ప్రభుహి దేవ బహు బేషా ।
రామ రూప దూసర నహిఁ దేఖా ॥
అవలోకే రఘుపతి బహుతేరే ।
సీతా సహిత న బేష ఘనేరే ॥ 341

తా॥ బహువేషధారులైన దేవతలెల్లరును రాజీవలోచనుడైన శ్రీరామ చంద్రుని పూజించుటను సతీదేవి చూచెను కాని, శ్రీరామచంద్రుని రెండవ రూపమును అనగా వియోగములో దుఃఖించుచున్న రూపమును గాంచలేదు సీతా సమేతుడైన శ్రీరామచంద్రుని దివ్యమంగళ స్వరూపములను పెక్కింటిని గాంచెను.

చౌ॥ సోఇ రఘుబర సోఇ లఛిమను సీతా ।
దేఖి సతీ అతి భఈఁ సభీతా ॥
హృదయ కంప తన సుధి కఛు నాహీఁ ।
నయన మూది బైఠీఁ మగ మాహీఁ ॥ 342

తా॥ ఎటు చూచినను శ్రీరామచంద్రుడే; ఎటుచూచినను సీతారామలక్ష్మ ణులే; ఆ సాక్షాత్కారమును గాంచినపై సతీదేవి భయము చెందెను హృద

యము కంపించెను దేహస్మృతి గోల్పోవునంత పరిస్థితి ఆమెకు సంభవించెను ఆమె నయనములను మూసికొని మార్గమధ్యమున దీనాతిదీనయై నొకచో ఆసీనురాలయ్యెను

చౌ॥ బహురి బిలోకేఉ నయన ఉఘారీ ।
కఛు న దీఖ తహఁ దచ్ఛకుమారీ ॥
పుని పుని నాఇ రామ పద సీసా ।
చలీఁ తహాఁ జహఁ రహే గిరీసా ॥ 343

తా॥ కొంతసేపటికి సతీదేవి నయనములను తెరచి చూచెను కాని దక్ష కుమారియైన సతీదేవి కేమియు గోచరింపలేదు అప్పుడపంతయు కరుణానిధియైన శ్రీరాముని ప్రభావమని తెలిసికొన్నదై సతీదేవి శ్రీరామచంద్రుని చరణకమలములకు నమస్కరించి పరమానంద బోధస్వరూపుడై దీనులకు పరమబంధువై పశుపతియైన పరమేశ్వరుని కడ కేగెను

దో॥ గఈఁ సమీప మహేస తబ హఁసి పూఛీ కుసలాత ।
లీన్హి పరీఛా కవన బిధి కహహు సత్య సబ బాత ॥ 344

తా॥ సతీదేవి శివుని సమీపించినంతనే మహేశ్వరుడు పరహాసవదనుడై సతి నాప్యాయముగా కుశల మడిగెను, మరియు నిట్లనెను—

సతీ! నీ కార్యము సఫలమైనదిగదా! సర్వాంగశోభితుడు, సద్గుణరాశియైన శ్రీరామచంద్రు నేవిధముగ బరీక్షించితివో యించుక తెలియ జెప్పుమా!

## శివప్రతిజ్ఞ—సతీదేవి యొక్క దుఃఖము

చౌ॥ సతీ సముఝి రఘుబీర ప్రభాఊ ।
భయ బస సివ సన కీన్హ దురాఊ ॥
కఛు న పరీఛా లీన్హి గోసాఈఁ ।
కీన్హ ప్రనాము తుమ్హారిహి నాఈఁ ॥ 345

తా॥ శ్రీరామ ప్రభావమును ప్రత్యక్షముగ జూచియున్నది, తెలిసికొన్నది గాన సతీదేవి భయముజెంది తన పరిక్షావిధానమునుగూర్చి శంకరుని కెఱింగింపక గుప్తముగా నుంచి రెంచి యివ్విధముగ నుడివెను

"స్వామీ! నేను శ్రీరామచంద్రుని నేవిధముగను పరీక్షింపలేదు అప్పటి కేగి మీవలెనే నేనుగూడ సర్వజ్ఞుడు, సౌందర్యరాశి, సర్వాంతర్యామియైన శ్రీరామునికి నమస్కరించితిని"

చౌ॥ జో తుమ్హ కహా సో మృషా న హోఈ ।
మోరేఁ మన ప్రతీతి అతి సోఈ ॥
తబ సంకర దేఖేఉ ధరి ధ్యానా ।
సతీ జో కీన్హ చరిత సబు జానా ॥ 346

తా॥ సతీదేవి చెప్పినదంతయు నాలకించి చంద్రభూషణుడు "సతీ! నీ వాక్కెన్నటికిని అనృతము కానేరదు ఆ దృఢ విశ్వాసము నాకెంతేనియు గల" దనెను అట్లు నుడివి, శంకరుడు ఇంచుకసేపు ధ్యానినిమగ్నుడై దివ్యదృష్టితో సతీదేవి శ్రీరాముని పరీక్షించిన విధాన మంతయు నెఱింగెను

## శంకరుడు సతీదేవిని పరిత్యజించుట

చౌ॥ బహురి రామమాయహి సిరు నావా ।
ప్రేరి సతిహి జేహిఁ ఝూఁఠ కహావా ॥
హరి ఇచ్ఛా భావీ బలవానా ।
హృదయ బిచారత సంభు సుజానా ॥ 347

తా॥ శ్రీరామమాయకు నమస్కరించెను ఆ మాయాప్రేరణవలననే సతి నోటినుండి అనృతవాక్యములు వెలువడినవి శ్రీహరిప్రేరిత ఇచ్ఛారూపమైన భవిష్యత్తు ప్రబలమైనదని శివుడు మనంబున చింతిల్లెను

చౌ॥ సతీఁ కీన్హ సీతా కర బేషా ।
సివ ఉర భయఉ బిషాద బిసేషా ॥
జౌఁ అబ కరఉఁ సతీ సన ప్రీతీ ।
మిటఇ భగతి పథు హోఇ అనీతీ ॥ 348

తా॥ సతీదేవి సీతాదేవిరూపమును ధరించెనన్న విషయమును దెలిసికొన్న శంకరుని హృదయము విషాదపూరిత మాయెను మనసులో నిట్లు దలచెను "ఇప్పుడు సతియందు కారుణ్యము వహించితినేని భక్తిమార్గము లుప్తమగును అన్యాయము ప్రబలును (ముందు దోహాతో అన్వయము)

దో॥ పరమ పునీత న జాఇ తజి కిఏఁ ప్రేమ బడ పాపు ।
ప్రగటి న కహత మహేసు కఛు హృదయఁ అధిక సంతాపు ॥ 349

తా॥ సతి పరమపవిత్రురాలు ఆమెను త్యజించుట సమంజసముగాదు కాని, ప్రేమించుట పాపకరమే యగును "

ఇట్లు తనమనసులో నిశ్చయించుకొనెనేగాని శంకరుడు బాహ్యముగ తన మనోనిశ్చయమును వెల్లడించలేదు శంకరుని హృదయ మధికసంతాపమునకు నిలయ మాయెను

చౌ॥ తబ సంకర ప్రభు పద సిరు నావా ।
సుమిరత రాము హృదయఁ అస ఆవా ॥
ఏహిఁ తన సతిహి భేట మోహి నాహీఁ ।
సివ సంకల్పు కీన్హ మన మాహీఁ ॥ 350

తా॥ శంకరుడు శ్రీరాముని పాదపద్మములకు ప్రణమిల్లెను లోకాభిరాముడై, రణరంగధీరుడైన శ్రీరాముని స్మరణ గావించుచు ఆదిశంకరుడు మనసులో ఈ దృఢసంకల్ప మొనర్చెను అదేమన-

నేనును సతియు ఈ జన్మలో ఇకమీదట పతిపత్నులుగ నుండుట సంభవము

శివుని తపస్సు

చౌ॥ అస బిచారి సంకరు మతిధీరా ।
చలే భవన సుమిరత రఘుబీరా ॥
చలత గగన భై గిరా సుహాఈ ।
జయ మహేస భలి భగతి దృఢాఈ ॥ 351

తా॥ దృఢమతియైన శంకరు డిట్లు విచారించి, శ్రీరఘువీరుని స్మరించుచు కైలాసమున కేగెను

కైలాసమున కేగు తఱి ఆకాశవాణి యిట్లు పలికెను మహేశ్వరునకు జయము కలుగుగాక। నీవు భక్తిని దృఢపఱచితివి (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ అస పన తుమ్హ బిను కరఇ కో అనా ।
రామ భగత సమరథ భగవానా ॥
సుని నభ గిరా సతీ ఉర సోచా ।
పూఛా సివహి సమేత సకోచా ॥ 352

తా॥ మహేశ్వరా। ఇంతటి ప్రతిజ్ఞ యొనరించుటకు సర్వసమర్థుడవైన నీకే సాధ్యము నీవు శ్రీరామభక్తుడవు। సమర్థుడవు। భగవానుడవు।

ఆకాశవాణి పల్కిన పలుకుల నాలకించి, సతీదేవి చింతాక్రాంతయై అతి సంకోచముతో శివునితో నిట్లనియె (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ కీన్హ కవన పన కహహు కృపాలా ।
సత్యధామ ప్రభు దీన దయాలా ॥
జదపి సతీం పూఛా బహు భాంతీ ।
తదపి న కహేఉ త్రిపుర ఆరాతీ ॥ 353

తా॥ ప్రభూ। స్వామి। స్మరహరా। కృపాసాగరా। మీరు చేసిన ప్రతిజ్ఞ యేది? దానినిగూర్చి నాకు తెలియజేయుడు మీరు సత్యసంధులు। దీనదయాళురు। నాపై నుపేక్షవహించక దయచేసి ఆ ప్రతిజ్ఞ యేమియో తెలుపవలయునని దీనురాలనై మిమ్ముల ప్రార్థించుచున్నాను స్వామీ। నా మొఱాలకింపుడు"

ఇట్లు పెక్కుభంగుల సతీదేవి శివుని వేడుకొనెను త్రిపురారియైన శివుడు మౌనాలంకృతు డాయెను

దో॥ సతీ హృదయం అనుమాన కియ సబు జానేఉ సర్బగ్య ।
కీన్హ కపటు మైం సంభు సన నారి సహజ జడ అగ్య ॥354

తా॥ మౌనాలంకృతుడైన శంకరుని గాంచిన సతీదేవి వ్యాకులయమున చింతయు, అవమానము చెలరేగెను ఆమె మనంబున నిట్లు తలపోసెను

సర్వజ్ఞుడైన శంకరునకు తెలియని దుండునా! నేను శివసాన్నిధ్యమున కపటనాటక మాడితిని స్త్రీసహజస్వభావము ననుసరించియుంటుటచే నిది మంచిది యిది చెడ్డ దనియెడు వివక్షజ్ఞానములేక మూర్ఖురాలనై తెలివిలేని పనులను చేసితిని

దో॥ జలు పయ సరిస బికాఇ దేఖహు ప్రీతి కి రీతి భలి।
బిలగ హోఇ రసు జాఇ కపట ఖటాఈ పరత పుని॥ 355

తా॥ ప్రీతియొక్క రీతిని గమనించుము క్షీరములో జలమును జేర్చి చో జలము దానియందు మిశ్రితమైన కారణమున ఇది క్షీరము, ఇది జలమని తెలియ గొనుటకు సాధ్యముకాదు జలములో మిశ్రితమైన క్షీరము విక్రయింపబడును గాని, క్షీరమందు పులుసు పడినయెడల క్షీరము విరుగును విరిగినంతనే రుచి లేకుండ పోవును

వి॥ క్షీరము స్వచ్ఛముగను తెల్లగను రుచికరముగ నుండును తల్లిపాలు కంఠమైన శిశువునకు గోక్షీరమే ఆహారము క్షీరమును సేవించినచో ఆరోగ్యవంతు లగుదురు కనుక కవి తులసీదాసు నిర్మలచిత్తమును క్షీరమునకు బోల్చినాడు

సామాన్యముగ మానవులు చంచలస్వభావులు మనస్సునకు ప్రత్యేకమగు స్వరూప మేదియును లేదు కావున నది ఏ యే విషయమున వ్యాపించునో తత్క్షణమే ఆ యాకారమును పొందును ఏ యే ఆకారమును పొందునో ఆ యా అనుభూతి మనకు ఏర్పడును మనము భగవంతుని పూజించుచున్నను మనమనస్సు ఎక్కడికో పోవుచుండును కావున మనకు తన్మయత, తద్రూపత లభించుటలేదు మహానుభావులైన వారి కే కొందరికో నిర్మల చిత్తముండును వారు తన్మయతాసక్తియు, తాదాత్మ్యాసక్తియు గలిగి తన్మయు లగుదురు క్షీరమువంటి నిర్మలచిత్తమున కపటరూపమైన పులుసు పడిన మనస్సు

కల్మషముతో నిండి యుపద్రవములకు దారితీయును క్షీరములో పులుసు పడకున్నచో దాని స్వచ్ఛతకును రుచికిని ఏమియు భంగము వాటిల్లదు మనంబున కపటభావములు ప్రవేశింపకున్నచో చిత్తము నిర్మలమై పరమేశ్వరాయత్త మగును

చౌ॥ హృదయఁ సోచు సముఝత నిజ కరనీ ।
చింతా అమిత జాఇ నహిఁ బరనీ ॥
కృపాసింధు సివ పరమ అగాధా ।
ప్రగట న కహేఉ మోర అపరాధా ॥ 356

తా॥ తాను చేసినపనిని మాటిమాటికిని జ్ఞప్తికి దెచ్చుకొని సతీదేవి వాల చింతించెను ఆమె విచారము, పశ్చాత్తాపము చూచితీరవలయునేగాని వర్ణించుట కెంతమాత్రమును సాధ్యముగాదు తన తప్పుచమును తలచుకొని పశ్చాత్తాపము నొందిన తరువాత సతీదేవి మనంబున ఈ విధముగ తలపోసెను

"పరమశివుడు కరుణాసముద్రుడు కనుక నే చేసిన యపరాధములను తమ శ్రీముఖమునుండి నుడివి నన్ను క్షోభపెట్టలేదు నా స్వామి యెంతటి దయార్ద్ర హృదయుడు। నేను నా యిచ్చవచ్చిన రీతి ప్రవర్తించినను నన్నొకసారియైనను పరుషముగ మాటలాడలేదు" (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ సంకర రుఖ అవలోకి భవానీ ।
ప్రభు మోహి తజేఉ హృదయఁ అకులానీ ॥
నిజ అఘ సముఝి న కఛు కహి జాఈ ।
తపఇ అవాఁ ఇవ ఉర అధికాఈ ॥ 357

తా॥ అని సమాధానపడిన సతీదేవి శంకరుని గాంచెను శంకరు డఖండ తేజోమయుడై విరాజిల్లుచుండెను శంకరు దూరముండుట గాంచిన సతీదేవికి మరల వైరాశ్యమలముకొనెను నాస్వామి నన్ను త్యజించినాడని తలచినదై దుఃఖించెను తానొనర్చిన పాపమునుగూర్చి తెలుసుకొన్నది గావున ఏమియు చెప్పలేదు కాని హృదయము మాత్రము కుమ్మరి ఆవమువలె నత్యధికముగా తపించిపోయెను

చౌ॥ సతిహి ససోచ జాని బృషకేతూ ।
కహీఁ కథా సుందర సుఖ హేతూ ॥
బరనత పంథ బిబిధ ఇతిహాసా ।
బిస్వనాథ పహుంచే కైలాసా ॥ 358

తా॥ వృషకేతువైన సాంబశివుడైన శంకరుడు చింతాక్రాంతురాలైన సతీదేవిని గాంచి, ఆమెకు మనశ్శాంతి నీయగోరినవాడై సుందరకథలను ఆమెకు సవిస్తరముగ నుడివెను మార్గమున దోవ తలీ, వివిధములైన యితిహాసముల నామెకు వినిపించెను ఇట్లు చెప్పుచు శంకరుడు కైలాసమును జేరెను

చౌ॥ తహఁ పుని సంభు సముఝి పన ఆపన ।
బైఠే బట తర కరి కమలాసన ॥
సంకర సహజ సరూపు సమ్హారా ।
లాగి సమాధి అఖండ అపారా ॥ 359

తా॥ కైలాసమున తానొనర్చిన ప్రతిజ్ఞను జ్ఞాపకముచేసికొని వటవృక్షము క్రింద పద్మాసనమున అనంత యోగనిరతుండాయెను

శంకరుడు తనసహజ స్వరూపమును (తన్నుతాను) శిక్షింపకొనెను అఖండ అపార సమాధియందు శంకరు డుండిపోయెను

దో॥ సతీ బసహిఁ కైలాస తబ అధిక సోచు మన మాహిఁ ।
మరము న కోఊ జాన కఛు జుగ సమ దివస సిరాహిఁ ॥ 360

తా॥ అప్పుడు సతీదేవి కైలాసమునందే యుండెను అప్పుడామె కమిత దుఃఖము గలిగెను ఈ రహస్యమును గూర్చి కొంతమాత్రమైనను ఎవ్వరును దెలిసికొనలే కుండిరి ఆమెకు దినమొకయుగముగా గడచుచుండెను

చౌ॥ నిత నవ సోచు సతీ ఉరభారా ।
కబ జైహఉఁ దుఖ సాగర పారా ॥
మైఁ జో కీన్హ రఘుపతి అపమానా ।
పుని పతిబచను మృషా కరి జానా ॥ 361

తా॥ దుఃఖభారముతో దిక్కులు గడచు సతీదేవి హృదయము నిట్లు యాతనపడుచు చింతలతో మునిగెను. ఆమె మనసులో నిట్లు చింతింపసాగెను

"ఈ దుఃఖసముద్రము నెట్లు ఎప్పుడు దాటగలుగుదును? నేను రఘుపతి యైన శ్రీరామచంద్రుని అవమానపరచితినే! పతివచనము అసత్యముగా భావించితిని (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ సో఼ ఫలు మోహి బిధాతాఁ దీన్హా ।
జో఼ కచు ఉచిత రహా సోఇ కీన్హా ॥
అబ బిధి అస బూఝిఅ నహిఁ తోహీ ।
సంకర బిముఖ జి అవసి మోహీ ॥ 362

తా॥ దానిఫలము ఇప్పుడనుభవించుచున్నాను. దాని ఫలమును విధాత (దైవము) నా కొసగెను. ఏది నాకు తగినదో అట్లే యొసగెను. కాని ఓ విధాతా! ఇప్పుడు నాకెట్టి దుచితమో దానిని సరిగా నీవు నిర్వర్తించలేదు. శంకరునికి విముఖురాలనైగూడ నేను జీవించునట్లొనర్చితివి. అది నీ కుచితముగాదు"

చౌ॥ కహి న జాఇ కఛు హృదయ గలానీ ।
మన మహుఁ రామహి సుమిర సయానీ ॥
జౌఁ ప్రభు దీనదయాలు కహావా ।
ఆరతి హరన బేద జసు గావా ॥ 363

తా॥ సతీదేవి పొందిన హృదయావేదన చెప్పుటకు సాధ్యముగాదు. ఇట్లు దుఃఖసముద్రమున మునిగి మరల తెప్పరిల్లుకొని సతీదేవి శ్రీరామచంద్రు నిట్లు స్మరించెను

"ఓ ప్రభూ! కరుణాకరా! దీనబంధూ! నిన్ను దీనదయాళు వందురే! నీ యశమును వేదములుగూడ నుద్ఘాటించినవిగదా! దుఃఖమును హరింపజేయు శ్రీరామచంద్రా! (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ తౌ మైఁ బినయ కరఉఁ కర జోరీ ।
ఛూటఉ బేగి దేహ యహ మోరీ ॥
జౌఁ మోరేఁ సివ చరన సనేహూ ।
మన క్రమ బచన సత్య బ్రతు ఏహూ ॥ 364

తా॥ నేను నా రెండు చేతులను జోడించి ప్రార్థించుచున్నాను నా తను వంతము గాంచలయును నేను మనో, వాక్కాయ, కర్మలతో శివుని సేవించితిని నా యాచరణ సత్యప్రమము (ముందు దోహాతో అన్వయము)

దో॥ తౌ సబదరసీ సునిఅ ప్రభు కరఉ సో బేగి ఉపాఇ ।
హోఇ మరను జెహిఀ బినహిఀ శ్రమ దుసహ బిపత్తి బిహాఇ ॥
365

తా॥ ఓ ప్రభూ! సమంర్థా! శ్రీరామచంద్రా! మరణ మాసన్నమగు నుపాయ మేదైన నాకు జెప్పుము శ్రమలేక పతిపరిత్యాగరూపమైన అగాధవిపత్తు దూరమగునుపాయ మైనను జెప్పుము”

చౌ॥ ఏహి బిధి దుఖిత ప్రజేసకుమారీ ।
అకథనీయ దారున దుఖు భారీ ॥
బీతేఀ సంబత సహస సతాసీ ।
తజీ సమాధి సంభు అబినాసీ ॥ 366

తా॥ అని చెప్పుచు దక్షసుతయైన సతీదేవి చాల దుఃఖించెను ఆ దారుణ మైన దుఃఖమును జూచి తిరవలయునేగాని వర్ణించుటకు సాధ్యముకాదు ఇట్లు ఎనుబదియారు వేల సంవత్సరములు గడచిన తరువాత అవినాశి, అఖండతేజ స్స్వరూపుడైన శివుడు సమాధి చాలించెను

చౌ॥ రామ నామ సివ సుమిరన లాగే ।
జానేఉ సతీఀ జగతపతి జాగే ॥
జాఇ సంభు పద బందను కీన్హా ।
సనముఖ సంకర ఆసను దీన్హా ॥ 367

తా॥ శివుడు రామనామమును స్మరణజేయుచునేయుండెను అట్లు రామనామ స్మరణ జేయుటను గాంచి సతీదేవి శంకరుడు తపమాచరించుటలేదని తెలిసికొని శివపాదారవిందములకు భక్తితో ప్రణమిల్లెను ఆమె భక్తి తాత్పర్యములకు సంతసించి శివుడు ఆమె సాన్నిధ్యమున ఆసీనయగుట కామె కనుజ్ఞ నొసగెను

చౌ॥ లగే కహన హరికథా రసాలా ।
దచ్ఛ ప్రజేస భఏ తేహి కాలా ॥
దేఖా బిధి బిచారి సబ లాయక ।
దచ్ఛహి కీన్హ ప్రజాపతి నాయక ॥ 368

తా॥ మహామహోపేతుడై ఆదిభిక్షువై, కపాలధారియైన శివుడు రసవత్తరములై వీనులకింపొనగు హరికథలను సతీదేవికి జెప్పసాగెను ఈ శుభసమయమున సతీదేవి తండ్రియగు దక్షుడు ప్రజాపతియయ్యెను చతుర్ముఖుడైన బ్రహ్మ, దక్షుడన్నివిధముల యోగ్యుడని తలచి, దక్షుని ప్రజాపతులకు నాయకునిగా నొనర్చెను

## సతీదేవి దక్షయజ్ఞమునకు పోవుట

చౌ॥ బడ అధికార దచ్ఛ జబ పావా ।
అతి అభిమాను హృదయఁ తబ ఆవా ॥
నహిఁ కోఉ అస జనమా జగ మాహీఁ ।
ప్రభుతా పాఇ జాహి మద నాహీఁ ॥ 369

తా॥ దక్షుడెప్పుడైతే యింతటి యధికారమును బొందెనో, అప్పుడాతడహంకార పూరితుడయ్యెను అధికారమును ఐశ్వర్యమును బొందిన తరువాత యీ జగత్తునందు గర్వపడకుండువారెవరు ?

వి॥ 'ధన మూల మిదం జగత్' అనుట పరిపాటి ఆ ధనము సద్గుణవంతులకు సత్ప్రవర్తనులకు లభించినచో పరోపకారమునకుపయోగపడి సార్థకమగును ఆ ధనమే దుష్టులకు లభించినచో మదమును అహంకారమును పెంపొందింపజేయును

దో॥ దచ్ఛ లిఏ ముని బోలి సబ కరన లగే బడ జాగ ।
నేవతే సాదర సకల సుర జే పావత మఖ భాగ ॥ 370

తా॥ దక్షుడు మునులను యజ్ఞము చేయుటకై పిలిపించెను దక్షప్రజాపతి యజ్ఞము చేయుట కంతయు సంసిద్ధము చేసెను యజ్ఞమునందు హవిర్భాగమును స్వీకరింపబోవు దేవతల కెల్లరకును ఆహ్వానములు పంపెను

వి॥ దక్షప్రజాపతి - దక్షప్రజాపతి ప్రవృత్తిమార్గానురక్తుడు శివ, దక్షుల మార్గములలో బేధాభిప్రాయములు గలవు కనుకనే శివునిపరకు ద్వేషము పెంపొందినది ఒకనాడు శివుడు ధ్యానము నందు నిమగ్నుడై యుండెను ధ్యాననిమగ్నుడైన శంకరుని సాన్ని ధ్యమున పలువురు దేవత లుండిరి ఆ సమయమునందు దక్షుడు విచ్చేసెను దక్షప్రజాపతిని గాంచినతోడనే దేవత లెల్లరును అత్యంత గౌరవాదరములతో లచి సన్మానించిరి కాని, ధ్యాననిమగ్నుడైన శివుడుమాత్ర మావిధముగనే యుండెను ఈ అవమానమును వరింప గలక దక్షప్రజాపతి శివునకు యజ్ఞములో హవిర్భాగము లేకుండు నట్లు శపించెను

శివునకు యజ్ఞములో హవిర్భాగ మీయకూడదని నిర్ణయించు కొని అందులకై దక్షప్రజాపతి ఒకయజ్ఞమును తలపెట్టెను ఈ జరిగిన సంఘటననుగూర్చి సతీదేవి కేమియు తెలియదు కాన, పితృ గృహమున కేగుటకై సంబరపడుచు శివునానతిని బొంది, సతి దక్ష గృహమున కేగినది యజ్ఞములో శివునకు హవిర్భాగ మివ్వనందున యోగాగ్నిలో తన తనువును త్యజించినది అంత్యమున వీరభద్రుడు దక్షునియజ్ఞమును ధ్వంస మొనరించి అతనిని అంతమొందించెను బ్రహ్మ ప్రార్థించినంతనే శివుడు దక్షుని జీవింపజేసెను ఆ సతియే హిమాచలుని గృహమున జన్మించినది ఇప్పుడు దక్షునకు శంకరుని మహిమ బాగుగా విదిత మాయెను

చౌ॥ కింనర నాగ సిద్ధ గంధర్బా ।
బధున్హ సమేత చలే సుర సర్బా ॥
బిష్ణు బిరంచి మహేసు బిహాఈ ।
చలే సకల సుర జాన బనాఈ ॥ 371

తా॥ ఆహ్వానమందినంతనే కిన్నరులు, నాగులు, సిద్ధులు, గంధర్వులు మొదలగు దేవత లందరును పత్నీసమేతులై పయనమైరి బ్రహ్మ, విష్ణు

మహేశ్వరులు తప్ప ఇతర దేవత లెల్లరును విమానములలో దక్షయజ్ఞమును దిలకించుట కేగిరి

చౌ॥ సతీఁ బిలోకే బ్యోమ బిమానా ।
జాత చలే సుందర బిధి నానా ॥
సుర సుందరీ కరహిఁ కల గానా ।
సునత శ్రవన ఛూటహిఁ ముని ధ్యానా ॥ 372

తా॥ దివ్యాతిదివ్యములు మనోహరములైన విమానములు గగనమార్గమున కెగురుచుండుటను సతీదేవి తిలకించెను దేవాంగనలు మధురగీతములను పాడుచుండిరి ఆ శ్రావ్యమైన మధురగీతములను వినిన ఎంతటి తపస్సంపన్నులు గాని ఏకాగ్రచిత్తముతో ధ్యానము జేయ నొల్లరు

చౌ॥ పూఛేఉ తబ సివఁ కహేఉ బఖానీ ।
పితా జగ్య సుని కఛు హరషానీ ॥
జౌఁ మహేసు మోహి ఆయసు దేహీఁ ।
కఛు దిన జాఇ రహౌఁ మిస ఏహీఁ ॥ 373

తా॥ అతి సంభ్రమముతో దేవతలెల్లరును విమానములందు పోవుటకు కారణమేమని సతీదేవి విస్మయముగా శివు నడిగెను శివుడు దానిని గూర్చి విపులముగ వివరించెను తన తండ్రియింట గొప్పయజ్ఞము జరుగబోవు చున్నదని విన్న సతీదేవి పరమానందభరితయై మనంబున ఇవ్విధముగ దలచెను

"మహేశ్వరు డానతిచ్చెనేని ఆగృహమున కొంతకాలముండవలయు నన్న యభిలాష నాకెంతేనియు గలుగుచున్నది"

చౌ॥ పతి పరిత్యాగ హృదయఁ దుఖు భారీ ।
కహఇ న నిజ అపరాధ బిచారీ ॥
బోలీ సతీ మనోహర బానీ ।
భయ సంకోచ ప్రేమరస సానీ ॥ 374

తా॥ పతి పరిత్యాగ దుఃఖమామె హృదయమున యింకను నాటుకొని యుండుటచేత, తన యపరాధమును మరల జ్ఞాపకము జేసికొని యేమియు జెప్ప లేకపోయెను దక్షయజ్ఞము జూచి రావలయునన్న కోరిక యామెయందు ప్రబల మాయెను అందుకు సతీదేవి భయ, సంకోచములు, ప్రేమరసముట్టిపడునట్టు ఈవిధముగ శివుని ప్రార్థించెను

శి॥ ఏ దేవి సర్వమంగళయో, యెవరి స్మరణమాత్రమున సర్వులు జయమును, మంగళమును కలుగునో ఆ భవాని తానొనరించిన యపరాధమును మాటిమాటికిని తలచుకొని యుండెను (ముందు దోహాతో అన్వయము)

దో॥ పితా భవన ఉత్సవ పరమ జౌఁ ప్రభు ఆయసు హోఇ ।
తౌ మైఁ జాఉఁ కృపాయతన సాదర దేఖన సోఇ ॥ 37౭

తా॥ "ఓ ప్రభూ! దీనబంధూ! నా తండ్రి యింట గొప్పయజ్ఞము జరుగుచున్నది ఓ చంద్రశేఖరా! మీ యాజ్ఞయైనచో సంబరముతో దానిని జూడ బోయెద" ననెను

చౌ॥ కహేహు నీక మోరేహుఁ మన భావా ।
యహ అనుచిత నహిఁ నేవత పఠావా ॥
దచ్ఛ సకల నిజ సుతా బోలాఈఁ ।
హమరేఁ బయర తుమ్హఉ బిసరాఈఁ ॥ 376

తా॥ మృదుమధుర మగు యుక్తమైన అప్పలుకుల నాలకించి శివుడు సంతుష్టుడై యిట్లనెను

సతీ! నీ యిష్టమే నా యిష్టము కాని, దక్షప్రజాపతి మనకు ఆహ్వానము పంపలేదు కనుక నీవచటి కేగుట యనుచితమే యని నా యభిప్రాయము దక్షుడు తన కుమార్తెలందరిని పిలువనంపెను కాని, నాయందు వైరభావము వలన నేమో నిన్ను మరచిపోయినాడు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ బ్రహ్మసభాఁ హమ సన దుఖు మానా ।
తేహి తేఁ అజహుఁ కరహిఁ అపమానా ॥
జౌఁ బిను బోలేఁ జాహు భవానీ ।
రహఇ న సీలు సనేహు న కానీ ॥ 377

తా॥ ఒకసారి బ్రహ్మసభయందు నాచే అవమానింపబడెను అదియే మనసునందుంచుకొని యిప్పుడు నన్నవమానించుటకు యత్నించుచున్నాడు ఇప్పుడు నిన్నాహ్వానించనిదే నీ పితృగృహమునకు పోయినచో మానమర్యాదలుండునా? శీల స్నేహములకు లోపము వాటిల్లదా? (మొండి దోహతో అపాయము)

చౌ॥ జదపి మిత్ర ప్రభు పితు గుర గేహా ।
జాఇఅ బిను బోలేహుఁ న సఁదేహా ॥
తదపి బిరోధ మాన జహఁ కోఈ ।
తహాఁ గఏఁ కల్యాను న హోఈ ॥ 378

తా॥ పితృ మిత్ర ప్రభు గురు గృహములకు పిలువకున్నను పోవలయునన్నమాట వాస్తవమే। కాని యిట్టి పరిస్థితులలో పోవుట శ్రేయోదాయకముకాదు ఎలయనగా వారు నిన్ను విరోధిగా భావింతురు, కనుక అట్టి ప్రయత్నము నిక మానుము.

చౌ॥ భాఁతి అనేక సంభు సముఝావా ।
భావీ బస న గ్యాను ఉర ఆవా ॥
కహ ప్రభు జాహు జో బినహిఁ బోలాఏఁ ।
నహిఁ భలి బాత హమారే భాఏఁ ॥ 379

తా॥ ఇటు లెన్నియో విధముల సతీదేవికి నచ్చజెప్పెను కాని, దుర దృష్టవశమున శంకరుని సదుపదేశము నామె నిరాకరించినది

గత్యంతరములేక శివు డీరీతిగా నుడివెను—

“పిలువనిదే నీ వటకేగినచో నీకు శ్రేయస్కరముగాదు నీ వచ్చటి కేగుట నాకెంతమాత్రము ఇష్టములేదు”

చౌ॥ తెహి చిత చడేఉ జో సంకర కహేఊ ।
ప్రభు అపమాను సముఝి ఉర దహేఊ ॥
పాఛిల దుఖు న హృదయఁ అస బ్యాపా ।
జస యహ భయఉ మహా పరితాపా ॥ 383

తా॥ ఆ సమయమున సకలజీవులకు పతియును జ్ఞానమునకు ఆధారమైన వారును, అనుకరింప నశక్యమైనవారునునైన శంకరుని మాటలను జగదంబ యైన సతి మనసున జేసికొనెను తనభర్తయైన శంకరు నవమానము జేసినారని తలచి సతీహృదయము మిగుల పరితపించెను

అంతకు మునుపు పతివిరహాము చే తానను భవించిన దుఃఖ మామె హృదయమున విశేషముగ వ్యాపించియుండలేదు అంతకంటెను దారుణమైన, దుస్సహమైన దుఃఖమును పతి నవమానించిన కారణమున సతీదేవి పొందెను

చౌ॥ జద్యపి జగ దారున దుఖ నానా ।
సబ తేఁ కఠిన జాతి అపమానా ॥
సముఝి సో సతిహి భయఉ అతిక్రోధా ।
బహుబిధి జననీఁ కీన్హ ప్రబోధా ॥ 384

తా॥ జగత్తునం దనేకప్రకారములైన దారుణదుఃఖములు గలవు కాని, జాతి యవమాన మన్నిటికంటెను కఠినమైనది సహింపరాని దనియు తలపోసినదై సతీదేవి భయము జెందెను క్రోధావేశపూరిత యయ్యెను తనయకు క్రోధ మావరించుటను జూచిన సతిదేవిజనని ఆమె నూరడించుటకు ప్రయత్నములు చేసెను

దో॥ సివ అపమాను న జాఇ సహి హృదయఁ న హోఇ ప్రబోధ ।
సకల సభహి హరి హటకి తబ బోలీఁ బచన సక్రోధ ॥ 385

తా॥ కాని, శంకరు నవమానించిరని కుందిన సతీదేవి తల్లి యూరడింపు వలన శాంతి నొందలేదు అంతియేగాక అత్యంతకోపావేశముతో సభాసదుల కిటులనియె (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ సుఁహు సభ సద సకల మునిందా।
కహీ సునీ జిన్హ సంకర నిందా॥
సో ఫలు తురత లహాఁ సబ కాహూఁ।
భలీ భాఁతి పఛితాబ పితాహూఁ॥ 386

తా॥ "ఓ సభాసదులారా! మునిశ్రేష్ఠులారా! వినుఁడు. సర్వేశ్వరుడైన శంకరుని నెవరు నిందించెదరో ఆ నిందావాక్యముల నెవరు వినెదరో వార లా ఫలమును శీఘ్రమే యనుభవించెదరు నా జనకుడైన దక్షుడు కూడ దీనికి తగిన ఫలమనుభవించును పశ్చాత్తాప మొందును (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ సంత సంభు శ్రీపతి అపబాదా।
సునిఅ జహాఁ తహఁ అసి మరజాదా॥
కాటిఅ తాసు జీభ జో బసాఈ।
శ్రవన మూది న త చలిఅ పరాఈ॥ 387

తా॥ ఎక్కడ సజ్జనులను, లక్ష్మీపతియైన మహావిష్ణువును శంభుని నిందించెదరో దూషించెదరో ఆ దూషించువారల నాలుకలు చీల్చివేయబడుగాక! అట్లు చేయలేని పక్షమున వాటిని వినజాలరేని చెవులు మూసికొని ఆ ప్రదేశమునుండి వెడలిపోవలె.

చౌ॥ జగదాతమా మహేసు పురారీ।
జగత జనక సబ కే హితకారీ॥
పితా మందమతి నిందత తేహీ।
దచ్ఛ సుక్ర సంభవ యహ దేహీ॥ 388

తా॥ త్రిపురాసురుని సంహరించిన మహేశ్వరుడు జగత్తునకు ఆత్మస్వరూపుడు ఆనందముతో బాటు స్ఫురించు అనుభవస్వరూపుడును, ఈ జగత్తునకు తండ్రియు, సర్వులకును హితమును చేకూర్చెడివాడును, మూడువేదముల ద్వారా తెలిసికొనదగినవాడును త్రినేత్రుండైన పరమేశ్వరుని మందమతియైన నా జనకుడు నిందించుచున్నాడు ఇక ఈ నిందావాక్యములను నేను సహింపజాలను దక్షుని వీర్యముచేత ఉత్పన్నమైన యీ దేహమునందు నా కెంతమాత్రము అభి

మానములేదు దీనిని తృణప్రాయముగ దలచుచున్నాను (ముందు దోహాలో అన్వయము)

చౌ॥ తజిహఉఁ తురత దేహ తేహి హేతూ ।
ఉర ధరి చంద్రమౌళి బృషకేతూ ॥
అస కహి జోగ అగిని తను జారా ।
భయఉ సకల మఖ హాహాకారా ॥ 389

తా॥ చంద్రభూషణుడును, వృషకేతుడైన శివుని హృదయమునందుంచుకొని నేనీశరీరమును త్యజించుచున్నాను" అని సుడువుచు సతీదేవి యోగాగ్నిలో తన శరీరమును భస్మము గావించెను యజ్ఞశాల యందుండు దేవతలు, మునీశ్వరులు తదితరులు సతీదేవిదేహపరిత్యాగమును, గాంచి భయముచెంది హాహాకారములు చేసిరి

## దక్షయజ్ఞ వినాశనము

దో॥ సతీ మరను సుని సంభు గన లగే కరన మఖ ఖీస ।
జగ్య బిధంస బిలోకి భృగు రచ్ఛా కీన్హ మునీస ॥ 390

తా॥ దివ్యకాంతి గలవైన, సర్వమంగళయైన సతీమరణమును గూర్చి విని శివగణము లన్నియు విధ్వంస యజ్ఞమును ధ్వంస మొనర్చిరి యజ్ఞము ధ్వంస మొనర్చబడుట గాంచి భృగువు దానిని సంరక్షించెను

చౌ॥ సమాచార సబ సంకర పాఏ ।
బీరభద్రు కరి కోప పఠాఏ ॥
జగ్య బిధంస జాఇ తిన్హ కీన్హా ।
సకల సురన్హ బిధివత ఫలు దీన్హా ॥ 391

తా॥ సర్వవ్యాపకుడై, నిఖిలభూతనాయకుడైన పరమేశ్వరునకు సతీమరణవార్త తెలిసెను యజ్ఞమును ధ్వంస మొనర్చుటకై వీరభద్రుని బంపెను వీరభద్రుడు యజ్ఞశాల కేగి యజ్ఞమును ధ్వంస మొనర్చి దేవతలకు యథోచితమైన ఫలము నొసగెను

చౌ॥ ఖై జగవిదిత దచ్ఛ గతి సోఈ ।
జసి కథు సంభు బిముఖ త్తై హోఈ ॥
యహ ఇతిహాస సకల జగ జానీ ।
తాతే మైం సంచేప బఖానీ ॥ 392

తా॥ భవానీపతియైన, సుఖస్వరూపుడై సర్వసమర్థుడై సాక్షాత్ శంకరునకు విముఖుడై, వైరము బూనినందులకు ఎవ్వరు సంహారింపబడెను శివద్రోహుల కేగతి గలిగెనో ఆ గతియే దక్షునకు గలిగెను

ఈ యితిహాస మందరికిని దెలిసినదే, కనుక నేను సంక్షిప్తముగా వర్ణించి నాను

వి॥ 'యహ ఇతిహాస సకల జగజాని । తాతే మైం సంక్షేప బఖానీ' యని పలికి యున్నారు అనగా ఈ యితిహాస మెల్లరకు తెలిసినది గావున తాను సంక్షిప్తముగా రచించితి నని శ్రీతులసీదాసు తెలుపుచున్నాడు ఇతిహాసమును సంక్షిప్తముగ రచించిన వారెరైనా పరికించచూడ ఇదెంతయో విపులముగను మనోరంజకముగ నున్నది ఇకముందటి రచనలో కవి పార్వతీజననము గురించి సుస్పష్ట పులకరించినాడు

## పార్వతీ జననము

చౌ॥ సతీం మరత హరి సన బరు మాగా ।
జనము జనము సివ పద అనురాగా ॥
తేహి కారన హిమగిరి గృహ జాఈ ।
జనమీం పారబతీ తను పాఈ ॥ 393

తా॥ సర్వమంగళయైన సతీదేవి దేహమును యోగాగ్నియందు భస్మము నొనరించు నెడ ఎన్ని జన్మములెత్తినను (జన్మజన్మములకు) సర్వలోక శుభ కరుండైన విశ్వేశ్వరుని పాదపద్మములపై భక్తి, ప్రేమానురాగము లుండు టులును, త్రిగుణములు స్వరూపములుగా గలవాడును, స్థూలసూక్ష్మకారణ శరీర

ములను జయించినవాడునైన శంకరునే తన తపఃఫలముగాను, భర్తగాను గోరి యుండెను ఆ కారణమువలననే ఆమె హిమాచలునిగృహమున పార్వతియై జన్మించెను

చౌ॥ జబ తే ఉమా సైల గృహ జాఈ ।
సకల సిద్ధి సంపతి తహఁ ఛాఈ ॥
జహఁ తహఁ మునిన్హ సుఆశ్రమ కీన్హే ।
ఉచిత బాస హిమ భూధర దీన్హే ॥ 394

తా॥ ఎప్పుడు ఉమామహేశ్వరి హిమాచలుని గృహమున జన్మించెనో, అప్పుడు హిమాచలుని గృహము సకలసంపదలతో తులతూగెను సకలసిద్ధు లాతనికి కరతలామలకము లాయెను హిమాచలుడు, ఆశ్రమములు నిర్మించు కొనుటకై మునుల కుచితస్థానముల నొసగెను

శాశ్వతముగా వెలుగొందెడు తల్లియు, జగదంబయైన పార్వతి యెచ్చట అవతరించెనో అచ్చట సంపదలకు లోటుండునా ?

దో॥ సదా సుమన ఫల సహిత సబ ద్రుమ నవ నానా జాతి ।
ప్రగటీ సుందర సైల పర మని ఆకర బహు భాఁతి ॥ 395

తా॥ ఆ సుందర పర్వతము నవీనవృక్షములచె సర్వదా పుష్పఫల భరితమై యొప్పారుచుండెను ఆ పర్వతము వివిధములైన మణుల కాలవాల మాయెను

వి॥ హిమవంతుడేలు ఆ పర్వత ప్రాంతము సహజముగ మనోహరమైనది కడు రమణీయమైనది జగజ్జననియైన పార్వతి జన్మించి నంతనే హిమాచలునకు సంపద హెచ్చినదని భావము

చౌ॥ సరితా సబ పునీత జలు బహహీఁ ।
ఖగ మృగ మధుప సుఖీ సబ రహహీఁ ॥
సహజ బయరు సబ జీవన్హ త్యాగా ।
గిరి పర సకల కరహిఁ అనురాగా ॥ 396

తా॥ ెదులన్నియు పవిత్రమైన నిర్మలమై జలముతో ప్రవహించు దెను పశుపక్ష్యాదులు, భ్రమరములు, సుఖముగా సంచరించుచుండినవి జీవు ్నయు తమ స్వాభావికమైన వైరభావమును విడచి పరస్పరము ప్రేమతో చరించుచుండెను

॥ సోహ సైల గిరిజా గృహ ఆఏ ।
జిమి జను రామభగతి కె పాఏ ॥
నిత నూతన మంగల గృహ తాసూ ।
బ్రహ్మాదిక గావహిం జసు జాసూ ॥ 397

తా॥ రామభక్తిని పొంది భక్తు డమిత తేజముతో విరాజిల్లు ంబికు ్వతి పర్వతరాజైన హిమాచలుని గృహమున జన్మించిన తరువాత ఆ పర్వత ్ అధికాధికమాయెను పర్వతరాజ గృహము నిత్యమంగళము పచ్చతోరణ ా విరాజిల్లెను జగదంబ యవతరించి ంతనే ఆమె యశమును, ఔన్నత్య ు గూర్చి బ్రహ్మాదిదేవతలు గానముజేసిరి

వి॥ గవంతుని యందలి పరమప్రేమయే భక్తి యనబడును క జన్మలలో సంపాదించుకొనిన పుణ్యములన్ని గూ గలసి, ్పరాశిగా యేర్పడి, దాని ఫలితముగా ఈ భక్తి యనునది ఒకా ానికి కలుగుచున్నది భగవదనుగ్రహము వలన, మహాత్ముల ువలన భక్తి కలుగును 'చతుర్విధా భజంతే మాం జ స్సు ినోఽర్జున' అని భగవద్వాక్యము అటువంటి అనన్యమైన రామ సామ్రాజ్యమును కర్తుడైన వా డమితతేజముతో విరాజిల్ల డునా! యన్న భావమిచ్చట కవి స్ఫురింపజేయుచున్నాడు

జగదంబ హిమాచలునింట నవతరించెను గాన ఆమె యశ ందను బ్రహ్మాదిదేవతలు గానము జేసిరని 'బ్రహ్మాదిక గావహిం జాసూ' యని విరచించుచు జగదంబ యవతారము బ్రహ్మాది తల కపరిమితానందము కలుగజేసెనని శ్రీతులసీదాసిచట స్పష్టిక ినాడు

చౌ॥ నారద సమాచార సబ పాఏ ।
కౌతుకహీఁ గిరి గేహ సిధాఏ ॥
సైలరాజ బడ ఆదర కీన్హా ।
పద పఖారి బర ఆసను దీన్హా ॥ 398

తా॥ జగజ్జననియైన భవాని పర్వతరాజగృహమున జన్మించి బాల్యచంద్రుని వలె దినదిన ప్రవర్ధమానయగుచున్నదన్న వార్తను నారదమునీంద్రుడు విన్నవాడై, కుతూహలముతో హిమాచలుని గృహమునకు వేంచేసెను. పర్వతరాజు నారదమునీంద్రుని పాదపద్మములను కడిగి సత్కరించి యుత్తమాసనము నొసగెను.

చౌ॥ నారి సహిత ముని పద సిరు నావా ।
చరన సలిల సబు భవను సించావా ॥
నిజ సౌభాగ్య బహుత గిరి బరనా ।
సుతా బోలి మేలీ ముని చరనా ॥ 399

తా॥ అటుపిమ్మట పత్నీసమేతుడై పర్వతరాజు మునీంద్రుని పాదపద్మములకు సాష్టాంగనమస్కారము నర్పించెను. వారి చరణోదకమును తన గృహమంతటను చల్లెను. మీ రాకతో నా గృహము పావనమయ్యెను. నా భాగ్యమే భాగ్యమని చెప్పుచు హిమాచలుడు ఆనందభరితుడాయెను. సుకుమారి, సౌందర్యరాశియైన తన యేకైక పుత్రికను పార్వతిని పిలిచి మునిపాదపద్మములకు నమస్కరింపజేసి ఇట్లనెను- (ముందు దోహాకు అన్వయము)

దో॥ త్రికాలగ్య సర్బగ్య తుమ్హ గతి సర్బత్ర తుమ్హారి ।
కహహు సుతా కే దోష గున మునిబర హృదయఁ బిచారి॥
400

తా॥ "ఓ మునీంద్రా! మీరు త్రికాలజ్ఞులు! సర్వజ్ఞులు! త్రిలోకసంచారులు! కాన నా పుత్రిక యొక్క గుణదోషములను గూర్చి బాగుగా నాలోచించి నాకు తెలియజేయుడు."

చౌ॥ వహ ముని బిహసి గూఢ మృదుబానీ ।
సుతా తుమ్హారి సకల గున ఖానీ ॥
సుందర సహజ సుసీల సయానీ ।
నామ ఉమా అంబికా భవానీ ॥ 401

తా॥ అత్యంత వినయ పూర్వకమైన ఆ వాక్యములను విని నారదముని సంతుష్టుడై మృదుమధురముగ గూఢమైన వచనముల నిట్లు పల్కెను

ఓ పర్వతరాజా! నీపుత్రిక సద్గుణరాశి, సహజసౌందర్యవతి, సుగుణవతి మరియు సుశీల ఆమెయే జగదంబ, ఉమ, భవాని (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ సబ లచ్ఛన సంపన్న కుమారీ ।
హోఇహి సంతత పియహి పిఆరీ ॥
సదా అచల ఏహి కర అహివాతా ।
ఏహి తేఁ జసు పైహహిఁ పితు మాతా । 402

తా॥ సర్వలక్షణసంపన్నురాలు శివునికత్యంతప్రీతిపాత్రురాలు, సౌభాగ్యవతి, ఆరాధించుజనులకు సౌభాగ్యము నొసఁగు ఆదిశక్తి ఈమెను కన్న తల్లి దండ్రులైన మీరు ధన్యాత్ములు ఇక మీ రమితయశమును బడయుదురు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ హోఇహి పూజ్య సకల జగ మాహీఁ ।
ఏహి సేవత కఛు దుర్లభ నాహీఁ ॥
ఏహి కర నాము సుమిరి సంసారా ।
త్రియ చఢిహహిఁ పతివ్రత అసిధారా ॥ 403

తా॥ ఈమె జగత్తునందు అందరిచే పూజింపబడును ఈమె సేవజేసినచో దుర్లభమైనవి యుండదోపు ప్రపంచమునందున్న స్త్రీలు ఈమె నామస్మరణవలన, కత్తి వాదరవంటి పాతివ్రత్య సిద్ధిని పొందుచున్నారు

వి॥ అజ్ఞాన మాయిష్టమగు నీ లోకమునకు జగన్మాత మహాశక్తియై యున్నది ఆదిశక్తి, పరాశక్తి, పరమేశ్వరియగు జగన్మాత లోకాతీతయై తన నిత్యచైతన్యములో పరమేశ్వరుని వహించు చుండును తల్లివలె మన కోరికల నీడేర్చును అప్తులవలె మనకష్టముల కడ్డుపడును కనుక ఈమె జగత్తునందు అందరిచే ఆరాధింపబడు చున్నది

శ్రద్ధ, అంతరికత, సమర్పణము, ఎంత పూర్ణతరమైనచో అనుగ్రహము, సంరక్షణము అంతగా లభింపగలదు ఈ జగన్మాత నారాధించుటవలన ముఖ్యముగా అతివలకు పాతివ్రత్యము కరతలామలక మగుచున్నది

చౌ॥ సైల సులచ్ఛన సుతా తుమ్హారీ ।
సునహు జే అబ అవగున దుఇ చారీ ॥
అగున అమాన మాతు పితు హీనా ।
ఉదాసీన సబ సంసయ ఛీనా ॥ 404

తా॥ ఓ పర్వతరాజా! నీ పుత్రికా మణి సర్వలక్షణ సంపన్నురాలే గాని, యీమెలో రెండుమూడు దోషములు గానవచ్చుచున్నవి వానిని గూర్చి శ్రద్ధగా నాలకింపుము

గుణహీనుడును మాతాపితృ విహీనుడను, ఉదాసీనుడను (ముందు దోహాతో అన్వయము)

దో॥ జోగీ జటిల అకాము మన నగన అమంగల బేష ।
అస స్వామీ ఏహి కహఁ మిలిహి పరీ హస్త అసి రేఖా॥ 40౹

తా॥ యోగియు, జటాధారియు, నిష్కామహృదయుడును, నిరుపేదయు, అమంగళవేషధారియునైన పతి లభించురేఖ యీమె హస్తమునందు స్పష్టముగ గానవచ్చుచున్నది

వి॥ సృష్టికి పూర్వమే యున్నవాడును, మూడు కన్నులు గలవాడును, గొప్పజటాజూటము గలవాడును, కదలుచున్నసర్ప హారము గలవాడును, మిక్కిలిమనోహరమైన ఆకారము గలవాడను అయిన పరమేశ్వరుని నారదుడు నిరుపేద యనుచున్నాడు

నామమును బట్టియు, రూపమును బట్టియు ఏ దేవుడు శివుడో (మంగళకరుడో), ఎవనిస్మరణమాత్రమున సర్వత్ర జయమును, మంగళమును కలుగునో, ఆ మంగళకరుని అమంగళ వేషధారియని చెప్పుచు నారదుడు పార్వతిని బరీక్షించుచున్నాడు

చౌ॥ సునిముని గిరా సత్య జియఁ జానీ ।
దుఖ దంపతిహి ఉమా హరషానీ ॥
నారదహూఁ యహ బేదు న జానా ।
దసా ఏక సముఝబ బిలగానా ॥ 406

తా॥ త్రికాలజ్ఞుడై, సర్వజ్ఞుడైన నారదమునీంద్రుని వాక్కులను హిమవంతుడును, మేనాదేవియు నాలకించి మిగుల దుఃఖించిరి నారదమునీంద్రుని వాక్యము అసత్యము కానేరదని తలచినవారై శోకసముద్రమున మునిగిరి

కాని, తనమనంబున పరమేశ్వర పాదారవిందయుగళమును కల్పించిన గుణంబయైన పార్వతీదేవి బాలికయైనను, ఆ మాటలను విని భయము జెందక సన్నసిడి యయ్యెను

పార్వతి తనమనంబున సంతుష్టినొందిన రహస్యమును సర్వజ్ఞుడైన నారదమునీంద్రుడు దెలుంగ డాయెను బాహ్యదృశ్య మొకే విధమైనను అంతర్య మని గ్రాహ్యము భిన్న భిన్నముగ నుండును గాన మనోభావనల నెఱుంగుట సాధ్యము కానేరదు

॥ సకల సఖిఁ గిరిజా గిరి మైనా ।
పులక సరీర భరే జల నైనా ॥
హోఇ న మృషా దేవరిషి భాషా ।
ఉమా సో [illegible]

తా॥ నారదువాక్కు నాలకించి సఖులును, పర్వతరాజును మేనాదేవియు అశ్రుపూరితవదనులైరి దేవర్షి పలుకు లసత్యము కానేర వని మనంబున దలచినదై పార్వతి నారదవచనములను గోప్యముగా నుంచుకొనెను

చౌ॥ ఉపజేఉ సివ పద కమల సనేహూ ।
మిలన కఠిన మన భా సందేహూ ॥
జాని కు అవసరు ప్రీతి దురాఈ ।
సఖి ఉఛంగ బైఠీ పుని జాఈ ॥ 408

తా॥ అప్పటినుండియు పార్వతికి పరమేశ్వరుని చరణకమలములపై ప్రేమానురాగము లుత్పన్నమాయెను కాని, శివుని గలియుట మిగుల కష్టమన్న భావము గూడ ఆమెకు స్ఫురించినది కాని, అది సమయము కాదని యెంచి ఉమాదేవి తన ప్రేమను గుప్తముగా నుంచి, సఖియొడిలో గూర్చుండెను

వి॥ అమితమైనతేజస్సుగలవాడును, వేదవాక్యముల ద్వారా తెలిసికొనదగినవాడును, చిన్మయము, ఆనందమయమునైన స్వరూపము గలవాడును, సర్వదేవతలచేత గానముచేయబడువాడును, మాయోపాధికుడును, తాండవ మొనర్చుటయందు సంబరముగలవాడును, సుఖకరుడైన శంకరుని పాదపద్మములపై జగదంబయైన పార్వతికి ప్రేమానురాగములు, భక్తితాత్పర్యములు పెంపొందినప్పటి భావ మప్పుడు స్ఫురించుచున్నది శివారాధన యించుక కష్టమనియు, తపముచేతనే శంకరుడు సాక్షాత్కరించునన్న భావన ఆమెయందుత్పన్న మాయెను పరమేశ్వరుని ప్రత్యక్షము గావించుకొను దృఢ సంకల్పము గలదై యేమియు నెఱుగనిదానివలె ఉండినది

చౌ॥ ఝూఠి న హోఇ దేవరిషి బానీ ।
సోచహిం దంపతి సఖీం సయానీ ॥
ఉర ధరి ధీర కహఇ గిరిరాఊ ।
కహహు నాథ కా కరిఅ ఉపాఊ ॥ 409

తా॥ దేవర్షివాక్కు లసత్యములు కానేర వని తలచినవారై హిమవంతుడును, మేనాదేవియు చతురికరైనస్నేహాతురాంద్రుడును చింతింపసాగిరి కొంతసేపయిన తర్వాత ధైర్యము దెచ్చుకొని పర్వతరా జీవిధముగ నుడివెను

"స్వామీ! నారదమునీంద్రా! ఈ యాపదను దాటు నుపాయ మేదైనను సెలవిందు దాని నవశ్య మొనర్తును"

దో॥ కహ మునీస హిమవంత సును జో బిధి లిఖా లిలార।
దేవ దనుజ నర నాగ ముని కోఉ న మేట నిహార॥ 410

తా॥ అప్పుడు మునీంద్రు డిట్లనెను "ఓ హిమవంతా! వినుము విధాత నొసటను వ్రాసిన వ్రాతను దేవతలు దానవులు మానవులు, నాగులు, మునులు మరెవ్వరుగాని తప్పింపలేరు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ తదపి ఏక మైఁ కహఉఁ ఉపాఈ।
హోఇ కరై జౌ దైఉ సహాఈ॥
జస బరు మైఁ బరనేఉఁ తుమ్హ పాహీఁ।
మిలిహి ఉమహి తస సంసయ నాహీఁ॥ 411

తా॥ ఐనను నొకయుపాయమును నేను మీ కెఱింగించెదను దైవ మనుకూలించినచో తప్పక సిద్ధించును నేను మీకు జెప్పిన లక్షణములుగల వరుడే నిస్సందేహముగ ఉమకు లభించును

వి॥ వేదాంతవేద్యుడు, జగత్పతియు, నిత్యుడు, త్రిగుణాత్ముడును, మునుల మనంబులకు ప్రత్యక్షముగా నుండు జ్ఞానమూర్తియు, జటాజూటము గలవాడును నైన శంకరుడే పార్వతికి పతి కాగలడని నారదుడు స్పష్టీకరించుచున్నాడు

చౌ॥ జే జే బర కే దోష బఖానే।
తే సబ సివ పహిఁ మైఁ అనుమానే॥
జౌ బిబాహు సంకర సన హోఈ।
దోషఉ గున సమ కహ సబు కోఈ॥ 412

తా॥ పరునియం దేయే దోషములున్నవని చెప్పితినో అవి అన్నియు సర్వశ్రేష్ఠుడై, సర్వేశ్వరుడైన శివుని యందు గలవు శివునితో నీమెకు వివాహమైనచో జనులెల్లరును దోషములను గుణములుగా నెంచెదరు

వి॥ 'యశ్శివో నామ రూపాభ్యాం యా దేవీ సర్వమంగళా, తయోః సంస్మరణాత్పుంసాం సర్వతో జయమంగళమ్ -నామమును బట్టియు, రూపమును బట్టియు ఏ దేవుడు (శివుడు) మంగళకరుడో, ఏ దేవి (పార్వతి) సర్వమంగళయో వారిరువురి స్మరణము సర్వత్ర జయమును, మంగళమును గలిగించునని యిచట జెప్పబడినది

చౌ॥ జౌఁ అహి సేజ సయన హరి కరహీఁ
బుధ కఛు తిన్హ కర దోషు న ధరహీఁ ॥
భాను కృసాను సర్బ రస ఖాహీఁ ।
తిన్హ కహఁ మంద కహత కోఉ నాహీఁ ॥ 413

తా॥ విష్ణుభగవానుడు పాలకడలిపై శేషతల్పమున శయనించినను పండితజను లేదోషముల నారోపించలేదు అగ్నిదేవుడును, సూర్యభగవానుడును భూమియందుండు మంచి-చెడుగులనన్నిటిని భక్షణము చేయుచున్నారు కాని, యింతవరకు సూర్యుడు కళంకుడని యెవ్వరును జెప్పుటలేదు

వి॥ సూర్యుడు తన వేడిమిచే జనులను తపింపజేయుచున్నాడు సూర్యుడు వేయింతలుగా వర్షించుట కొఱకే భూమినుండి జలమును పీల్చును కాన 'సహస్రగుణ ముత్స్రష్టు మాదత్తే హి రసం రవిః' అన్న కాళిదాస సూక్తి యిచట అనుసంధేయము

చౌ॥ సుభ అరు అసుభ సలిల సబ బహఈ ।
సురసరి కోఉ అపునీత న కహఈ ॥
సమరథ కహుఁ నహిఁ దోషు గోసాఈఁ ।
[illegible]

తా॥ గంగానదిలో శుభ్రమైన-అశుభ్రమైన జలము ప్రవహించుచుండును కాని, గంగ నపవిత్రముగ ఎవ్వరును జెప్పుటలేదు సూర్యుడు అగ్ని మరియు పవిత్ర గంగవోలె సమర్థులకు దోషము లంటవు

గంగానది పరమపవిత్రమైనదని భావించుచున్నాము కదా॰ కాని, అందులో మంచి స్వచ్ఛమైన నీటితో బాటు మురికి నీరు కలసిపోవుచున్నది కదా॰ మురికి నీరున్నను మనము గంగను అపవిత్రమనుట లేదు కావున, అదే విధముగా యోగ్యుడైన వ్యక్తిలో కొన్ని దోషములున్నను, అవి దోషములుగా లెక్కింపబడవు సూర్యునకు, అగ్నికి గంగానదికి అపవిత్రదోష మంటదు అదే రీతి యోగ్యుడును దోషములచే అపవిత్రుడు కాడు

వి॥ హిమవంతుడు_ యోగి, జటాధారి, నిష్కామహృదయుడు, దిగంబరుడును, అశుభ వేషధారియునగు శివుని తనపుత్రిక వరించుచున్నదేయని చింతింపగా, నారదుడు శివునికి గల ఆ యా దోషములు పార్వతిని పరిణయమాడుటచే గుణములగునని పేర్కొనుచున్నాడు పైగా ఆ దోషములన్నియు బాహిరములైనవి వేష భూషలకు సంబంధించినవి కాని, ఆంతరములైనవి కావు యోగులకు వేషాడంబర ముండదు కాని, అంతఃస్వచ్ఛత అధికము తులసీదాసు నారదుని ద్వారా మానవులకు వేష భూషాది బాహ్యాడంబరములు స్వచ్ఛత నీయవనియు, వానిని చూచి మోసపోవలదనియు అంతఃస్వచ్ఛతను పరిశీలించి యోగ్యతను నిర్ణయింపవలెననియు ఉద్బోధించుచున్నాడు ఉదాహరణముగా సూర్యుడు, అగ్ని, గంగను పేర్కొన్నాడు అగ్ని సర్వభక్షకుడు, కాని, పవిత్రుడే! గంగలో వలసినంత మాలిన్యము కలదు అయినను పవిత్రురాలే! సూర్యుడు తన కిరణములను అపవిత్ర స్థలములలో కూడ ప్రసరింప జేయును గ్రహణ దోషమును కలదు అయినను పవిత్రుడే! అట్లే యోగ్యులైన పురుషులలో దోషము లున్నట్లు కాన్పించినను నవి దోషములు కావని

దో॥ జౌం అస హిసిషా కరహిం నర జడ బిబేక అభిమాన ।
పరహిం కలప భరి నరక మహుం జీవ కి ఈస సమాన॥ 415

తా॥ సాధువుల దోషములను చూచి సామాన్య మానవులు తాము వారి దోషములను గ్రహించి, గర్వముచే తాము గొప్పవారమని భావించుట తగదు అట్టి జడులు తమ దోష సామ్యముచే మహాత్ములుగా తమ్ము తాము భావించినచో, వారు కల్పాంతము వఱకు నరక కూపమున బడిపోవుట తథ్యము ఎలయన, మహాత్ములు పరమాత్మస్వరూపులు వారిలో దోషములు లీలలు మాత్రమే సామాన్యుడైన జడుడు తాను వారితో సమానుడని తలంచుట జీవుడు దేవునితో సమాను డనుటయే

వి॥ నారదుని హితబోధలోని అంతర్యమేమన శివుడు పరమాత్ము డనియు అతనితో సామ్యత జడ స్వరూపుడైన హిమవంతునకు లేద నియు స్ఫురించుచున్నది జీవుడు దేవునితో సమానుడగునా? _ అని ప్రశ్నార్థక సూచనచే శ్రీ తులసిదాసు ప్రస్ఫుటముగా ద్వైత మును ప్రతిపాదించుచున్నాడు దేవుడు దేవుడే! జీవుడు జీవుడే! జీవు డెన్నటికి దేవుడు కాజాలడనుట ద్వైతము శ్రీతులసీదాసు ద్వైతమును బోధించుట ఆశ్చర్యమే యగును కాని ఇచట సామాన్యు డైన జడుడైన జీవుడని భావింపవలెను అట్టి జీవునకు దైవత్వమెట్లు సిద్ధించును? కొందరు అద్వైతులు కొన్ని దైవగుణములను తమలో నాపాదించుకొని 'సోఽహం' అని గర్వపడుచుందురు అట్టి గర్విష్ఠు లెన్నటికిని దైవత్వము పొందలేరనియు, పతనముపొంది ఆకల్పాంతము నరకలోకవాసులగుదురనియు, సమకాలికులైన కొందఱు తత్త్వ వేత్తలను దృష్టిలోనుంచుకొని తులసీదాసు జ్ఞానబోధ చేయుచున్నాడు

చౌ॥ సురసరి జల కృత బారుని జానా ।
కబహుం న సంత కరహిం తేహి పానా ॥
సురసరి మిలేం సో పావన జైసేం ।
ఈస అనీసహి అంతరు తైసేం ॥ 416

తా॥ మద్యము గంగానదీ జలములచే తయారు చేయబడినను దానిని బుద్ధి మంతులు త్రాగరు కదా। కాని మద్యము గంగలో కలిసినను గంగను పవిత్ర ముగనే భావింతురు మద్యము జీవుడు గంగ దేవుడు జీవుడు దేవునిలో కలసి దైవత్వము పొందవచ్చును అపు డాతడు పవిత్రు డగును కాని దైవ గుణములను తా నాపాదించుకొన్నంత మాత్రమున, గంగతో చేసిన మద్యమువలె తాను పవిత్రుడు కాజాలడు ఇదియే జీవునకు దేవునకుగల తారతమ్యము నారదునిచె శివుని పరబ్రహ్మత్వము వ్యక్తీకరింప బడినది

వి॥ శ్రీ తులసీదాసు జీవుని దేవుని మద్యముతో గంగతో క్రమ ముగా పోల్చి జీవదేవతారతమ్యమును నిరూపించుచున్నాడు నాటి అద్వైతమున అహంకారము పెరిగి స్వచ్ఛత నశించి యుండవచ్చును దానిని అన్యాపదేశముగా తులసీదాసు నారదవాక్యముగా వ్యక్తీకరిం చుచున్నాడు ఇందులో జీవుడు పరమాత్మునితో ఐక్యత పొంది పవిత్రుడు కావలెనని యు, కేవలము బాహ్యములైన దైవగుణములచే భగవంతునివలె పవిత్రుడగుట అసంభావ్యమనియు సారాంశము కొందరు యోగులవలె కాన్పించుచు మానసిక స్వచ్ఛత లేక వర్తించి తామే భగవంతులమని విఱ్ఱవీగుదురు। అట్టివారు గంగతో చేసిన మద్యము వంటి వారు మద్య గుణము గలవారే అట్లుగాక అంతర స్వచ్ఛతచే భగవంతునిలో తాము లీనమైనచో తాము మద్యతుల్యు లయ్యు స్వచ్ఛులగుదురు గంగానదిలో కలసిన మద్యము గంగయే అగునుకదా। ఇది శ్రీతులసీదాసు బోధించిన అద్వైతము

చౌ॥ సంభు సహజ సమరథ భగవానా।
ఏహి బిబాహఁ సబ బిధి కల్యానా॥
దురారాధ్య పై అహహిఁ మహేసూ।
అసుతోష పుని కియేఁ కలేసూ॥ 417

తా॥ శివుడు సహజ సమర్థుడు, సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, పరమాత్ముడు కాన ఈ వివాహ మన్నివిధముల మంగళకరమైనది కాని, మహాదేవుడనబడు

దేవుడును, సకల జీవులకు పతియునైన శంకరు నారాధించుట బహు కష్టతరము తపము జేసినచో నతి శీఘ్రముగా శివుడు ప్రసన్నుడై సర్వాభీష్టములనొసగును

వి॥ శివునకు రెండు ఆకారములు గలవు ఒకటి రౌద్రము, ఇంకొకటి హృద్యము (సౌమ్యము) 'హృద్యము' అనుటలో హృదయముచే పొందదగినవాడు ప్రేమచేతనే చిక్కువాడు తపము చేతనే సాక్షాత్కరించువాడు

తన తపోనిష్ఠచే పార్వతి పరమేశ్వరుని సంతుష్టునొనర్చునని నారద మునీంద్రుడు నుడువుచున్నాడు

చౌ॥ జౌఀ తపు కరై కుమారి తుమ్హారీ ।
భావిఉ మేటి సకహిఀ త్రిపురారీ ॥
జద్యపి బర అనేక జగ మాహీఀ ।
ఏహి కహఀ సివ తజి దూసర నాహీఀ ॥ 418

తా॥ నీ పుత్రికయైన పార్వతి తప మొనరించినచో త్రిపురారియైన శివుడు ప్రసన్నుడగును ఈ జగత్తునందు వరు లనేకులు గలరు కాని, శంకరుడే పార్వతికి తగిన పతి

వి॥ సమస్తయోగుల చేత ధ్యానింపదగినవాడును సర్వదేవతలచేత నారాధింపబడువాడును, అమితతేజస్స్వరూపుడును, మాయోపాధికుడును, త్రిపురాసురులను జయించినవాడును నైన శంకరుడే పార్వతికి తగిన వరుడని నారదుడు ముందు జరుగబోవు శివపార్వతుల కల్యాణమును సూచించుచున్నాడు

'ఏహి కహ సివ తజి దూసర నాహి' అనుమాటలలో కవి పార్వతీ దృఢసంకల్పము నతిచమత్కారముగా చిత్రీకరించినాడు

చౌ॥ బర దాయక ప్రనతారతి భంజన ।
కృపాసింధు సేవక మన రంజన ॥
ఇచ్ఛిత ఫల బిను సివ అపరాధేఁ ।
లహిఅ న కోటి జోగ జప సాధేఁ ॥ 419

తా॥ వరముల నొసగువాడును శరణాగతుల దుఃఖములను నాశ మొన రించువాడును, కరుణాసముద్రుడును, భక్తుల మనస్సులను రంజింప జేసెడి వాడును నైన శివునారాధింపనిదే కోట్లకొలదిసంవత్సరములు జపతపముల నొన ర్చినను మనోవాంచిత ఫలము లీడేరవు

వి॥ మనోవాక్కాయ కర్మల ద్వారా భగవత్సేవ కర్తవ్య మనెడి విషయము ఇచ్చట ప్రకటితమైనది ఆశ్రితుల యోగక్షేమము లను విచారించువాడును, సమస్త శ్రేయస్సులను ప్రసాదించుటకై నిరీక్షించువాడును, ఇహమునకు, పరమునకు సమ్మతమైన హిత మును బోధించుట యందు నిపుణుడును, లోపల వెలుపల వ్యాపించి యున్నవాడును, సర్వము నెఱింగినవాడునునైన పరమేశ్వరు నారా ధింపనిదే ముక్తి కలుగదనియు, మనోవాంఛిత ఫలము లీడేరవనియు కవి యిచట విశదీకరించుచున్నాడు

త్వమేవ శరణం మమ' అని శరణు జొచ్చుట, వేడుకొనుట అతి ముఖ్యము 'శంకరా! నిన్ను శరణు జొచ్చుచున్నాను కనికరముతో నన్ననుగ్రహింపు' మని భక్తుడు ప్రార్థింపవలయును భగవద్దర్శనమునకై పరితపింప వలయునన్న భావన కూడ ఇందు స్ఫురించుచున్నది

దో॥ అస కహి నారద సుమిరి హరి గిరిజహి దీన్హి అసీస ।
హోఇహి యహ కల్యాన అబ సంసయ తజహు గిరీస ॥ 420

తా॥ అని నుడివి శ్రీమన్నారాయణుని స్మరించుచు నారద మునీంద్రుడు పార్వతి నాశీర్వదించి పర్వత రాజుతో నిట్లనియె—

ఓ పర్వతరాజా! నీవు సంశయములను విడిచిపెట్టుము నీకు శుభమగుగాక! అనెను

చౌ॥ కహి అస బ్రహ్మభవన ముని గయఊ ।
ఆగిల చరిత సునహు జస భయఊ ॥
పతిహి ఏకాంత పాఇ కహ మైనా ।
నాథ న మైఁ సముఝే ముని బైనా ॥ 421

తా॥ ఆ విధముగ నుడివి నారదుఁడు బ్రహ్మలోకమున కేగెను ఇప్పుడు ముందు జరుగుబోవు చరిత్రను శ్రద్ధతో నాలకింపుఁ

పతియైన పర్వతరా జేకాంతముగ నుండినది గమనించినదై మేనాదేవి దీనవచనముతో పతిని జేరి యివ్విధముగ నుడివెను

ఓ నాథా! నాకు ముని నుడివిన వాక్యములందలి యర్థము బాగుగా తెలియలేదు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ జౌఁ ఘరు బరు కులు హోఇ అనూపా ।
కరిఅ బిబాహు సుతా అనురూపా ॥
న త కన్యా బరు రహఉ కుఆరీ ।
కంత ఉమా మమ ప్రానపిఆరీ ॥ 422

తా॥ మన కన్యకయైన పార్వతి కనుకూలుడైన వరుడు ఉత్తమకుల సంజాతుడై ఐశ్వర్యవంతుడైనచో వివాహము జేయుము లేకపోయినచో నాపుత్రిక అవివాహితగా నుండుట నాకిష్టమే! పార్వతి నాకు ప్రాణప్రియమైనది కనుక అయోగ్యునకు పార్వతినిచ్చి వివాహమొనర్చుట నా కెంతమాత్రి మిష్టములేదు

వి॥ యువతులకు కలుగు సామాన్యభావములే పార్వతి జననియైన మేనాదేవి కావరించినవి పార్వతి జగదంబ, ఆదిశక్తియని యెఱుగనందున నారదమునీంద్రుని పలుకులు విన్నంతనే మేనాదేవి మనస్సు వికలమాయెను అందులకే అనుకూలుడైన వరుడు లభించనిచో పార్వతి కన్యగాఁడుండినను తన కాన దిదాయక మనుచున్నది

"ఉమా మమ ప్రానపిఆరీ" అని ఇచట తులసీదాసు విరచించి నాడు మేనాదేవికి ఉమ ప్రాణప్రియమైనదనియు, ఆమె శ్రేయస్సు కోసమే మేనాదేవి తల్లడిల్లుచున్నదని యినుచున్నాడు

చౌ॥ జౌం న మిలిహి బరు గిరిజహి జోగూ ।
గిరి జడ సహజ కహిహి సబు లోగూ ॥
సోఇ బిచారి పతి కరేహు బిబాహూ ।
జేహిం న బహోరి హోఇ ఉర దాహూ ॥ 423

తా॥ పార్వతికి యోగ్యుడైన వరుడు దొరికినివో, జనులందరును "పార్వతి స్వాభావికముగా మౌర్ఖ్యము వహించినదని" చెప్పెదరు కాన ఓ స్వామి ! ఇవన్నియు విచారించియే పార్వతికి వివాహమొనరించు ప్రయత్నములు చేయుము వివాహముచేసిన తరువాత సంతాపముతో క్రుంగకమునుపే చేయవలసినదంతయు సక్రమముగ జేయుడు

చౌ॥ అస కహి పరీ చరన ధరి సీసా ।
బోలే సహిత సనేహ గిరీసా ॥
బరు పావక ప్రగటై ససి మాహీం ।
నారద బచను అన్యథా నాహీం ॥ 424

తా॥ అని చెప్పుచు మేనాదేవి పతిచరణములపై వ్రాలెను అంత హిమవంతుడు మేనాదేవిని లేవనెత్తి "చంద్రునిలో అగ్నిని జూడవచ్చునేమో గాని త్రికాలజ్ఞుడైన, సర్వజ్ఞుడైన నారదమునీంద్రుని వాక్కు లెట్టిపరిస్థితులయందును అసత్యములు గ నేరవు"

దో॥ ప్రియా సోచు పరిహరహు సబు సుమిరహు శ్రీభగవాన ।
పారబతిహి నిరమయుఉ జేహిం సోఇ కరిహి కల్యాన ॥ 425

తా॥ ప్రియా ! సమస్తచింతలను వీడి భగవానుని స్మరింపుము పార్వతిని సృష్టిజేసిన పరమాత్ముడే ఆమెకు మేలు మొనగూర్చును

చౌ॥ అబ జౌఁ తుమ్హహి సుతాపర నేహూ ।
తౌ అస జాఇ సిఖావను దేహూ ॥
కరై సో తపు జేహిఁ మిలహిఁ మహేసూ ।
ఆన ఉపాయఁ న మిటిహి కలేసూ ॥ 426

తా॥ తపముచేతనే పరమేశ్వరుడు ప్రసన్నుడగునని నారదమునీంద్రులు నుడివిరి కనుక నీకు నిజముగ పార్వతియందు ప్రేమానురాగములుండిన నీ విప్పుడేపోయి పార్వతి తపముచేయుటకు సాధనభూతురాలవు గమ్ము ఇంకొక యుపాయములో ఈ క్లేశము మనకు దూరముగాదు

చౌ॥ నారద బచన సగర్భ సహేతూ ।
సుందర సబ గున నిధి బృషకేతూ ॥
అస బిచారి తుమ్హ తజహు అసంకా ।
సబహి భాఁతి సంకరు అకలంకా ॥ 427

తా॥ నారదమునీంద్రుల వచనములు రహస్యయుక్తములైనవి, సహేతుకములైనవి శివుడు సమస్తగుణముల కాటపట్టయినవాడు కాన ఇవన్నియు తెలిసినదానవై సందేహములను విడువుము అన్నివిధముల పరిశీలించి చూచినను శివుడు నిష్కళంకుడు

వి॥ ఎవడు వృషకేతుడో, ఎవడు ఆకాశము శిఖగాగలవాడో, ఎవడు సమస్త సర్పములకు రాజైన వాసుకియే ఆభరణము గలవాడో, ఎవడు జటా జూటము గలవాడో, ఎవడు తాండవమాడుటయందు సంబరపడువాడో, ఎవడు వేదాంతమనెడి ఉద్యానవనమునందు విహరించుటయం దనురాగము గలవాడో అ నీలకంఠుడైన శివుడమంగళస్వరూపు డెట్లగును?

అన్నివిధముల పరిశీలించినను శివుడు అమంగళవేషధారియైనను మంగళకరుడే, నిష్కళంకుడే యన్న ఒకానొక మహత్తర భావమిందు స్ఫురించుచున్నది కనుకనే కవి "సంకరు అకలంకా" అనగా శంకరుడు నిష్కళంకు డనెను

చౌ॥ సుని పతి బచన హరషి మన మాహీఀ ।
గఈ తురత ఉఠి గిరిజా పాహీఀ ॥
ఉమహి బిలోకి నయన భరే బారీ ।
సహిత సనేహ గోద బైఠారీ ॥ 428

తా॥ పతివచనములను నాలకించినదై మనసులోని ఖేదమునంతయు బాపుకొని, మేనాదేవి తక్షణమే తన యేకైకపుత్రికయు, సౌందర్యరాశియునైన పార్వతికడకుం జేరెను పార్వతిని జూచినంతనే ఆమె దుఃఖము మరల ఉప్పొంగెను అశ్రుపూరితనయనయై పార్వతిని ప్రేమతో తన ఒడియందు గూర్చుండజేసెను

వి॥ మందమారుత స్పర్శచేత హాయినొందినట్లు, హిమవంతుని పలుకు లామె కెంతియో సుఖమునొసగి, భయమును తొలగింప జేసినవి

చౌ॥ బారహిఀ బార లేతి ఉర లాఈ ।
గదగద కంఠ న కఛు కహి జాఈ ॥
జగత మాతు సర్బగ్య భవానీ ।
మాతు సుఖద బోలీఀ మృదు బానీ ॥ 429

తా॥ మాటి మాటికిని పార్వతిని హృదయమునకు హత్తుకొనెను ప్రేమాతిశయము వలన ఆమెకు నోటమాటరాలేదు కాని జగజ్జననియైన పార్వతి సర్వజ్ఞురాలు తన జననిస్థితి గమనించినదై ఆమెకు మనశ్శాంతి నిచ్చు మృదు భాషణములతో నిట్లనెను

దో॥ సునహి మాతు మైఀ దీఖ అస సపన సునావఉఀ తోహి ।
సుందర గౌర సుబిప్రబర అస ఉపదేసేఉ మోహి ॥ 430

తా॥ అమ్మా! నేను స్వప్నవృత్తాంతమును చెప్పెదను వినుము నేను స్వప్నమునందు శ్రేష్ఠుడైన గౌరవర్ణముగల బ్రాహ్మణోత్తముని గాంచితిని అతడు నాకిట్లుపదేశించెను

## పార్వతీ తపస్సు

చౌ॥ కరహి జాఇ తపు సైలకుమారీ ।
నారద కహా సో సత్య బిచారీ ॥
మాతు పితహి పుని యహ మత భావా ।
తపు సుఖప్రద దుఖ దోష నసావా ॥ 431

తా॥ పార్వతీ ! నారదాదేశానుసారము నీవరణ్యమునకు బోయి తపమాచరింపుము. తరువాత నీ వొనర్చిన ఘన కార్యమును నీ తల్లిదండ్రులు గూడ శ్లాఘింతురు. అంతియేగాక, తపము మనస్సునకు శాంతినొసగును, దుఃఖ దోషములను హరింపజేయును.

వి॥ గంగానదీ తీరములు, గ్రామ సమీపముగా నుండు అరణ్య ప్రదేశములు, పర్వత గుహలు, పరమేశ్వర ధ్యానమునకు నిలయములు. యోగులు అడవులలో ఆకులు, ఫలములు, కంద మూలములు భక్షించువారై చిత్తమును పరమేశ్వర పాదపద్మముల కర్పణచేసి, తపమొనర్చుచుందురు. కనుకనే శ్రీ తులసీదాసు 'తపు సుఖప్రద దుఖ దోష నసావా' అని నుడివెను. తపము దోషములను హరింపజేసి సుఖశాంతులను ప్రసాదించును. తపోనిష్ఠచే కృతార్థత సిద్ధించును, భగవత్సాక్షాత్కారము కలుగును. అప్పుడే యోగులు పరమయోగు లనబడెదరు.

చౌ॥ తపబల రచఇ ప్రపంచు బిధాతా ।
తపబల బిష్ను సకల జగ త్రాతా ॥
తపబల సంభు కరహి సంఘారా ।
తపబల సేషు ధరఇ మహిభారా ॥ 432

తా॥ తపోబలముతోనే బ్రహ్మ ఈ జగత్తును సృష్టించెను. తపోబలముతోనే విష్ణువు జగత్తును పాలించుచున్నాడు. తపోబలముతోనే మహేశ్వరుడు

జగత్తును సంహారము చేయుచున్నాడు తపోబలముతోనే శేషుడు పృథ్వీభార మును వహించుచున్నాడు (క్రింది దోహాతో అన్వయము)

చౌ॥ తప అధార సబ సృష్టి భవానీ ।
కరహి జాఇ తపు అస జియఁ జానీ ॥
సునత బచన బిసమిత మహతారీ ।
సపన సునాయఉ గిరిహి హఁకారీ ॥ 433

తా॥ భవానీ! సృష్టియంతయు తపముపై ఆధారపడియున్నది ఈ విషయము గ్రహించినదానవై నీవు తపముజేయ నుద్యుక్తురాలవుగమ్ము

అశ్రుపూరిత నయనయైయున్న మేనాదేవి స్వప్నవృత్తాంతమును విన్న తరువాత ఆశ్చర్య చకితురాలయ్యెను ఆమె యీ స్వప్న వృత్తాంతమును పర్వత రాజున కెఱింగించెను

చౌ॥ మాతు పితహి బహుబిధి సముఝాఈ ।
చలీఁ ఉమా తప హిత హరషాఈ ॥
ప్రియ పరివార పితా అరు మాతా ।
భఏ బికల ముఖ ఆవ న బాతా ॥ 434

తా॥ పార్వతి జననీజనకులను పెక్కుభంగుల నోదార్చి, ధైర్యమును జెప్పి, సంతోషముతో తపమొనర్చుట కరణ్యమునకు బోవ సంకల్పించెను అత్యంత సుకుమారియు, సౌందర్యరాశియైన తమ యేకైకపుత్రిక భోగవిలాసము లన్నింటిని త్యజించి, తపోవనములకు బోవు తఱి కుటుంబవాసులును, పర్వత రాజు - మేనాదేవియు చాల వ్యాకులత నొందిరి దుఃఖసముద్రమగ్నులై మునిగిన వారలు గావున వారి నోటినుండి యొకమాటైనను వెలువడలేదు ఆమె పోయిన కొంతసేపటివఱకు మౌనమే రాజ్యముచేయు చున్నదా యన్నటులుండెను

దో॥ బేదసిరా ముని ఆఇ తబ సబహి కహా సముఝాఇ ।

తా॥ ఆ దుఃఖసమయము మహానుభావుడైన వేదశిరుడను ముని విచ్చేసి అందరి నూఱడించెను పార్వతి జగదంబ, ఆదిశక్తియనుచు పార్వతీ మహాత్మ్యము గూర్చి వారి కెఱింగించెను అది విన్న తరువాతనే సర్వులును సమాధానపడిరి

చౌ॥ ఉర ధరి ఉమా ప్రానపతి చరనా ।
జాఇ బిపిన లాగీఁ తపు కరనా ॥
అతి సుకుమార న తను తప జోగూ ।
పతి పద సుమిరి తజేఉ సబు భోగూ ॥ 436

తా॥ ప్రాణపతియైన సర్వేశ్వరుడైన పరమశివుని పాదారవిందములను అంతఃకరణకమలమున ప్రతిష్ఠించుకొని పార్వతి తపోవనమునకుబోయి తపము జేయ దొడగెను పార్వతి అత్యంత సుకుమారి ఆమె సర్వైశ్వర్యములతో తులతూగుచుండినది ఆమె శరీరము తపమునకు కొంచెమాత్రము యోగ్యమైనది కాదు తాను నీశ్వరుని ప్రసన్నుని జేసికొనుటకై యామె భోగవిలాసము లన్నిటిని తృణప్రాయముగ నెంచి త్యజించి సర్వేశ్వరుని శరణు పొందెను

వి॥ 'ఉర ధరి ఉమా ప్రానపతి చరనా' అని కవి ఇచట పేర్కొన్నాడు మనస్సు పరమేశ్వరుని పాదపద్మములయందును, బుద్ధి పరమశివుని ధ్యానించుట యందును, కన్నులు మహాదేవుని దివ్యమంగళ విగ్రహవైభవమును దర్శించుట యందును నిష్ఠగలవాయెను

చౌ॥ నిత నవ చరన ఉపజ అనురాగా ।
బిసరీ దేహ తపహిఁ మను లాగా ॥
సంబత సహస మూల ఫల ఖాఏ ।
సాగు ఖాఇ సత బరష గవాఁఏ ॥ 437

తా॥ తపమాచరించుట ప్రారంభించిన పార్వతికి స్వామి (శంకరుని) పాదారవిందములపై నిత్య నూతనానురాగ ముత్పన్నమాయెను తపోనిష్ఠయందు మనస్సు లీనమైయుండుటచేత తన్ను తాను మరచిపోయెను ఒక వేయిసంవత్సరములు కందమూలఫలాదు లారగించి పార్వతి తదేక నిష్ఠతో తపమాచరించెను తరువాత నూరు సంవత్సరములు ఆకులలము లారగించి తపమొనరించెను

చౌ॥ కఛు దిన భోజను బారి బతాసా ।
కిఏ కఠిన కఛు దిన ఉపబాసా ॥
బేల పాతీ మహి పరఇ సుఖాఈ ।
తీని సహస సంబత సోఇ ఖాఈ ॥ 438

తా॥ పార్వతి కొంతకాలము కేవలము జలము వాయువునే ఆహారముగా గ్రహించెను తరువాత కొన్ని దినములు కఠినోపవాసములతో గడిపెను మారేడాకులు ఎండి భూమిపై బడుచుండగా మూడువేలసంవత్సరములు వానిని తిని తపమాచరించెను

చౌ॥ పుని పరిహరే సుఖానేఉ పరనా ।
ఉమహి నాము తబ భయఉ అపరనా ॥
దేఖి ఉమహి తప ఖీన సరీరా ।
బ్రహ్మ గిరా భై గగన గభీరా ॥ 439

తా॥ తరువాత ఎండుటాకులను గూడ తినుట మానివేసెను అప్పుడు పార్వతి నామము అపర్ణ యైనది తపముచే క్షీణించిన యామెనుజూచి గంభీరమైన బ్రహ్మవాణి ఆకాశమునుండి యిట్లు పలికెను (ముందు దోహాతో అన్వయము)

దో॥ భయఉ మనోరథ సుఫల తవ సును గిరిరాజకుమారి ।
పరిహరు దుసహ కలేస సబ అబ మిలిహహిఁ త్రిపురారి ॥ 440

తా॥ ఓ పర్వత రాజకుమారీ! వినుము నీ మనోరథ మీడేరినది నీ వికమీఁద అధిక క్లేశమునకు బాల్పడజేయునట్టి యీ తపమును చాలింపుము నీకు శివుడు పతి కాగలడు

చౌ॥ అస తప కాహుఁ న కీన్హ భవానీ ।
భఏ అనేక ధీర ముని గ్యానీ ॥
అబ ఉర ధరహు బ్రహ్మ బర బానీ ।

తా॥ భవానీ! జ్ఞానులు, తపోధను లెందరో కలరు కాని, నీవు చేసినటు వంటి కఠోరతపము నితరు లెవ్వరును జేయలేక పోయిరి నీకు నీవే సాటి ఇది శ్రేష్ఠమైన బ్రహ్మవాణిని సత్యముగను నిరంతరము పవిత్రముగను భావించి, ఈ వాక్యమును నీ హృదయమున గుప్తముగ నుంచుకొనుము

చౌ॥ ఆవై పితా బోలావన జబహీం ।
హఠ పరిహరి ఘర జాఏహు తబహీం ॥
మిలహిం తుమ్హహిం జబ సప్త రిషీసా ।
జానేహు తబ ప్రమాన బాగీసా ॥ 442

తా॥ ఎప్పుడు నీ జనకుడు నిన్ను పిలువ పంపునో యప్పుడు హఠపూర్వకమైన నీ పట్టును వీడి గృహమున కేగవలయును సప్తర్షులు నిన్ను గలసినపుడీ వాక్యము సత్యమైనదని నీవు తెలిసికొనవలయును

చౌ॥ సునతి గిరా బిధి గగన బఖానీ ।
పులక గాత గిరిజా హరషానీ ॥
ఉమా చరిత సుందర మైం గావా ।
సునహు సంభు కర చరిత సుహావా ॥ 443

తా॥ ఆకాశమునుండి వెలువడిన బ్రహ్మవాణిని విన్న తరువాత పార్వతి మిక్కిలి కుదుటబడెను సంతోషముతో నామె శరీరము పులకితమాయెను

ఇట్లు యాజ్ఞవల్క్యమహాముని భరద్వాజునితో నేను పార్వతీ చరితమును గూర్చి చెప్పితిని ఇక శివచరితమును శ్రద్ధతో నాలకింపు మనెను

## శ్రీరాముడు శివుని వివాహమునకై ప్రోత్సహించుట

చౌ॥ జబ తేం సతీ జాఇ తను త్యాగా ।
తబ తేం సివ మన భయఉ బిరాగా ॥
జపహిం సదా రఘునాయక నామా ।
జహం తహం సునహిం రామ గున గ్రామా ॥ 444

తా॥ సతీదేవి దక్షగృహమున యోగాగ్నిచే తన శరీరమును భస్మము జేసికొనిన తరువాత శివునకు వైరాగ్య మధికమాయెను శివుడు సదా రామనామము నే జపించుచుండెను ఎచటికేగినను శ్రీరామ గుణగానమునే వినుచుండెను శ్రీరామ కథామృతమునే గ్రోలుచుండెను

దో॥ చిదానంద సుఖధామ సివ బిగత మోహ మద కామ ।
బిచరహిఁ మహి ధరి హృదయఁ హరి సకల లోక
అభిరామ ॥ 445

తా॥ చిదానందుడు, సుఖధాముడు కామక్రోధమదమోహ రహితుడు సంపూర్ణ జగత్తున కానందము చేకూర్చెడివాడైన శంకరభగవానుడు శ్రీహరిని (శ్రీరామచంద్రుని) మనోమందిరమున ప్రతిష్ఠించుకొని, రామని ధ్యానించుచు పృథ్వియందు సంచరింప దొడగెను

చౌ॥ కతహుఁ మునిన్హ ఉపదేసహిఁ గ్యానా ।
కతహుఁ రామ గున కరహిఁ బఖానా ॥
జదపి అకామ తదపి భగవానా ।
భగత బిరహ దుఖ దుఖిత సుజానా ॥ 446

తా॥ పరమేశ్వరుడు మునులకు జ్ఞానోపదేశము చేయుచుండెను శ్రీరామ చంద్రుని సుగుణ సంపదను మునులకు వర్ణించి చెప్పుచుండెను శివుడు సమర్థుడు నిష్కామ హృదయుడు గలవాడు అటువంటి [illegible] శంకరుడు తన చరణదాసి, సతీమణి, భక్తురాలు సతీదేవి వియోగ [illegible] ముచే మిగుల దుఃఖించుచుండెను

వి॥ కరుణ యనెడి [illegible] వాసియు, సజ్జనులచేత [illegible] ఆకారమును దాల్చువాడును, [illegible] సంబద్ధమైన పార్వతీ విరహ మును [illegible] చేయుచున్న తపము ఫలించెడు [illegible]

గనుకనే ఎం్రదశేఖరున కీ దశ సంప్రాప్తించినదన్న భావమిందు స్ఫురించుచున్నది

చౌ॥ ఏహి బిధి గయఉ కాల బహు బీతీ ।
నిత నై హోఇ రామ పద ప్రీతీ ॥
నేము ప్రేము సంకర కర దేఖా ।
అబిచల హృదయఀ భగతి కై రేఖా ॥ 447

తా॥ ఈ విధముగ ఎంతోకాలము గడచిపోయినది శంకరునకు శ్రీరామ చంద్రుని పాదపద్మములపై నిత్యనూతన ప్రేమ దినదినాభివృద్ధిగాంచుచుండెను శంకరుని నియమ నిష్ఠలు, అనన్య ప్రేమ, భక్తితాత్పర్యములు శ్రీరామచంద్రుని గదలించి వైచినవి శంకరుని హృదయమున పెంపొందిన భక్తిప్రేమలను శ్రీరామచంద్రుడు దివ్యదృష్టితో గాంచెను

చౌ॥ ప్రగటే రాము కృతగ్య కృపాలా ।
రూప సీల నిధి తేజ బిసాలా ॥
బహు ప్రకార సంకరహి సరాహా ।
తుమ్హ బిను అస బ్రతు కో నిరబాహా ॥ 448

తా॥ కృతజ్ఞుడను కృపాళుడును, రూపశీలముల కాటపట్టయినవాడును, మహాతేజోవంతుడును, భగవానుడునైన శ్రీరామచంద్రుడు శివునకు సాక్షాత్కరించెను శ్రీరాముడు శివుని బహువిధముల ప్రశంసించెను ఇంతటికఠిన వ్రతమును బాటించుట శంకరునకు దప్ప ఇతరుల కెవ్వరికిని సాధ్యముగాదని నుడివెను

చౌ॥ బహుబిధి రామ సివహి సముఝావా ।
పారబతీ కార జన్మ సునావా ॥
అతి పునీత గిరిజా కై కరనీ ।
బిస్తర సహిత కృపానిధి బరనీ ॥ 449

తా॥ దశరథనందనుడై శ్రీరామచంద్రుడు పార్వతీజన్మ వృత్తాంతమును శివున కెఱింగించెను కృపానాగరుడై శ్రీరామచంద్రుడు పార్వతి పవిత్రాచరణను గూర్చి సవిస్తరముగ వర్ణించెను (ముందు దోహతో అన్వయము)

దో॥ అబ బినతీ మమ సునహు సివ జౌఁ మో పర నిజ నేహు ।
జాఇ బిబాహహు సైలజహి యహ మోహి మాగేఁ దేహు॥450

తా॥ తదుపరి శివునితో ఇవ్విధముగ నుడివెను శంకరా, నాపై నీకు వాస్తవమైన ప్రేమగలదేని నీవు సత్వరముగ బోయి పార్వతిని పరిణయమాడుము

చౌ॥ కహ సివ జదపి ఉచిత అస నాహీఁ ।
నాథ బచన పుని మేటి న జాహీఁ ॥
సిర ధరి ఆయసు కరిఅ తుమ్హారా ।
పరమ ధరము యహ నాథ హమారా ॥ 451

తా॥ అను శ్రీరామచంద్రుని మాటలకు శంకరు డివ్విధముగ ప్రత్యుత్తరమొసగెను

ఐనను అట్లొనర్చుట యుచితముకాదు కాని స్వామి వాక్కు లే నాటికైన ఫలింపకపోవునా ! నీ యాజ్ఞను శిరసావహింతును నీ యాజ్ఞను పాలించుటయే నా ధర్మము కర్తవ్యము గదా !

చౌ॥ మాతు పితా గురు ప్రభు కై బానీ ।
బినహిఁ బిచార కరిఅ సుభ జానీ ॥
తుమ్హ సబ భాఁతి పరమ హితకారీ ।
అగ్యా సిర పర నాథ తుమ్హారీ ॥ 452

తా॥ మాత, పిత, గురువు, స్వామి ఇట్టివారి మాటలను విచారించకుండగనే శుభకరముగా నెంచవలయును నీవన్నివిధముల నా శ్రేయస్సును గోరువాడవు హితకారివి కనుక ఓ స్వామీ ! నీయాజ్ఞ నాకు శిరోధార్యము

చౌ॥ ప్రభు తోషేఉ సుని సంకర బచనా ।
భక్తి బిబేక ధర్మ జుత రచనా ॥
కహ ప్రభు హర తుమ్హార పన రహేఊ ।
అబ ఉర రాఖేహు జో హమ కహేఉ ॥ 453

తా॥ పశుపతియైన శివుని భక్తిజ్ఞానములను చూచియు, ధర్మయుక్తమైన వచనములను వినియు, శ్రీరాముడు సంతుష్టి జెందెను

'ఓ మహాదేవా! నీ ప్రతిజ్ఞ సమాప్తగావింపబడినది' నేను నుడివిన మాటలను మాత్రము మఱవక మనస్సునం దుంచుకొనుము నా కిచ్చిన మాట నే పరిస్థితియందు నీవు గూడ మఱపరాడదు

చౌ॥ అంతరధాన భఏ అస భాషీ ।
సంకర సోఇ మూరతి ఉర రాఖీ ॥
తబహిం సప్తరిషి సివ పహిం ఆఏ ।
బోలే ప్రభు అతి బచన సుహాఏ ॥ 454

తా॥ అని నుడివి శ్రీరామచంద్రు డంతర్ధాన మాయెను కరుణాసముద్రుడైన, దీనజన సంరక్షకుడైన శ్రీరామచంద్రు డంతర్ధానమైన తరువాత శంకరుడు శ్రీరామచంద్ర దివ్యమంగళ స్వరూపమును తన హృదయ పీఠమున ప్రతిష్ఠించుకొనెను అట్లు ప్రతిష్ఠించుకొని శ్రీరామనామామృతమును గ్రోలుచుండ సప్తర్షులు శివుని కడ కరుదెంచిరి వారెందుల కేతెంచిరో ఆ విషయము నెరింగినవాడై మృదుమధురముగ వారి కిట్లు చెప్పెను (ముందు దోహాతో అన్వయము)

## సప్తర్షులు పార్వతిని పరీక్షించుట_పార్వతీ మాహాత్మ్యము

దో॥ పారబతీ పహి జాఇ తుమ్హ ప్రేమ పరిచ్ఛా లేహు ।
గిరిహి ప్రేరి పఠఏహు భవన దూరి కరేహు సందేహు ॥455

తా॥ ప్రథమమున మీరు పార్వతి తపమాచరించు అరణ్య ప్రదేశమున కేగి యామె ప్రేమను, భక్తితాత్పర్యములను పరీక్షింపుడు తరువాత హిమాచలుని గృహమున కేగి, పార్వతిని ఇంటికి పిలిపింపవలెనని గా నాదేశింపుడు హిమాచలుని సందేహము లన్నిటిని బాపుడు

చౌ॥ రిషిన్హ గౌరి దేఖి తహఁ కైసీ ।
మూరతిమంత తపస్యా జైసీ ॥
బోలే ముని సును సైలకుమారీ ।
కరహు కవన కారన తపు భారీ ॥ 456

తా॥ శివు నానతిపై సప్తర్షులు తపోవనమున కేగిరి అచ్చట తపస్సే శరీరము దాల్చియున్నదా యన్నట్లున్న పార్వతిని గాంచిరి ఆమెను గాంచినవారై అత్యంతాశ్చర్యముతో సప్తర్షు లీవిధముగ నుడివిరి-

"శైలజా ! నీ వెందులకు ఎవరిని సాక్షాత్కరింపజేసికొనుట కింతటి కఠోరమైన తప మొనర్చుచున్నావు ?" (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ కేహి అవరాధహు కా తుమ్హ చహహూ ।
హమ సన సత్య మరము కిన కహహూ ॥
కహత బచన మను అతి సకుచాఈ ।
హఁసిహహు సుని హమారి జడతాఈ ॥ 457

తా॥ నీవెవరి నారాధించుచుంటివి ? నీ వేమి కోరి యింతటి ఘోరతపము నొనర్చుచుంటివి ? ఆ సత్యమును మర్మమును గూర్చి మాకేల యెఱింగింప కున్నావు ?

అని సప్తర్షు లడుగగా పార్వతి యిట్లు చెప్పెను - మీ రడిగిన ప్రశ్నలకు ప్రత్యుత్తరముగా ఆ మాట జెప్పుటకు నా కెందులకో సంకోచముగనున్నది ఏలన నా మూర్ఖతను (పట్టును) జూచి మీరు పరిహసింతురు (ముందు దోహాతో అన్వయము)

దో॥ మను హఠ పరా న సునఇ సిఖావా ।
చహత బారి పర భీతి ఉఠావా ॥
నారద కహా సత్య సోఇ జానా ।
బిను పంఖన్హ హమ చహహిఁ ఉడానా ॥ 458

తా॥ నా మనంబు మీ యుపదేశము నెంతమాత్రము నంగీకరింప జాలదు ఏలన, నేను హరముతో ఒక ఘనకార్యమును సాధింప సంకల్పించినాను నేను నీటియందు గోడగట్టుటకు బూనుకొన్నాను నారద మునీంద్రుడు చెప్పినదానిని నిజమని భావించి రెక్కలు లేకయే యెగురజూచుచున్నాను

వి॥ రెక్కలు లేని పక్షి యెగురుటకు బ్రయత్నించు చందంబున తాను మహేశ్వరుని బ్రసన్నుని గావించుకొన బ్రయత్న మొనరించుచున్నానని పార్వతి నుడువుచున్నది

చౌ॥ దేఖహు ముని అబిబేకు హమారా ।
చాహిఅ సదా సివహి భరతారా ॥ 459

తా॥ ఓ మునీశ్వరులారా! మీరు నా యజ్ఞానము జూడుడు నేను సాక్షాత్ పరమేశ్వరుని పరిణయమాడ నిచ్ఛగించుచున్నాను శంకరుడే పతిగావలయునని నిరంతరము వాంఛించుచున్నాను

దో॥ సునత బచన బిహసే రిషియ గిరిసంభవ తవ దేహ ।
నారద కర ఉపదేసు సుని కహహు బసే ఉ కిసు గేహ ॥ 460

తా॥ అత్యంతవినయపూర్వకమైన పార్వతి పల్కుల నాలకించి సప్తర్షులు హేళనగా నవ్విరి మరియు నిట్లనిరి - నీ శరీరము పర్వతముచే ఉత్పన్నమైనది గావున నారదుని పలుకులయందు విశ్వాసముంచి యింతటి ఘోరమైన తపమును జేయుటకు అరణ్యమునకు విచ్చేసితివి నారదుని యుపదేశములను వాతోత్తులను విన్నవారల సంసార మెవ్వరిది యింతపఱకు బాగుపడినది?
(ముందు దోహాతో అన్వయము)

చౌ॥ దచ్ఛ సుతన్హ ఉపదేసేన్హి జాఈ ।
తిన్హ ఫిరి భవను న దేఖా ఆఈ ॥
చిత్రకేతు కర ఘరు ఉన ఘాలా ।
కనకకసిపు కర పుని అస హాలా ॥ 461

తా॥ నారదుడు పిమ్మట పుత్రుల కుపదేశ మొసంగెను దానితో వారు మరల తిరిగివచ్చి యింటి యావరణములోని కైనను రాలేదు చిత్రకేతుని యిల్లు నారదునివలననే సర్వనాశనమైనది ఇదే స్థితి హారణ్యకశిపునకు గలిగినది

వి॥ నారదుని యుపదేశమును విన్నచో బాగు పడినవారె వరును లేరనియు అందుల కుదాహరణముగ చిత్రకేతుని, దక్షపుత్రుల చరిత్రలను విశదముగ సప్తర్షులు వివరించుచున్నారు

చిత్రకేతుడు చిత్రకేతుడను రాజు సంతానము లేక చింతిల్లు చుండెను ఒకనాడు చిత్రకేతుని కడకు నారదుడు, అంగిరసుడు విచ్చేసిరి వారికి నమస్కరించి, చిత్రకేతుడు తన కోరికను వారికి తెలియజేసెను ఈ కోరికను కోరవలదనియు, అది సిద్ధించినను వ్యర్థమే అగునని త్రికాలజ్ఞులైన, సర్వజ్ఞులైన మునులు నుడివిరి

ఎంత చెప్పినను రాజు విననందున, తుదకొక పుత్రుడుద్భ వించుననియు, అతని వలన సుఖ దుఃఖములు రెండును సంప్రాప్త మగుననియు నుడివి వెడలి పోయిరి కొంతకాలమునకు చిత్ర కేతుని భార్య గర్భవతియై పుత్రుని గనియె పుత్రు డుదయించినంతనే ఆమెపై రాజునకు ప్రేమ అతిశయించెను ఆమెపై రాజునకు ప్రేమాను రాగము లతిశయించుట గాంచి కడకు రాణు లా పసికందుకు విష మిచ్చి చంపివైచిరి వాడు మరణించినంతనే నారదాంగిరసమునీం ద్రులు మరల విచ్చేసి ఆ బాలకుని జీవాత్మను బిలిచి వాని పూర్వ జన్మవృత్తాంతమును వానిచే నిట్లు వినిపించిరి

"వీరు నా శత్రువులు పగదీర్చుకొనుటకే నేను వీరి యింట జన్మించితిని ఎవరు ఎవరికి తండ్రి! ఎవరు ఎవరికి పుత్రుడు!"

ఈ మాటలు విన్నంతనే చిత్రకేతునకు జ్ఞానోదయమాయెను ఈ వ్యామోహమును విడచి భగవాను నారాధింప దొడగెను

ఈ చిత్రకేతు మహారాజునే పార్వతి శపించుటచే వృత్రాసురు డాయెను

హిరణ్యాకశిపుడు - జయ విజయులను ద్వారపాలకులు దితి గర్భమున హిరణ్యాక్ష హిరణ్యాకశిపులను నామములతో జన్మించిరి వీ రిరువురును బలవంతులు 'రాత్రియందుగాని' పగటియందుగాని, భూమ్యాకాశములందుగాని, మనుష్యుని వలనగాని, మృగముల వలన గాని, దేవతల వలనగాని, రాక్షసులవలనగాని, సృష్టిలోని యే జీవివలన కూడ మాకు మరణము కలుగకుండునట్లు వరము ప్రసాదింపుమని బ్రహ్మను వేడి వరమును పొందిరి హిరణ్యాకశిపుడు దేవతలను హింసింప మొదలిడెను ఒకసారి హిరణ్యాకశిపుని భార్య లీలావతిని ఇంద్రుడు బంధించి తీసికొని పోవుచుండ నారదమునీంద్రు డామెను విడిపించి గర్భవతియైన ఆమెకు జ్ఞానోపదేశమును జేసెను ఆ యుపదేశమును గర్భస్థశిశువైన ప్రహ్లాదుడు బాగుగా విన్నవాడై హరిభక్తిని పెంపొం దింప జేసికొనెను నారదుని యుపదేశ ప్రభావమువలన ప్రహ్లాదుడు తండ్రి నెదిరించెడి వాడాయెను

అతడు నారదుడు పెంపొందింపజేసిన హరిభక్తిని వీడనందున తండ్రిచే హింసింపబడెను హింసించినను వినక ప్రహ్లాదుడు హిరణ్యా కశిపుని మరణమునకు కారకుడాయెను తుదకు నరసింహభగవానుని చేతిలో హిరణ్యాకశిపుడు మరణము నొందెను

నారదుని యుపదేశము వలన చిత్రకేతుని సంసారము బాగు పడలేదు హిరణ్యాకశిపుని కేస్థితి సంభవించినదో నీకు తెలియును గదా! కనుక నీ వీ ప్రయత్నమును మానుమని సప్తర్షులు పార్వతి నాదేశించుచున్నారు

చౌ॥ నారదసిఖ జే సునహిం నర నారీ ।
అవసి హోహిం తజి భవను భిఖారీ ॥
మన కపటీ తన సజ్జన చీన్హా ।
ఆపు సరిస సబహీ చహ కీన్హా ॥ 46౭

తా॥ స్త్రీ, పురుషులెవరైనను గాని నారదుని యుపదేశమును పాటించినచో ఇల్లు - వాకిలి విడచి నిక్కముగా బికారు లగుదురు నారదుడు కపటస్వభావము గలవాడు కాని వెలుపలికి సజ్జనుడుగా గనపడును

నారదుడు వేషధారి అతని శరీరమునందలి చిహ్నములను బట్టి యతడు సజ్జనుడుగా పరిగణింపబడుచున్నాడు తనవలె నందరిని దేశద్రిమ్మరులుగా చేయ జూచును

చౌ॥ తేహి కేం బచన మాని బిస్వాసా ।
తుమ్హ చాహహు పతి సహజ ఉదాసా ॥
నిర్గుణ నిలజ కుబేష కపాలీ ।
అకుల అగేహ దిగంబర బ్యాలీ ॥ 463

తా॥ నారదుని వచనములయందు నీవు విశ్వాసముంచి అటువంటి పతినే కోరితివేని అతడు స్వాభావికముగా నుదాసీనుడు గుణహీనుడు నిర్లజ్జాపరుడు, అమంగళ వేషధరుడు, నరకపాలములు మాలలుగా ధరించినవాడు, కులహీనుడు, ఇల్లు - వాకిలి లేనివాడు భుజగ భూషణుడు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ కహహు కవన సుఖు అస బరు పాయేం ।
భల భూలిహు ఠగ కే బౌరాఏం ॥
పంచ కహేం సివం సతీ బిబాహీ ।
పుని అవడేరి మరాఏన్హి తాహీ ॥ 464

తా॥ అటువంటి వరుని వివాహమాడిన నీకు సుఖముండగలదా? నీవు నారదునిచే మోసగింపబడితివి మునుపు ఈ యైదుగురే చెప్పరని శివుడు సతిని వివాహమాడెను కాని తరువాత ఆమెను త్యాగము చేసెను ఆ దుఃఖములోనే ఆమె మరణించెను

దో॥ అబల సుఖ సోవత సోచు నహిం బీఖ మాగి భవ ఖాహిం ।
సహజ ఏకాకిన్హ కే భవన కబహుం కి నారి ఖటాహిం ॥ 465

తా॥ అప్పటినుండి ఇప్పటివరకు శివుని కే చింతయులేదు భిక్షాటనము జేయుచున్నాడు సుఖజీవనము గడపుచున్నాడు ఏ చింతయును లేక హాయిగా నిద్రించుచున్నాడు అట్టి లేకాకిగా, జీవింపగోరు వానికి భార్య - సంసారము మొదలగునవి యెందులకు స్త్రీ లటువంటి వానితో నెగ్గగలరా ?

చౌ॥ అజహుఁ మానహు కహా హమారా ।
హమ తుమ్హ కహుఁ బరు నీక బిచారా ॥
అతి సుందర సుచి సుఖద సుసీలా ।
గావహిఁ బేద జాసు జసలీలా ॥ 466

తా॥ ఇప్పుడైనను మా మాట వినుము నీకు మంచివరు నన్వేషించితిమి అతడు సుందరుడు సుశీలుడు అతని యశమును గూర్చి వేదములు నిరంతరము గానముచేయును

చౌ॥ దూషన రహిత సకల గున రాసీ ।
శ్రీపతి పుర వైకుంఠ నివాసీ ॥
అస బరు తుమ్హహి మిలాఉబ ఆనీ ।
సునత బిహసి కహ బచన భవానీ ॥ 467

తా॥ అట్టి దోషరహితుడు, సద్గుణరాశి, లక్ష్మీపతి, వైకుంఠవాస, సకలగుణపరిపూర్ణుడు, సౌందర్యరాశియైన విష్ణుదేవుడు నీ వాసతి యొసగినచో అతని నిచ్చటికి బిలుచుకొని వత్తుము, అని సప్తర్షులు ఘంటాపథముగ జెప్పిరి పార్వతి వారిమాట లాలకించి, చిరునవ్వుతో ఇట్లనయై వారికీ విధముగ ప్రత్యుత్తర మొసగెను (ముందు దోహారో అధ్యాయము)

చౌ॥ సత్య కహేహు గిరిభవ తను ఏహా ।
హర న ఛూట ఛూటై బరు దేహా ॥
కనకఉ పుని పషాన తేఁ హోఈ ।
జారెహుఁ సహజు న పరిహర సోఈ ॥ 468

తా॥ ఇంతవరకుమందు మీరు నుడివిన వాక్కులు సత్యములు నిజముగా నా శరీరము పర్వతముచే నుత్పన్నమైనది కనుక నా మొండి పట్టును విడువను

నా శరీర మేమైన నెగుగాక। బంగారు కూడ రాతినుండియే యుల్పన్నమగును ఆ బంగారును మరల అగ్నియం దుంచినపుడు దాని స్వభావమైన సువర్ణత్వము సెది పోదదుగదా।

చౌ॥ నారద బచన మైఁ పరిహరఉఁ।
బసఉ భవను ఉజరఉ నహి డరఉఁ॥
గుర కేఁ బచన ప్రతీతి న జేహీ।
సపనేహుఁ సుగమ న సుఖ సిధి తేహీ॥ 469

తా॥ నేను నారదుని వచనములను అమృతతుల్యముగా భావింపను ఆతని మాటలను మాత్ర మే ఎప్తి యందుగాని విడనాడను ఇల్లు సంసారము మొదలగు సెవి కలిగినను లేకపోయినను నేను బాధ పడను భయము జెందను గురు వచనములయందు విశ్వాసము లేనివారికి స్వప్నమునందు గూడ సుఖము శాంతి, సిద్ధియు కలుగనేరదు

వి॥ గురౌ హరౌ చ పరా భక్తిః కర్తవ్యా గురువునందును, వారియందును గొప్ప భక్తి గలిగి యుండవలయునని శ్రీశంకర భగవత్పాదులు వచించెను భగవానుడు గురు రూపముతో నున్నాడని గుర్తించి మనోవాక్కాయ కర్మలద్వారా గురుసేవ చేయవలయును గురు సందర్శనము సాక్షాత్ భగవత్సందర్శన మగును గురుకృప భగవత్కృపయే! గురు వాక్యము భగవద్వాక్యమే! గురూపదేశము భగవదుపదేశమే యగుచున్నది అందుకే శ్రీ తులసీదాసు గురువచనముల యందు విశ్వాసము లేనివారికి స్వప్నమునందు గూడ సుఖ శాంతులు కలుగనేరవని నుడివెను గురూపదేశ మమోఘమై అజ్ఞానమును మటుమాయము చేసి, దుఃఖము నంతమొందించి నిత్యనిరతిశయసుఖమును, బ్రహ్మానందమును ప్రాప్తింప జేయుననన్న యింకొక మహత్తర భావమిందు స్ఫురించుచున్నది

దో॥ మహాదేవ అవగున భవన బిష్ణు సకల గున ధామ।
జేహి కర మను రమ జాహి సన తేహి తేహి సన కామ॥ 470

తా॥ మహాదేవుడు దుర్గుణముల కాటపట్టయినవాడు విష్ణువు సకల సద్గుణ రాశి యని నే నంగీకరించెదను కాని, ఎవరి మనస్సు ఎవరియందు లగ్నమై యుండునో, ఏది యెవరికి మంచిదని తోచునో వారు వారి కొఱకే పరితపించెదరు వానినే పొందుటకు ప్రయత్నింతురు

చౌ॥ జౌఁ తుమ్హ మిలతేహు ప్రథమ మునీసా ।
సునతిఉఁ సిఖ తుమ్హారి ధరి సీసా ॥
అబ మైఁ జన్మ సంభు హిత హారా ।
కో గున దూషన కరై బిచారా ॥ 471

తా॥ ఓ మునీశ్వరులారా ! ప్రథమమున మీరే నా కుపదేశమిచ్చి యుండినచో నేను మీ మాటలను శిరసావహించి యుండెడిదానను నేను శివుని కోసమే జన్మించినాను శివుని పాదారవిందముల కంకితము కాబడిన నా మనస్సునందితర భావనల కెంతమాత్రమును చోటులేదు కావున గుణ దోషముల నెట్లెంచగలను ?

చౌ॥ జౌ తుమ్హారే హర హృదయఁ బిసేషీ ।
రహి న జాఇ బిను కిఏఁ బరేషీ ॥
తౌ కౌతుకిఅన్హ ఆలసు నాహీఁ ।
బర కన్యా అనేక జగ మాహీఁ ॥ 472

తా॥ వివాహ ప్రసక్తి లేనిదే మీకు తోచనట్లున్నది మీరు వధూవరులను గూర్చి నిశ్చయింతురేని, ప్రపంచములో వివాహమునకు యోగ్యలైన కన్యలు పలువురు గలరు ఇంకెక్కడైనను ప్రయత్నించినచో మీ కార్యము సఫలమగును ఎయచేసి ఇంకొక చోటికి పొండు

చౌ॥ జన్మ కోటి లగి రగర హమారీ ।
బరఉఁ సంభు నతు రహఉఁ కుఆరీ ॥
తజఉఁ న నారద కర ఉపదేసూ ।
ఆపు కహహిఁ సతబార మహేసూ ॥ 473

తా॥ నేను కోటిజన్మలెత్తినను సరే, యీ సంకల్పమును మానను వరించిన శివునే వివాహమాడెదను లేకున్నచో జీవితాంతము కన్యకగానే యుండెదను స్వయముగ శివుడే వచ్చి నూరుసార్లు నాకు చెప్పినను నారదుని యుపదేశమును మాత్రము వీడను (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ మైఁ పా పరఉఁ కహఇ జగదంబా
తుమ్హ గృహ గవనహు భయఉ బిలంబా ॥
దేఖి ప్రేము బోలే ముని గ్యానీ ।
జయ జయ జగదంబికే భవానీ ॥ 474

తా॥ అనుచు మరల జగజ్జననియైన పార్వతి యీవిధముగ నుడివెను మీ పాదములను బట్టుకొందును మీకు వేయి నమస్కారములు చాల ప్రొద్దుపోయినది ఌయచేసి మీ గృహములకు బొందు, అని పార్వతి నుడువగా సప్తర్షులు పార్వతికి ఈశ్వరునిపై గల ప్రేమానురాగములను భక్తి శ్రద్ధలనుజూచి పరమానందముతో ఓజగజ్జననీ! భవానీ! నీకు జయము కలుగుగాక! (ముందు దోహాతో అన్వయము)

దో॥ తుమ్హ మాయా భగవాన సివ సకల జగత పితు మాతు ।
నాఇ చరన సిర ముని చలే పుని పుని హరషత గాతు ॥475

తా॥ నీవు మాయ, శివుడు భగవానుడు మీరిరువురును ఈ సమస్త జగత్తునకు మాతాపితలు, అని నుడివినవారై మునులు పార్వతి పాదపద్మములకు నమస్కరించి వెడలిపోయిరి వారు మాటిమాటికిని ఆనందమున పులకిత గాత్రులైరి

చౌ॥ జాఇ మునిన్హ హిమవంతు పఠాఏ ।
కరి బినతీ గిరిజహిఁ గృహ ల్యాఏ ॥
బహురి సప్తరిషి సివ పహిఁ జాఈ ।
కథా ఉమా కై సకల సునాఈ ॥ 476

తా॥ సప్తర్షులు హిమాచలుని గృహమునకు బోయిరి పార్వతి తపమును ఆమె యేకాగ్రతను హిమవంతునికి తెలియజేసి పార్వతిని తపము చాలించి యింటికి బిలుచుకొని రమ్మని యాతనికి జెప్పిరి హిమాచలుడు తపోనిష్ఠలోనున్న పార్వతికి సప్తర్షుల యాగమనమును గూర్చిచెప్ప యామె నింటికి బిలుచుకొనివచ్చెను సప్తర్షులామెను స్తుతించిరి తరువాత శంకరుని కడకుబోయి పార్వతీవృత్తాంతమును సవిస్తరముగా జెప్పిరి

చౌ॥ భఏ మగన సివ సునత సనేహా ।
హరషి సప్తరిషి గవనే గేహా ॥
మను థిర కరి తబ సంభు సుజానా ।
లగే కరన రఘునాయక ధ్యానా ॥ 477

తా॥ పార్వతి ప్రేమానురాగములనుగూర్చి సప్తర్షులవలన విన్నవాడై శివుడు ఆనంద పరవశుడాయెను సప్తర్షులు ప్రసన్నులై తమ నివాసస్థానమైన బ్రహ్మలోకమునకు వెడలిపోయిరి అప్పుడు శివుడు మనస్సును స్థిరపరచుకొని శ్రీరఘునాథుని ధ్యానమునందు నిమగ్నుడాయెను

చౌ॥ తారకు అసుర భయఉ తేహి కాలా ।
భుజ ప్రతాప బల తేజ బిసాలా ॥
తేహిం సబ లోక లోకపతి జీతే ।
భఏ దేవ సుఖ సంపతి రీతే ॥ 478

తా॥ ఆ సమయమున తారకాసురుడు సమస్త లోకపాలురను జయించి లోకాధిపతి యయ్యెను ఆ రాక్షసుని బారినుండి విముక్తి బొందజాలక దేవతలు కాంతిలేక, సుఖ సంపద్రహితులై యుండిరి తారకాసురుడు పరాక్రమవంతుడు, తేజోవంతుడు అతనిని జయించుట దేవతలకు దుర్లభ మాయెను

## మన్మథుడు దేవకార్య సహాయార్థముబోయి భస్మమగుట

చౌ॥ అజర అమర సో జీతి న జాఈ ।
హారే సుర కరి బిబిధ లరాఈ ॥
తబ బిరంచి సన జాఇ పుకారే ।
దేఖే బిధి సబ దేవ దుఖారే ॥ 479

తా॥ అంతియేగాక తారకాసురుడు అజరుడు కనుక అతనిని జయించుట యసాధ్యము దేవతలా రాక్షసునితో బోరి పోరి తుదకు విరమించుకొనిరి దేవత లందరును జేరి బ్రహ్మలోకమునకు బోయి చతుర్ముఖుడైన బ్రహ్మను వేనోళ్ళ స్తుతించిరి సమస్త దేవతలు దుఃఖించుటను, సృష్టికర్తయైన బ్రహ్మ గాంచెను

దో॥ సబ సన కహా బుఝాఇ బిధి దనుజ నిదన తబ హోఇ ।
సంభు సుక్ర సంభూత సుత ఏహి జీతఇ రన సోఇ ॥ 480

తా॥ బ్రహ్మ వారి ననుగ్రహించి యివ్విధముగ నుడివెను- శివుని వీర్యముచే ప్రభవించిన పుత్రుడే తారకాసురుని సమరమున జయించుటకు సమర్థుడు అప్పుడే తారకాసురునికి మృత్యువు సంభవము (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ మోర కహా సుని కరహు ఉపాఈ ।
హోఇహి ఈస్వర కరిహి సహాఈ ॥
సతీఁ జో తజీ దచ్ఛమఖ దేహా ।
జనమీ జాఇ హిమాచల గేహా ॥ 481

తా॥ నామాటల నాలకించి యిందులకేదైన నుపాయము నన్వేషింపుడు ఈశ్వరుడు సహాయ మొనర్చినచో, కార్యము సఫలమై-నటులేయని భావింపుడు మునుపు దక్షుడు యజ్ఞము జేయునెడ సతీదేవి శరీర త్యాగముజేసెను మరల నిప్పుడామె హిమాచలుని గృహమున జన్మించినది (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ తేహిఁ తపు కీన్హ సంభు పతి లాగీ ।
సివ సమాధి బైఠే సబు త్యాగీ ॥
జదపి అహఇ అసమంజస భారీ ।
తదపి బాత ఏక సునహు హమారీ ॥ 482

తా॥ ఆమె శివునినే పతిగా గోరి తప మొనర్చినది ఇచ్చట శివుడు మాత్ర మన్నియు విడిచి తపోనిష్ఠలో నున్నాడు వారిరువురును గలియుట యసమంజ

సము ఈ పరిస్థితి యిట్లున్నను నా మాట పాటింపుడు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ పరవహు కాము జాఇ సివ పాహీం ।
కరై ఛోభు సంకర మన మాహీం ॥
తబ హమ జాఇ సివహి సిర నాఈ ।
కరవాఉబ బిబాహు బరిఆఈ ॥ 483

తా॥ మీరెల్లరు మన్మథుని కడకేగి, యాతని శివుని ఎద్దకు బంపుడు మన్మథుడు శివుని మనస్సును క్షోభింపచేయును అప్పుడు శివుని సమాధినిష్ఠకును భంగము గలుగును నేను బోయి శివుని పాదములపై బడి, బలాత్కారముగ నైనను శంకరుని వివాహము జరిపింతును (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ ఏహి బిధి భలేహిం దేవహిత హోఈ ।
మతి అతి నీక కహఇ సబు కోఈ ॥
అస్తుతి సురన్హ కీన్హి అతి హేతూ ।
ప్రగటేఉ బిషమబాన ఝుషకేతూ ॥ 484

తా॥ ఇంత కన్నను మించిన యుపాయము మరియొకటి లేదు

దేవతలందరును బ్రహ్మ పలికిన పలుకుల నేకగ్రీవముగా సమ్మతించిరి తరువాత దేవతలు భక్తితో మన్మథుని స్తుతించిరి అప్పుడు పంచబాణములు కలిగినవాడును, మత్స్యచిహ్నాయుక్తమైన ధ్వజముకలవాడునైన మన్మథుడు వారికి సాక్షాత్కరించెను

దో॥ సురన్హ కహీ నిజ బిపతి సబ సుని మన కీన్హ బిచార ।
సంభు బరోధ న కుసల మోహి బిహసి కహేఉ అస మార॥485

తా॥ దేవతలందరు మన్మథునితో తమకు గలిగిన యాపదలను గూర్చి సవిస్తరముగ నుడివిరి పరోపకారము చేయుబృద్ధి సంకల్పము కలవాడు గావున మన్మథుడు పరహాస వదనుడై దేవతలతో నిట్లనియె - శంకరునితో విరోధము నాకు శ్రేయస్కరము కాదేమో - (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ తదపి కరబ మైఁ కాజు తుమ్హారా ।
శ్రుతి కహ పరమ ధరమ ఉపకారా ॥
పర హిత లాగి తజఇ జో దేహీ ।
సంతత సంత ప్రసంసహిఁ తేహీ ॥ 486

తా॥ మీ కార్యము నేను తప్పక చేసెదను ఏలన 'పరోపకారార్థ మిదం శరీరమ్' పరోపకారమే పరమ ధర్మమని వేదములు ఘోషించుచున్నవి పరోపకార మొనర్చుటయందు శరీరత్యాగము జేసిన వారిని సజ్జనులు నిరంతరము కీర్తింతురు వారి కీర్తి చిరస్థాయిగా నిలుచును

చౌ॥ అస కహి చలేఉ సబహి సిరు నాఈ ।
సుమన దనుష కర సహిత సహాఈ ॥
చలత మార అస హృదయఁ బిచారా ।
సివ బిరోధ ధ్రువ మరను హమారా ॥ 487

తా॥ అనిచెప్పి మన్మథుడు తన పుష్ప బాణములను చేతబూని వసంత ఋతువు ఇత్యాదులను సహాయముగా గైకొని కార్యనిమిత్తమై బయలుదేరెను మార్గమున బోవుతఱి, మన్మథుని హృదయమునందు జరుగబోవు విపత్తును గూర్చిన యాలోచనలు చెలరేగెను శివునితో వైరము వహించుచున్నాను ఇందువలన నాకు మరణము నిశ్చయ మని అతడు నిశ్చయించుకొనెను

చౌ॥ తబ ఆపన ప్రభాఉ బిస్తారా ।
నిజబస కీన్హ సకల సంసారా ॥
కోపేఉ జబహి బారిచరకేతూ ।
ఛనఁ మహుఁ మిటే సకల శ్రుతి సేతూ ॥ 488

తా॥ అట్లు నిశ్చయించుకొని, కార్యతత్పరుడు గావున తన ప్రభావమును ప్రపంచమంతట వ్యాపింపజేసెను సమస్త ప్రపంచమును తన వశమునం దుంచుకొనెను మత్స్య ధ్వజ ధరుడై మన్మథ దేవుడు ఆగ్రహపూరితుడ య్యెనో, ఆ సమయమున క్షణములో వేదములందు భక్తి భావము లెగిరిపోయెను

చౌ॥ బ్రహ్మచర్జ బ్రత సంజమ నానా ।
ధీరజ ధరమ గ్యాన బిగ్యానా ॥
సదాచార జప యోగ బిరాగా ।
సభయ బిబేక కటకు సబు భాగా ॥ 489

తా॥ బ్రహ్మచర్యము నియమము ఇంద్రియ నిగ్రహము గంభీర స్వభావము, ధర్మము, జ్ఞానము విజ్ఞానము, సదాచారము, జపము, యోగము, వైరాగ్యము, వివేకము - ఇత్యాది సేన భయపడి పరుగెత్తెను

ఛం॥ భాగేఉ బిబేకు సహాయ సహిత
సో సుభట సంజుగ మహి మురే ।
సద్గ్రంథ పర్వత కందరన్హి మహుఁ
జాఇ తేహి అవసర దురే ॥
హోనిహార కా కరతార కో రఖవార
జగ ఖరభరు పరా ।
దుఇ మాథ కేహి రతినాథ జేహి
కహుఁ కోపి కరదను సర దరా ॥ 490

తా॥ వివేకము తన సహాయభట సహితముగ పరుగిడెను దాని యుద్ధ వీరులు రణభూమికి వెన్నుచూపి వెనుకకు మరలివచ్చిరి అనగా మానవులందు వివేకము నశించిపోయెను ఆ సమయమున వారందరును సద్గ్రంథరూపమైన పర్వతపు గుహలకు పోయి దాగుకొనిరి అనగా జ్ఞానము, వైరాగ్యము సంయమము, నియమము, సదాచార విషయములు గ్రంథములలో మాత్రము గానవచ్చు చుండెను గాని యాచరణములలో మాత్రము లేకపోయెను

జగత్తునందంతటను అల్లకల్లోల మావరించెను అందరును దైవము ప్రతికూలు డాయెనని తలచి యిట్లనిరి—

ఓ విధాతా ! ఇంకనేమి జరుగనున్నదో, మమ్ము రక్షించువారెవరు? ఎవరికోసమై రతిపతి మన్మథు డుగ్రుడై చేతియందు ధనుర్బాణములనుబూనినాడు?

దో॥ జే సజీవ జగ అచర చర నారి పురుష అస నాము ।
తే నిజ నిజ మరజాద తజి భఏ సకల బస కామ ॥ 491

తా॥ జగత్తునందు స్త్రీలు పురుషులు, చరాచర జీవులెన్నిగలవో, అన్నియు సంబరుసు వారి వారి మర్యాదను విడచి మన్మథునకు వశమైరి

చౌ॥ సబకే హృదయఁ మదన అభిలాషా ।
లతా నిహారి నవహిఁ తరు సాఖా ॥
నదీఁ ఉమగి అంబుధి కహుఁ ధాఈఁ ।
సంగమ కరహిఁ తలాబ తలాఈఁ ॥ 492

తా॥ అందరికిని కామేచ్ఛ హృదయము నందు గలిగెను లతలను జూచి వృక్షపు శాఖలు వంగినవి నదులు పొంగి పొంగి సముద్రము వైపునకు ప్రవహించినవి లటాకములు—చిన్న తటాకములు పరస్పరము సంగమించు కొన్నవి

చౌ॥ జహఁ అసి దసా జడన్హ కై బరనీ ।
కో కహి సకఇ సచేతన కరనీ ॥
పసు పచ్ఛీ నభ జల థల చారీ ।
భఏ కామబస సమయ బిసారీ ॥ 493

తా॥ వృక్షములు, నదులు మొదలగు జడపదార్థములకే యటువంటి దశ గలిగినప్పుడు సచేతనముల చర్యలను జెప్పుట కెవరికి సాధ్యము? ఆకాశము, జలము, పృథ్వియందు సంచరించు పశు పక్ష్యాదులు తమ సంయోగమును సమయమును గూడ మఱచి మన్మథుని వశమాయెను

చౌ॥ మదన అంధ బ్యాకుల సబ లోకా ।
నిసి దిను నహిఁ అవలోకహిఁ కోకా ॥
దేవ దనుజ నర కిన్నర బ్యాలా ।
ప్రేత పిసాచ భూత బేతాలా ॥ 494

తా॥ సర్వలోకములలోని సకలజీవులను కామాంధులై వ్యాకులత జెందిరి చక్రవాకము చక్రవాకియు రేయిపగళ్ళుగరక కామవిపశులయ్యెను దేవతలు, దానవులు మానవులు కిన్నరులు, సర్పములు, ప్రేతములు, పిశాచములు, భూతములు, బేతాళురు (అంటు దోహాతో అన్వయము)

చౌ॥ ఇన్హ కై దసా న కహేఉఁ బఖానీ ।
సదా కామ కే చేరే జానీ ॥
సిద్ధ బిరక్త మహాముని జోగీ ।
తేపి కామబస భఏ బియోగీ ॥ 495

తా॥ మన్మథునికి దాసులైరి అని వశపర్చిందుటకే సాధ్యముకాదు సిద్ధులు విరక్తులు మహామునులు, యోగులు సర్వులును మన్మథుని వశములో నుండిరి అందరును యోగినవారలై స్త్రీ విరహమున క్రుంగి పోవుచుండిరి

ఛం॥ భఏ కామబస జోగీస తాపస
పావఁరన్హి కీ కో కహై ।
దేఖహిఁ చరాచర నారిమయ జే
బ్రహ్మమయ దేఖత రహే ॥
అబలా బిలోకహిఁ పురుషమయ
జగు పురుష సబ అబలామయం ।
దుఇ దండ భరి బ్రహ్మాండ భీతర
కామకృత కౌతుక అయం ॥ 496

తా॥ యోగీశ్వరులు, తాపసులే మన్మథవశులైన తరువాత పామరుల మాట చెప్పనేల? యోగీశ్వరులు సమస్త చరాచర జగత్తును బ్రహ్మామయముగా జూచువారలిప్పుడు జగత్తును స్త్రీమయముగ జూడసాగిరి

రెండు గడియల వరకు విశ్వమంతయు మన్మథుని చేతియం దుండెను మన్మథుని చేతిలో యోగీశ్వరులు కీలుబొమ్మలైరి

సో॥ ధరీ న కాహూఁ ధీర సబ కే మన మనసిజ హరే ।
జే రాఖే రఘుబీర తే ఉబరే తేహి కాల మహుఁ ॥ 497

తా॥ ఎవరును హృదయములందు ధైర్యము సహింపలేక పోయిరి కామదేవుడు (మన్మథుడు) ఎల్ల్వల మనంబులను హరించెను శ్రీరఘునాథుడగు శ్రీరామచంద్రుని రక్షణలోనున్నవారలు మాత్రము గట్టిగ నిగ్రహము గలవారైరి

[మనో వాక్కాయ కర్మలలో శ్రీరాముని సేవించిన వారలు విషయాసక్తులంటరని భావము]

చౌ॥ ఉభయ ఘరీ అస కౌతుక భయఊ ।
జౌ లగి కామ సంభు పహిఁ గయఊ ॥
సివహి బిలోకి ససంకేఉ మారూ ।
భయఉ జథాథితి సబు సంసారూ ॥ 498

తా॥ రెండు గడియల వరకును మన్మథుని శక్తి విశ్వమంతటిని సమ్మోహము చేసినది మన్మథుడు ఉల్లాసముగా శివుని సాన్నిధ్యమును జేరెను తపోనిష్ఠలో నుండిన శివభగవానుని గాంచి, పుష్పబాణుడు భయము జెందెను అప్పుడు విశ్వమంతయు మామూలుస్థితికి వచ్చెను అందరును చాంచల్యములేక స్థిరమనస్సు కలవారైరి

చౌ॥ భఏ తురత సబ జీవ సుఖారే ।
జిమి మద ఉతరి గఏఁ మతవారే ॥
రుద్రహి దేఖి మదన భయ మానా ।
దురాధర్ష దుర్గమ భగవానా ॥ 499

తా॥ మధుపానము చేయుటవలన మత్తెక్కి మత్తు తగ్గిన తరువాత మామూలు స్థితికి వచ్చినట్లు జీవులందరు కామ కాంక్షను వీడి సుఖ శాంతులను పొందిరి

దురాధర్షుడు దుర్గముడు భగవానుడు, రుద్రుడైన శివుని గాంచి మన్మథుడు మిక్కిలి భయము జెందెను

వి॥ శివుడు దుర్గముడు దురాధర్షుడు శివుని పరాజితుని జేయుట అత్యంత కఠినమైనపని శివుడనంతుడు భగవంతుడు సంపూ

ట్టమైన ఐశ్వర్యముతో గూడినవాడు ను, ధర్మపరుడును, కీర్తిమంతుడును, షడ్గుణ పరిపూర్ణుడును, ఈశ్వరుడును, రుద్రుడునైన శివునిజూచి, మన్మథుడు మిక్కిలిభయముచే కంపమొందెను

చౌ॥ ఫిరత లాజ కఛు కరి నహిఁ జాఈ ।
మరను ఠాని మన రచేసి ఉపాఈ ॥
ప్రగటేసి తురత రుచిర రితురాజా ।
కుసుమిత నవ తరు రాజి బిరాజా ॥ 500

తా॥ కాని వెనుకకు మరలుట మన్మథునికి లజ్జాకరము గదా! ఏమిచేయుటకును మన్మథునకు తోచలేదు తనకు మరణమే తప్పని ఎరియని నిశ్చయించుకొని యొక ఉపాయమును బన్నెను వెంటనే సుందరమైన వసంతఋతు వతనికి తోడయ్యెను అరణ్యమంతయు పుష్పములతో నిండి సౌరభములు వెదజల్లుచుండెను క్రొత్త చిగుళ్ళతో వృక్షములు శోభాయమానముగ నుండి వి

చౌ॥ బన ఉపబన బాపికా తడాగా ।
పరమ సుభగ సబ దిసా బిభాగా ॥
జహఁ తహఁ జను ఉమగత అనురాగా ।
దేఖి ముఏహుఁ మన మనసిజ జాగా ॥ 501

తా॥ దిశదిశల వనములు, ఉపవనములు తటాకములతో ఆ ప్రదేశము కన్నులపండువుగ నుండెను ఆ రామణీయకమును జూచి తీరవలయునే గాని వర్ణించుటకు సాధ్యము గానేరదు కనువిందొనర్చు ఆ రామణీయకముగాంచిన, నిరాశజెందిన వారికి సహితము మరల ఆశ జనించునను టలో సందియములేదు అదియే మన్మథు డొనర్చిన చిత్రాతిచిత్రము సుందరాతిసుందరమైన వనముల శోభ గాంచినంతనే మరణింపబోవు వానియందు గూడ కామదేవుడు (మన్మథుడు) మేల్కొని ఆశలు రేకెత్తించుచున్నాడేమో యన్న భ్రమ యుత్పన్నము కాక మానదు

ఛం॥ జాగఇ మనోభవ ముఏహుఁ
మన బన సుభగతా న పరై కహీ ।
సీతల సుగంధ సుమంద మారుత
మదన అనల సఖా సహీ ॥
బికసే సరన్హి బహు కంజ గుంజత
పుంజ మంజుల మధుకరా ।
కలహంస పిక సుక సరస రవ కరి
గాన నాచహిఁ అపఛరా ॥ 502

తా॥ సమస్త వాంఛలను విడనాడి నిరాశజెంది వారిపై వారిని గూడ మన్మథుడు మేల్కొలిపెను మన్మథుడు సృష్టించిన వాతావరణమే యేదో ప్రత్యేక రమణీయతను గలిగియుండెను ఆ ప్రదేశము సుందరమయ్యెను ఆ సౌందర్యమును దిలకించి తీరవలయునేగాని వర్ణించుట కేమాత్రము సాధ్యము గాదు కామరూపమైన అగ్నికి ప్రాణమిత్రమై శీతల, మంద, సుగంధిల పవనము వీవ సాగెను

సరోవరమునందు కమలము లనేకములు వికసించి యుండెను ఆ వికసించిన కమలములలో భ్రమరములు ఝుంకారములు చేయుచుండెను సరోవర ప్రాంతములందున్న వృక్షములపై కోయిలలు, చిలుకలు తియ్యని పలుకులను బలుకుచుండెను రాజహంసలు ఠీవిగా సరోవరమునందు విహారించుచుండెను అప్సరసలు గానమొనర్చుచు నాట్యమాడుచుండిరి

దో॥ సకల కలా కరి కోటి బిధి హారేఉ సేన సమేత ।
చలీ న అచల సమాధి సివ కోపేఉ హృదయనికేత ॥ 503

తా॥ ఇట్లు మన్మథుడు నిజసేనా సమేతుడై కోట్లకొలది తన కళావిశేషము లన్నిటిని జూపెను మహేశ్వరుని తపమును భంగము జేయదలంచెను కాని యోడిపోయెను నిశ్చలుడైన శంకరుని మన్మథుడు కదలింపజాలడాయెను శంకరు డచల సమాధిని వీడలేదు అంత మన్మథుడు క్రోధముతో దిగ్గన లేచెను

చౌ॥ దేఖి రసాల బిటప బర సాఖా ।
తేహి పర చడేఉ మదను మన మాఖా ॥
సుమన చాప నిజ సర సంధానే ।
అతి రిస తాకి శ్రవన లగి తానే ॥ 504

తా॥ మన్మథుడు సుందరమైన ఒక మామిడి కొమ్మను జూచి దాని నెక్కి కూర్చుండెను. పుష్పధనుస్సును పంచబాణములతో సంధించెను.

అత్యంత క్రోధముతో లక్ష్యమునుంచి, ధనుస్సును ప్రతిజ్ఞా పూర్వకముగా లాగెను.

చౌ॥ ఛాడే బిషమ బిసిఖ ఉర లాగే ।
ఛూటి సమాధి సంభు తబ జాగే ॥
భయఉ ఈస మన ఛోభు బిసేషీ ।
నయన ఉఘారి సకల దిసి దేఖీ ॥ 505

తా॥ మన్మథుడు తీక్ష్ణమైన యైదు బాణములను విడచెను. అవి శివుని హృదయమును దాకెను. తాకినంతనే సమాధికి భంగము వాటిల్లెను.

అఖండమైన తేజస్సుతో విరాజిల్లుచు, తపస్సమాధిలో నిమగ్నుడైయున్న శివుని మనస్సు చాల క్షోభించెను. బాణములు తగిలిన అక్షణమే అతడు కన్నులు తెఱచెను. అన్నివైపుల దృష్టి సారించెను.

చౌ॥ సౌరభ పల్లవ మదను బిలోకా ।
భయఉ కోపు కంపేఉ త్రైలోకా ॥
తబ సివఁ తీసర నయన ఉఘారా ।
చితవత కాము భయఉ జరి ఛారా ॥ 506

తా॥ మామిడాకుల వెనుక దాగియుండిన మన్మథుని గాంచి శివుడాగ్రహపూరితు డాయెను. అంత ముల్లోకములు కంపించెను. శివుడు మూడవకన్ను తెఱచెను. శంకరుని యాగ్రహమునకు గురియై మన్మథుడు భస్మము గావింపబడెను.

చౌ॥ హాహాకార భయఉ జగ భారీ।
డరపే సుర భఏ అసుర సుఖారీ॥
సముఝి కామసుఖు సోచహిఁ భోగీ।
భఏ అకంటక సాధక జోగీ॥ 507

తా॥ జగత్తునందు హాహాకారములు చెలరేగెను. దేవతలు భయము జెందిరి. దైత్యులు సుఖము నొందిరి. దేవతల కీడు గోరువారలు గాన దైత్యులు సంతోషించిరి. భోగవిలాసములలో బడినవారలు, విషయాసక్తులును మననము జేసుకొన్నవారై చింతాక్రాంతులైరి. సాధు సజ్జనులు, యోగులును నిష్కంటకులైరి. సుఖశాంతుల నొందిరి.

## రతిపరిదానము

ఛం॥ జోగి అకంటక భఏ పతి గతి
సునత రతి ముఱుఛిత భఈ।
రోదతి బదతి బహు భాఁతి కరునా
కరతి సంకర పహిఁ గఈ॥
అతి ప్రేమ కరి బినతీ బిబిధ బిధి
జోరి కర సన్ముఖ రహీ।
ప్రభు ఆసుతోష కృపాల సివ
అబలా నిరఖి బోలే సహీ॥ 508

తా॥ యోగులు నిష్కంటకులైరి. మన్మథుని మరణానంతరము మన్మథ పత్నియైన రతీదేవి తన పతికి గలిగిన గతిని విన్నదై మూర్ఛిల్లెను. వెక్కి వెక్కి యేడ్చుచు కరుణరసము చిప్పిల రోదించుచు శివుని కడ కేగెను. శివుని పతిభిక్ష పెట్టుమని వేడెను. తరువాత సత్యంత వినయముతో కరకమలములను జోడించి శివుని చెంత నిలబడెను. అతి శీఘ్రముగా ప్రసన్నుడగు శివుడా యబల నిస్సహాయస్థితిలో నుండుట గాంచి యోదార్పు మాటలతో నిట్లు చెప్పెను —
(ముందు దోహాతో అన్వయము)

దో॥ అబ తేఁ రతి తవ నాథ కర హోఇహి నాము అనంగు ।
బిను బపు బ్యాపిహి సబహి పుని సును నిజ మిలన
ప్రసంగు ॥ 509

తా॥ ఓ రతీ! ఇప్పటినుండి నీ పతి నామము అనంగుడు' అతడు శరీరములేకయే యన్నిస్థలములయందును సంచరించును వ్యాప్తి నొందును ఇప్పుడు నీవు నీ పతిని జేరు పైనమును గూర్చి యాలకింపుము (ముందు దోహతో అన్వయము)

చౌ॥ జబ జదుబంస కృష్ణ అవతారా ।
హోఇహి హరన మహా మహిభారా ॥
కృష్ణ తనయ హోఇహి పతి తోరా ।
బచను అన్యథా హోఇ న మోరా ॥ 510

తా॥ భూభారమును తగ్గించుట కెవ్వడు యదువంశమునందు శ్రీకృష్ణ దవతారమెత్తునో, అప్పుడు నీపతి కృష్ణునకు పుత్రుడై ప్రద్యుమ్నుడను నామముతో విరాజిల్లును నా వచనము లెన్నటికిని అసత్యములు కానేరవుసుమా!

చౌ॥ రతి గవనీ సుని సంకర బానీ ।
కథా అపర అబ కహఉఁ బఖానీ ॥
దేవన్హ సమాచార సబ పాఏ ।
బ్రహ్మాదిక బైకుంఠ సిధాఏ ॥ 511

తా॥ శంకర వచనముల నాలకించి రతీదేవి వెడలి పోయెను ఇప్పుడిక కథాగమనమునకు తోడ్పడు కథను నేను (శ్రీ తులసీదాసు) సవిస్తరముగ చెప్పెదను శ్రద్ధతో నాలకింపుడు

బ్రహ్మాది దేవతలు, జరిగిన సంఘటనలను, సమాచారములను గురించి విన్నవారై వైకుంఠమున కేగిరి

చౌ॥ సబ సుర బిష్ణు బిరంచి సమేతా ।
గఏ జహాఁ సివ కృపానికేతా ॥
పృథక పృథక తిన్హ కీన్హ ప్రసంసా ।
భఏ ప్రసన్న చంద్ర అవతంసా ॥ 512

తా॥ వైకుంఠము నుండి దేవతలు బ్రహ్మ, విష్ణు సమేతులై కృపానిధియైన శంకరుడుండు తపోవనమునకు కేతెంచిరి అందరును వేరువేరుగా శంకరుని స్తుతించిరి అప్పుడు శశిభూషణుడైన శివుడు ప్రసన్నుడాయెను

చౌ॥ బోలే కృపాసింధు బృషకేతూ ।
కహహు అమర ఆఏ కేహి హేతూ ॥
కహ బిధి తుమ్హ ప్రభు అంతరజామీ ॥
తదపి భగతి బస బినవఉఁ స్వామీ ॥ 513

తా॥ కృపాసాగరుడైన వృషకేతుడైన శంకరు డీవిధముగ నుడివెను— ఓ దేవతలారా! మీరెందుల కేతెంచితిరి?

అని బ్రహ్మ ప్రభూ! నీవు సర్వాంతర్యామివి! నీకు దెలియనిదేమున్నది? అయిన ను భక్తిపారవశ్యముతో నేను నిన్ను ప్రార్థించుచున్నాడను

## పార్వతీ పరిణయము

దో॥ సకల సురన్హ కే హృదయఁ అస సంకర పరమ ఉఛాహు।
నిజ నయనన్హి దేఖా చహహిఁ నాథ తుమ్హార బిబాహు॥514

తా॥ ఓ శంకరా! కన్నులార నీ వివాహమహోత్సవమును దిలకించి, సంతోషింపవలయునని దేవత లాసపడుచున్నారు

చౌ॥ యహ ఉత్సవ దేఖిఅ భరి లోచన ।
సోఇ కఛు కరహు మదన మద మోచన ।
కాము జారి రతి కహుఁ బరు దీన్హా ।
కృపాసింధు యహ అతి భల కీన్హా ॥ 515

తా॥ మన్మథుని మంట మణచిన వాడా! స్మరహరా! నీ వివాహమహోత్సవం మెల్లరను కన్నులారం గాంచుటుల నీ వౌనర్పవలయును

కృపాసాగరా! మన్మథుని భస్మమొనర్చి, రతికి వరము నొసగి బ్రోచితివి నీ విల్లానరించుట సముంజసమే!

చౌ॥ సొసతి కరి పుని కరహిఁ పసాఉ ।
నాథ ప్రభున్హ కర సహజ సుభాఉ ॥
పారబతిఁ తపు కీన్హ అపారా ।
కరహు తాసు అబ అంగీకారా ॥ 516

తా॥ స్వామి! మహాత్ముల సహజస్వభావం మిదియే మొదట దండించి నొసగి తరువాల కృపం జూపుటయే!

ఇప్పుడు జగజ్జననియైన పార్వతి నిన్ను పతిగా జేసికొనుటకై యఖండ తపము రించినది కాన, ఆమెను పరిణయ మాడుటకు నీ వంగీకరింపవలయు యున్నది

చౌ॥ సుని బిధి బినయ సముఝి ప్రభు బాని ।
ఐసేఇ హోఉ కాహా సుఖు మానీ ॥
తబ దేవన్హ దుందుభీఁ బజాఈఁ ।
బరషి సుమన జయ జయ సుర సాఈఁ ॥ 517

తా॥ చతుర్ముఖుడైన బ్రహ్మ చేసిన ప్రార్థనను విన్నవాడై శ్రీరామ వచనములను మననము జేసికొని శంకరుడు ప్రసన్నుడాయెను నీ యభీష్టమే నెరవేరు గాక యనెను అప్పుడు దేవతలు దుందుభులు మ్రోగించిరి పుష్ప వర్షమును గురియించిరి శంకరునకు జయము కలుగుగాక! శంకరునకు జయము! జయము! అని జయజయ ధ్వనులను జేసిరి

చౌ॥ అవసరు జాని సప్తరిషి ఆఏ ।
తురతహిఁ బిధి గిరిభవన పఠాఏ ॥
ప్రథమ గయే జహఁ రహీఁ భవానీ ।
బోలే మధుర బచన ఛల సానీ ॥ 518

తా॥ మంచి సమయమును జూచుకొని సప్తర్షులచటి కేతెంచిరి బ్రహ్మ ఒక్షణమే సప్తర్షులను హిమాచలుని గృహమునకు బంపెను

సప్తర్షులు పార్వతియుం ప్రవేశమున కరిగిరి (ఉడికించుటకో యన్నట్లు) సప్తర్షులు తియ్యని పలుకుల నిట్లు పలికిరి ఆ వచనములు వినోట యుక్తముగా వాంటకరముగ నుండెను

దో॥ కహా హమార న సునేహు తబ నారద కేఁ ఉపదేస ।
అబ భాఝూర తుహ్మార పన జారేఉ కాము మహేస ॥ 519

తా॥ పార్వతీ! నారదుని యుపదేశమువలన ఆ సమయమున నీవు మా మాటలను వినవైతివి ఇప్పుడు నీవు సల్పిన శపథము నెరవేరునట్లు లేదు నీ ప్రయాస వ్యర్థమైనది శంకరుడు మన్మథుని భస్మము గావించినాడుగాన నీ మనోరథ మడేరదు అని సప్తర్షులు పలికిరి

చౌ॥ సుని బోలీఁ ముసుకాఇ భవానీ ।
ఉచిత కహేహు మునిబర బిగ్యానీ ॥
తుమ్హరేఁ జాన కాము అబ జారా ।
అబ లగి సంభు రహే సబికారా ॥ 520

తా॥ వినోదకరమును, గూఢమును, మధురమునునైన మాటలను విని పార్వతి చిరునవ్వు నవ్వి యిట్లనెను— ఓ విజ్ఞానసంపన్నులైన ముని పుంగవులారా! మీరు చెప్పినది గూడ ఉచితమే! మీ దృష్టిలో శివుడు మన్మథుని భస్మ మొనరించినవాడు, వికారయుక్తుడు (ముందు దోహాలో అన్వయము)

చౌ॥ హమరేఁ జాన సదా సివ జోగీ ।
అజ అనవద్య అకామ అభోగీ ॥
జౌఁ మైఁసివ సేయే అస జానీ ।
ప్రీతి సమేత కర్మ మన బానీ ॥ 521

తా॥ మరి నా దృష్టిలో శంకరుడు సదా యోగీశ్వరుడు జన్మరహితుడు, అనవద్యుడు, కామరహితుడు, అభోగి ఇట్లు తలంచిన దాననె నేను మనో

వాక్కాయకర్మములలో, ప్రేమపూర్వకముగ శంకరుని సేవించితిని, ధ్యానించితిని, తపము జేసితిని (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ తౌ హమార పన సునహు మునీసా ।
కరిహహిఁ సత్య కృపానిధి ఈసా ॥
తుమ్హ జో కహా హర జారేఉ మారా ।
సోఇ అతి బడ అబిబేకు తుమ్హారా ॥ 522

తా॥ ఓ మునీశ్వరులారా! సర్వేశ్వరుడైన, పశుపతియైన, కృపానిధియైన శంకరుడు నా ప్రతిజ్ఞను సత్యము జేయును కాని శివుడు మన్మథుని భస్మమొన రించె నంటిరే అదిమాత్రము యవివేకమని నేను భావించుచున్నాను (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ తాత అనల కర సహజ సుభాఊ ।
హిమ తేహి నికట జాఇ నహిఁ కాఊ ॥
గఏఁ సమీప సో అవసి నసాఈ ।
అసి మన్మథ మహేస కీ నాఈ ॥ 523

తా॥ దహించుట, అగ్నియొక్క సహజ స్వభావము గదా! కనుకనే మంచు అగ్ని సమీపమున కెన్నడునుబోదు అట్లు పోయినచో దహింపబడును కనుక మహాదేవుని మన్మథుడు దరియుటలో గూడ అదియే జరిగినది అది న్యాయ బద్ధమే యగును శివు డగ్ని స్వరూపుడని తెలిసికూడ మన్మథుడు సాహసించి యఖండ తేజముచే విరాజిల్లుచున్న యాదిశంకరునకే తపోభంగము జేయ బూనెను కాని పర్యవసానముగా తాను భస్మమగుటయే యయ్యెను

దో॥ హియఁ హరషే ముని బచన సుని దేఖి ప్రీతి బిస్వాస ।
చలే భవానిహి నాఇ సిర గఏ హిమాచల పాస ॥ 524

తా॥ పార్వతీదేవి వచనముల నాలకించి ఆమె ప్రేమను, విశ్వాసమును గాంచి, మును లంతరంగమున చాల సంతసించిరి భవానికి నమస్కరించి హిమాచలుని కడకేగిరి

చౌ॥ సబు ప్రసంగు గిరిపతిహి సునావా ।
మదన దహన సుని అతి దుఖు పావా ॥
బహురి కహేఉ రతి కర బరదానా ।
సుని హిమవంత బహుత సుఖు మానా ॥ 525

తా॥ సప్తర్షులు జరిగిన దంతయు హిమాచలునకు జెప్పిరి మన్మథుడు భస్మముగావింప బడెనన్న మాటను విని హిమాచలుడు మిగుల వగచెను అంత మునులు రతికి శంకరుడు వరదాన మొసగిన విధానమును గూర్చి విపులముగ ఎక్కాణించిరి అదివిని, హిమాచలుడు మనస్సును కుదుట పఱచుకొని సుఖ సంతోషములను పొందెను

చౌ॥ హృదయఁ బిచారి సంభు ప్రభుతాఈ ।
సాదర మునిబర లిఏ బోలాఈ ॥
సుదిను సునఖతు సుఘరీ సోచాఈ ।
బేగి బేదబిధి లగన ధరాఈ ॥ 526

తా॥ శివప్రభావమును గూర్చి తెలిసికొన్నవాడై హిమాచలుడు ముని శ్రేష్ఠుల సహాయముతో పిలిపించెను మునులు శుభదినము, శుభ నక్షత్రము, శుభ ఘడియను బాగుగా పరిశీలించి వేదవిధానానుసారముగా లగ్నమును నిశ్చయించి లగ్నపత్రికను వ్రాయించిరి

చౌ॥ పత్రీ సప్తరిషిన్హ సోఇ దీన్హీ ।
గహి పద బినయ హిమాచల కీన్హీ ॥
జాఇ బిధిహి తిన్హ దీన్హి సో పాతీ ।
బాచత ప్రీతి న హృదయఁ సమాతీ ॥ 527

తా॥ హిమాచలుడు లగ్నపత్రిక ప్రథమమున సప్తర్షుల కొసగెను వారి పాదపద్మములకు ప్రణమిల్లి వారిని పెక్కువిధంగుల స్తుతించెను సప్తర్షులు లగ్న పత్రికను దీసికొని పోయి బ్రహ్మ కొసగిరి ఆ లగ్న పత్రికను తనలో తాను పఠించు సమయమున బ్రహ్మ హృదయాంతరమునుండి ప్రేమాభిమానము లుప్పొంగెను

చౌ॥ లగన బాచి అజ సబహి సునాఈ ।
హరషే ముని సబ సుర సముదాఈ ॥
సుమన బృష్టి నభ బాజన బాజే ।
మంగల కలస దసహుఁ దిసి సాజే ॥ 528

తా॥ తరువాత లగ్నపత్రికను జదివి అందరికి వినిపించెను ఆ శుభవార్తను విని దేవతాసమాజము లన్నియు హర్షించెను ఆకాశము నుండి పుష్పవర్షము గురిసెను మంగళవాద్యములు మ్రోగెను పదిదిశలనుండి మంగళకలశములు తయారుచేయబడి తేబడెను

దో॥ లగే సఁవారన సకల సుర బాహన బిబిధ బిమాన ।
హోహిఁ సగున మంగల సుభద కరహిఁ అపచరా
గాన ॥ 529

తా॥ పార్వతీ పరిణయమును జూడవలయునన్న అమితోత్సాహముతో దేవతలు తమతమ వాహనములను, విమానములను సిద్ధము చేసికొనిరి శుభ దినము, శుభఘడియ ఆసన్నమగు చున్నది గాన కల్యాణప్రదమైన మంగళ శకునము లగపడెను అప్సరసలు గానము సల్పదొడగిరి

చౌ॥ సివహి సంభు గన కరహిఁ సింగారా ।
జటా ముకుట అహి మౌరు సఁవారా ॥
కుండల కంకన పహిరే బ్యాలా ।
తన బిభూతి పట కేహరి చాలా ॥ 530

తా॥ కైలాసమున శివగణములు శివుని శృంగారింప మొదలిడిరి జడలను కిరీటముగా జేసి, దానిపై సర్పమును, వివాహసమయమున వరుడు తలపై ధరించు బాసికముగా గట్టిరి శివుడు సర్పకుండలములను కంకణములను ధరించెను తనువుపై, విభూతి బూసికొనెను పులిచర్మమునే వస్త్రముగా ధరించెను

చౌ॥ ససి లలాట సుందర సిర గంగా ।
నయన తీని ఉపబీత భుజంగా ॥
గరల కంఠ ఉర నర సిర మాలా ।
అసివ బేష సివ ధామ కృపాలా ॥ 531

తా॥ చంద్ర భూషణుడను, గంగాధరుడును త్రినేత్రుండును, భుజగ భూషణుడను, నీలకంఠుడును నరముండమాలను ధరించినవాడైన శంకరుడు పెండ్లికుమారుడై అధికశోభతో విరాజిల్లెను ఆ వేషధారణము అశుభమైనను శంకరునకు శుభప్రదమైనది, మంగళకరమైనది

వి॥ మస్తకముపై చంద్రుని ధరించినవాడును, శిరమున గంగను తాల్చినవాడును, మూడు కన్నులుగలవాడును, నీలకంఠుడును, మెడలో నరముండమాలను జన్నిదముగా ధరించినవాడు శంకరుడు

చాల పెద్దదియగు ఆకాశము శివుని యొక్క జటాజూటముగా చెప్పబడినది గొప్పదియగు నాగేంద్రము (వాసుకి) శివుడు ధరించెడి హారము

గరళకంఠు డనగా విషకంఠుడని యర్థము గరళమనగా కాలకూటవిషము ఆ గరళమును సేవించినవాడు గనుకనే గరళకంఠుడైనాడు శివుడు దేవతలకుసైతము చూడ భయంకరముగా నుండెడి యా కాలకూటవిషమును శివుడు అవలీలగా పాన మొనర్చి తన కంఠకూపమున నిలుపుకొనెను

లోకమును సహితము దగ్ధము చేయజాలిన నల్లని యాగరళము శివుని ఏమియు చేయలేక పోయినది, స్ఫటికము వోలె శ్వేత కాంతితో ప్రకాశించెడు ఆ శివుని కంఠమున ఇంద్రనీలమణివలె ఆభరణమై అది ప్రకాశించెను అందువలననే శివుని 'నీలకంఠు' డందురు

'నీలకంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ సదా శివాయ శ్రీమన్మహాదేవాయ నమః' అని శ్రుతివాక్యము 'ఉమా సహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠమ్' అని శ్రుతి యును భగవంతుని దివ్యమంగళ విగ్రహవైభవమును స్తుతించినది కాన ఆదిశంకరుని దివ్యవిభవ్యరూప మమంగళకర మెట్లగును?

చౌ॥ కర త్రిసూల అరు డమరు బిరాజా ।
చలే బసహఁ చఢి బాజహిఁ బాజా ॥
దేఖి సివహిఁ సురత్రియ ముసుకాహీఁ ।
బర లాయక దులహిని జగ నాహీఁ ॥ 532

తా॥ శివు డొక చేతియందు త్రిశూలమును ధరించెను ఇంకొకచేతిలో డమరుకము ధరించెను త్రిశూలము, డమరుకము శివుడు ధరించినందువల్ల సుశోభితుడుగ నుండెను

శివుడు వృషభముపై నెక్కి పయన మాయెను అంత మంగళ వాద్యములు మ్రోగెను శివుని జూచి దేవాంగనలు పరిహాసముతో ఈ వరునకు తగిన పెళ్ళి కుమార్తె ఈ ప్రపంచములో నెచ్చటను దొరికదు అనిరి

చౌ॥ బిష్ను బిరంచి ఆది సుర బ్రాతా ।
చఢి చఢి బాహన చలే బరాతా ॥
సుర సమాజ సబ భాఁతి అనూపా ।
నహిఁ బరాత దూలహ అనురూపా ॥ 533

తా॥ బ్రహ్మ, విష్ణు, దేవతా సమూహములు వారి వారి వాహనములపై నారోహించి వరపక్షమున వెడలిరి దేవతలు సహజముగ సుందరులు ఇక శంక రుని వివాహ మును జూచుటకు ప్రత్యేకాలంకారమును జేసికొని పెళ్ళి కుమారుని వెంట బోవుచుండ పరమసుందరులై విరాజిల్లుచుండిరి కాని పెండ్లి కుమారు డైన శివుని కనురూపమైన వారు గారు ఏలన శివుని మనసు, సొగసు దినుసు వేరు

దో॥ బిష్ణు కహా అస బిహసి తబ బోలి సకల దిసిరాజ ।
బిలగ బిలగ హోఇ చలహు సబ నిజ నిజ సహిత సమాజ ॥ 534

తా॥ అప్పుడు విష్ణుభగవానుడు దిక్పాలుర నెల్ల బిలిచి నవ్వుచు నిట్లనెను - మీరందరును మీ పరివారములతో వేరువేరుగా శంకరుని వివాహమునకు తరలి పొందు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ బర అనుహారి బరాత న భాఈ ।
హఁసీ కరైహహు పర పుర జాఈ ॥
బిష్ణు బచన సుని సుర ముసుకానే ।
నిజ నిజ సేన సహిత బిలగానే ॥ 535

తా॥ దేవతలారా మనమెంటి వారనుసరించుట కీ వరుడు యోగ్యుడు కాడు అమంగళ వేషధారియైన ఈ శివునితో పరదేశమునకు బోయి ఎందులకు నవ్వులపాలు గావలెను। మీరు వేరువేరుగనే తరలి పొందు ఈ మాటలను విన్నదేవతాగణములు చిరునవ్వు నవ్వి తమతమ సేనలతో కూడి వేరువేరుగనే వివాహమునకు తరలిపోయిరి

చౌ॥ మనహీఁ మన మహేసు ముసుకాహీఁ ।
హరి కే బింగ్య బచన నహిఁ జాహీఁ ॥
అతి ప్రియ బచన సునత ప్రియ కేరే ।
భృంగిహి ప్రేరి సకల గన టేరే ॥ 536

తా॥ వారట్లు పోవుచుండుట గాంచి శంకరుడు తనలోతాను నవ్వుకొనెను విష్ణుభగవానుడు వ్యంగ్యవచనములను పలికినంతమాత్రమున శివుడాగ్రహపూరితుడు కాలేదు అమితోత్సాహముతో వాటి నతిప్రియవచనములుగా భావించి, శంకరుడు భృంగిని పంపి తన గణముల నన్నిటిని బిలిపించెను

చౌ॥ సివ అనుసాసన సుని సబ ఆఏ।
ప్రభు పద జలజ సీస తిన్హ నాఏ॥
నానా బాహన నానా బేషా।
బిహసే సివ సమాజ నిజ దేఖా॥ 53

తా॥ శంకరుని యాజ్ఞను శిరసావహించి శివగణము లందరును వచ్చిరి కరుణామయుడైన శంకరుని పాదారవిందములకు ప్రణమిల్లిరి వివిధములైన వాహనములతోను, వివిధములైన వేషధారణలతోను శివగణము శోభాయమానముగ నుండెను వివిధ వస్తువాహనములతో విలసిల్లుచున్న తన గణములను, సేవకులను దాసుల నొక్కమారు చూచి పరమేశ్వరు డమితానందము నొందెను

చౌ॥ కోఉ ముఖహీన బిపుల ముఖ కాహూ।
బిను పద కర కోఉ బహు పద బాహూ॥
బిపుల నయన కోఉ నయన బిహీనా।
రిష్ట పుష్ట కోఉ అతి తనఖీనా॥ 538

తా॥ ఆ శివగణము లీ విధముగ నుండిరి కొన్ని గణములు ముఖములు లేనివారు కొందరు బహుముఖములు గలవారు కొందరు కాలు సేతులు లేని వారు కొందరు ఒకే కాలు, ఒకే చేయి గలవారు కొంతమంది పెక్కు నయనములు గలవారు కొందరు ఏక నయనము గలవారు కొంతమంది బలిష్ఠులుగ, ఉత్సాహులుగ నుండిరి కొంతమంది బలహీనులై కృశించి యుండిరి

ఛం॥ తన ఖీన కోఉ అతిపీన పావన
కోఉ అపావన గతి ధరేం।
భూషన కరాల కపాల కర సబ
సద్య సోనిత తన భరేం॥
ఖర స్వాన సుఅర సృకాల ముఖ గన
బేష అగనిత కో గనై।
బహు జినస ప్రేత పిసాచ జోగి జమాత
బరనత నహిం బనై॥ 539

తా॥ కొందరు సన్నగను, మరికొందరు బలహీనులుగను మరి కొందరు లావుగను, బలిష్ఠులుగ నుండిరి కొందరు కురూపులు, కొందరు పవిత్రులు మఱికొందరు అపవిత్ర వేషధారులు చూచుటకు భయము గొల్పునటువంటి యాభరణములను కొందఱు ధరించి యుండిరి ఎల్లర శరీరములకు రక్తము పూయబడి యుండెను, గార్ధభము శునకము వరాహముఖములు గలవా రనేకు లుండిరి జంబుకముఖములుగలవా రుండిరి లెక్కలేనంత మంది శివగణము లుండిరి ప్రేతములు పిశాచములు గూడ నుండిరి పిశాచములేగాక, యోగుల సమూహములు గూడ నుండెను అన్నియుజూచి తీరవలయునే కాని చెప్పుటకు సాధ్యముకాదు

సో॥ నాచహిఁ గావహిఁ గీత పరమ తరంగీ భూత సబ ।
దేఖత అతి బిపరీత బోలహిఁ బచన బిచిత్ర బిధి ॥ 540

తా॥ భూతప్రేతములు గీతములను పాడుచుండిరి వారికి సమయ సందర్భములు లేవు ఇచ్చవచ్చినట్లు ప్రవర్తించుచు వారలు చూచుటకు విచిత్రముగాను, కురూపులుగా నుండిరి అతి విచిత్రముగ మాటలాడుచుండిరి

చౌ॥ జస దూలహు తసి బనీ బరాతా ।
కౌతుక బిబిధ హోహిఁ మగ జాతా ॥
ఇహాఁ హిమాచల రచేఉ బితానా ।
అతి బిచిత్ర నహిఁ జాఇ బఖానా ॥ 541

తా॥ పెండ్లికుమారు డెట్లుండెనో, పెండ్లివైపు వారు (శివగణములు) గూడ అటులే యుండిరి అందఱును అతి సంభ్రమముతో వివాహమునకు తరలి పోవు నెడ పరస్పరము పరిహాసము లాడుకొనుచుండిరి

ఇచ్చట హిమాచలుడు అతివిచిత్రమైన వివాహమండపమును తయారు చేయించెను ఆ మండపము యొక్క యలంకరణము చిత్రాతిచిత్రము

చౌ॥ సైల సకల జహఁ లగి జగ మాహీఁ ।
లఘు బిసాల నహిఁ బరని సిరాహీఁ ॥
బన సాగర సబ నదీఁ తలావా ।
హిమగిరి సబ కహుఁ నేవత పఠావా ॥ 542

తా॥ జగత్తునందు చిన్నవి పెద్దవియగు పర్వతము లెన్నియో గలవు అవన్నియు వర్ణించుటకు సాధ్యముగానివి అవి అనంతములు వనములు, సముద్రములు, నదులు, తటాకము లెన్నియో గలవు అన్నిటిని గురించి చెప్పుటయసాధ్యము హిమాచలు డెల్లరకును ఆహ్వానము బంపెను

చౌ॥ కామరూప సుందర తన ధారీ ।
సహిత సమాజ సహిత బర నారీ ॥
గఏ సకల తుహినాచల గేహా ।
గావహిం మంగల సహిత సనేహా ॥ 543

తా॥ అన్నియు వాటి ఇష్టానుసారముగా రూపములను ధరించుకొని సుందర శరీర ధారణ గావించుకొని సౌందర్యవతులైన స్త్రీలై సమాజ సహితముగ హిమాచలుని గృహమున కేతెంచిరి అందరును స్నేహ పారవశ్యముచేత మంగళగీతములను గానము చేయదొడగిరి

చౌ॥ ప్రథమహిం గిరి బహు గృహ సంవరాయే ।
జథాజోగు తహం తహం సబ ఛాయే ॥
పురసోభా అవలోకి సుహాఈ ।
లాగఇ లఘు బిరంచి నిపునాఈ ॥ 544

తా॥ పెండ్లివారు తదితరులు విడిది చేయుటకు హిమాచలుడు ముందుగానే పెక్కు భవనము లేర్పాటు చేసియుండెను యథాయోగ్యముగా పెండ్లికి వచ్చిన వారలు వారి వారి స్థానములలో విడిది చేసిరి ఆ నగరము యొక్క శోభజూచిన యెడల బ్రహ్మయొక్క సృష్టియు, చాతుర్యము గూడ దురవగాహముగా నగుపడును

ఛం॥ లఘు లాగ బిధి కీ నిపునతా
అవలోకి పుర సోభా సహీ ।
బన బాగ కూప తడాగ సరితా సుభగ
సబ సక కో కహీ ॥

మంగల బిపుల తోరన పతాకా కేతు
గృహ గృహ సోహహిఁ ।
బనితా పురుష సుందర చతుర ఛబి
దేఖి ముని మన మోహహిఁ ॥ 545

తా॥ పార్వతీపరిణయము జరుగబోవు నా నగరపుశోభగాంచిన నిజముగా బ్రహ్మనిపుణత్వము తుచ్ఛముగా నగపడు ననుటలో సందేహములేదు వనములు, ఉపవనములు, బావులు, చెఱువులు, నదుల ప్రాంతములన్నియు సుందరములై చూచుటకు కన్నుల పండువుగ నుండెను వానిని వర్ణించుట కెవరికి సాధ్యము? గృహములన్నియు మామిడాకుల తోరణములు, అరటి స్తంభములు ఇత్యాది మంగళ సూచకమైన వానితో నలంకరించి యుండిరి ధ్వజపతాకలు లమర్చి యుండిరి అవన్నియు చూచుటకు కడు రమణీయముగ నుండెను అచ్చట నుండు చతురులైన స్త్రీపురుషుల సౌందర్యమును దిలకించిన, మునులకు కూడ మోహము గల్గునట్లుండెను

దో॥ జగదంబా జహఁ అవతరీ సో పురు బరని కి జాఇ ।
రిద్ధి సిద్ధి సంపత్తి సుఖ నిత నూతన అధికాఇ ॥ 546

తా॥ ఆ నగరమున సాక్షాత్ జగదంబయైన పార్వతీదేవి యవతరించినది కనుక ఆ నగరమును వర్ణింప సాధ్యమా? ఆ నగరము, సమృద్ధికి, సఫలతకు ఆటపట్టయినది జగదంబ జన్మస్థానముగాన, ఆ నగరము సంపదలచే తుల తూగెను అన్నపూర్ణ అవతరించిన చోట దారిద్ర్యముండునా? సుఖసంపదలు దినదినాభివృద్ధి నొందెను

చౌ॥ నగర నికట బరాత సుని ఆఈ ।
పుర ఖరభరు సోభా అధికాఈ ॥
కరి బనావ సజి బాహన నానా ।
చలే లేన సాదర అగవానా । 547

తా॥ వరపక్షము వారందఱును నగర సమీపమునకు వచ్చిరి నగరములో ఆనంద కోలాహలము వ్యాపించెను వరపక్షమువారు, నగరములోనివారు గలిసిన తరువాత చూచుట కత్యంత రమణీయముగ నుండెను

పెండ్లి వారికి స్వాగతమిచ్చుటకు కొందఱును, యుక్తిచేత శృంగారిము జేసికొని వివిధములైన వాహనములను దీసికొని ఆడంబరసహితముగా పెండ్లి వారిని గౌరవపురస్కారములతో సత్కరించుటకు కొందఱును సిద్ధపడిపోయిరి

చౌ॥ హియఁ హరషే సుర సేన నిహారీ ।
హరిహి దేఖి అతి భఏ సుఖారీ ॥
సివ సమాజ జబ దేఖన లాగే ।
బిడరి చలే బాహన సబ భాగే ॥ 54

తా॥ దేవతా బృందమును జూచి, నగరనివాసులందఱును సంతోషించిరి ముఖ్యముగా విష్ణుభగవానుని గాంచి, పురవాసులెల్లరును చాల సంతుష్టి నొందిరి శివసమాజమును గాంచినంతనే వీరును, గజములు, అశ్వములు, రథములు వృషభాదివాహనములును భయపడి పరుగిడిరి

చౌ॥ ధరి ధీరజు తహఁ రహే సయానే ।
బాలక సబ లై జీవ పరానే ॥
గఏఁ భవన పూఛహిఁ పితు మాతా ।
కహహిఁ బచన భయ కంపిత గాతా ॥ 549

తా॥ కొంత వయస్సు మళ్ళినవారు, వివేకవంతులు ధైర్యమువహించి అచ్చటనే యుండిరి పసివాండ్రు మాత్రము ప్రాణము లరచేతియం దుంచుకొని పరుగు దీసిరి ఇండ్లకు బోయిన తరువాత వారి తల్లిదండ్రులు, భయమునకు కారణ మడుగగా వారు భయకంపితులై యిట్లనిరి (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ కహిఅ కాహ కహి జాఇ న బాతా ।
జమ కర ధార కిధౌఁ బరిఆతా ॥
బరు బౌరాహ బసహఁ అసవారా ।
బ్యాల కపాల బిభూషన ఛారా ॥ 550

తా॥ ఏమని చెప్పుదుము మా నోటనుండి మాటలు వెలువడుట లేదు ఈ వచ్చినవారు పెండ్లివారా లేక యమదూతలా? పెండ్లికుమారుడేమైనా పిచ్చివాడేమో! వృషభముపై స్వారిచేయుచు వచ్చెను మెడలో పాము, చేతిలో పుర్రెయు నున్నవి

ఛం॥ తన ఛార బ్యాల కపాల
భూషన నగన జటిల భయంకరా ।
సంగ భూత ప్రేత పిసాచ జోగిని బికట
ముఖ రజనీచరా ॥
జో జిఅత రహహి బరాత దేఖత
పున్య బడ తేహి కర సహీ ।
దేఖిహి సో ఉమా బిబాహు ఘర
ఘర బాత అసి లరికన్హ కహీ ॥ 551

తా॥ పెండ్లికుమారుడు శరీరమునంతటను భస్మము పూసికొన్నాడు మెడలో పామును ధరించినాడు భయంకరుడు జటాధారి అతని వెంట భయంకర ముఖములు గలిగిన పిశాచములు, యోగులు రాక్షసులు కూడ కలరు ఇటువంటి పెండ్లివారిని జూచి, ప్రాణములతో నుండినవారు నిజముగా పుణ్యాత్ములే! పార్వతీ పరిణయమును తప్పక వారే చూడగలరు" అని పసిపాండ్రందరును ఇంటింట నిటువంటి మాటలను చెప్పుకొనిరి

వి॥ 'నాగేంద్రహారాయ త్రిలోచనాయ భస్మాంగరాగాయ మహేశ్వరాయ' అని శ్రీశంకరాచార్యులు శివుని స్తుతించినట్లు, శ్రీ తులసీదాసు పరమేశ్వరుని స్వరూపము పలుమారులు వర్ణించి యున్నారు

భయంకరముఖములుగల పిశాచములు, భూత, ప్రేతములు శివుని వెంబడించి యున్నారు అటువంటి వారిని జూచి ప్రాణములతో నుండిన వారు నిజముగా పుణ్యాత్ములేయని బాలురు చెప్పిన వాక్యములలో గొప్ప సత్య మిమిడి యున్నది ఈ దృశ్యప్రపంచము సామాన్యముగా విషయాసక్తులతో నిండియుండును జ్ఞానమార్గాన్వేషకులను,

సజ్జనులను, తఱచు విషయాసక్తులు లేక దుష్ట శక్తులు బాధించుచునే యుండును ఆ దుష్టశక్తులే భూతపిశాచము లని నోప్పును అవి సాధు జనుల నావరించినపుడు వానికి లొంగక స్థిత ప్రజ్ఞులై విరాజిల్లువారు నిజముగా పుణ్యాత్ములని భావము

అటువంటి పుణ్యాత్ములే పార్వతీకల్యాణమును జూడబోవుదు రని బాలురు చెప్పినదానిలో గూఢార్థ మిమిడి యున్నది అనగా అటు వంటి పుణ్యాత్ములు కైలాసమును జూతురని భావము

దో॥ సముఝి మహేస సమాజ సబ జనని జనక ముసుకాహిఁ ।
బాల బుఝావ బిబిధ బిధి నిడర హోహు డరు నాహిఁ॥552

తా॥ ఆ సేం శింగణములని తలచి బాలుర తల్లిదండ్రులు లంపరును వారి మాటలకు నంతసించి ఆ బాలకులను భయపడవలసిన నిమిత్తములేదు, నిర్భయ ముగ నుండు డని చెప్పి ఊరడించిరి

చౌ॥ లై అగవాన బరాతహి ఆఏ ।
దియే సబహి జనవాస సుహా ఏ ॥
మైనాఁ సుభ ఆరతీ సఁవారీ ।
సంగ సుమంగల గావహిఁ నారీ ॥ 553

తా॥ స్వాగతమిచ్చువారు, పరపక్షమువారిని గౌరవముతో బిలుచుకొని వచ్చిరి పెండ్లివారు రాజభవనమునందు విడిది చేసిరి పార్వతీదేవి తల్లియైన మేనాదేవి మంగళహారతిని దీసికొని వచ్చెను ఆమెవెంట కొంతమంది సఖులు గూడ నుండిరి వారు సంభ్రమముతో, నుత్సాహముతో ఉత్తమమంగళగీతములను పాడ మొదలిడిరి

చౌ॥ కంచన థార సోహ బరపానీ ।
పరిఛన చలీ హరహి హరషానీ ॥
బికట బేష రుద్రహి జబ దేఖా ।
అబలన్హ ఉర భయ భయఉ బిసేషా ॥ 554

తా॥ మేనాదేవి చేతియందు బంగారుహారతి పళ్ళెము శోభిల్లెను వరుడు ద్వారముకడ కేతెంచినపుడు ఎదురు పక్షమువారు హారతి నిచ్చుట యాచారము ఆచార ప్రకారము హారతి నిచ్చుటకు మేనాదేవి అమితానందముతో ద్వారము కడకేగెను శివుని భయంకరస్వరూపమును గాంచి మేనాదేవి, తదితర స్త్రీలందరును మిగుల భయము జెందిరి

చౌ॥ భాగి భవన పైఠీం అతి త్రాసా ।
గఏ మహేసు జహాం జనవాసా ॥
మైనా హృదయం భయఉ దుఖు భారీ ।
లీన్హి బోలి గిరీస కుమారీ ॥ 555

తా॥ భయాతిశయముచే మేనాదేవి, కడమ స్త్రీలందరును ఇండ్లకు మరలి వచ్చిరి శివుడు వరపక్షమువారున్న జనవాసమునకు వెడలిపోయెను మేనాదేవి హృదయము క్షోభించెను ఆమె దుఃఖాతిశయము వర్ణింప నలవికాదు మేనాదేవి పార్వతిని తనవద్దకు బిలిపించెను

చౌ॥ అధిక సనేహం గోద బైఠారీ ।
స్యామ సరోజ నయన భరే బారీ ॥
జేహిం బిధి తుమ్హహి రూపు అస దీన్హా ।
తేహిం జడ బరు బా ఉర కస కీన్హా ॥ 556

తా॥ అత్యంత ప్రేమపారవశ్యముతో మేనాదేవి పార్వతిని తన యొడిలో కూర్చుండబెట్టుకొని అశ్రుపూరిత నయనయై యిట్లనెను— విధాత నీ కెంతటి సుందర రూపమును ప్రసాదించినాడు। కాని యా మూర్ఖుడు నీ కెట్టి వచ్చివానిని భర్తగా సమకూర్చినాడు। (ముందు దోహాతో అన్వయము)

ఛం॥ కస కీన్హ బరు బౌరాహ
బిధి జేహిం తుమ్హహి సుందరతా దఈ ।
జో ఫలు చహిఅ సురతరుహిం సో
బరబస బబూరహిం లాగఈ ॥

తుమ్హ సహిత గిరి తేఁ గిరౌఁ పావక
జరౌఁ జలనిధి మహుఁ పరౌఁ।
ఘరు జాఉ అపజసు హోఉ జగ
జీవత బిబాహు న హౌఁ కరౌఁ॥ 557

తా॥ ఇంతటి సౌందర్యమును ప్రసాదించిన విధాత నీకు పిచ్చివరునేల సృష్టించెను? కల్పవృక్షమున కాయవలసిన ఫలమును తుమ్మచెట్టునందు గాయించుచున్నాడు. ఇప్పుడీ వివాహము జరుపుటకు నేనెంతమాత్ర మంగీకరింపను. నిన్ను దీసికొని వెళ్ళి పర్వతమునుండి క్రిందికైన బడద్రోయుదును. అగ్నికాహుతి చేసెదను లేక సముద్రమునకైన ముంచెదను. నా పరువు ప్రతిష్ఠలు నాశనమగుగాక! ఇల్లు వాడ శిథిల మగుగాక! ప్రపంచమంతటను నపకీర్తి వ్యాపించుగాక! నేను బ్రతికియుండగ ఈ పిచ్చివరునకు మాత్రము నా ప్రియ పుత్రిక నిన్నిచ్చి వివాహము జేయను

దో॥ భఈఁ బికల అబలా సకల దుఖిత దేఖి గిరినారి।
కరి బిలాపు రోదతి బదతి సుతా సనేహు సఁభారి॥ 558

తా॥ ఇట్లు దుఃఖించుచున్న మేనాదేవి దుఃఖమును జూచి స్నేహాతురాండ్రందరును వ్యాకులత నొందిరి. మేనాదేవి తన పుత్రికయైన పార్వతిని పిలుచుకొని రోదించుచు నిట్లు చెప్పెను— (ముందు దోహాలో అన్వయము)

చౌ॥ నారద కర మైఁ కాహ బిగారా।
భవను మోర జిన్హ బసత ఉజారా॥
అస ఉపదేసు ఉమహి జిన్హ దీన్హా।
బౌరే బరహి లాగి తపు కీన్హా॥ 559

తా॥ నేను నారదునికే యపకారము గావించితిని? కలకాలము వర్ధిల్లు నా యింటిని ధ్వంసముచేయ బూనెను (పిచ్చివానిని పతిగా జేసికొమ్మనెడి యుపదేశమును పార్వతికి నారదుడే యొసగినది) ఆ యుపదేశమును వేదవాక్యముగా భావించి, నా ప్రియ పుత్రికయైన సుకుమారియైన పార్వతి ఆ పిచ్చివానిని పతి జేసికొనుటకు తపము జేసినది

చౌ॥ సాచేహుఁ ఉన్హ కేఁ మోహ న మాయా ।
ఉదాసీన దను ధాముౝ జాయా ॥
పర ఘర ఘాలక లాజ న భీరా ।
బాఁఝు కి జాన ప్రసవ కై పీరా ॥ 560

తా॥ వాస్తవముగ అయనకు మోహము, మాయయు లేవు ఇల్లు-వాకిలి, ధన ధాన్యములు లేవు అతడుదాసీను . అతనికి భార్యయులేదు కనుకనే యితరుల సంసారములను నాశనము జేయుటకు బూనుకొనెను అతనికి లజ్జలేదు సరికదా భయ మెంత మాత్రమును లెదు గొడ్రాలి కేమి దెలియును బిడ్డ నొప్పులు!

చౌ॥ జననిహి బికల బిలోకి భవానీ ।
బోలీ జుత బిబేక మృదు బానీ ॥
అస బిచారి సోచహి మతి మాతా ।
సో న టరఇ జో రచఇ బిధాతా ॥ 561

తా॥ తల్లియొక్క ఆవేదనను, దుఃఖమును గ్రహించినదై పార్వతి వివేకయుక్తమైన కోమలవాణితో ఆమె నిటు లోదార్చును — జననీ! బ్రహ్మ నొసట వ్రాసిన వ్రాత తప్పింప నెవరికి సాధ్యము! ఇది తొలి నే జేసుకొన్న పూజా ఫలమనియే భావించి నీ విక చింతించుట మానుమమ్మా! (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ కరమ లిఖా జౌఁ బాఉర నాహూ ।
తౌ కత దోసు లగాఇఅ కాహూ ॥
తుమ్హ సన మిటహిఁ కి బిధి కే అంకా ।
మాతు బ్యర్థ జని లేహు కలంకా ॥ 562

తా॥ నా నుదుట వచ్చివాడు వరుడ గాగల రేఖయుండిన దాని కితరులపై దోష మారోపించుట పాడియా? విధాత నొసట వ్రాసిన గీతను దుడుప శక్యమా? వ్యర్థముగా నితరులను నిందింపకుము (ముందు దోహాతో అన్వయము)

చం॥ జని లేహు మాతు కలంకు కరునా
పరిహరహు అవసర నహీం ।
దుఖు సుఖు జో లిఖా లిలార హమరేం
జాబ జహాం పాఉబ తహీం ॥
సుని ఉమా బచన బినీత కోమల
సకల అబలా సోచహీం ।
బహు భాంతి బిధిహి లగాఇ దూషన
నయన బారి బిమోచహీం ॥ 563

తా॥ మాతా ఇతరులపై కళంక మారోపింపకుము దుఃఖమును విడిచి పెట్టుము ఇది విషాదమునకు సమయము గాదు నా భాగ్యరేఖ యెట్లుండిన నట్లగును నాకు గలిగిన సుఖదుఃఖముల నే ననుభవింతును

అత్యంత వినయముతో గూడిన కోమలవచనములను పార్వతి చెప్పగా విని యచ్చటనున్న సకల నారీమణులు దీర్ఘాలోచనలో నిమగ్నలైరి పెక్కు విధముల బ్రహ్మను దూషించుచు కన్నీరు గార్చిరి

వి॥ జ్ఞానమునకు వయస్సుతో నిమిత్తము లేదు అవతార పురుషులైన యాదిశంకరుడును, బుద్ధభగవానుడును, బాల్యమునందే జ్ఞానపూర్ణులైరి ధ్రువుడు, ప్రహ్లాదుడును బాల్యావస్థయందే శ్రీహరి చరణసరోజములందు అచంచలమైన భక్తిగలవారైరి శంకరాచార్యులు, బుద్ధుడు తాము తరించుటయే గాక తమ ప్రబోధములచే నితరులకు గూడ సన్మార్గమునుగూర్చి బోధించిరి

ఇటువంటి సంఘటనలను దృష్టియందుంచుకొని కవి, కుమారి పార్వతి తన తల్లియైన మేనాదేవికి కర్మ బలవత్తరమను విషయమునుగూర్చియు, దానిని సహనముతో దాటు విధానమును గూర్చియు చెప్పినట్లు అతిచమత్కారముగా చిత్రీకరించినాడు

పార్వతి పరిస్థితిని జూచి, యామె సకియ లందరును, మేనాదేవియు నశ్రుపూరిత వదనలైరి పార్వతీదేవి వయస్సునందు చిన్న

దైనను జ్ఞానమునకు నిధి గావున నామె యే మాత్రమును దుఃఖింపక తనకై వగచువారిని క్షణములో నూరడింప చేసెను అటులే మహాత్ములు తమకెన్ని బాధలు, కష్టములు కలిగినను స్థిరచిత్తులై, కష్టములను సుఖరూపములుగా భావింతురు

దో॥ తేహి అవసర నారద సహిత అరు రిషి సప్త సమేత ।
సమాచార సుని తుహినగిరి గవనే తురత నికేత ॥ 564

తా॥ మేనాదేవియును సఖులును తదితర అంతఃపుర నివాసులు దుఃఖ సముద్రమున మునిగియున్నారన్న సమాచారమును విని, హిమాచలుడు నారద మునీంద్రుని, సప్తర్షులను వెంటబెట్టుకొని తమ భవనమునకు విచ్చేసెను

చౌ॥ తబ నారద సబహీ సముఝావా ।
పూరుబ కథా ప్రసంగు సునావా ॥
మయనా సత్య సునహు మమ బానీ ।
జగదంబా తవ సుతా భవానీ ॥ 565

తా॥ నారదుడు పార్వతి పూర్వజన్మ వృత్తాంతము నెల్లరకు వినిపించెను ప్రత్యేకముగా నారదమునీంద్రుడు మేనాదేవితో నిట్లనియె— మేనాదేవీ! నా మాటయందు విశ్వాసముంచుమమ్మా! నీ పుత్రిక సాక్షాత్ జగజ్జనని భవాని— (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ అజా అనాది సక్తి అబినాసిని ।
సదా సంభు అరధంగ నివాసిని ॥
జగ సంభవ పాలన లయ కారిని ।
నిజ ఇచ్ఛా లీలా బపు ధారిని ॥ 566

తా॥ జన్మరహిత, అనాది, అవినాశిని, ఆదిశక్తి శంకరార్ధాంగ నివాసిని, సృష్టి పాలనము, సంహారమును గావించునది తన ఇచ్ఛా మాత్రమున లీలగా శరీరధారణ చేయునది (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ జనమీ ప్రథమ దచ్ఛ గృహ జాఈ ।
నాము సతీ సుందర తను పాఈ ॥
తహఁఉఁ సతీ సంకరహి బిబాహీఁ ।
కథా ప్రసిద్ధ సకల జగ మాహీఁ ॥ 567

తా॥ ఆమె ప్రథమమున దక్షుని గృహమున జన్మించెను అప్పుడామె పేరు సతి అత్యంతసౌందర్యవతియై విరాజిల్లుచుండిన యామె శంకరుని పరిణయ మాడెను ఈ కథ జగత్ప్రసిద్ధమైనదే కదా।

చౌ॥ ఏక బార ఆవత సివ సంగా ।
దేఖేఉ రఘుకుల కమల పతంగా ॥
భయఉ మోహు సివ కహా న కీన్హా ।
భ్రమ బస బేష సీయ కర లీన్హా ॥ 568

తా॥ ఒకసారి సతీదేవి శివసమేతయై వచ్చునప్పుడు రఘుకుల కమలము లకు సూర్యుడైన శ్రీరామచంద్రుని గాంచెను అట్టితరి ఆమె అజ్ఞాన మావరించెను కనుకనే శంకరుని మాట వినదాయెను అజ్ఞానవశమున సీతాదేవి వేషమును దాల్చెను

వి॥ ఒకసారి సతీదేవి శంకర సమేతయై అగస్త్యాశ్రమము నుండి కైలాసమునకు మరలి వచ్చుచుండెను శంకరుడు రామ నామమును జపించుటయును, రామునకు ప్రణమిల్లుటయునుపార్వతి-సతీదేవి గమనించినదై మనస్సునం దిట్లు తలపోసెను 'లక్ష్మీపతియైన శ్రీ మహావిష్ణువు లోకహితార్థము మానవ జన్మమెత్తినను, అజ్ఞానివలె విరహాబాధ ననుభవించుచు భార్య కొరకు దుఃఖించునా! అన్వేషించునా! ఆమె మనోభావములను శంకరుడు సర్వాంతర్యామిగావున గ్రహించెను అలయుచో శ్రీరాముని పరీక్షింపవచ్చునని నుడివెను శ్రీరాముడు పరబ్రహ్మస్వరూపుడు, సర్వవ్యాపకుడనియు, గో బ్రాహ్మణ సజ్జనహితార్థము రఘుకులమునందు జన్మించినాడనియు శ్రీరామ మహిమను గూర్చి శంకరుడు విపులముగ జెప్పెను కాని,

అజ్ఞానవశమున శివుని మాటలు వినక సీతాదేవిరూపమును దాల్చి శ్రీరాముని పరీక్షించెను

ఈ పూర్వజన్మ వృత్తాంతమును నారదమునీంద్రుడే మేనా హిమవంతుల కెఱింగించి వారి దుఃఖమును బాపెను

ఇచ్చట 'దేఖేఁ రఘుకుల కమల పతంగా' అని కవికుల శేఖరుడైన శ్రీ తులసీదాసు సెలవిచ్చినాడు అనగా రఘుకుల కమలములకు సూర్యుడని యర్థము సూర్యోదయమైనతోడనే కమలములు వికసించును అందులకే సూర్యుని కమలబాంధవుడందురు పతంగ అనగా సూర్యుడని భావము ఇదే అర్థము స్ఫురించునట్లు వినయ పత్రిక యందు శ్రీవారు 'భానుకుల కమల రవి' యని చెప్పుచు శ్రీరాముని స్తుతించియున్నాడు (ముందు దోహాతో అన్వయము)

చం॥ సియ బేషు సతీఁ జో కీన్హ తేహిఁ
అపరాధ సంకర పరిహరీఁ ।
హర బిరహఁ జాఇ బహోరి పితు కేఁ
జగ్య జోగానల జరీఁ ॥
అబ జనమి తుమ్హారే భవన నిజ పతి
లాగి దారున తపు కియా ।
అస జాని సంసయ తజహు గిరిజా
సర్బదా సంకర ప్రియా ॥ 569

తా॥ సతీదేవి సీతరూపమును ధరించి యపరాధమునకై శంకరుడామెను త్యజించెను శంకరుని వియోగమున దుఃఖితయైన సతి తన తండ్రియైన దక్షుడు చేయు యజ్ఞమునకు పోవ సంకల్పించి, శివునెట్లో యొప్పించి తుదకు దక్షగృహమున కేగెను అచ్చట శంకరునకు హవిర్భాగ మొసగకుండుట కాగ్రహపూరితయై యోగాగ్నియందు ఆ శరీరమును భస్మము గావించుకొనెను ఇప్పుడు మీ గృహమునం దవతరించి పరమేశ్వరునే పతిగా గోరి తప మాచ

రించిరి పార్వతి నదాశివుని ప్రియమైనది అర్ధాంగి కనుక నీవు సందేహములను విడిచిపెట్టి ఈ శుభ సమయమున సంతోషముగ నుండుమమ్మా

దో॥ సుని నారద కే బచన తబ సబ కర మిటా బిషాద ।
ఛన మహుఁ బ్యాపేఉ సకల పుర ఘర ఘర యహ
సంబాద ॥ 570

తా॥ అని నారదుడు చెప్పు వచనములను విన్నతరువాత అందరి దుఃఖము దూరమయ్యెను క్షణములో నీ సమాచారము నగరమంతంతటను ప్రాకెను ప్రతియింట జగజ్జననియై పార్వతీదేవి ప్రభావమును గూర్చిన మాటలే వినవచ్చుచుండెను

చౌ॥ తబ మయనా హిమవంతు అనందే ।
పుని పుని పారబతీ పద బందే ॥
నారి పురుష సిసు జుబా సయానే ।
నగర లోగ సబ అతి హరషానే ॥ 571

తా॥ అప్పుడు మేనాదేవియు, హిమాచలుడు నానందనిమగ్నులైరి పార్వతి పుత్రికి యన్న భావమును విడచి యా జగజ్జనని పాదపద్మములకు ప్రణమిల్లిరి స్త్రీలు పురుషులు, బాలకులు, యువకులు, వృద్ధులు, నగర నివాసులెల్లరు నానందపరవశులైరి

చౌ॥ లగే హోన పుర మంగల గానా ।
సజే సబహిఁ హాటక ఘట నానా ॥
భాఁతి అనేక భఈ జేవనారా ।
సూపసాస్త్ర జస కఛు బ్యవహారా ॥ 572

తా॥ నగరనివాసు లెల్లరును మంగళగీతములను గానముచేయ దొడగిరి కొందరు వివిధములైన సువర్ణ కలశములను సిద్ధము చేసిరి మరికొందరు పాక శాస్త్రములో జెప్పు రీతిగా మధురమైన, రుచికరమైన వంటలను జేసిరి

చౌ॥ సో జేవనార కి జాఇ బఖానీ ।
బసహిఁ భవన జేహిఁ మాతు భవానీ ॥
సాదర బోలే సకల బరాతీ ।
బిష్ణు బిరంచి దేవ సబ జాతీ ॥ 573

తా॥ ఏ భవనమున సాక్షాత్ భవాని—పార్వతీదేవి వాసము చేయుచున్నదో యచ్చట నున్న భోజన సామగ్రిని, ఆ వైభవమును వర్ణింప నెవరి తరము? హిమవంతుడు సంబంధీకులైన వారిని లోకపితామహుండైన బ్రహ్మను, శేషశాయియైన విష్ణువును, దేవతలందరిని సగౌరవముగా నాహ్వానించెను

చౌ॥ బిబిధి పాఁతి బైఠీ జేవనారా ।
లాగే పరుసన నిపున సుఆరా ॥
నారిబృంద సుర జేవఁత జానీ ।
లగీఁ దేన గారీఁ మృదు బానీ ॥ 574

తా॥ అందరను భోజనము చేయుటకు పంక్తులు దీర్చిరి మధురపదార్థములు వడ్డింపబడెను దేవతలందరు భోజనములు చేయు సమయమున స్త్రీలందరును కోమలముగ వారిని పరిహసించిరి

ఛం॥ గారీఁ మధుర స్వర దేహిఁ సుందరి
బింగ్య బచన సునావహీఁ ।
భోజను కరహిఁ సుర అతి బిలంబు బినోదు
సుని సచు పావహీఁ ॥
జేవఁత జో బఢ్యో అనంద సో ముఖ
కోటిహూఁ న పరై కహ్యో ।
అచవాఁఇ దీన్హేఁ పాన గవనే బాస
జహఁ జాకో రహ్యో ॥ 575

తా॥ అత్యంత సౌందర్యవతులైన యువతీమణులు తియ్యని పలుకులతో పరిహాసమాడ జొచ్చిరి ఆ భోజన సమయమున, ఎటుచూచినను వ్యంగ్య

ముతో సూడిన హాస్యరసభరితమైన వాక్కులే వినవచ్చుచుండెను దేవతలా వినోదములను వినుచు, సుఖానుభవమును పొందిరి కనుక భోజనములు సుగియుట కాలస్యమాయెను

భోజన సమయమున, ఎల్వరు లనుభవించిన యానందమును, వేనోళ్ళ గూడ వర్ణింప సాధ్యముగాదు విందుభోజనములు ముగిసిన తరువాత నందరికిని తాంబూలములను నిచ్చిరి తిరువాత వివాహమునకు విచ్చేసినవారలు వారుండు విడిది భవనములకు వెడలిపోయిరి

దో॥ బహురి మునిన్హ హిమవంత కహుఁ లగన సునాఈ ఆఇ ।
సమయ బిలోకి బిబాహ కర పరఏ దేవ బోలాఇ ॥ 576

తా॥ మరల మునులు తిరిగివచ్చి హిమవంతునికి లగ్నపత్రికను వినిపించిరి వివాహసమయ మాసన్నమైనదని దేవతల నందరిని పిలిపించిరి

చౌ॥ బోలి సకల సుర సాదర లీన్హే ।
సబహి జథోచిత ఆసన దీన్హే ॥
బేదీ బేద బిధాన సఁవారీ ।
సుభగ సుమంగల గావహిఁ నారీ ॥ 577

తా॥ దేవతలందరిని నాదరపూర్వకముగా పిలిపించి, వారివారి యంతస్తునకు తగినట్టుగా ఉచితాసనముల నొసగిరి వేదములో చెప్పిన రీతిగా వివాహవేదికను సిద్ధపరచియుంచిరి వనితలు శ్రేష్ఠమైన, మధుర మంగళ గీతములను గానము చేయ దొడగిరి

చౌ॥ సింఘాసను అతి దిబ్య సుహావా ।
జాఇ న బరని బిరంచి బనావా ॥
బైఠే సివ బిప్రన్హ సిరు నాఈ ।
హృదయఁ సుమిరి నిజ ప్రభు రఘురాఈ ॥ 578

తా॥ వేదికపై నత్యంత సుందరమైన యొకదివ్యసింహాసన ముండెను ఆ సింహాసన పు టలంకరణ వర్ణించుటకు సాధ్యము గాదు ఏలని బ్రహ్మ దానిని

స్వయముగా నిర్మించెను శంకరుడు పెండ్లి కుమారుడై, బ్రాహ్మణులకు నమస్కరించి, యంతరంగమున తన స్వామియైన శ్రీరఘునాథుని స్మరించుచు ఆ దివ్య సింహాసనమునం దాసీనుడయ్యెను

చౌ॥ బహురి మునీసన్హ ఉమా బోలాఈం
కరి సింగారు సఖీం లై ఆఈం ॥
దేఖత రూపు సకల సుర మోహే ।
బరనై ఛబి అస జగ కబి కో హై ॥ 579

తా॥ ఆ శుభసమయమున మునీశ్వరులు పార్వతిని పిలిపించిరి చెలికత్తెలు పార్వతిని శృంగారించి తోడ్కొని వచ్చిరి పార్వతీదేవి రూప సౌందర్యములను జూచి దేవతలు గూడ మోహాతులైరి ఆ సోయగమును వర్ణింపగల కవి యీ జగత్తునం దుండడనుట యతిశయోక్తి కానేరదేమో।

చౌ॥ జగదంబికా జాని భవ భామా ।
సురన్హ మనహిం మన కీన్హ ప్రనామా ॥
సుందరతా మరజాద భవానీ ।
జాఇ న కోటిహుం బదన బఖానీ ॥ 580

తా॥ పార్వతి జగదంబయనియు శంకరపత్నియని తెలిసికొని దేవతలంతరంగమున పార్వతికి ప్రణామము లాచరించిరి ఆ శోభను వేనోళ్ళతో వర్ణింప సాధ్యము గాదు

ఛం॥ కోటిహుం బదన నహిం బనై బరనత
జగ జనని సోభా మహా ।
సకుచహిం కహత శ్రుతి సేష సారద
మందమతి తులసీ కహా ॥
ఛబి ఖాని మాతు భవాని గవనీం
మధ్య మండప సివ జహాం ।
అవలోకి సకహిం న సకుచ పతి పద
కమల మను మధుకరు తహాం ॥ 581

తా॥ జగజ్జనని యైన పార్వతీదేవిసౌందర్యమును, శోభను కోట్ల ముఖములతోను వర్ణించుట సాధ్యము గాదు వేదములు, శేషుడును, సరస్వతియును వర్ణించుటకు సంకోచించుచుందురు అట్టితరి మందబుద్ధియైన తులసీదాసు ఏ శ్రేణి లోనికి వచ్చును?

సౌందర్యరాశియైన భవాని వివాహమండపము మధ్యకు పోయి శివునితో చోట ఒకొక యాసనముపై కూర్చుని యుయ్యేను లజ్జాభారమునేత్ర లజ్జించుకొని చూచుచున్నది కాని శివపాదారవిందములను గాంచలేక పోయెను కాని యామె మనోరూపమై భ్రమరమై మకరందము నాస్వాదించుచునే యుండెను

వి॥ తుమ్మెద పుష్పములపై మకరందమును పానము జేయును అట్లే పార్వతి ప్రత్యక్షముగా శివుని పాదారవిందములు చూడలేక పోయినను, మనోరూపమైన తుమ్మెదయై, తుమ్మెద మకరందమును గ్రోలు నట్లు, ఆమె శివపాదారవిందములపై వ్రాలెనను భావము నందు వ్యక్తమగుచున్నది

సర్వజ్ఞుడయ్యును ఇందు కవి తులసీదాసు తనను 'మందమతి తులసీ' యని చెప్పుచు బిగువత్వమునుబట్టి నైచ్యానుసంధానము గావించు కొనుచున్నాడు

పశుపతీ! ప్రభూ! నిగ్రహానుగ్రహ సామర్థ్యముగల దేవా! నీవు దీనులకు పరమబాంధవుడవు గదా! నే నత్యంత దీనుడను, మందమతిని నాయిందు కనికరముంచి నాకు వాక్కు ప్రసాదించి నన్ను నీవే కాపాడవలసియున్నది' అని శ్రీతులసీదాసు శివుని వేడు కొనుచున్నాడు

దో॥ ముని అనుసాసన గనపతిహి పూజేఉ సంభు భవాని ।
కోఉ సుని సంసయ కరై జని సుర అనాది జియఁ జాని॥582

తా॥ మునుల యాజ్ఞచే శివపార్వతులు గణేశుని పూజించిరి గణపతి శివ పార్వతుల సంతానము కదా! ఇప్పుడు వివాహమునకు పూర్వమెక్కడినుండి

ఎచ్చెన్న ఎంచేహ మందరికిని కలుగును దేవతలనాదిగా నున్నారని భావించి మహాశయులు టువంటి సందేహములు కొన్పుచు మీయుటందురు గాక।

చౌ॥ జసి బిబాహ కై బిధి శ్రుతి గాఈ।
మహామునిన్హ సో సబ కరవాఈ॥
గహి గిరీస కుస కన్యాపానీ।
భవహి సమరషీఁ జాని భవానీ॥ 583

తా॥ వేదములో వివాహ పద్ధతుల నెన్ని చెప్పినారో ఆ రీతిగా మునులు వివాహమును జరిపించిరి పర్వతరాజైన హిమవంతుడు చేతియందు దర్భనుంచుకొని తన పుత్రిక చేయి పట్టుకొని యామె శివపత్నియైన భవాని యని తెలిసికొని పార్వతిని శంకరునకు సమర్పణ గావించెను

చౌ॥ పానిగ్రహన జబ కీన్హ మహేసా।
హియఁ హరషే తబ సకల సురేసా॥
బేదమంత్ర మునిబర ఉచ్చరహీఁ।
జయ జయ జయ సంకర సుర కరహీఁ॥ 584

తా॥ మహేశ్వరుడు పార్వతిని పాణిగ్రహణము చేసకొనినంతనే ఇంద్రాది దేవతలు హర్షించిరి శ్రేష్ఠ మునులెల్లరును వేదమంత్రము లుచ్చరించిరి దేవతలు జయ శ్రీమహాదేవ! జయ జయ శ్రీమహాదేవ! యనుచు జయజయ ధ్వనులు సల్పిరి

చౌ॥ బాజహీఁ బాజన బిబిధ బిధానా।
సుమనబృష్టి నభ భై బిధి నానా।
హర గిరిజా కర భయఉ బిబాహా।
సకల భువన భరి రహా ఉఛాహా॥ 585

తా॥ వివిధ మంగళ వాద్యములు మ్రోగెను ఆకాశమునుండి వివిధ ప్రకారములుగా పుష్పవర్షములు కురిసెను శివపార్వతుల వివాహ మత్యంత వైభవోపేతముగ జరిగినది బ్రహ్మాండమంతయు నానందముతో నిండెను

చౌ॥ దాసీం దాస తురగ రథ నాగా ।
ధేను బసన మని బస్తు బిభాగా ॥
అన్న కనక భాజన భరి జానా ।
దాఇజ దీన్హ న జాఇ బఖానా ॥ 586

తా॥ హిమాచలుడు దాసదాసీజనమును, రథములను అశ్వములను, గోవులను, వస్త్రములను, మణి-కిరీటాది వస్తువులను సువర్ణాన్నపాత్రలను, వరదక్షిణగానిచ్చెను ఆ వస్తుసముదాయములను వర్ణించుట సాధ్యము కాదు

ఛం॥ దాఇజ దియో బహు భాంతి పుని
కర జోరి హిమభూధర కహ్యో ।
కా దేఉం పూరనకామ సంకర
చరనపంకజ గహి రహ్యో ॥
సివం కృపాసాగర ససుర కర సంతోషు
సబ భాంతిహిం కియో ।
పునిగహే పదపాథోజ మైనాం
ప్రేమపరిపూరన హియో ॥ 587

తా॥ ధనకనకాది వస్తువాహనములను వరదక్షిణగా నిచ్చి రెండు చేతులను జోడించి హిమాచలు డిట్లనెను—

'ఓ శంకరా! నీవు సంపూర్ణకాముడవు నేను నీ కేమీయగలవాడను అనుచు శివపాదారవిందములను గట్టిగా బట్టుకొనెను అప్పుడు కృపాసాగరుడైన శివుడు తన మామయైన హిమాచలుని సమాధాన పఱచెను నిండు ప్రేమతో, పరిపూర్ణహృదయముతో మేనాదేవి శంకరుని చరణకమలములకు ప్రణమిల్లి యిట్లనెను (ముందు దోహాతో అన్వయము)

దో॥ నాథ ఉమా మమ ప్రాన సమ
గృహకింకరీ కరేహు ।
ఛమేహు సకల అపరాధ అబ
హోఇ ప్రసన్న బరు దేహు ॥ 588

తా॥ స్వామీ! ఉమ నాకు ప్రాణసమమైనది. ఆమెను నీ పాద దాసిగా స్వీకరించుము. ఉమ చేసిన సకలాపరాధములను క్షమించి ఆమెను కరుణించి వలయును ప్రసన్నచిత్తముతో నా కానుకలను ప్రసాదించుము.

చౌ॥ బహు బిధి సంభు సాసు సముఝాఈ ।
గవనీ భవన చరన సిరు నాఈ ॥
జననీ ఉమా బోలి తబ లీన్హీ ।
లై ఉఛంగ సుందర సిఖ దీన్హీ ॥ 589

తా॥ శివుడు అత్తయైన మేనాదేవిని పెక్కు విధముల సమాధానపరచెను. శివ పాదారవిందములకు నమస్కరించి మేనాదేవి రాజమందిరమున కేగెను. తరువాత పార్వతిని పిలిపించెను. పార్వతిని ఒడియందు గూర్చుండ జేసి, యీ విధముగ హితోపదేశ మొనరించెను. (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ కరేహు సదా సంకర పద పూజా ।
నారి ధరము పతి దేవ న దూజా ॥
బచన కహత భరే లోచన బారీ ।
బహురి లాఇ ఉర లీన్హి కుమారీ ॥ 590

తా॥ ఓ పార్వతీ! సదా శివుని పాదపద్మములను సదా పూజించుము, అదియే నారీ ధర్మము. వనితలకు పతియే దైవము. అని చెప్పుచు కన్నీరు కార్చుచు పార్వతి నాలింగనము జేసికొనెను.

చౌ॥ కత బిధి సృజీం నారి జగ మాహీం ।
పరాధీన సపనేహుం సుఖు నాహీం ॥
భై అతి ప్రేమ బికల మహతారీ ।
ధీరజు కీన్హ కుసమయు బిచారీ ॥ 591

తా॥ మరియు నిట్లనెను. విధి ఈ జగత్తునందు స్త్రీజాతి నేల సృష్టించెను? పరాధీనులకు స్వప్నములోగూడ సుఖశాంతులుండవు (స్త్రీలు పరాధీనలని భావము)

అని చెప్పుచు ప్రేమతో వికలమైన మనసు కలదాయెను కాని, దుఃఖ ... యము కాదని తలచి, ధైర్యము వహించెను

చౌ॥ పుని పుని మిలతి పరతి గహి చరనా ।
పరమ ప్రేమ కఛు జాఇ న బరనా ॥
సబ నారిన్హ మిలి భేటి భవానీ ।
జాఇ జనని ఉర పుని లపటానీ ॥ 592

తా॥ ... దేవి మాటి మాటికిని పార్వతి నాలింగనము చేసికొనెను ఆమె పాదములపై వ్రాలి క్రింద పడిపోవుచుండెను ఆ అగాధమైన, యనంతమైన ప్రేమాతిశయమును వర్ణింప ... అరము? పార్వతీదేవి తన స్నేహాతురాం ... సఖులను ఆలింగనము చేసికొని మరల మేనాదేవిని జేరి ... పూర్వకముగ ఆలింగన మొనర్చుకొనెను

ఛం॥ జననిహి బహురి మిలి చలీ ఉచిత
అసీస సబ కాహూఁ దఈఁ ।
ఫిరి ఫిరి బిలోకతి మాతు తన తబ సఖీఁ
లై సివ పహిఁ గఈఁ ॥
జాచక సకల సంతోషి సంకరు
ఉమా సహిత భవన చలే ।
సబ అమర హరషే సుమన బరషి
నిసాన నభ బాజే భలే ॥ 593

తా॥ పార్వతి మాటిమాటికిని తల్లి నాలింగనము చేసికొని ముందుకు ... ప్రతియొకరును ఉమ నాశీర్వదించిరి పార్వతి వెడలునపుడు తల్లిని ... బాగ చూచుచు బోయెను అప్పుడు సఖియ లామెను శంకరుని వద్దకు ... పిచ్చిరి

మహాదేవుడు యాచకులను సంతుష్టి పఱచి పార్వతీసమేతముగా కైలాస ... పోయెను దేవతలు ప్రసన్నులై పుష్పవర్షము కురియించిరి అంబర ... దుందుభులు మ్రోగెను

దో॥ చలే సంగ హిమవంతు తబ పహుఁచావన అతి హేతు ।
బిబిధ భాఁతి పరితోషు కరి బిదా కీన్హ బృషకేతు ॥ 594

తా॥ శివపార్వతులను హిమవంతుడు దివ్యంబగు ప్రేమతో కైలాసమునకు వెంబడించెను. కైలాసమునకు వృషకేతుడు హిమాచలుని సానందపరవశునిగావించెను. హిమాచలుడు శివునివద్ద సెలవుదీసుకొని తన భవనమునకు మరలివచ్చెను.

చౌ॥ తురత భవన ఆఏ గిరిరాఈ ।
సకల సైల సర లిఏ బోలాఈ ॥
ఆదర దాన బినయ బహుమానా ।
సబ కర బిదా కీన్హ హిమవానా ॥ 595

తా॥ అనంతరము భవనమునకు విచ్చేసి అక్షణమే పర్వతరాజైన హిమవంతుడు తన సేవకులైన పర్వత, సరోవరములను పిలిపించెను. వారి నుచితరీతి సత్కరించి, బహుమానములొసగి పంపివైచెను.

చౌ॥ జబహిఁ సంభు కైలాసహిఁ ఆఏ ।
సుర సబ నిజ నిజ లోక సిధాఏ ॥
జగత మాతు పితు సంభు భవానీ ।
తేహిఁ సింగారు న కహఉఁ బఖానీ ॥ 596

తా॥ శంకరుడు కైలాసమును జేరిన తరువాత దేవతలెల్లరును వారి వారి నివాసముల కేగిరి.

పార్వతీ పరమేశ్వరులు జగత్తునకు మాతాపితలు. వారి శృంగారమును, ప్రణయమును గూర్చి వర్ణించుట శక్యమా? అని శ్రీగోస్వామి తులసీదాసు వచించుచున్నారు.

చౌ॥ కరహిఁ బిబిధ బిధి భోగ బిలాసా ।
గనన్హ సమేత బసహిఁ కైలాసా ॥
హర గిరిజా బిహార నిత నయఊ ।
ఏహి బిధి బిపుల కాల చలి గయఊ ॥ 597

తా॥ శివపార్వతు లనేక ప్రకారములుగ భోగవిలాసములతో గూడి గణ సహితముగా కైలాసమునందు వాసము జేయుచుండిరి వారు నిత్యము విహారము సల్పుచుండిరి ఈ విధముగ చాలకాలము గడచి పోయినది

చౌ॥ తబ జనమేఉ షటబదన కుమారా ।
తారకు అసురు సమర జేహిం మారా ॥
ఆగమ నిగమ ప్రసిద్ధ పురానా ।
షన్ముఖ జన్ము సకల జగజానా ॥ 598

తా॥ వారికి షణ్ముఖుడను పుత్రుడు (ఆరుముఖములు గలిగిన పుత్రుడు) జనించెను షణ్ముఖుడు పెరిగి పెద్దవాడై తారకాసురుని సంహరించెను

వేదశాస్త్రములందును, పురాణములందును షణ్ముఖ జన్మవృత్తాంతము ప్రసిద్ధమే । అందరికును విదితమైనదే ।

ఛం॥ జగు జాన షన్ముఖ జన్ము కర్ము
ప్రతాపు పురుషారథు మహా ।
తేహి హేతు మైం బృషకేతు సుత కర
చరిత సంఛేపహిం కహా ॥
యహ ఉమా సంభు బిబాహు జే
నర నారి కహహిం జే గావహీం ।
కల్యాన కాజ బిబాహ మంగల
సర్బదా సుఖు పావహీం ॥ 599

తా॥ షణ్ముఖుని జన్మకర్మప్రతాపములు జగత్తునందెల్లరకును విదితమే । నేను (తులసీదాసు) వృషకేతు పుత్రుని, చరిత్రమును సంక్షేపముగా తెలిపితిని

శివుల కింబోయిన పార్వతీ పరిణయమును స్త్రీలైనను, పురుషులైనను గానము చేసినచో వారికి వివాహాదిమంగళకార్యములు సఫలమై సుఖమునొందెదరు

దో॥ చరిత సింధు గిరిజా రమన బేద న పావహిఁ పారు ।
బరనై తులసీదాసు కిమి అతి మతి మంద గవాఁరు ॥ 600

తా॥ గిరిజాపతియైన మహాదేవుని చరిత్రము సముద్రము వంటి అంతులేనిది, యగాధమైనది. దాని యంతు వేదములుగూడ దెలిసికొన లేకపోయినవి.

ఇటిప్పుడు అత్యంత మందబుద్ధియు, మూర్ఖుడు నైన యీ తులసీదాసు ఎట్లు వర్ణింపగలడు?

చౌ॥ సంభు చరిత సుని సరస సుహావా ।
భరద్వాజ ముని అతిసుఖ పావా ॥
బహు లాలసా కథా పర బాఢీ ।
నయనన్హి నీరు రోమావలి రాఢీ ॥ 601

తా॥ మధుర మనోహర రసవత్తరమైన శివ చరిత్రమును విని భరద్వాజ మహాముని చాల సంతోషించెను. కథ వినవలెనన్న కుతూహల మాతనియం దెంతేనియు పెంపొందెను. నయనములనుండి యానందబాష్పములు గారెను. గగుర్పాటు గలిగెను.

వి॥ 'నారాయణుని దివ్యనామాక్షరములపై కరగని మనసులు కఠినశిలలు, మురవైరి కథలకు ముదితాశ్రు రోమాంచమిళితమై యుండని మేను మొద్దు' అని భాగవతములో జెప్పబడియున్నది.

భగవత్కథలను మహనీయులు వినుతఱి, ఆనందబాష్పములు గారును, రోమాంచముగూడ సహజమై యుండును. ఎవని హృదయమందు దివ్యభావన, రోమాంచాది చిహ్నములుగల భగవద్భావన యుద్భవించునో వాని జన్మము సార్థకమైనది! అతడు తరించుటయే గాక అతని అనుయాయులును తరింతురు.

చౌ॥ ప్రేమ బిబిస ముఖ ఆవ న బానీ ।
దసా దేఖి హరషే ముని గ్యానీ ॥
అహో ధన్య తవ జన్మ మునీసా ।
తుమ్హహి ప్రాన సమ ప్రియ గౌరీసా ॥ 602

తా॥ ప్రేమచే ముగ్ధుడాయెను ప్రేమాతిశయముచే నోటినుండి మాట వెలువడలేదు భరద్వాజుని ఎరగాంచి, యాజ్ఞవల్క్యుడాతని యెడ ప్రసన్నుడై యిట్లనెను – ఓ మునీశ్వరా! ఆహా! నీ జన్మము ధన్యమైనది నీవు గౌరీపతియైన శివునకు ప్రాణప్రియుడైనావు

ని॥ ప్రేమ సంతోషమును, ద్వేషము అశాంతిని కలగించును ప్రేమాధిక్యము అధిక సంతోషమును, అధికద్వేషము అధికమైన అశాంతిని కలిగించును భగవంతుని యందలి పరమప్రేమయే భక్తి ఆ భక్తి గలిగినవారు అంతరంగమున గొప్ప సుఖము నొందుదురు ఇందుకు భక్తి యొక్కటే సాధ్యముగాని ఇట్టి భావనను శరణుజొచ్చిన వారికి యిష్టదైవమే ప్రాణాధికము

చౌ॥ సివ పద కమల జిన్హహి రతి నాహీం ।
రామహి తే సపనేహుఁ న సోహాహీం ॥
బిను ఛల బిస్వనాథ పద నేహూ ।
రామ భగత కర లచ్ఛన ఏహూ ॥ 603

తా॥ శివపాదారవిందములందెవరికి ప్రీతిలేదో, వారు శ్రీరామచంద్రునికి స్వప్నమునందు గూడ మంచివారుగా గన్పించరు విశ్వనాథుడైన శ్రీ శివచరణములపై నిష్కపటమైన, విశుద్ధమైన ప్రేమ గలిగియుండుటే రామభక్తుని లక్షణము

చౌ॥ సివ సమ కో రఘుపతి ప్రతధారీ ।
బిను అఘ తజీ సతీ అసి నారీ ॥
పను కరి రఘుపతి భగతి దేఖాఈ ।
కో సివ సమ రామహి ప్రియ భాఈ ॥ 604

తా॥ శివునితో సమానముగ రామభక్తి యను ప్రతమును జేయువాడెవడు? శంకరుడు ఏ పాపము నెఱుగని సతీదేవిని సమాతము త్యాగమొనర్చెను ప్రతిజ్ఞాపూర్వకముగా రామభక్తిని చాటెను కనుక ఓ నాయనలారా! అన్నలారా! శ్రీరామచంద్రునికి శంకరుని కంటెను ప్రాణసమాను లెవరున్నారు!

వి॥ 'రామభక్తి సామ్రాజ్య మేమానవుల కబ్బెనో మనసా' అని శ్రీ త్యాగరాజు రామభక్తిని కీర్తించెను. రామభక్తి గలుగుట దుర్లభము. రామభక్తి యను ప్రతిమను సంకల్పించిన శివుడే సర్వమును త్యజించి యేకాంతముగ రామధ్యానము చేసెను. ఆ సామ్రాజ్యమేపాటి? అనేకజన్మలలో సంపాదించుకొనిన పుణ్యము లన్నియు గలసి గొప్పరాశిగా ఏర్పడి, దాని ఫలితముగా ఆ భక్తి యనునది ఒకానొకనికి కలుగుచున్నది. భగవదనుగ్రహముచేతను, అథవా మహాత్ముల దయవలనను ఈ భక్తి మనకు కలుగును.

శౌనకుడు ప్రశ్నచే రామభక్తిని నిరూపణ చేసినట్లు, గురు కటాక్షమువలన మహాత్ముల దయవలన కలిగిన దానిని సదను ష్ఠా నియమములన్ని దీక్షతో పెంపొందించుకొని శ్రీరామకృపకు పాత్రులు గావలయును.

దో॥ ప్రథమహిఁ మైఁ కహి సివచరిత బూఝా మరము తుమ్హార ।
సుచి సేవక తుమ్హ రామ కే రహిత సమస్త బికార ॥ 605

తా॥ నేను ప్రథమమున శివచరిత్రను చెప్పి నీ మర్మము నెఱింగితిని. నీవు శ్రీరామచంద్రునికి పవిత్రమైన భక్తుడవు. సమస్త దోషరహితుడవు.

చౌ॥ మైఁ జానా తుమ్హార గున సీలా ।
కహఉఁ సునహు అబ రఘుపతి లీలా ॥
సుని ముని అజు సమాగమ తోరేఁ ।
కహి న జాఇ జస సుఖు మన మోరేఁ ॥ 606

తా॥ నేను నీ గుణశీలములను దెలిసికొంటిని. ఇప్పుడు నేను శ్రీరఘు నాథుని లీలలను వర్ణించెదను, వినుము. ఓ మునీశ్వరా! నేడు నిన్ను గలసి కొనుటవలన నేను సమితానందము నొందుచున్నాను. ఆ యానందమింతింత యని చెప్పుటకు శక్యము గానేరదు.

చౌ॥ రామ చరిత అతి అమిత మునీసా ।
కహి న సకహిఁ సత కోటి అహీసా ॥
తదపి జథా శ్రుత కహఉఁ బఖానీ ।
సుమిరి గిరాపతి ప్రభు ధనుపానీ ॥ 607

తా॥ ఓ మునీశ్వరా! శ్రీరాము చరిత్ర మత్యంత మపారమైనది. దానిని శతకోటి శేషులు గూడ వర్ణింపజాలరు. ఐనను నేను విన్న ప్రకారము, ధనుర్ధారియైన శ్రీరామచంద్రుని స్మరించి నీకు జెప్పెదను

చౌ॥ సారద దారునారి సమ స్వామీ ।
రామా సూత్రధర అంతరజామీ ॥
జేహి పర కృపా కరహిఁ జను జానీ ।
కబి ఉర అజిర నచావహిఁ బానీ ॥ 608

తా॥ మునీశ్వరా! ఇందు సరస్వతి గూడ కొయ్య బొమ్మతో సమానము స్వామీ! అంతర్యామియైన శ్రీరామచంద్రుడు సూత్రధారుడు. తన భక్తుడని యెంచి యే కవిని కృపాదృష్టితో జూచునో వాని హృదయ ఫలకమున శ్రీరామచంద్రుడు సరస్వతి నాడించును

వి॥ పట్టణములందుగాని, పల్లెలందుగాని తోలుబొమ్మలాట లాడించుచుందురు. అందు సూత్రధారుడు దారమును పట్టుకొని యేవిధముగ బొమ్మ నాడించునో ఆ విధముగ అది ఆడుచుండును

ఇచ్చట కవి తులసీదాసు సరస్వతిని - కొయ్యబొమ్మకును, శ్రీరామచంద్రుని - సూత్రధారునకును బోల్చినాడు. సూత్రధారుడు కొయ్యబొమ్మ నాడించురీతి, శ్రీరామచంద్రుడు తన భక్తుల హృదయ ఫలకమున వాగ్దేవియైన సరస్వతి నాడించును అనగా శ్రీరామ భక్తులకు సరస్వతి కటాక్షము తప్పక కలుగునని కవి హృదయము

చౌ॥ ప్రనవఉఁ సోఇ కృపాల రఘునాథా ।
బరనఉఁ బిసద తాసు గున గాథా ॥
పరమ రమ్య గిరిబరు కైలాసూ ।
సదా జహాఁ సివ ఉమా నివాసూ ॥ 609

తా॥ భక్తులకు పెన్నిధియైన, కరుణా సముద్రుడైన శ్రీరఘునాథుచరణార విందములకు నేను నమస్కరించుచున్నాడను శ్రీరామునుగుణ సంపదను విపులీకరించెడు పవిత్రమైన నిర్మలమైన శ్రీరామ చరిత మానసమును, నేను చెప్పెదను శ్రద్ధగా నాలకింపుము

కైలాస పర్వతము నందు రమణీయమైన స్థానములు గలవు కనుకనే అది శివ పార్వతులకు సదా నివాస స్థానమైనది

## శివ–పార్వతుల సంవాదము

దో॥ సిద్ధ తపోధన జోగిజన సుర కిన్నర మునిబృంద ।
బసహిఁ తహాఁ సుకృతీ సకల సేవహిఁ సివ సుఖకంద॥ 610

తా॥ సిద్ధులు, తపోధనులు, యోగులు, దేవతలు, కిన్నరులు, మునులు కైలాస పర్వతమునందు వసింతురు వారెల్లరును చాల పుణ్యాత్ములు నిత్యానంద స్వరూపుడును, చంద్రశేఖరుడును, మహాదేవుడును ఆశ్రితులకు సుఖకరుడైన శివునకు నిరంతరము సేవలొనర్చుచుందురు

వి॥ కైలాసపర్వతమున (ఇదే రజతగిరి–వెండికొండ) ప్రమథగణములతో నున్న శివుని సిద్ధులు, తపోధనులు, యోగులు, దేవతలు, కిన్నరులు అంజలి ఘటించి 'విభూ! సాంబశివా! శంభో! శంకరా! పాహి' అని స్తుతించుచు ఆ యానందములో అనేకబ్రహ్మకల్పములను ఒక్కక్షణమాత్రముగా గడపుచుందురు

నిత్యము భగవద్ధ్యానము జేయుచు, భగనంతునియెడ నపారమైన భక్తి శ్రద్ధలుగల వారి భాగ్యమే భాగ్యము! వారి జీవనమే దివ్యజీవనమన్న మఱియొక భావమిందు స్ఫురించుచున్నది

చౌ॥ హరి హర బిముఖ ధర్మ రతి నాహీఁ ।
తే నర తహఁ సపనేహుఁ నహిఁ జాహీఁ ॥
తేహి గిరి పర బట బిటప బిసాలా ।
నిత నూతన సుందర సబ కాలా ॥ 611

తా॥ ఎవరు హరిహరులకు విముఖులుగా నుందురో అనగా శంకరుని యందు విష్ణువునందు భక్తి తాత్పర్యములు లేనివారలకు ధర్మమునందాసక్తి గలుగ నేరదు వారు స్వప్నమునందైనను కైలాసమునుగాని వైకుంఠమును గాని చేరలేరు

కైలాస పర్వతమున నొక విశాలమైన వటవృక్షము గలదు ఆ వట వృక్షము నిత్యము క్రొత్తచిగుళ్ళతో అన్ని ఋతువుల యందును సుందరమై యొప్పారుచుండును

చౌ॥ త్రిబిధ సమీర సుసీతలి ఛాయా ।
సివ బిశ్రామ బిటప శ్రుతి గాయా ॥
ఏక బార తేహి తర ప్రభు గయఊ ।
తరు బిలోకి ఉర అతి సుఖు భయఊ ॥ 612

తా॥ అచ్చట త్రివిధమునైన శీతల, మంద, సుగంధ వాయువులు వీచు చుండెను ఆ వృక్షచ్ఛాయను విశ్రాంతి తీసికొనిన చాల సుఖకరముగనుండును ఆ వటవృక్షము శంకరునకు విశ్రాంతి యొసగునదని వేదములో గూడ చెప్ప బడినది

ఒకసారి శంకరుడు వృక్షచ్ఛాయలో ఆసీనుడాయెను ఆ వాతావరణమున ఆ ప్రశాంత స్థలమున శంకరుడెప్పుడు పొందని యమితానందమును పొందెను

చౌ॥ నిజ కర డాసి నాగరిపు ఛాలా ।
బైఠే సహజహిఁ సంభు కృపాలా ॥
కుంద ఇందు దర గౌర సరీరా ।
భుజ ప్రలంబ పరిధన మునిచీరా ॥ 613

తా॥ శంకరుడు తనవద్దనున్న పులిచర్మమును వటవృక్షముక్రింద బఱచెను సహజముగా నిర్మలుడైన శివుడా వ్యాఘ్రచర్మాసనమునం దాసీనుడాయెను కుంద పుష్పములు, చంద్రుడు, శంఖమువలె ధవళ శరీరము గలవాడు శివుడు అజానుబాహుడు జటావల్కలధారి

చౌ॥ తరున అరున అంబుజ సమ చరనా ।
నఖ దుతి భగత హృదయ తమ హరనా ॥
భుజగ భూతి భూషన త్రిపురారీ ।
అనను సరద చంద ఛబి హారీ ॥ 614

తా॥ శివుని చరణములు, అప్పుడు వికసించిన ఎఱ్ఱదామరలతో సమానముగ నుండెను నఖములజ్యోతి భక్తులహృదయాంధకారమును హరించు జ్యోతిగా నుండెను సర్పములు, విభూతియే శివుని భూషణములుగా నుండెను త్రిపురాసురులకు శత్రువైన శివుని ముఖారవిందము పూర్ణచంద్రుని శోభను గూడ హరించు నట్లుండెను

వి॥ సూర్యు డంధకారమును బాపును శంకరుని పాదపద్మముల యందుండెడి నఖముల ద్యుతి, భక్తుల యజ్ఞానాంధకారమును తొలగింపజేసి జ్ఞానోదయమగునట్లు చేయును ఆ నఖముల వెలు గెవరి యందు ప్రవేశించునో, వారు అజ్ఞానాంధకారమునుండి విముక్తులై, దివ్యదృష్టి గలవారై, భగవద్భక్తు లగుదురు

దో॥ జటా ముకుట సుర సరిత సిర లోచన నలిన బిసాల ।
నీలకంఠ లావన్యనిధి సోహ బాలబిధు భాల ॥ 615

తా॥ జటాధారి, గంగాధరుడు, కమలనయనుడు, నీలకంఠుడు, లావణ్యనిధియైన శివుడు వటవృక్షముక్రింద నాసీనుడై శోభాయమానముగ నుండెను శిరమున రెండవ చంద్రుడు సుశోభితుడై అలరారు చుండెను

చౌ॥ బైఠే సోహ కామరిపు కైసేఁ ।
ధరేఁ సరీరు సాంతరసు జైసేఁ ॥
పారబతీ భల అవసరు జానీ ।
గఈఁ సంభు పహిఁ మాతు భవానీ ॥ 616

తా॥ మన్మథునకు శత్రువైన శివు డచ్చట ఆసీనుడైన తఱి, శాంతరసమే శరీరము దాల్చి వచ్చినదా యన్నట్లుండెను. అది మంచి సమయమని గమనించి, శివపత్నియైన పార్వతి శంకరుని జేరెను.

చౌ॥ జాని ప్రియా ఆదరు అతి కీన్హా ।
బామ భాగ ఆసను హర దీన్హా ॥
బైఠీం సివ సమీప హరషాఈ ।
పూరుబ జనమ కథా చిత ఆఈ ॥ 617

తా॥ అంత శంకరుడు ప్రాణపదమైన, ప్రియమైన పార్వతి నాదరించి, ఆమె తన వామభాగమున గూర్చుండుట కనుమతి నొసగెను. పార్వతి ప్రసన్న చిత్తముతో ప్రాణపతియైన శివుని వామభాగమున ఆసీనురాలయ్యెను. ఆసీనయైన తరువాత పార్వతికి ఆమె తొలిజన్మపు కథ జ్ఞాపకమునకు వచ్చెను.

వి॥ దుర్మార్గులు, అవినీతిపరు లెన్ని తప్పులను జేసినను వానిని కప్పిపుచ్చి తాము చేయునట్లుగనే ప్రపంచమున వ్యవహరింతురు కాని, సన్మార్గులు కాలకర్మవశమున ఏ కించిద్దోషమును జేసినను జీవితాంతము పశ్చాత్తప్తులగుదురన్న భావము గూడ ఇందు స్ఫురించుచున్నది.

చౌ॥ పతి హియం హేతు అధిక అనుమానీ ।
బిహసి ఉమా బోలీం ప్రియ బానీ ॥
కథా జో సకల లోక హితకారీ ।
సోఇ పూఛన చహ సైలకుమారీ ॥ 618

తా॥ పూర్వజన్మమున తన పతి ఉపేక్ష, ఈ జన్మమున తనమీదనున్న అపేక్ష రెంటిని జూచినదై పార్వతి చిరహాసవదనముతో మృదుమధురముగ శివునితో నిట్లనెను—అని యాజ్ఞవల్క్యమహాముని భరద్వాజునకు కథ చెప్పుచున్నాడు. ఈ శ్రీరామచరిత మానసమును సర్వజన హితార్థమై, పార్వతి పరమేశ్వరుని చెప్పగోరుచున్నదని యాజ్ఞవల్క్యుడు భరద్వాజునితో ననెను.

వి॥ ఇచ్చట కవీశ్వరుడైన శ్రీ తులసీదాసు దివ్యజ్ఞానమున కాటపట్టయిన శ్రీరామచరిత మానస మాహాత్మ్యమును విశదీకరించు చున్నాడు కనుకనే 'సకల-లోక-హితకారీ' యనుచున్నాడు మహాదేవునకును, ఆదిశక్తికిని దెలియనిదేమున్నది! లోకహితార్థము పార్వతి పరమేశ్వరుని శ్రీరామ చరితమానసమును జెప్పగోరుచున్నది ఈ గ్రంథమును శ్రవణముజేసిన చాలును, సంసారచక్రమున పరిభ్రమించుటచే కలిగిన తాపము చల్లారును, దివ్యజ్ఞానము కలుగును ఈ మానసము పాపమును, తాపమును వారించి దివ్యమైన ఆనందమును ప్రసాదించునని యభిప్రాయము

చౌ॥ బిస్వనాథ మమ నాథ పురారీ ।
త్రిభువన మహిమా బిదిత తుమ్హారీ ॥
చర అరు అచర నాగ నర దేవా ।
సకల కరహిఁ పద పంకజ సేవా ॥ 619

తా॥ పార్వతి శంకరునితో ఇవ్విధముగ నుడివెను- ఓ సర్వేశ్వరా! ప్రాణపతీ! త్రిపురారి (త్రిపురాసురుని సంహరించినవాడా) నీ మహిమ ముల్లోకములలో ప్రసిద్ధమైనది చరాచరములు, నాగులు, మానవులు, దేవత లందఱును నీ చరణకమలములను నిరంతరము సేవింతురు

దో॥ ప్రభు సమరథ సర్బగ్య సివ సకల కలా గున ధామ ।
జోగ గ్యాన బైరాగ్య నిధి ప్రనత కలపతరు నామ ॥ 620

తా॥ ఓ ప్రభూ! నీవు సమర్థుడవు! సర్వజ్ఞుడవు! కల్యాణ కరుడవు! సకల కళలకును, గుణములకును ఆటపట్టయినవాడవు! యోగ, జ్ఞాన, వైరాగ్యములకు నిధివి నీ నామము శరణాగతులకు కల్పవృక్షము వంటిది

వి॥ కోరిన కోరికల నొసగునది కల్పవృక్షము ఆశ్రితులైన వారి యోగక్షేమముల భారమును వహించుటయందు సమర్థుడనియు, సమస్త యోగశ్రేయస్సులను అనుగ్రహించుటకై నిరీక్షించువాడు శంకరుడనియు పార్వతి శంకరుని స్తుతించుచున్నది

చౌ॥ జౌం మో పర ప్రసన్న సుఖరాసీ ।
జానిఅ సత్య మోహి నిజ దాసీ ॥
తౌ ప్రభు హరహు మోర అగ్యానా ।
కహి రఘునాథ కథా బిధి నానా ॥ 621

తా॥ ఓ సుఖరాశీ ? నీవు నాయందు ప్రసన్నుడవైతివి. ఇప్పుడు నేను నీ చరణదాసుని ప్రభూ ! నాయందు దయయుంచి, శ్రీరామకథను నాకు జెప్పి, నా యజ్ఞానమును బాప గోరుచున్నాను

చౌ॥ జాసు భవను సురతరు తర హోఈ ।
సహి కి దరిద్ర జనిత దుఖు సోఈ ।
ససిభూషన అసం హృదయం బిచారీ ॥
హరహు నాథ మమ మతి భ్రమ భారీ ॥ 622

తా॥ కల్పవృక్షము క్రింద నెవని గృహముండునో, వాడెక్కడైనను దారిద్ర్యముచేత పీడింపబడునా ?

ఓ శశిభూషణా ! (చంద్రశేఖరా), నా యజ్ఞానమును, మతిభ్రమను దూరీకృత మొనర్పుము

చౌ॥ ప్రభు జే ముని పరమారథ బాదీ ।
కహహిం రామ కహుం బ్రహ్మ అనాదీ ॥
సేస సారదా బేద పురానా ।
సకల కరహిం రఘుపతి గున గానా ॥ 623

తా॥ ఓ ప్రభూ ! పరమార్థతత్త్వమును బాగుగా నవగాహన చేసికొన్న వారును, పండితులును బ్రహ్మజ్ఞానులును, శ్రీరామచంద్రుని అనాదియగు బ్రహ్మ యని చెప్పుదురు. ఆదిశేషుడును, వేద పురాణములును శ్రీరామగుణగాన మొనర్చుచున్నవి

చౌ॥ తుమ్హ పుని రామ రామ దినరాతీ ।
సాదర జపహు అనంగ అరాతీ ॥
రాము సో అవధ నృపతి సుత సోఈ ।
కి అజ అగున అలఖ గతి కోఈ ॥ 624

తా॥ ఓ మన్మథునికి శత్రువైనవాడా! స్మరహరా! నీవుకూడ రేయుం బవళ్ళు రామనామమును జపింతువు కదా! ఆ రాము డయోధ్యాపురాధీశ్వరుడైన దశరథ మహారాజ పుత్రుడేనా లేక జన్మరహితుడు, అగోచరుడు నిర్గుణుడునైన రాముడు మఱియొకడు కలడా?

వి॥ శంకరుడే రామనామమును నిరంతరము జపించుచుండెనన్న, శ్రీరామనామ మహిమ యెంతటిదో యూహింపనగును రామనామము సంసారసాగరమునుండి తరింపజేయుటకు నౌకవంటిది

దో॥ జౌఁ నృప తనయ త బ్రహ్మ కిమి నారి బిరహఁ మతి భోరి।
దేఖి చరిత మహిమా సునత భ్రమతి బుద్ధి అతి మోరి॥625

తా॥ అతడు రాజపుత్రుడైన నిర్గుణబ్రహ్మ యెట్లగును? నిర్గుణబ్రహ్మయైనచో స్త్రీ విరహమున నతనికేల మతిభ్రమించును? ఆ రాముని చరిత్రను గాంచియు, అతని మహిమను గూర్చి వినియు, నీ విషయమున నాకు బుద్ధి స్థిరము కాకున్నది నా మనస్సు పరిపరి విధముల బోవుచున్నది

చౌ॥ జౌఁ అనీహ బ్యాపక బిభు కోఊ।
కహహు బుఝాఇ నాథ మోహి సోఊ॥
అగ్య జాని రిస ఉర జని ధరహూ।
జేహి బిధి మోహ మిటై సోఇ కరహూ॥ 626

తా॥ ఇచ్ఛారహితుడా, వ్యాపకుడా సమర్థుడా, అనాది బ్రహ్మయా ఇంకే దైనను బాగుగా విచారించి నాకు విశదీకరించుము

నన్నేమియు దెలియని అమాయకురాలనుగా భావింపుడు ఇట్లడిగి నందుల కాగ్రహము చెందకుడు నా సందేహనివృత్తి యేవిధముగ నగునో యట్లు చేసి నాభ్రమను, అజ్ఞానమును తొలంగజేసి నన్ననుగ్రహింపుడు

చౌ॥ మైఁ బన దీఖి రామ ప్రభుతాఈ।
అతి భయ బికల న తుమ్హహి సునాఈ॥
తదపి మలిన మన బోధు న ఆవా॥
సో ఫలు భలీ భాఁతి హమ పావా॥ 627

తా॥ నేను నా పూర్వజన్మమున అరణ్యమున శ్రీరామచంద్రుని ప్రభావమును గాంచితిని కాని మిగుల భయము జెందియున్న కారణమున ఆ విషయమును గూర్చి తెలుపలేక పోయితిని మీరెంత బోధించినను మాలిన్యముతో నిండిన నా మనస్సు మీ ప్రబోధములను నిరసించెను అందులకు ఫలమును నేను బాగా పొందగలిగితిని

వి॥ మనస్సు చంచలమైనది మనో నిగ్రహ మెంతటివారలకు సాధ్యమయిగాదు ఎంత బోధించినను మీ ప్రబోధములను నా మలిన మనస్సేలకో అంగీకరింపలేదని' పార్వతి శివునకు జెప్పెనన్న ఇక సామాన్య మానవుల విషయము చెప్పనేల?

బుద్ధిమంతులు, అనుభవజ్ఞులు, చెప్పిన మాటలను వినకపోయిన యెడల దాని ఫలమును పొందుదురు పెద్దలు చెప్పిన హితోక్తుల యందు సందేహములు కల్పించుకొని, దానిని పరీక్షింప బూనిన, అనేకము తిప్పలగుట ఖాయము

ఇచట శ్రీ తులసీదాసు రామకథను జెప్పుచు కథారూపమున మనకు జ్ఞానబోధ చేయుచున్నాడు అందులకే యీ గ్రంథమును శ్రీరామచరిత మానసమన్నాడు శ్రీ తులసీదాసు

చౌ॥ అజహుఁ కఛు సంసఉ మన మోరేఁ ।
కరహు కృపా బినవఉఁ కర జోరేఁ ॥
ప్రభు తబ మోహి బహు భాఁతి ప్రబోధా ।
నాథ సో సముఝి కరహు జని క్రోధా ॥ 628

తా॥ ఇప్పటికి కూడ నాకు సందేహ నివృత్తి కాలేదు ఇంకను కొన్ని సందేహము లున్నవి నేను నా కరములను జోడించి నమస్కార పూర్వకముగా మిమ్ము ప్రార్థించుచున్నాను నాయందు కృపజూపుడు ఓ ప్రభూ! ఆ సమయమున మీరు నా సంశయములను బాపుటకు ప్రయత్నించితిరి కాని నేను వాటిని త్రోసిపుచ్చితిని ముందు జరిగిన సంఘటనలను మనస్సునం దుంచుకొని నాపై ఆగ్రహము వహింపకుడు

చౌ॥ తబ కర అస బిమోహ అబ నాహీం ।
రామకథా పర రుచి మన మాహీం ॥
కహహు పునీత రామ గున గాథా ।
భుజగ రాజ భూషన సురనాథా ॥ 629

తా॥ ముందు గలిగినటువంటి భ్రమ యిప్పుడు నాకెంత మాత్రమును లేదు రామకథను వినవలయునన్న కుతూహలము కలుగుచున్నది ఓ భుజగరాజ భూషణా! సురనాథా! మీరు పవిత్రమైన శ్రీరామకథను నాకు జెప్పుడు

దో॥ బందఉం పద ధరి ధరని సిరు బినయ కరఉం కర జోరి ।
బరనహు రఘుబర బిసద జసు శ్రుతి సిద్ధాంత నిచోరి॥ 630

తా॥ నేను మీకు సాష్టాంగ నమస్కారము జేయుచున్నాను రెండు చేతులను జోడించి ప్రార్థించుచున్నాను వేద సిద్ధాంతసారమైన శ్రీరఘునాథుని నిర్మల యశమును వర్ణింపుము

చౌ॥ జదపి జోషితా నహిం అధికారీ ।
దాసీ మన క్రమ బచన తుమ్హారీ ॥
గూఢఉ తత్త్వ న సాధు దురావహిం ।
ఆరత అధికారీ జహం పావహిం ॥ 631

తా॥ స్త్రీలు వేదాది గ్రంథములను శ్రవణము జేయుట కధికారిణులు కారు అయినను మనోవాక్కాయ కర్మములతో మీ దాసురాలను కాన నేను విని గోరుచున్నాను జిజ్ఞాసువైన యార్తు లధికారులని యెచ్చట, చెప్పుడు తెలిసికొందురో, అచ్చట సాధుసజ్జనులైన వారు గూఢ తత్త్వములనుగూడ దాచిక వారికి చెప్పుదురు

వి॥ స్త్రీలు వేదాది గ్రంథములను శ్రవణము చేయుట కధికారిణులు గాకున్నను, మన పూర్వకముగా భగవంతుని ధ్యానముచేయు వారును, అర్చనచేయువారును, భగవత్కథలను వినుటకు, చదువుటకు కధికారిణులని శ్రీ తులసీదాసు వచించుచున్నాడు

అర్హులైనవా రెవరైనను అనగా పారమార్థికము గూర్చి తెలిసికొను నాసక్తి గలవారలకు గూఢతత్త్వమును బోధించుట అవశ్యక మనియు శ్రీవారు నుడువుచున్నారు

ఆధ్యాత్మికముగా పురోగమించు వారలకు మాత్రము సద్గురువులు విశేషముగా గూఢతత్త్వమును బోధింపవల యునను భావము

అడిగిన వారలకు జెప్పవలయునుగాని రామకథ నందరికిని జెప్పగూడదన్న యింకొక భావము స్ఫురించుచున్నది

చౌ॥ అతి ఆరతి పూఛఉఁ సురరాయా ।
రఘుపతి కథా కహహు కరి దాయా ॥
ప్రథమ సో కారన కహహు బిచారీ ।
నిర్గున బ్రహ్మ సగున బపు ధారీ ॥ 632

తా॥ ఓ సురనాథా ! నేను పరమార్థభావ ముతో మిమ్ములడుగుచున్నాను మీరు నాయందు దయయుంచి శ్రీరఘునాథుని కథను జెప్పుడు కథను ప్రారంభించుటకు ముందు ఒక సంశయమును దీర్పుడు నిర్గుణబ్రహ్మ సగుణరూపమును దాల్చునా?

చౌ॥ పుని ప్రభు కహహు రామ అవతారా ।
బాలచరిత పుని కహహు ఉదారా ॥
కహహు జథా జానకీ బిబాహీఁ ।
రాజ తజా సో దూషన కాహీఁ ॥ 633

తా॥ ప్రభూ, ముందు శ్రీరామావతారగాథను వివరింపుడు తరువాత రాముని బాలచరిత్రమును జెప్పుడు తదుపరి శ్రీరామ కల్యాణ వైభవమును, (జానకీవివాహము జరిగిన వైనమును) ఏ దోషమువలన రాజ్యమును త్యజించెనో, ఆ విషయమును విపులీకరింపుడు

చౌ॥ బన బసి కీన్హే చరిత అపారా ।
కహహు నాథ జిమి రావన మారా ॥
రాజ బైఠి కీన్హీఁ బహు లీలా ।
సకల కహహు సంకర సుఖసీలా ॥ 634

తా॥ ఓ వృషభకరుడవైన శంకరా, శ్రీరాము డరణ్యమున వాసము జేసిన విధానమును, ఏ విధముగ రావణాసురుని వాతమార్చినదియు మొదలైన శ్రీరాము లీల లన్నిటిని వారు సవిస్తరముగ చెప్పుడు రాముడు రాజ్యము చేసిన వైనమును నా కెఱింగింపుడు

దో॥ బహురి కహహు కరునాయతన కీన్హ జో అచరజ రామ ।
ప్రజా సహిత రఘుబంసమని కిమి గవనే నిజధామ ॥ 635

తా॥ ఓ కృపాసాగరా। కరుణానిధీ। శ్రీరాము డొనర్చిన యద్భుతచర్యలను గూర్చి చెప్పుము

రఘుకులశిరోమణి తన పరిజనసమూహముగా నిజనివాసమును కెట్లు పోయెను

చౌ॥ పుని ప్రభు కహహు సో తత్త్వ బఖానీ ।
జేహిఀ బిగ్యాన మగన ముని గ్యానీ ॥
భగతి గ్యాన బిగ్యాన బిరాగా ।
పుని సబ బరనహు సహిత బిభాగా ॥ 636

తా॥ ప్రభూ! ఏ యనుభూతితో జ్ఞానులైన ముని గణములు సదా ఆత్మ నిమగ్నులై యుందురో, ఆ తత్త్వమును గూర్చి చెప్పుడు భక్తి, జ్ఞానము, విజ్ఞానము వైరాగ్యము_ వీటిని విభాగసమేతముగ వర్ణనచేయుడు

చౌ॥ ఔరఉ రామ రహస్య అనేకా ।
కహహు నాథ అతి బిమల బిబేకా ॥
జో ప్రభు మైఀ పూఛా నహిఀ హోఈ ।
సోఉ దయాల రాఖహు జని గోఈ ॥ 637

తా॥ పై జెప్పినవన్నియు వర్ణించిన తరువాత నింకను మిగిలిన వేమైనను శ్రీరామచంద్రుని గూర్చిన యనేక రహస్యములను, గూఢభావములను_అథవా చరిత్రములను గూర్చి చెప్పుడు ఓ నాథా! మీరు నిర్మలజ్ఞాన పరిపూర్ణులు నే నడుగవలసిన యంశము లేవైనను నేను మరచిన ఓ దయాసముద్రుడా, వానినిగూర్చికూడ దాచకుడు, విపులీకరింపుడు

చౌ॥ తుమ్హ త్రిభువన గుర బేద బఖానా ।
ఆన జీవ పాంవర కా జానా ॥
ప్రశ్న ఉమాకై సహజ సుహాఈ ।
ఛల బిహీన సుని సివ మన భాఈ ॥ 638

తా॥ త్రిలోక గురుడవని మిమ్ము వేదము లుద్ఘాటించినవి ఈ రహా న్య మును పామరు లెట్లు తెలియును?

॥ ఉత్తమభక్తునకు గురూపదేశము భగవదుపదేశమై అమోఘమై ... ఇచ్చట పార్వతి శంకరుని త్రిలోకగురుడని ... సముగా నున్నది ఆదర్శప్రాయముగా శ్రీ శంకర ... త్యాదులు శంభో లోకగురో మదీయమనస సౌఖ్యోపదేశం ... ప్రార్థించిరి

చౌ॥ హర హియఁ రామచరిత సబ ఆఏ ।
ప్రేమ పులక లోచన జల ఛాఏ ॥
శ్రీరఘునాథ రూప ఉర ఆవా ।
పరమానంద అమిత సుఖ పావా ॥ 639

తా॥ శ్రీ మహాదేవుని హృదయాంతరమున రామచరిత్ర మంతయు గను ఎంచెను అప్పుడు శంకరుడు హర్ష పులకితదేహు డయ్యెను నయనములనుండి యానంద బాష్పములు గారెను శ్రీరఘునాథుని దివ్యమంగళరూపము అంత రంగమున గనుపించెను శ్రీరామ దర్శనముచే పరమానందభరితుడైన శివు డపారమైన సుఖశాంతులను పొందెను

దో॥ మగన ధ్యాన రస దండ జుగ పుని మన బాహేర కీన్హ ।
రఘుపతి చరిత మహేస తబ హరషిత బరనై లీన్హ ॥ 640

తా॥ శివుడు రెండుగిడియల వరకు ధ్యానానందరసములో మునిగియుండెను తరువాత మనంబును బాహ్యప్రపంచముపై కేంద్రీకరించెను అంత శ్రీ రఘు పతిచరిత్రమును వర్ణింప మొదలిడెను

వి॥ మహాత్ములు భగవత్కథలను బోధించునపుడు మొదట కొంతసేపు మనంబునం దిష్టదైవమును ప్రార్థించుకొని తరువాత తద్ధ్యాననిష్ఠా సముద్భూతానందరసస్నిగ్ధ పులకాంగులై యితరులకు జ్ఞానమును బోధింతురు

చౌ॥ ఝూఠేఉ సత్య జాహి బిను జానేఁ ।
జిమి భుజంగ బిను రజు పహిచానేఁ ॥
జేహి జానేఁ జగ జాఇ హేరాఈ ।
జాగేఁ జథా సపన భ్రమ జాఈ ॥ 641

చౌ॥ బందఉఁ బాలరూప సోఇ రామూ ।
సబ సిధి సులభ జపత జిసు నామూ ॥
మంగల భవన అమంగల హారీ ।
ద్రవఉ సో దసరథ అజిర బిహారీ ॥ 642

తా॥ "ఎవనిని తెలియకుండుటచే అసత్యము సత్యముగా భాసించునో యే యెఱుక లేకుండుటచే త్రాడు సర్పమనెడి భ్రమ కలుగునో యే వివేకమును పొందిన తరువాత జగత్తు లోపభూయిష్ఠముగా (అసంపూర్ణముగా) నగుపడునో జాగృతియందే ఎఱుకచేత స్వప్నభ్రాంతి తొలగునో, అటువంటి యెఱుకకు నిధానమైన శ్రీరామచంద్రుని బాలరూపమునకు, నేను వందన మొనరించుచున్నాడను

శ్రీరామనామమును జపించిన, సకల సిద్ధులు సహజముగ ప్రాప్తించును మంగళకరుడు శ్రీరామచంద్రుడు అమంగళమును హరించువాడు అయోధ్యా నగరమున శ్రీ దశరథుని రాజభవనపు టావరణమున నాడుకొను బాలరాముడు నాయందు కృపజూపుగాక!" అని శంకరుడు వచించుచున్నాడు

వి॥ పరమ భక్తుడైన సూరదాసు శ్రీకృష్ణలీలలను వర్ణించి యున్నాడు "సూరసాగర్" అను గ్రంథమున బాలకృష్ణునిట్లు చిత్రించినాడు 'అంగన ఖేలై నందకే నందా! యదుకుల కుముద సుఖద చారు చందా' అనగా యదుకులమనెడి కుముద పుష్పములను

వికసింపజేయుటకు చంద్రునివంటి శ్రీకృష్ణుడు నందునింటి యావరణమున నాడుచున్నాడని శ్రీకృష్ణలీలలను కన్నులకు గట్టినట్లుగా వివరించియున్నాడు

ఇచట శ్రీ తులసీదాసు శ్రీరాముని బాలకరూపమును ప్రథమమున శంకరుడే వర్ణించి యున్నట్లు చెప్పినాడు

చౌ॥ కరి ప్రనామ రామహి త్రిపురారీ ।
హరషి సుధా సమ గిరా ఉచారీ ॥
దన్య ధన్య గిరిరాజకుమారీ ।
తుమ్హ సమాన నహిఁ కోఉ ఉపకారీ ॥ 643

తా॥ త్రిపురారియైన శివుడు తన మనోగతుడైన శ్రీరామునకు ప్రణమిల్లి ఆనంద పరిపశుడై యమృత తుల్యమైన వాణిచే ఇవ్విధముగ నుడివెను —

ఓ గిరిరాజకుమారీ! పార్వతీ! నీవు ధన్యురాలవు! నీతో సమానమైన యుపకారిణి యింకెవ్వరును లేరు

చౌ॥ పూఁఛేహు రఘుపతి కథా ప్రసంగా ।
సకల లోక జగపావని గంగా ॥
తుమ్హ రఘుబీర చరన అనురాగీ ।
కీన్హిహు ప్రస్న జగత హిత లాగీ ॥ 644

తా॥ నీవు శ్రీరఘునాధుని కథా ప్రసంగమును జెప్పుమన్న ప్రశ్న నన్నడిగితివే యది సమస్తలోకహితార్థమైనది జగత్తును పవిత్రమొనరించు లోకమైన గంగ వంటిది

జగత్కల్యాణము కొఱకే నీవీప్రశ్న వేసితివి నీకు శ్రీరామచంద్రుని పావనిపాదపద్మములపై ప్రేమానురాగములు పెంపొందుగాక!

దో॥ రామ కృపా తే పారబతి సపనేహుఁ తవ మన మాహిఁ ।
సోక మోహ సందేహ భ్రమ మమ బిచార కఛు నాహిఁ॥ 645

తా॥ పార్వతీ! శ్రీరామచంద్రుని కృపావిశేషమున నీ హృదయమందు స్వప్నమందును, శోకము, మోహము సందేహము, భ్రమ-ఇత్యాదులు లేనట్లు నీకు తెలియుచున్నది

చౌ॥ తదపి అసంకా కీన్హహుఁ సోఈ ।
కహత సునత సబ కర హిత హోఈ ॥
జిన్హ హరికథా సునీ నహిఁ కానా ।
శ్రవన రంధ్ర అహిభవన సమానా ॥ 646

తా॥ కాని, పూర్వజన్మమున నీవు కూడ దీనిని సందేహించియుంటివి ఇప్పుడు రామచరితమానసమును వినుట కర్హురాలైతివి శ్రీరామచరిత శ్రవణ మనన మాత్రమున సర్వులకును మంగళము చేకూరును ఎవరు విష్ణుకథలను నాలకింపరో వారి వీనులు సర్పబిలముతో సమానమైనవి

చౌ॥ నయనన్హి సంత దరస నహిఁ దేఖా ।
లోచన మోరపంఖ కర లేఖా ॥
తే సిర కటుతుంబరి సమ తూలా ।
జే న నమత హరి గుర పద మూలా ॥ 647

తా॥ ఎవరు తమ కన్నులపండువుగా సజ్జనులను దర్శింపరో వారి నయనద్వయంబు నెమలిపింఛముపై నున్న కంటియాకారము వంటివి

శ్రీహరి పాదపద్మములకును, శ్రీ గురుచరణకమలములకును నమస్కరింపని వారి శిరస్సులు జొన్నచొప్పతో నింపిన నారకాయబుఱ్ఱలు

చౌ॥ జిన్హ హరి భగతి హృదయఁ నహిఁ ఆనీ ।
జీవత సబ సమాన తేఇ ప్రానీ ॥
జో నహిఁ కరఇ రామ గున గానా ।
జీహ సో దాదుర జీహ సమానా ॥ 648

తా॥ ఎవరు హృదయమున భగవద్భక్తికి స్థానమీయరో అటువంటివారు జీవచ్ఛవములు శ్రీరామచంద్రుని గుణగానము చేయనివారి నాలుకలు కప్పనాలుకలతో సమానమైనవి

చౌ॥ కులిస కఠోర నిఠుర సోఇ ఛాతీ ।
సుని హరి చరిత న జో హరషాతీ ॥
గిరిజా సునహు రామ కై లీలా ।
సుర హిత దనుజ బిమోహన సీలా ॥ 649

తా॥ భగవల్లీలలను, చరిత్రమును విని హర్షింపని వాని హృదయము వజ్రమువలె కఠినమైనది ఓ పార్వతీ! శ్రీరామచంద్రుని లీలలను గూర్చి వినుము శ్రీరామకథ దేవతలకు మంగళము చేకూర్చునది దైత్యులకు విశేషముగ అజ్ఞాన ముత్పన్నము చేయునది

వి॥ భగవత్కథలకు విముఖమైన వాని హృదయము వజ్రమునకు పోల్చబడినది వజ్రము బేదింపరానిది అటులనే విష్ణుకథలచే ద్రవింపని వాని హృదయ మత్యంతకఠినమైనదన్న భావమిందు స్ఫురించుచున్నది

'నారాయణుని దివ్యనామాక్షరములపై కరగని మనసులు కఠిన శిలలు' అన్న బాగవత సూక్తి ఇచ్చట అనుసంధేయము

శ్రీరామావతారము దేవతలకును, సజ్జనులకును, మునులకును కల్యాణప్రదమైనది శ్రీరామావతారము దైత్యులకు భ్రమ నుత్పన్నము చేసినది అజ్ఞానముచే రావణాది దైత్యులు శ్రీరామునికి విరోధులై తుదకు రామునిచే సంహరించబడిరి

దో॥ రామకథా సురధేను సమ సేవత సబ సుఖ దాని ।
సత సమాజ సురలోక సబ కో న సునై అస జాని ॥ 650

తా॥ శ్రీరామకథ కామధేనువుతో సమానమైనది కామధేనువును సేవించినను, ఆశ్రయించినను సమస్తమైన కోరికల నొసగును అటులనే రామకథ సుఖశాంతుల నొసగునది

సజ్జన సమాజము దేవలోకము వంటిది శ్రీరామకథ కామధేనువుతో సమానమనియు, సజ్జన సమాజము దేవలోకమనియు దెలిసికొన్న తరువాత దీనిని శ్రవణము చేయ కుండెదరా!

చౌ॥ రామకథా సుందర కరతారీ ।
సంసయ బిహగ ఉడావనిహారీ ॥
రామకథా కలి బిటప కురారీ ।
సాదర సును గిరిరాజకుమారీ ॥ 651

తా॥ శ్రీరామకథ మధుర మనోహర కరతల ధ్వని ఆ ధ్వని సందేహ రూపమైన పక్షుల నెగురగొట్టగలదు శ్రీరామకథ కలియుగ రూపమైన వృక్షమును ఖండించుటకు గొడ్డలితో సమానమైనది ఓ గిరిరాజకుమారీ, దీనిని శ్రద్ధగా నాలకింపుము

వి॥ కరతల ధ్వనిచే పక్షిసముదాయము లెగిరిపోవును పక్షుల నెగురగొట్టుటకు కరతల ధ్వని యెటులో, అటులే సమస్త సందేహ నివృత్తికిని రామాయణ మెంతయో ఉపకరించును కలియుగము-వృక్షమునకును, రామకథ-గొడ్డలికిని పోల్చబడినవి వృక్షమును గొడ్డలి నఱకు చందంబున శ్రీరామకథ కలియుగమున నున్న సమస్త పాపములను వారించును కలియుగమున నున్న పాపములను పోగొట్టుటకు శ్రీరామకథా శ్రవణమే సర్వత్ర సాధనమైనది

చౌ॥ రామ నామ గున చరిత సుహాఏ ।
జనమ కరమ అగనిత శ్రుతి గాఏ ॥
జథా అనంత రామ భగవానా ।
కథా తథా కీరతి గున నానా ॥ 652

తా॥ వేదములు శ్రీరామ నామమును, అగణిత గుణగణములను, జన్మకర్మాదులను గానము చేసినవి శ్రీరాము డనంతుడు శ్రీరామ కథాకీర్తియు అనంతము శ్రీరామ గుణము లనంతములు

వి॥ 'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' అని భగవానుడు గీత యందును వచించెను వేదములద్వారా తెలిసికొనదగిన వాడనియు, అనంతుడనియు జెప్పుచు శ్రీరామయశస్సంపదను గానము చేయుచున్నాడు శ్రీతులసీ దాస మహాకవి

చౌ॥ తదపి జథా శ్రుత జసి మతి మోరీ ।
కహిహఉఁ దేఖి ప్రీతి అతి తోరీ ॥
ఉమా ప్రస్న తవ సహజ సుహాఈ ।
సుఖద సంత సంమత మోహి భాఈ ॥ 653

తా॥ ఈ కథ వినవలయునన్న ప్రీతిని జూచి, నేను వినినట్లును, నా బుద్ధ్యను సారముగా నేనీకథను నీకు వినిపింతును

ఓ పార్వతీ, నీ వడిగిన ప్రశ్న సహజసుందరమైనది సుఖదాయకమైనది సజ్జన సమ్మతమైనది గనుకనే నాకా ప్రశ్న యుచితముగ తోచినది

చౌ॥ ఏక బాత నహిఁ మోహి సోహానీ ।
జదపి మోహ బస కహేహు భవానీ ॥
తుమ్హ జో కహా రామ కోఉ అనా ।
జేహి శ్రుతి గావ ధరహిఁ ముని ధ్యానా ॥ 654

తా॥ కాని ఓ పర్వత రాజకుమారీ నీ వడిగిన యొక మాట మాత్రము నాకు రుచింపలేదు అదేదన భ్రమవశమున నీ వాడినమాట— రాముడెవరు? ఎవని గూర్చి వేదములు నిరంతరము గానము జేయునో యతడేనా? మునిగణములు నిరంతరము ఎవనిని గూర్చి ధ్యానము చేయుదురో ఆ రాముడే యతడా? ఇంకొక రాముడున్నాడా?' అని

దో॥ కహహిఁ సునహిఁ అస అధమ నర గ్రసే జే మోహ పిసాచ।
పాషండీ హరిపద బిముఖ జానహిఁ ఝూఠ న సాచ ॥ 655

తా॥ మోహ పిశాచగ్రస్తులైనవారలు, కపటత్వముగల వారలు, భగవత్పాదారవిందములకు విముఖులైనవారలు, సత్యాసత్యములను గూర్చి యేమియు నెఱుంగని యధము లివ్విధముగ జెప్పెదరు ఇటువంటి మాటలను వినెదరు

చౌ॥ అగ్య అకోబిద అంధ అభాగీ ।
కాఈ బిషయ ముకుర మన లాగీ ॥
లంపట కపటీ కుటిల బిసేషీ ।
సపనేహుఁ సంతసభా నహి దేఖీ ॥ 656

చౌ॥ కహహిఁ తే బేద అసంమత బానీ ।
జిన్హ కే సూఝ లాభ నహిఁ హానీ ॥
ముకుర మలిన అరు నయన బిహీనా ।
రామ రూప దేఖహిఁ కిమి దీనా ॥ 657

తా॥ మనోదర్పణముపై విషయ మాలిన్యమున్నవారలే యజ్ఞానులు, మూర్ఖులు, అంధులు మరియు భాగ్యహీనులు, స్వప్నమునందు గూడ సజ్జన సందర్శనము జేయనివారు, వ్యభిచారులు, కుటిలురు, మోసగాండ్రు–

లాభము హానియు తెలియనివారలు వేదవిరుద్ధమైన మాటల నాడుచుందురు వారి హృదయదర్పణము మలినమైనది వారే నయనవిహీనులు పాపము వారు శ్రీరామచంద్రుని దివ్యమంగళస్వరూపము నెట్లు గాంచెదరు?

వి॥ నిర్మలమైన మనస్సును అద్దమునకు బోల్చినాడు కవి సజ్జనులమనస్సు నిర్మలముగ నుండును, గనుకనే వారిని నిర్మల పుణ్యు లందురు సత్పురుషుని హృదయ మెట్లు నిర్మలముగ నుండునో శ్రీవాల్మీకి మహర్షి రామాయణమును రచించునపు డిట్లు వర్ణించి యున్నాడు

'అకర్దమమిదం తీర్థం భరద్వాజ నిశామయ,
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా '

'ఓ భరద్వాజుడా ! సజ్జనుని హృదయ మెట్లు నిర్మలమై, నిష్కళంకమై యుండునో అటులే తమసానది నిర్మలముగను, మనోహరముగ నున్నది ' ఈ మాటలను శ్రీ వాల్మీకిమహర్షి తమసానదీ తీరము చేరి, బురద మొదలగు కల్మషములులేక నిర్మలమైన నదీ జలమును జూచి ప్రక్కనున్న భరద్వాజునితో ఆ నది యొక్క ప్రాశస్త్యమును, నిర్మలత్వమును గూర్చి చెప్పెను

నిర్మలమనస్సు స్వచ్ఛమైన దర్పణమనియు నట్లే ఆ మనస్సు వికలమైన, దర్పణముపై మాలిన్యము చేరినచో స్వచ్ఛతకు ఎట్లు

భంగము వాటిల్లునోయని శ్రీ తులసీదాసు వచించుచున్నాడు కల్మ
షము గలవారే అజ్ఞానులు, అంధులు, భాగ్యహీనులు

చౌ॥ జిన్హ కేఁ అగున న సగున బిబేకా ।
జల్పహిఁ కల్పిత బచన అనేకా ॥
హరిమాయా బస జగత భ్రమాహీఁ ।
తిన్హహి కహత కఛు అఘటిత నాహీఁ ॥ 658

తా॥ నిర్గుణము (అవ్యక్తము), సగుణమును (వ్యక్తము, సృష్టి) గురించిన వివేకము లేనివారలు వాస్తవముగాని మాటలను నోటికి వచ్చినట్లు వాగుదురు వారు శ్రీహరిమాయకు వశీభూతులై జగత్తులో జన్మ మృత్యు చక్రములో పడి భ్రమవశమున తిరుగుచుందురు వారికి కొంత జ్ఞానమును బోధించుట యసంభవము కానేరదు

చౌ॥ బాతుల భూత బిబస మతవారే ।
తే నహిఁ బోలహిఁ బచన బిచారే ॥
జిన్హ కృత మహా మోహ మద పానా ।
తిన్హ కర కహా కరిఅ నహిఁ కానా ॥ 659

తా॥ సన్నిపాతము, ఉన్మాదము మొదలగు వ్యాధులకు లోనయినవారు, భూతపిశాచములచే పీడింపబడువారలు, బాగుగా నాలోచించి మాటలాడరు వారు మహామోహరూపమైన మధువును సేవించిన వారలు గనుక వారేమి చెప్పినను దానిని మనము వినగూడదు

సో॥ అస నిజ హృదయఁ బిచారి తజు సంసయ భజు రామపద।
సును గిరిరాజకుమారి, భ్రమ తమ రబి కర బచన మమ॥ 660

తా॥ అని తలచిన దానవై సందేహములన్నియు విడిచిపెట్టుము శ్రీరామ చంద్రుని భజింపుము, ఓ గిరిరాజ కుమారీ, భ్రమరూపమైన యంధకారమును నాశనము జేయుటకు సూర్యకిరణములతో సమానమైన నా వచనముల నాలకింపుము

వి॥ ఏకో వారిజబాంధవః క్షితినభోవ్యాప్తం తమో మండలమ్।
భిత్వా లోచనగోచరోఽపి భవతి త్వం కోటి సూర్యప్రభః॥ అని శంకరాచార్య విరచితమైన శివానందలహరిలో జెప్పబడియున్నది

అనగా "ఒక్క సూర్యుడు భూమ్యాకాశముల యందంతటను నిండియున్న గాఢాంధకారమును పటాపంచలు గావించి కన్నులకును కనుపించునట్టి వాడగుచున్నాడు నీవో కోటి సూర్యప్రభా భాస మానుడవు, ఐనను ఎందుకో సాక్షాత్కరింపకున్నావు" అని శ్రీ శంకర భగవత్పాదులు శంకరుని స్తుతించిరి

ఈ చీకటిని సూర్యుడు పాఱదోలుచున్నాడు అజ్ఞానాంధ కారమును బాపి, జ్ఞానమనెడి వెలుగు నిచ్చు చిత్సూర్యుని వంటివాడు పరమశివుడు అఖండ తేజః స్వరూపుడు శివుడు శివు నాశ్రయించిన అజ్ఞానమునకు తావుండదు అందులకే పరమభక్తాగ్రేసరుడైన శ్రీముత్తుస్వామి దీక్షితులు 'భానుకోటి ప్రకాశాయ' అని చెప్పుచు శంకరుని కీర్తనల ద్వారా స్తుతించినాడు

చౌ॥ సగునహి అగునహి నహిఁ కఛు భేదా।
గావహిఁ ముని పురాన బుధ బేదా॥
అగున అరూప అలఖ అజ జోఈ।
భగత ప్రేమ బస సగున సో హోఈ॥ 661

తా॥ సగుణ నిర్గుణములలో భేదమేమియు లేదు మునులు అట్లే అను చున్నారు పురాణములు, వేదములుగూడ ఆ విధముగనే చెప్పుచున్నవి పండితుల యభిప్రాయమును నట్టిదే। ఏది నిర్గుణము, నిరాకారము, అవ్యక్తము, అభవముగా నుండునో, అదియే భక్తులకు ప్రేమవశమున సగుణమై పోవును

చౌ॥ జో గున రహిత సగున సోఇ కైసేఁ।
జలు హిమ ఉపల బిలగ నహిఁ జైసేఁ॥
జాసు నామ భ్రమ తిమిర పతంగా।
తేహి కిమి కహిఅ బిమోహ ప్రసంగా॥ 662

తా॥ ఏది నిర్గుణమో అది సగుణమెట్లగును? ఎట్లు జలమునకు, వడగండ్లకు ఆరెండును జలము గనుక భేదములేదో, అట్లే నిర్గుణము సగుణము రెండును ఒక్కటే। ఎవనినామము భ్రమరూపమైన అంధకారమును నాశన మొనర్చుటకు సూర్యునివంటిదో వానికి మోహప్రసంగమును గూర్చి చెప్ప నగునా?

చౌ॥ రామ సచ్చిదానంద దినేసా।
నహిం తహం మోహ నిసా లవలేసా॥
సహజ ప్రకాసరూప భగవానా।
నహిం తహం పుని బిగ్యాన బిహానా॥ 663

తా॥ శ్రీరామచంద్రుడు సచ్చిదానందస్వరూప సూర్యుడు సూర్యుడుండిన చోట అంధకారమునకు తావులేదు శ్రీరామచంద్రుడుండుచోట మోహరూపమైన అంధకారము లేశమాత్రము నుండదు శ్రీరామచంద్రుడు సహజ ప్రకాశవంతుడు। షడ్గుణపరిపూర్ణుడు। దివారాత్రములవలె అజ్ఞానరూపమైన రాత్రియుండును, విజ్ఞానరూపమైన ప్రాతఃకాలము వచ్చును కాని భగవానుడు సహజముగనే ప్రకాశవంతుడును నిత్యజ్ఞాన స్వరూపుడు।

వి॥ శ్రీ గోస్వామి తులసీదాసు, తన యిష్టదైవమైన శ్రీరామచంద్రుని సచ్చిదానంద స్వరూప సూర్యుడనియు షడైశ్వర్య యుక్తుడనియు జెప్పుచు స్తుతించినాడు అజ్ఞానమును అంధకారమనియు, విజ్ఞానము ప్రాతఃకాలమనియు వచించినాడు సూర్యుడు శ్రీరామచంద్రు డన్నాడు అరుణోదయమైన తరువాత అంధకారము పోయినట్లే రామచంద్రుని కృపాకటాక్ష వీక్షణమున అజ్ఞానముపోయి, మానవులు విజ్ఞానవంతు లగుదురు

రేయుంబవళ్ళవలె అజ్ఞాన విజ్ఞాన దశలను మానవాళి పొందుదురేగాని, భగవానుడు మాత్రము నిత్యజ్ఞాన స్వరూపుడు, అచలుడు, ఆశ్రయించిన వారలకు కల్పవృక్షము వంటివాడు జ్ఞానమనెడి వెలుగును ప్రసాదించు దినకరుడు

'ప్రీతిపూర్వకం భజతాం తేషాం తమః నాశయామి ఆత్మభావస్థః జ్ఞానదీపేన భాస్వతా' అని భగవద్వాక్యము

చౌ॥ హరష బిషాద గ్యాన అగ్యానా ।
జీవ ధర్మ అహమితి అభిమానా ॥
రామ బ్రహ్మ బ్యాపక జగ జానా ।
పరమానంద పరేస పురానా ॥ 664

తా॥ హర్షము-శోకము జ్ఞానము-అజ్ఞానము, అహంకారము-అభిమానము-ఇవన్నియు జీవులు పొందెడి దశలు, జీవధర్మములు శ్రీరామచంద్రుడు వ్యాపకబ్రహ్మ, పరమానంద స్వరూపుడు, పరాత్పరుడు పురాణ పురుషుడు ఈ విషయము జగత్ప్రసిద్ధమైనదే।

వి॥ సుఖ దుఃఖములు జనన మరణములు, కలిమిలేములు మొదలగువానిని జీవులనుభవింతురు భగవానుడన్నిటికిని అతీతుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, పరమానంద స్వరూపుడన్న భావ మిందు స్ఫురించుచున్నది

దో॥ పురుష ప్రసిద్ధ ప్రకాస నిధి ప్రగట పరావర నాథ ।
రఘుకులమని మమ స్వామి సోఇ కహి సివఁ నాయఉ
మాథ ॥ 665

తా॥ శ్రీరామచంద్రుడు పురాణపురుషుడు, తేజస్స్వరూపుడు, అనేక రూపములలో ప్రకటిత మగువాడు జీవమాయారూపమైన యీ జగత్తును పరిపాలించెడువాడు ఆ రఘుకులమణియైన శ్రీరామచంద్రుడే నా స్వామి యని నిర్వచించుచు పరమేశ్వరుడు శ్రీరామునకు సాష్టాంగ నమస్కారము చేసెను

చౌ॥ నిజ భ్రమ నహిఁ సముఝహిఁ అగ్యానీ ।
ప్రభు పర మోహ ధరహిఁ జడప్రానీ ॥
జథా గగన ఘన పటల నిహారీ ।
ఝాఁపేఉ భాను కహహిఁ కుబిచారీ ॥ 666

తా॥ అజ్ఞానులైనవారు భ్రమవశమున శ్రీరామచంద్రుని దెలిసికొనలేరు మూర్ఖులైన వారలు రాముని సరిగా నర్థము జేసికొనలేక ఇచ్ఛకు వచ్చినట్లు మాట

లాడెదరు అదియెట్లనగా నాకాశములోని మేఘమాలను జూచి 'మేఘములు సూర్యుని దాచియుంచినవి' అన్నటులుండును వారిపలుకులు। అజ్ఞానులు శ్రీరాముని దెలిసికొనలేక తమ యజ్ఞానమును ప్రభువు విషయమున ప్రకటింతురు

వి॥ అజ్ఞానులు పలికెడి పలుకులు అర్థములేనివి వారాడెడి మాటలు 'మేఘములు సూర్యుని దాచినవి' అన్నటులే యుండును సమస్త ప్రపంచమున తన కిరణములను ప్రసరింపజేయు నాదిత్యుడెక్కడ! మేఘములెక్కడ! అఖండ తేజస్స్వరూపుడైన సూర్యుని మేఘములు దాచగలవా? శ్రీరామచరిత్రను దెలిసికొన్న యజ్ఞానులట్లు అర్థహీనములైన పలుకులను బలుకుచు కాలము వ్యర్థపుచ్చెదరు

చౌ॥ చితవ జో లోచన అంగులి లాఏఁ।
ప్రగట జుగల ససి తేహి కే భాఏఁ॥
ఉమా రామబిషఇక అస మోహా॥
నభ తమ ధూమ ధూరి జిమి సోహా॥ 667

తా॥ ఎవరు చేతి వ్రేళ్ళను కన్నుల కడ్డము పెట్టుకొని ఆకాశము వైపు జూచెదరో వారికి రెండు చంద్రబింబము లగపడును

ఉమా, శ్రీరఘుచంద్రుని విషయములో ఏ విధమైన అజ్ఞాన కల్పనలైనను ఆకాశములోని యంధకారము ధూళియని భావింపవలయును

వి॥ చంద్రబింబమొక్కటియే! ఐనను చేతివ్రేళ్ళను కంటి కడ్డముగ బెట్టుకొని చూచినపుడు మాత్రము రెండు చంద్రబింబములుగా కనిపించును శ్రీరామ మహిమ నర్థముజేసికొనలేని యజ్ఞానుల కాకాశమున నిద్దరు చంద్రు లగపడునట్లు, వారు సంశయచిత్తులై భక్తిని గోల్పోవుదురు శ్రీ రఘునాథుని విషయములో మోహకల్పనలు ఆకాశములోని యంధకారము, ధూళితో సమానము

ఆకాశము నిర్మలమైనది నిర్లేపమైనది అందు మాలిన్యమునకు తావులేదు అటులనే శ్రీరామచంద్రుడు నిత్యనిర్మలుడు నిర్లిప్తుడు!

చౌ॥ బిషయ కరన సుర జీవ సమేతా ।
సకల ఏక తేఁ ఏక సచేతా ॥
సబ కర పరమ ప్రకాసక జోఈ ।
రామ అనాది అవధపతి సోఈ ॥ 668

తా॥ విషయములు, ఇంద్రియములు, ఇంద్రియముల దేవతలు, జీవాత్మ-ఇవన్నియు ఒకదాని సహాయముచే నింకొకటి చేతన మగుచున్నవి అనగా విషయ కల్పన లింద్రియముల వలనను, ఇంద్రియము లింద్రియముల దేవతల వలనను సచేతనములు కాగా ఇంద్రియాది దేవతలు, జీవాత్మ, చైతన్యప్రకాశమువలనను సచేతను లగుచున్నారు ఈ యన్నిటికిని అతీతుడు పరమ ప్రకాశవంతుడు అనాదియు, బ్రహ్మయైన అయోధ్యాధిపతి-శ్రీరామచంద్రుడు ।

చౌ॥ జగత ప్రకాస్య ప్రకాసక రాము ।
మాయాధీస గ్యాన గున ధాము ॥
జాసు సత్యతా తేఁ జడ మాయా ।
భాస సత్య ఇవ మోహ సహాయా ॥ 669

తా॥ ఈ జగత్తు ప్రకాశవంతమైనది శ్రీరామచంద్రుడు దీనిని ప్రకాశమానముచేయువాడు శ్రీరాముడు మాయాధీశుడు. జ్ఞానగుణధాముడు శ్రీరాముని సత్తాచేతనే జడమగు మాయ మోహము యొక్క సహాయమున సత్యముగా భాసించుచున్నది

దో॥ రజత సీప మహుఁ భాస జిమి జథా భాను కర బారి ।
జదపి మృషా తిహుఁ కాల సోఇ భ్రమ న సకఇ కోఉ టారి ॥ 670

తా॥ ముత్యపు చిప్పయందు వెన్నెల ప్రసరించినపుడును, సూర్యకిరణములు సోకినప్పుడును నీరున్నటులు తోచుచు ప్రసిద్ధముగను, ప్రకాశవంతముగ గనపడును ఆ ప్రకాశము మూడవ కాలములో మిథ్యయగును ఆ భ్రమ నెవరును తొలగింపలేరు

వి॥ త్రికాలములు - ఉదయము - మధ్యాహ్నము - సాయంకాలము సూర్యకిరణములు సోకినప్పుడు గాని చంద్ర కిరణము

ప్రసరించినప్పుడుగాని ముత్యపుచిప్ప ప్రకాశవంతముగ నుండును ఆ ప్రకాశము మూడవ కాలమున అనగా సాయంకాలమున మిథ్య యగును అని భావము

చౌ॥ ఏహి బిధి జగ హరి ఆశ్రిత రహఈ।
జదపి అసత్య దేత దుఖ అహఈ ॥
జౌం సపనేం సిర కాటఇ కోఈ।
బిను జాగేం న దూరి దుఖ హోఈ ॥ 671

తా॥ ఈ విధముగ ఈ జగత్తు శ్రీహరి ఆశ్రయములో నున్నది అట్లుండినను అసత్యమై అనుక్షణము దుఃఖము నిచ్చుచున్నది

జగత్తసత్యమైనచో అది దుఃఖ మెందుల కొసగుననన్న సంశయము కద్దు ఆ సంశయ నివారణార్థము కవి యిట్లు వచించుచున్నాడు

ఎవరో తలను ఖండించినట్లు స్వప్నము గాంచెద మనుకొందము నిద్ర మేల్కొను వరకును ఆ స్వప్నము నందు గలిగిన దుఃఖము దూరము గాదు కదా।

చౌ॥ జాసు కృపాం అస భ్రమ మిటి జాఈ।
గిరిజా సోఇ కృపాల రఘురాఈ ॥
ఆది అంత కోఉ జాసు న పావా।
మతి అనుమాని నిగమ అస గావా ॥ 672

తా॥ ఓ గిరిజా ఎవని కృపవలన భ్రమ దూరీకృతమగునో ఆ యొకడే కృపాకరుడైన శ్రీరామచంద్రుడు ఆది మధ్యాంత రహితుడు। వేదములు తమ బుద్ధినే శంకించి యీ క్రింద చెప్పిన విధముగ శ్రీరాముని గూర్చి గానము జేసినవి— (ముందు దోహతో అన్వయము)

చౌ॥ బిను పద చలఇ సునఇ బిను కానా।
కర బిను కరమ కరఇ బిధి నానా ॥
ఆనన రహిత సకల రస భోగీ।
బిను బానీ బకతా బడ జోగీ ॥ 673

చౌ॥ తన బిను పరస నయన బిను దేఖా ।
గ్రహఇ ఘ్రాన బిను బాస అసేషా ॥
అసి సబ భాఁతి అలౌకిక కరనీ ।
మహిమా జాసు జాఇ నహిఁ బరనీ ॥ 674

తా॥ అతడు పాదములు లేకయే నడచును చెవులు లేకయే వినును చేతులు లేకయే సర్వకార్యములు చేయును జిహ్వ లేకయే రుచిచూచును వాణి లేకయే మంచి యోగ్యమైన వక్తయగుచున్నాడు

శరీరము లేకయే స్పర్శ చేయును నయనములు లేకయే వీక్షించును నాసిక లేకయే పరిమళము నాఘ్రాణించును ఆ బ్రహ్మ యొక్క వైచిత్రి సర్వ విధముల నలౌకికమైనది అతని మహిమ లెన్న తరమా!

వి॥ స్థావరజంగమాత్మకమగు సమస్తప్రపంచము పరమాత్మకు దేహముగ చెప్పబడినది ఈ సమస్త బ్రహ్మాండము భగవంతునిదే పంచీకృత పంచభూతాత్మకమగు సమస్త స్థూలప్రపంచము (విరాట్ తత్త్వము) ఆత్మయొక్క (పరమాత్మ యొక్క) స్థూలదేహముగా ఉన్నది పంచీకృత పంచభూతాత్మకమగు హిరణ్యగర్భతత్త్వము (సమష్టి ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశములు) పరమాత్మయొక్క సూక్ష్మదేహముగా చెప్పబడినది అవ్యాకృతము పరమాత్మ యొక్క కారణదేహముగా ఉన్నది

ఈ దోహా యందు కవీశ్వరుడైన శ్రీ తులసీదాసు విరాట్ స్వరూపమును గూర్చి విపులీకరించినాడు

దో॥ జేహి ఇమి గావహిఁ బేద బుధ జాహి ధరహిఁ ముని ధ్యాన।
సోఇ దసరథ సుత భగత హిత కోసలపతి భగవాన ॥ 675

తా॥ ఈ విధముగ నెవనిని వేదములు, పండితులు వర్ణన నల్పుచుందురో యెవనిని మునులు నిరంతరము ధ్యానము జేయు చుందురో వాడే దశరథ నందనుడు భక్తులకు హితము జేకూర్చెడి వాడు అయోధ్యాధిపతియైన భగవానుడైన శ్రీరామచంద్రుడు!

చౌ॥ కాసీఁ మరత జంతు అవలోకీ ।
జాసు నామ బల కరఉఁ బిసోకీ ॥
సోఇ ప్రభు మోర చరాచర స్వామీ ।
రఘుబర సబ ఉర అంతరజామీ ॥ 676

తా॥ ఓ పార్వతీ, ఎవని నామ బలమున పుణ్యక్షేత్రమైన కాశియందు మరణించినవారు రామ మంత్రోపదిష్టులై శోకరహితులై ముక్తులగుచున్నారో అతడే నా ప్రభువైన రఘుశ్రేష్ఠుడైన శ్రీరామచంద్రుడు జడచేతనములకు స్వామి సర్వుల హృదయాంతరాళముల నెఱిగినవాడు సర్వవ్యాపకుడు

చౌ॥ బిబసహుఁ జాసు నామ నర కహహీఁ ।
జనమ అనేక రచిత అఘ దహహీఁ ॥
సాదర సుమిరన జే నర కరహీఁ ।
భవ బారిధి గోపద ఇవ తరహీఁ ॥ 677

తా॥ ఇచ్ఛారహితులై, వివశులైనను శ్రీరామ నామస్మరణ మాత్రమున, వారు జన్మాంతర పాపములను సహితము భస్మీభూత మొనర్చుకొనిన వారలై యనంత సంసార సాగరమును సహితము గోష్పాద మాత్ర పరిమాణంబుగల దానినిగా జేసి యతి సులభముగా తరింతురు (దుస్తరమైన భవసాగరమును పరిశ్రమ లేకయే దాటెదరని భావము)

చౌ॥ రామ సో పరమాతమా భవానీ ।
తహఁ భ్రమ అబిహిత తవ బానీ ॥
అస సంసయ ఆనత ఉర మాహీఁ ।
గ్యాన బిరాగ సకల గున జాహీఁ ॥ 678

తా॥ ఓ భవానీ, ఆ పరమాత్ముడే శ్రీరామచంద్రుడు అతని యందు భ్రమవశమున నీవు చెప్పిన మాట లత్యంతము అనుచితములు ఈ ప్రకారమైన సంశయములకు మనంబున చోటిచ్చుటచే మానవులు జ్ఞానవైరాగ్యాది రహితులగుచున్నారు సద్గుణములన్నియు వారిని వీడుచున్నవి అజ్ఞానము ప్రబలుచున్నది

వి॥ సంశయములకు చోటీయక మనోవాక్కాయ కర్మముల ద్వారా భగవంతుని సేవింపుమనుచున్నాడు మహేశ్వరుడు భగవత్పాదసేవ అవశ్యము కర్తవ్యమని యిందు నొక్కి వక్కాణింపబడినది.

పరమేశ్వరుడు పార్వతికి జ్ఞానబోధ జేయుచున్నాడనగా ఆది శక్తియైన జగజ్జననియైన పార్వతికి నిగూఢమైన వేదాంత తత్త్వములు తెలియవనిగాదు లోకహితార్థము ఆమె యడిగిన ప్రశ్నకు సాక్షాత్తు శంకరుడే మనకు పరోక్షముగా జ్ఞానబోధ సల్పుచున్నాడు

చౌ॥ సుని సివకే భ్రమ భంజన బచనా ।
మిటి గై సబ కుతరక కై రచనా ॥
భఇ రఘుపతి పద ప్రీతి ప్రతీతీ ।
దారున అసంభావనా బీతీ ॥ 679

తా॥ అజ్ఞాన హరణమైన శంకరుని వాణి వినినంతనే పార్వతికి సంశయములు తీరెను అంత శ్రీరామ చరణ కమలములపై ప్రేమ, భక్తి విశ్వాసములు పెంపొందెను దారుణమైన సంభవాసంభవము లామెను వీడసాగెను

దో॥ పుని పుని ప్రభు పద కమల గహి జోరి పంకరుహ పాని।
బోలీం గిరిజా బచన బర మనహుం ప్రేమ రస సాని ॥ 680

తా॥ పునః పునః శ్రీ శంకర పాదారవిందములను బట్టుకొని కమల సదృశ కరయుగమును జోడించి పార్వతి ప్రేమరసముట్టిపడ మృదు మధుర మనోహర వచనముల నిట్లనెను (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ ససికర సమ సుని గిరా తుమ్హారీ ।
మిటా మోహ సరదాతప భారీ ॥
తుమ్హ కృపాల సబు సంసఉ హరేఊ ।
రామస్వరూప జాని మోహి పరేఊ ॥ 681

తా॥ చంద్రకిరణములు శరదృతువు నందు కలిగెడి యెండ తాపమును పోగొట్టి చల్లదనము నిచ్చును చంద్రకిరణ సదృశమైన మీ శీతల వాణి విన్నంతనే శరదృతువునందలి యెండ వేడిమితో సమానమైన నా యజ్ఞానము నన్ను బాసినది

ఓ కృపాకరా, మీరు నా సకలసంశయములను హరింపజేసితిరి ఇప్పుడు శ్రీరామచంద్రుని యథార్థ స్వరూపము నాకు గోచరించుచున్నది

చౌ॥ నాథ కృపాఁ అబ గయఉ బిషాదా ।
సుఖీ భయఉఁ ప్రభు చరన ప్రసాదా ॥
అబ మోహి ఆపని కింకరి జానీ ।
జదపి సహజ జడ నారి అయానీ ॥ 682

తా॥ ఓ నాథా మీ కృపవలన నా విషాదము దూరమగుచున్నది మీ యనుగ్రహము వలన నిప్పుడు నాకు సుఖశాంతులు లభించినవి మీ చరణ కమల సందర్శన భాగ్యముచే నా కన్నియు సమకూరినవి

స్త్రీలు సహజముగా జ్ఞానహీనలు, మూర్ఖురాండ్రు గదా! ఐనను మీరు నన్ను తమ దాసిగా భావించి—(ముందు దోహాతో అన్వయము)

చౌ॥ ప్రథమ జో మైఁ పూఛా సోఇ కహహూ ।
జౌఁ మో పర ప్రసన్న ప్రభు అహహూ ॥
రామ బ్రహ్మ చిన్మయ అబినాసీ ।
సర్బ రహిత సబ ఉర పుర బాసీ ॥ 683

తా॥ ఓ ప్రభూ, ఇప్పుడు మీరు నాయందు ప్రసన్నులైతిరి నేను మిమ్ము ముందడిగిన ప్రశ్న కిప్పుడు సమాధాన మొసగుడు ఆ శ్రీరామచంద్రుడు పరబ్రహ్మ, చిన్మయుడు, అవినాశి, సర్వసంగరహితుడు, సర్వుల మనోమందిరమున నివాసము జేయువాడు —ఇది సత్యమేనా?

## అవతార కారణములు

చౌ॥ నాథ ధరేఉ నరతను కేహి హేతూ ।
మోహి సముఝాఇ కహహు బృషకేతూ ॥
ఉమా బచన సుని పరమ బినీతా ।
రామ కథా పర ప్రీతి పునీతా ॥ 684

తా॥ నాథా, వృషకేతూ, శ్రీరాము డేల మానవావతారమెత్తెను? దానిని గూర్చి నాకు సవిస్తరముగ తెలిగింపుడు—అని పార్వతి నుడివిన మృదుమధుర వినయవచనముల నాలకించి పరమేశ్వరుడు సంతుష్టినొందెను శ్రీరామ కథయందు అమెకు గలిగిన భక్తి శ్రద్ధలను సరికించి— (ముందు దోహాతోఅన్వయము)

వి॥ శ్రీ త్యాగబ్రహ్మ 'ఎవరికై అవతారమెత్తితివో ఇపుడైన దెలుపవయ్యా' అని శ్రీరామచంద్రుని కీర్తన రూపమున అవతార కారణమును గూర్చి అడిగెను

దో॥ హియఁ హరషే కామారి తబ సంకర సహజ సుజాన ।
బహు బిధి ఉమహి ప్రసంసి పుని బోలే కృపానిధాన ॥685

తా॥ మన్మథునకు శత్రువైన, శంకరుడు సహజముగ చతురమైన మనంబున మిగుల నానందించి, పార్వతిని బహువిధములుగ ప్రశంసించి మరల నిట్లనియె (ముందు దోహాతో అన్వయము)

సో॥ సును సుభ కథా భవానీ రామచరితమానస బిమల ।
కహా భుసుండి బఖాని సునా బిహగ నాయక గరుడ॥ 686

తా॥ ఓ భవానీ, నిర్మల రామచరితమానసమనెడి మంగళకరమైన కథను వినుము ఈ మానసమును కాకభుసుండి విస్తారముగా పక్షిరాజైన గరుత్మంతునికి చెప్పెను

సో॥ సో సంబాద ఉదార జేహి బిధి భా ఆగేఁ కహబ ।
సునహు రామ అవతార చరిత పరమ సుందర అనఘ॥687

తా॥ ఆ శ్రేష్ఠసంవాద మేవిధముగ జరిగెనో దానిని గూర్చి వివరింతును ఇప్పుడు నీవు శ్రీరామచంద్రుని అవతారములగూర్చి సమస్తపాపములను హరింప జేయు పరమపవిత్ర కథల నాలకింపుము

సో॥ హరి గున నామ అపార కథా రూప అగనిత అమిత ।
మైఁ నిజ మతి అనుసార కహఉఁ ఉమా సాదర సునహు॥688

తా॥ శ్రీహరి గుణములు, నామములు, కథలు, రూపము లనంతములు అపారములు, అగణితములు కాని గిరిజా నేను నా బుద్ధ్యనుసారముగా జెప్పె దను నీ వాదరపూర్వకముగ దీనిని వినుము

చౌ॥ సును గిరిజా హరిచరత సుహాఏ ।
బిపుల బిసద నిగమాగమ గాఏ ॥
హరి అవతార హేతు జేహి హోఈ ।
ఇదమిత్థం కహి జాఇ న సోఈ ॥ 689

తా॥ ఓ గిరిజా, వేదశాస్త్రములు శ్రీహరియొక్క సుందర విశద నిర్మల చరిత్రమును గానము చేసినవి హరి అవతారవిధానమును జెప్ప సాధ్యమా ? శ్రీహరి మానవావతారమెత్తుట కెన్నియో కారణములు గలవు వాటి నెఱుంగుటకు సాధ్యము గాదు

చౌ॥ రామ అతర్క్య బుద్ధి మన బానీ ।
మత హమార అస సునహి సయానీ ॥
తదపి సంత ముని బేద పురానా ।
జస కఛు కహహిఁ స్వమతి అనుమానా ॥ 690

తా॥ ఓ బుద్ధిమతీ, శ్రద్ధగా వినుము నా యభిప్రాయము మాత్రమిదియే బుద్ధి, మనస్సు, వాణిచే శ్రీరామునిగూర్చి తర్కించుట సాధ్యముగాని పని ఐనను సజ్జనులు, మునులు వేదపురాణములు వాని బుద్ధ్యనుసారముగా గానము చేసినవి

చౌ॥ తస మైఁ సుముఖి సునావఉఁ తోహీ ।
సముఝి కరఇ జస కారన మోహీ ॥
జబ జబ హోఇ ధరమ కై హానీ ।
బాఢహిఁ అసుర అధమ అభిమానీ ॥ 691

తా॥ ఓ సుముఖీ, నాకు తెలిసిన రామావతారకారణములు నీ కెఱిగించె దను ధర్మమున కెప్పుడు హానికలుగునో అప్పుడు నీచులైన రాక్షసు లుద్భవించెదరు

చౌ॥ కరఁ అనీతి జాఇ నహిఁ బరనీ ।
సీదహిఁ బిప్ర ధేను సుర ధరనీ ॥
తబ తబ ప్రభు ధరి బిబిధ సరీరా ।
హరహిఁ కృపానిధి సజ్జన పీరా ॥ 692

తా॥ అట్లు అన్యాయము, అక్రమము ప్రబలినప్పుడు గోవులకు, బ్రాహ్మణులకు, దేవతలకు కష్టములు సంభవించినపుడును భూభారమెక్కువైనప్పుడును కృపానిధియైన భగవానుడు దివ్యశరీరమును దాల్చి సజ్జనులకు గలిగిన కష్టములను బాపును

దో॥ అసుర మారి థాపహిఁ సురన్హ రాఖహిఁ నిజ శ్రుతి సేతు।
జగ బిస్తారహిఁ బిసద జస రామ జన్మ కర హేతు ॥ 693

తా॥ శ్రీరామచంద్రు డసురులను జంపి దేవతలను కాపాడును వేదముల మర్యాదను నిలబెట్టును జగత్తునందు తన నిర్మలయశమును వ్యాపింపజేయును శ్రీరామచంద్రుని యవతారకారణము లివియే వాటిని వివరింతును, శ్రద్ధగా వినుము

చౌ॥ సోఇ జస గాఇ భగత భవతరహీఁ ।
కృపాసింధు జన హిత తను ధరహీఁ ॥
రామ జనమ కే హేతు అనేకా ।
పరమ బిచిత్ర ఏక తేఁ ఏకా ॥ 694

తా॥ శ్రీరామయశమును పాడిపాడి భక్తజనులు భవసాగరమును తరించెదరు కరుణాసముద్రుడైన భగవానుడు భక్తుల హితార్థ మనేకావతారము లెత్తును శ్రీరామ జన్మమునకు కారణము లనేకములు గలవు అవి ఒకదానికంటె నింకొకటి మించినవై విచిత్రముగ నుండును

చౌ॥ జనమ ఏక దుఇ కహఉఁ బఖానీ ।
సావధాన సును సుమతి భవానీ ॥
ద్వారపాల హరి కీ ప్రియ దోఊ ।
జయ అరు బిజయ జాన సబ కోఊ ॥ 695

తా॥ ఓ బుద్ధిమతియైన భవానీ, నేను విష్ణువవతరించుట కొకటిరెండు జన్మముల కారణములు మాత్రము విస్తారముగా జెప్పెదను, వినుము శ్రీహరికి జయవిజయులను ద్వారపాలకు లుండిరి ఇది అందరికి దెలిసిన విషయమే।

## జయవిజయులు

వీరు వైకుంఠమునందు ద్వారపాలకులు ఒకసారి సనకాది మునీంద్రులు శ్రీహరిసందర్శనార్థ మేతెంచిరి ద్వారపాలకులైన జయవిజయులు వారి నడ్డగించి వారితో వాదించిరి అంత మునీంద్రులాగ్రహపూరితులై రాక్షసులుగండని వారిని శపించిరి ఆ జయవిజయులే సత్య యుగములో హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు, త్రేతా యుగములో రావణ కుంభకర్ణులు, ద్వాపర యుగములో శిశుపాల దంతవక్త్రులు భగవానుడు వరాహ నరసింహ రామకృష్ణావతారము లెత్తి తన ద్వారపాలకుల నుద్ధరించెను

చౌ॥ బిప్ర శాప తేఁ దూనఉ భాఈ ।
తామస అసుర దేహ తిన్హ పాఈ ॥
కనక కసిపు అరు హాటకలోచన ।
జగత బిదిత సురపతి మద మోచన ॥ 696

తా॥ జయవిజయు లిరువురును (అన్నదమ్ములు) సనకాదిమునుల శాపముచే తామసశరీరమును పొందిరి, అనగా రాక్షసులైరి వారే హిరణ్యాక్షుడు - హిరణ్యకశిపుడు వారు దేవలోకమునకు పోయి ఇంద్రాదులను జయించి జగత్తునందు సాటిలేనివారని ప్రఖ్యాతిగాంచిరి

వి॥ జయవిజయులను ద్వారపాలకులు దితిగర్భమున హిరణ్యాక్ష - హిరణ్యకశిపులను నామములతో జన్మించిరి వీరిరువురును బలవంతులు

చౌ॥ బిజఈ సమర బీర బిఖ్యాతా ।
ధరి బరాహ బపు ఏక నిపాతా ॥
హోఇ నరహరి దూసర పుని మారా ।
జన ప్రహ్లాద సుజస బిస్తారా ॥ 697

తా॥ హిరణ్యాక్ష - హిరణ్యకశిపులు సుప్రసిద్ధులైన యుద్ధవీరులు వారిలో హిరణ్యాక్షుని భగవానుడైన విష్ణువు వరాహావతారమెత్తి సంహరించెను నరసింహావతారమెత్తి విష్ణువు హిరణ్యకశిపుని హతమార్చెను తన భక్తుడైన ప్రహ్లాదుని యశమును వ్యాప్తిచేసెను.

వి॥ వరాహుడు-హిరణ్యాక్షుడు జయవిజయులను ద్వారపాలకులు, దితిపుత్రులు ఒకసారి బ్రహ్మ ప్రార్థించగా విష్ణుభగవానుడు వరాహావతారమెత్తి జలములో మునిగియున్న భూమినుద్ధరించుటకు పోయెను భగవానుడు తిరిగివచ్చుచుండగా మార్గమున హిరణ్యాక్షుడగపడెను వరాహావతారమున నున్న భగవానుడు హిరణ్యాక్షుని వధించెను

హిరణ్యకశిపుడు-నరహరి ఎవ్వరివలనను మరణము సంభవింపకుండునట్లు అమరుడగునట్లును వరమును బ్రసాదింపుమని హిరణ్యకశిపుడు బ్రహ్మను వేడియుండెను జన్మమెత్తిన వాడెన్నంటికిని అమరుడుకాడు, ఇంకొక వరమును వేడుకొనుమని బ్రహ్మ పలికెను అంతహిరణ్యకశిపుడు రాత్రియందుగాని, పగటియందుగాని, భూమ్యాకాశము

లందుగాని, మనుష్యునివలనగాని, మృగమువలనగాని, దేవతలవలన గాని, రాక్షసులవలనగాని, సృష్టిలోని యే జీవివలన కూడ తనకు మరణము కలుగకుండునట్లు వరమును ప్రసాదింపు మనెను బ్రహ్మావరము నొసగెను ఈ ప్రకారము వరమును బొంది దేవతల కమితమైన దుఃఖము కలుగజేయుచు హిరణ్యకశిపుడు తుదకు తన పుత్రుడైన ప్రహ్లాదుని హింసింపసాగెను భగవానుడు శ్రీహరి యెక్కడనున్నాడో చూపుము లేకపోయినచో నిన్ను జంపెద ననెను అంత భగవానుడు నరసింహావతారమున హిరణ్యకశిపుని జంపి ప్రహ్లాదుని రక్షించెను

దో॥ భయే నిసాచర జాఇ తేఇ మహాబీర బలవాన ।
కుంభ కరన రావన సుభట సుర బిజఈ జగ జాన ॥ 698

తా॥ వారిరువురును అట్లు శ్రీహరిచే జంపబడి మరుజన్మమున దేవతలను జయించువారలైన రావణ, కుంభకర్ణులుగ జన్మించిరి రావణ, కుంభకర్ణులు బలవంతులని సమస్త జగత్తునకు విదితమే ।

చౌ॥ ముకుత న భఏ హతే భగవానా ।
తీని జనమ ద్విజ బచన ప్రవానా ॥
ఏక బార తిన్హ కే హిత లాగీ ।
ధరేఉ సరీర భగత అనురాగీ ॥ 699

తా॥ భగవంతునిచేత సంహరింపబడినను, హిరణ్యాక్షుడు-హిరణ్యకశిపుడు ముక్తి నొందలేదు ఏలని సనకాదిమునులు వారికి బెట్టిన శాపమువలన వారు ముక్తి బొందలేదు వారు రాక్షసులుగ మూడుజన్మము లెత్తి శ్రీహరిచే సంహరింపబడి తరువాత ముక్తి నొందెదరని మునులు వారిని శపించియుండిరి కనుక వారిని తరింపజేయుటకు ఒకసారి విష్ణుభగవాను డవతార మెత్తెను

చౌ॥ కస్యప అదిత తహాఁ పితు మాతా ।
దశరథ కౌసల్యా బిఖ్యాతా ॥
ఏక కలప ఏహి బిధి అవతారా ।
చరిత పబిత్ర కిఏ సంసారా ॥ 700

తా॥ ముందుజన్మమున అదితి-కశ్యపులుగా జన్మించినవారలే మరుజన్మమున శ్రీరాముని మాతాపితలై కౌసల్యా దశరథుల నామమున సుప్రసిద్ధులైరి ఒక కల్పములో శ్రీమహావిష్ణు వీ ప్రకారముగ నవతరించి ప్రపంచమున పవిత్ర లీలలను గావించెను

వి॥ అదితి-కశ్యపుడు దక్ష ప్రజాపతి పుత్రిక పేరు అదితి ఈమె ప్రజాపతియైన కశ్యపుని పత్ని ఇరువురును ఘోరమైన తప మొనరించిరి ఆ తపమునకుమెచ్చి భగవానుడు వారికి సాక్షాత్కరించి వర మడుగు డనెను వారిరువురును చేతులు జోడించి 'నీవంటి పుత్రుని మాకు ప్రసాదింపు' మని వేడుకొనిరి భగవానుడు 'ఏవమస్తు' అని నుడివి త్రేతా యుగమున మీ పుత్రుడ నయ్యెదనని చెప్పుచు అంతర్ధానమాయెను త్రేతాయుగములో అదితి కౌసల్యగా, కశ్యపుడు దశరథుడుగా జన్మించిరి ఇంతకుముందు వామనుడు వీరికే జన్మించి యుండెను

చౌ॥ ఏక కలప సుర దేఖి దుఖారే ।
సమర జలంధర సన సబ హారే ॥
సంభు కీన్హ సంగ్రామ అపారా ।
దనుజ మహాబల మరఇ న మారా ॥ 701

తా॥ ఒక కల్పములో దేవతలందఱును జలంధరుడను దైత్యునితో పోరి యుద్ధములో నపజయమును పొందిన కారణమున దుఃఖితులై యుండుట జూచి శంకరుడు జలంధరునితో ఘోరయుద్ధ మొనర్చెను కాని మహాబలవంతుడైన జలంధరుడు మరణించలేదు

చౌ॥ పరమ సతీ అసురాధిప నారీ ।
తేహిఁ బల తాహి న జితహిఁ పురారీ ॥ 702

తా॥ జలంధరు డెందులకు మరణించలేదనగా- జలంధరుని సతి మహా పతివ్రత కనుక త్రిపురాసురుని నాశనముచేసిన శివుడుగూడ జలంధరుని జయింపలేకపోయెను

దో॥ ఛల కరి టారేఉ తాసు బ్రత ప్రభు సురకారజ కీన్హ ।
జబ తేహిఁ జానేఉ మరము తబ శాప కోప కరి దీన్హ॥ 703

తా॥ అప్పుడు శ్రీహరి జలంధరు నెటులైనను రూపుమాపవలెనని పట్టు పట్టెను దేవకార్యార్థమై పరమసాధ్వియైన జలంధరుని సతియగు శ్రీతులసిచేయు వ్రతమును భంగము జేయనెంచెను ఆమె వ్రతమును భంగముచేసి దేవతల కార్యమును సఫలముజేసెను ఆ వ్రతమునకు భంగము వాటిల్లినదని కనుగొని, శ్రీ తులసి యాగ్రహము బూని భగవానుడైన శ్రీహరిని శపించెను

చౌ॥ తాసు శాప హరి దీన్హ ప్రమానా ।
కౌతుకనిధి కృపాల భగవానా ॥
తహఁ జలంధర రావన భయఊ ।
రన హతి రామ పరమ పద దయఊ ॥ 704

తా॥ సమస్త లీలావిలాసుడైన శ్రీహరి శ్రీతులసి యొసగిన శాపమును స్వీకరించెను కృపాకరుడైన భగవానుని లీల యత్యాశ్చర్యకరము గదా। ఆ జలంధరుడె యింకొక కల్పములో రావణు డయ్యెను ఆ రావణుని శ్రీరామచంద్రుడు యుద్ధములో జంపి మోక్షము నొసంగెను

చౌ॥ ఏక జనమ కర కారన ఏహా ।
జేహి లగి రామ ధరీ నరదేహా ॥
ప్రతి అవతార కథా ప్రభు కేరీ ।
సును ముని బరనీ కబిన్హ ఘనేరీ ॥ 705

తా॥ ఇది భగవానుడైన విష్ణుదేవుడు జన్మించుట కొక కారణము ఈ కారణమువలన శ్రీరామచంద్రుడు మానవుడుగా జన్మించెను

ఓ భరద్వాజమునీ, వినుము భగవానునియొక్క ప్రత్యేకావతారకథను కవులు పెక్కువిధములుగా వర్ణించియున్నారు

చౌ॥ నారద శాప దీన్హ ఏక బారా ।
కలప ఏక తేహి లగి అవతారా ॥
గిరిజా చకిత భఈఁ సుని బానీ ।
నారద బిష్ణు భగత పుని గ్యానీ ॥ 706

శా॥ ఒకసారి నారదమునీంద్రుడు శ్రీమహావిష్ణువునకు శాపమొసగెను దానివలన నింకొకకల్పమునందు భగవానుడు మరల నవతారమెత్తెను

ఈ మాట విన్న పార్వతి విస్మితురాలై యిట్లనెను ఆ నారదుడు జ్ఞాని మరియు విష్ణుభక్తుడు గదా: నారదుడెట్లు భగవానునికి శాప మొసగెను:

వి॥ నారదుడు పరమజ్ఞాని, విష్ణుభక్తుడు నారద మునీంద్రుడు తన జీవితవృత్తాంతమును నీ విధముగ వ్యాసునకు తెలియజేసెను

నారదమునీంద్రుడు

"పూర్వ జన్మమున నేను దాసీ పుత్రుడను నా జనని చాతుర్మాస్యమున ఋషులకు సేవలొనర్చు చుండెడిది నేను నా జనని సాంగత్యమున భగవత్కథలను విను చుంటిని, ఉప వాసములు చేయు చుంటిని నే నైదు సంవత్సరముల బాలుడుగానుండినపుడు పాము కరచి నాతల్లి మరణించెను తరువాత హిమాలయమున కేగితిని అట ధ్యాన నిమగ్నుడనైతిని ఒకసారి భగవద్దర్శనము నాకు కలిగెను తరువాత చీకట్లు గ్రమ్మెను అంత ఆకాశవాణి ఆ రాబోవు జన్మమున నా దర్శనము నీకు లభించునని ఎలికెను నేను మరణమునకై వేచి యుంటిని తుదకది సంభవించినది మరణించిన తరువాత మరీచి తదితరులతో బాటు నా యుత్పత్తి బ్రహ్మవలన కలిగినది అప్పటి నుండి శ్రీ హరి నామసంకీర్తనము జేయుచున్నాను కనుక వ్యాస మహర్షి నీవు కూడ భగవల్లీలలను వర్ణింపుము నీకు శాంతి లభింప గలదు ఇంత వఱకు నీవు కేవలము జ్ఞానప్రధానమైన (బ్రహ్మ సూత్రములు) కర్మప్రధానమైన (మహాభారతము) గ్రంథములను రచించితివి చిదానందమయుడైన శ్రీకృష్ణునిలీలలను వర్ణింపలేదు కనుక భాగవతమును భక్తిప్రధానమైన దివ్యగ్రంథమును రచింపుము"

నారదుని ఆదేశానుసారము వ్యాసుడు భాగవతమును రచించెను

చౌ॥ కారన కవన శాప ముని దీన్హా ।
కా అపరాధ రమాపతి కీన్హా ॥
యహ ప్రసంగ మోహి కహహు పురారీ ।
ముని మన మోహ అచరజ భారీ ॥ 707

తా॥ ముని భగవానునికి శాపమెందుల కొసగెను? లక్ష్మీ పతియైన విష్ణుభగవానుడు నారదమునీంద్రున కేమి యపకార మొనర్చెను?

పురారీ, ఆ కథను నాకు వివులీకరింపుడు విశిష్టజ్ఞాన సంపన్నుడైన నారద మునీంద్రున కజ్ఞానమావరించుటయా? ఎంత ఆశ్చర్యకరమైన విషయము!

దో॥ బోలే బిహసి మహేస తబ గ్యానీ మూఢ న కోఇ ।
జేహి జస రఘుపతి కరహిఁ జబ సో తస తేహి ఛన హోఇ ॥
708

తా॥ అని పర్వతరాజకుమారియైన పార్వతీదేవి యడుగగా మహాదేవుడు దరహాసవదనుడై యిట్లనెను

గిరిజా, జ్ఞానులైనను, మూర్ఖులైనను నరే శ్రీరఘునాథు డాక్షణమున నెట్లాడించునో అట్లాడవలసిందే! [ఎంతటిజ్ఞానులైనను ఒకొక్కప్పుడు మాయవలలో బడెదరని యర్థము ]

సో॥ కహఉఁ రామ గున గాథ భరద్వాజ సాదర సునహు ।
భవ భంజన రఘునాథ భజు తులసీ తజి మాన మద॥ 709

తా॥ యాజ్ఞవల్క్యమహాముని భరద్వాజమునితో నిట్లు వచించుచున్నాడు ఓ భరద్వాజా, నేను శ్రీరామచంద్రుని సుగుణసంపదను గురించిన కథనుచెప్పెదను, శ్రద్ధగా నాలకింపుము

మదమాత్సర్యములను త్యజించి, భవభంజనుడైన శ్రీరాముని భజింపుమని శ్రీతులసీదాసు వచించుచున్నాడు

## నారదునిం కహంకారం మావరించుట

## మాయాప్రభావము

చౌ॥ హిమగిరి గుహా ఏక అతి పావని ।
బహ సమీప సురసరీ సుహావని ॥
ఆశ్రమ పరమ పునీత సుహావా ।
దేఖి దేవరిషి మన అతి భావా ॥ 710

తా॥ హిమాలయపర్వతమునం దొక పవిత్రమైన గుహ కలదు దానికి సమీపమున గంగానది ప్రవహించుచుండెను ఆ పరమపవిత్రమైన సుందరాశ్రమము మును జూచినతోడనే నారదు డమితానందము నొందెను

చౌ॥ నిరఖి సైల సరి బిపిన బిభాగా ।
భయఉ రమాపతి పద అనురాగా ॥
సుమిరత హరిహి శాప గతి బాధీ ।
సహజ బిమల మన లాగి సమాధీ ॥ 711

తా॥ పర్వతములు, నదులు, వనములు, సుందరారణ్య ప్రదేశములను జూచిన నారదునకు లక్ష్మీకాంతుడైన శ్రీమన్నారాయణుని చరణ కమలములపై భక్తిగలిగెను భగవద్ధ్యానమునందు అతడు నిమగ్నుడాయెను మును దక్ష ప్రజాపతి, నారదునకు పెట్టిన శాపమువలన నారదు డొక్కచోట స్థిరముగ నుండలేక పోవుచుండెను ఇప్పుడు మాత్రము శ్రీహరి కటాక్షముచే, నారదుడు సుందర నదీ ప్రాంతమందు ప్రత్యేక వాతావరణమున శాంతచిత్తుడై స్థిరుడాయెను సహజముగా నిర్మలుడు గాన నారదుడు తపస్సమాధిలో నుండిపోయెను

వి॥ సృష్ట్యారంభమునకు ముందు బ్రహ్మ దక్ష ప్రజాపతిని తన కుడిచేతి వ్రేలితో నుత్పన్న మొనరించెను రెండున్నర గడియల కన్న ఎక్కువకాల మొకచోట నుండజాలవని దక్షప్రజాపతి నారదునకు శాప మొసగెను శాపగ్రస్తుడైనందువలననే నారదమునీంద్రుడు హరినామ సంకీర్తనము జేయుచు నొకచోట నుండక సంచరించుచుండుట

చౌ॥ ముని గతి దేఖి సురేస డేరానా ।
కామహి బోలి కీన్హ సనమానా ॥
సహిత సహాయ జాహు మమ హేతూ ।
చలేఉ హరషి హియఁ జలచర కేతూ ॥ 712

తా॥ నారదమునీంద్రుని తపస్సు దేవతల రాజైన యింద్రునకు ఆందోళన కలిగించెను. త్రిలోక సంచారియగు నారదు డిట్లు ఏకాంత స్థలమున తపమాచరించుట జూచి ఇంద్రుడు భయము జెందెను. నారదుని తపమేవిధముగనైనను భంగపరుపవలయునన్న దృఢసంకల్పము గలవాడై, ఇంద్రుడు మన్మథుని సగౌరవముగ నాహ్వానించి సత్కరించెను. మరియు నిట్లనెను - "మన్మథా, నీవు నీ పుష్పబాణములు ధరించి యింకను వలయు సహాయసంపత్తిగొని నారదుని తపమును భంగపరచుము."

ఇంద్రుని మాటల నాలకించి ప్రసన్నచిత్తుడై మీనధ్వజము నిడుకొని మన్మథుడు నారదుని కడకేగెను.

చౌ॥ సునాసీర మన మహుఁ అసి త్రాసా ।
చహత దేవరిషి మమ పుర బాసా ॥
జే కామీ లోలుప జగ మాహీఁ ।
కుటిల కాక ఇవ సబహి డేరాహీఁ ॥ 713

తా॥ తన పురమైన యమరావతిని బొందగోరి నారదుడు తపమాచరించుచున్నాడన్న శంక ఇంద్రునకు గలిగినది. దేవసార్వభౌమత్వములో నున్నను స్వార్థపరుడై, విచక్షణాజ్ఞానము లేక మన్మథుని తపోభంగమునకై నియమించెను.

అటులే జగత్తునందు కామాంధులు పరమలోభులు గలరు. వారు దుష్టులై కాకులవలె నెందరిని భయపెట్టుదురు.

దో॥ సూఖ హాడ లై భాగ సఠ స్వాన నిరఖి మృగరాజ ।
ఛీని లేఇ జని జాని జడ, తిమి సురపతిహి న లాజ ॥ 714

తా॥ ఒకసారి తెలివి లేని శునకము మృగరాజైన సింహమును జూచి యెండిపోయిన ఎముకముక్కను నోటితో గరచుకొని తీసుకొనిపోయెనట। ఆ యెముకముక్కను సింహము లాగుకొనునేమో యని భయపడి యట్లుచేసెనది

మూర్ఖ శునకము వలె ఇంద్రుడు గూడ నా రాజ్యమును నారదుడపహరించును అని తలచెను అట్లు తలచుటాతనికి సగ్గుకాదేమో।

చౌ॥ తేహి ఆశ్రమహిఁ మదన జబ గయఊ।
నిజ మాయాఁ బసంత నిరమయఊ॥
కుసుమిత బిబిధ బిటప బహురంగా।
కూజహిఁ కోకిల గుంజహిఁ భృంగా॥ 715

తా॥ మన్మథుడు నారదమునీంద్రు డుండినయాశ్రమమునకు బోయెనో లేదో మరుక్షణముననే వసంతర్తువు నుత్పన్నము జేసెను వృక్షములపై రకరకములైన రంగురంగుల పుష్పములను వికసింపజేసెను అచ్చట కోయిలలు మధురగానము జేయుచుండెను తుమ్మెదలు ఝుంకారములు జేయుచుండెను అట్లు పర్వత ప్రాంతమంతయు నుద్యానవనముగ మారిపోయెను

చౌ॥ చలీ సుహావని త్రిబిధ బయారీ।
కామ కృసాను బఢావనిహారీ॥
రంభాదిక సురనారి నబీనా।
సకల అసమసర కలా ప్రబీనా॥ 716

తా॥ కామాగ్ని నుత్పన్నము జేయు నటువంటి త్రివిధములైన శీతల-మంద-సుగంధ మారుతములు వీవసాగెను నవయువతులైన రంభాది దేవాంగనలెల్లరును కామకళయందు నిపుణాతి నిపుణలు

చౌ॥ కరహిఁ గాన బహు తాన తరంగా।
బహుబిధి క్రీడహిఁ పాని పతంగా॥
దేఖి సహాయ మదన హరషానా।
కీన్హేసి పుని ప్రపంచ బిధి నానా॥ 717

తా॥ అప్సరసలు గీత, వాద్య మృదంగ తాళాది ధ్వనులతో గానముచేయ దొడగిరి పూల బంతుల నిడుకొని, రకరకములైన యాటలనాడిరి, నాట్యము జేసిరి తనకు సహాయ కారిణులుగా వచ్చిన దేవాంగనలను వారి నాట్య భంగిమను జూచి కార్యము సిద్ధించినట్లే భావించి మన్మథుడు సంతోషించెను అవి యేవియు నారదుని కదలింపలేకపోయినవి మన్మథుడు మరల నానా ప్రకారములైన మాయాజాలమును పన్నెను

చౌ॥ కామకలా కఛు మునిహి న బ్యాపీ ।
నిజ భయఁ డరేఉ మనోభవ పాపీ ॥
సీమ కి చాఁపి సకఇ కోఉ తాసూ ।
బడ రఖవార రమాపతి జాసూ ॥ 718

తా॥ కాని ఆ కామకళలేవియు నారద మునీంద్రుని చలింపజేయ జాలక పోయినవి అప్పుడు పరమ పాపాత్ముడైన మన్మథుడు నారదమునీంద్రుని శాపమునకు గురి కావలసి వచ్చునేమోయని భయపడెను కాని, లక్ష్మీపతియైన శ్రీవిష్ణువు మన్మథునికి రక్షకుడుగా నుండెను కనుక నే హానియు జరుగలేదు

దో॥ సహిత సహాయ సభీత అతి మాని హారి మన మైన ।
గహేసి జాఇ మునిచరన తబ కహి సుఠి ఆరత బైన॥ 719

తా॥ మన్మథుడు పరిజన సమేతముగా మిగుల భయము జెంది మనంబున దాని నొక యోటమిగా భావించి, యతి దీనవచనములబ లుక్కుచు మునీంద్రుని పాదములను బట్టుకొనెను

చౌ॥ భయఉ న నారద మన కఛు రోషా ।
కహి ప్రియ బచన కామ పరితోషా ॥
నాఇ చరన సిరు ఆయసు పాఈ ।
గయఉ మదన తబ సహిత సహాఈ ॥ 720

తా॥ నారదు డేమాత్ర మాగ్రహము నొందలేదు అతి ప్రియ వచనములతో మన్మథు నోదార్చెను అప్పుడు మన్మథుడు మునీంద్రునకు ప్రణమిల్లి, తన పరిజనముతో బాటు వెనుకకు మరలెను

చౌ॥ ముని సుసీలతా ఆపని కరనీ ।
సురపతి సభాఁ జాఇ సబ బరనీ ॥
సుని సబకేఁ మన అచరజు ఆవా ।
మునిహి ప్రసంసి హరిహి సిరు నావా ॥ 721

తా॥ మన్మథుడు ఇంద్రసభకుబోయి నారదమునీంద్రుని సౌశీల్యమును గూర్చిచెప్పి, తాను తపమును భంగపఱచుటకు చేసినయత్నమును దెల్పి సభాసదుల నాశ్చర్యచకితులను గావించెను నారదమునీంద్రుని బహువిధములుగా ప్రశంసించుచు శ్రీహరికి ప్రణమిల్లెను

చౌ॥ తబ నారద గవనే సివ పాహీఁ ।
జితా కామ అహమితి మన మాహీఁ ॥
మార చరిత సంకరహి సునాఏ ।
అతిప్రియ జాని మహేస సిఖాఏ ॥ 722

తా॥ అఖండ తపస్సంపన్నుడై, నారదమునీంద్రుడు ప్రథమమున నీశ్వరుని దర్శించుటకై కైలాసమునకుబోయెను మన్మథుని జయించితినెడి యహంకార మధికముగా నారదు నావరించి యుండెను ఈశ్వరుని దర్శించి, మన్మథు డే విధముగ తపోభంగ మొనరించినదియు జెప్పెను మహాదేవుడు నారదు నత్యంతప్రీతి పాత్రునిగా భావించి యీ విధముగ సలహా ఇచ్చెను

చౌ॥ బార బార బినవఉఁముని తోహీ ।
జిమి యహ కథా సునాయహు మోహీ ॥
తిమి జని హరిహి సునాఏహు కబహూఁ ।
చలేహుఁ ప్రసంగ దురాఏహు తబహూఁ ॥ 723

తా॥ ఓ మునీశ్వరా, నేను మాటిమాటికి నిన్నర్థించి చెప్పిన నా మాటను నిరాకరింపకుము ఇప్పుడు నీవు నాకు వినిపించిన మన్మథగాథ శ్రీహరికిమాత్రము చెప్పకుము ఒక వేళ ఈ ప్రసక్తి వచ్చినను సరే, యీ విషయమును మాత్రము తెల్పకుము

దో॥ సంభు దీన్హ ఉపదేస హిత నహిఁ నారదహి సోహాన ।
భరద్వాజ కౌతుక సునహు హరి ఇచ్ఛా బలవాన ॥ 724

తా॥ ఈశ్వరుడు చేసిన హితబోధ నారదున కెంతమాత్రము రుచింపలేదు ఓ భరద్వాజా, మరల నారదునకు జరిగిన విధివైపరీత్యమును గూర్చివినుము హరియిచ్ఛ బలపత్తరమైనది గదా

చౌ॥ రామ కీన్హ చాహహిఁ సోఇ హోఈ ।
కరై అన్యథా అస నహిఁ కోఈ ॥
సంభు బచనముని మన నహిఁ భాఏ ।
తబ బిరంచి కే లోక సిధాఏ ॥ 725

తా॥ శ్రీరామచంద్రు డేమిచేయ సంకల్పించునో యది జరిగియే తీరును దానికి విరుద్ధముగ నెవ్వరును ఎదచుకొనలేరు శివుని హితబోధ రుచింపనందున నారదమునీంద్రుడు కైలాసమునుండి బ్రహ్మలోకమునకు బోయెను

చౌ॥ ఏక బార కరతల బర బీనా ।
గావత హరి గున గాన ప్రబీనా ॥
ఛీరసింధు గవనే మునినాథా ।
జహఁ బస శ్రీనివాస శ్రుతిమాథా ॥ 726

తా॥ ఒకసారి గానవిద్యయందు నిపుణుడైన నారదమునీంద్రుడు సుందరమైన వీణను చేతగైకొని, హరినామ సంకీర్తనము జేయుచు క్షీరసాగరమునకు బోయెను

ఆ సమయమున వేదాంతతత్త్వము మూర్తీభవించిన శ్రీనివాసుడు—శ్రీమన్నారాయణుడు శేష తల్పమున బరుండి యుండెను

చౌ॥ హరషి మిలే ఉఠి రమానికేతా ।
బైఠే ఆసన రిషిహి సమేతా ॥
బోలే బిహసి చరాచర రాయా ।
బహుతే దినన కీన్హి ముని దాయా ॥ 727

తా॥ నారదుని గాంచినంతనే లక్ష్మీపతి లేచి, యమితానందముతో మునికెదురేగి సత్కరించి యుచితాసనముపై గూర్చుండ బెట్టెను ఋషితో పాటు తాను నొక యాసనముపై గూర్చుండి, చరాచరమునకు ప్రభువైన శ్రీహరి దరహాసవదనముతో నిట్లనియె —

"మునీశ్వరా, నీవు బహుకాలమున కిచటి కేతెంచితివి "

చౌ॥ కామ చరిత నారద సబ భాషే ।
జద్యపి ప్రథమ బరజి సివఁ రాఖే ॥
అతి ప్రచండ రఘుపతి కై మాయా ।
జేహి న మోహ అస కో జగ జాయా ॥ 728

తా॥ అని విష్ణుదేవుఁడనిన విని నారద మునీంద్రుడు హర్షించి, మన్మథుడు తన తపమును భంగ పఱచిన విధానమును గూర్చి, విస్తారముగ శ్రీహరికి జెప్పెను మన్మథ చరిత్రమును విష్ణుభగవానునికి మాత్రము చెప్పకుము అన్న శంకరుని హితోక్తులను గూడ మఱచి, నారదు డహంకారపూరితుడై, తన గొప్పతనమును గూర్చి తానే ప్రశంసించుకొనెను

ఇది శ్రీరఘునాథుని మాయగాక యింకేమన వచ్చును? శ్రీరామచంద్రుడు కల్పించు మాయ చాల బలవత్తరమైనది ప్రబలమైనది ఆ మాయకు లోబడని వారీ ప్రపంచములో నెవరున్నారు?

వి॥ ఎంతటి తపస్సంపన్నులైనను కాలకర్మవశమున శ్రీవారి మాయకు వశీభూతు లగుచుందురని శ్రీవారు వచించిరి "లోకవత్తు లీలాకైవల్యం" "క్రీడావాన్స్వఖిలం జగత్" "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" అను శ్రుతిస్మృతుల భావములిందు గోచరమగుచున్నవి

దో॥ రూఖ బదన కరి బచన మృదు బోలే శ్రీభగవాన ।
తుమ్హరే సుమిరన తేఁ మిటహిఁ మోహ మార మద మాన॥729

తా॥ నారదుని పలుకులను విని విష్ణుదేవుడు మృదుమధురముగ నిట్లనెను-మునీశ్వరా, నిన్ను స్మరణ చేసిన మాత్రమున, నితరులకు గలిగిన కామ, క్రోధ మోహ, మద, మాత్సర్యములు పటాపంచలగును

చౌ॥ సును ముని మోహ హోఇ మన తాకేఁ ।
గ్యాన బిరాగ హృదయ నహి జాకేఁ ॥
బ్రహ్మచరజ బ్రత రత మతిధీరా ।
తుమ్హహి కి కరఇ మనోభవ పీరా ॥ 730

తా॥ మునీంద్రా, మోహమునకు వశీభూతుడైనవాని హృదయమున జ్ఞాన వైరాగ్యములకు తావుండునా? నీవు బ్రహ్మచర్యవ్రత తత్పరుడవు వివేకవంతుడవు మన్మథుడు విలాస పురుషుడు అఖండతేజస్సంపన్నుడవైన నిన్ను మన్మథుడు జయింప గలుగునా ?

చౌ॥ నారద కహేఉ సహిత అభిమానా ।
కృపా తుమ్హారి సకల భగవానా ॥
కరునానిధి మన దీఖ బిచారీ ।
ఉర అంకురేఉ గరబ తరు భారీ ॥ 731

తా॥ అని శ్రీమన్నారాయణు డనిన విని, నారదు డహంకార పూరితుడై యిట్లనెను—

విష్ణుభగవానుడా ఇదంతయు నీ కృపయే లేకున్న శృంగారమున కాటపట్టయిన మన్మథుని జయించుట శక్యమా ?

అనిన విని విష్ణుభగవానుడు మనంబునం దీ విధముగ తలపోసెను "వీని మనస్సున గర్వమను భూరి వృక్షాంకురము మొలకెత్తినది (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ బేగి సో మైఁ డారిహఉఁ ఉఖారీ ।
పన హమార సేవక హితకారీ ॥
ముని కర హిత మమ కౌతుక హోఈ ।
అవసి ఉపాయ కరబి మైఁ సోఈ॥ 732

తా॥ వృక్షమును వేరుతో పెకలించు చందంబున నారదుని అజ్ఞానమునం తయు నిర్మూలము జేసెదను భక్తులను కాపాడుట నా కర్తవ్యము గదా। నారదుని యహంకారము తొలగు నుపాయము నిప్పుడే చేసెదను అది మునీంద్రు నకు గూడ శ్రేయోదాయకమే నేనిట్లు చేయుట వలన నారదునకు జ్ఞాన ముత్ప న్నమగును నాకు క్రీడ లభించును ”

వి॥ భగవానుడు విలాసార్థము ప్రపంచమును క్రీడావస్తువుగా సృష్టించు కొనినాడు బొమ్మలాటలోని బొమ్మల కదలికలన్నియు సూత్రధారుని ఇష్టానుసారము వానికి వినోదమును, ఉత్సాహమును కలిగించు చుండును అటులనే మన జీవితరూపమైన జగన్నాటకము జగన్నాటక సూత్రధారుడైన శ్రీహరికి ఇష్టప్రాయమై వినోదమునే కలిగించు చుండునన్న భావము ఇందు స్ఫురింపజేయుచున్నారు శ్రీ తులసీదాసస్వామి “పశుపతీ! శంకరా! సమస్త ప్రపంచమును క్రీడావస్తువుగా సృజించు కొనుచున్నావు” ‘క్రీడార్థం సృజసి పపంచమఖిలం’ అన్న శ్రీ శంకరాచార్య సూక్తి యిట అను సంధేయము

చౌ॥ తబ నారద హరి పద సిర నాఈ।
చలే హృదయఁ అహమితి అధికాఈ॥
శ్రీపతి నిజ మాయా తబ ప్రేరీ।
సునహు కఠిన కరనీ తేహి కేరీ॥ 733

తా॥ అట్టితటి నారదుడు శ్రీమన్నారాయణుని పాదపద్మములకు నమస్కరించి వెడలెను లక్ష్మీపతియు భగవానుడైన శ్రీహరి మాయా ప్రభావమువలన నార దుని యహంకారము పెంపొందెను అప్పుడు నారదునకు గలిగిన యిడుమలను గూర్చి వినుడని శ్రీతులసీదాసు మనల నాదేశించుచున్నాడు

## విశ్వమోహినీ స్వయంవరము

దో॥ బిరచేఉ మగ మహుఁ నగర తేహిఁ సత జోజన బిస్తార ।
శ్రీనివాసపుర తేఁ అధిక రచనా బిబిధ ప్రకార ॥ 734

తా॥ శ్రీహరి తనమాయచే గొప్పనగరమును నిర్మాణము గావించెను ఆ నగరము శతయోజన విస్తారమైది ఆ నగరము చిత్రవిచిత్రములైన యలంకారములతో గూడి శ్రీనివాసుని వైకుంఠమున కన్న సుందరాతి సుందరమై యొప్పారుచుండెను

చౌ॥ బసహిఁ నగర సుందర నర నారీ ।
జను బహు మనసిజ రతి తనుధారీ ॥
తేహిఁ పుర బసఇ సీలనిధి రాజా ।
అగనిత హయ గయ సేన సమాజా ॥ 735

తా॥ ఆ వైభవోపేతమైన నగరములో నివసించు యువతీ యువకు లత్యంత సుందరులు వారిని తిలకించిన రతీ మన్మథులే మానవ రూపములలో నున్నారేమో యన్న భ్రాంతి కలుగక మానదు

ఆ శ్రీహరి ప్రేరిత దివ్య నగరమును శీలనిధియను ప్రతిభావంతుడు పరిపాలించుచుండెను ఆ రాజు సకల సంపదలతో తులతూగుచుండెను అతనికి అసంఖ్యాకములైన రథ గజ, తురగములు, కాల్బలముండెను

చౌ॥ సత సురేస సమ బిభవ బిలాసా ।
రూప తేజ బల నీతి నివాసా ॥
బిస్వమోహనీ తాసు కుమారీ ।
శ్రీ బిమోహ జిసు రూపు నిహారీ ॥ 736

తా॥ అతని వైభవము, విలాసము ఇంద్రునితో సమానమైనది అంతకు మించి రూపతేజో పరాక్రమవంతుడు నీతికి ఆటపట్టయిన వాడు అతని కత్యంత రూపవతి విశ్వమోహినియన్న నామధేయము గల పుత్రిక యుండెను

ఆమె సౌందర్యమును గాంచినచో లక్ష్మీదేవియే మోహించును అతి శయ రూపలావణ్యములతో విరాజిల్లుచుండినది విశ్వమోహాని

చౌ॥ సోఖ హరి మాయా సబ గున ఖానీ ।
సోభా తాసు కి జాఇ బఖానీ ॥
కరఇ స్వయంబర సో నృపబాలా ।
ఆఏ తహఁ అగనిత మహిపాలా ॥ 737

తా॥ శ్రీహరిమాయచే నుత్పన్నమైన విశ్వమోహాని సద్గుణరాశి ఆ రూప లావణ్యములను వర్ణింప తరమా। ఆ రాజకుమారి స్వయంవరమున తన కను రూపుడగు వరు నెన్నుకొనుట కియ్యకొనగా రూపతేజోవంతులైన రాజకుమారు లెందరో యచటి కేతెంచిరి

చౌ॥ ముని కౌతుకీ నగర తేహిఁ గయఊ ।
పురబాసిన్హ సబ పూచత భయఊ ॥
సుని సబ చరిత భూపగృహఁ ఆఏ ।
కరి పూజా నృప ముని బైఠాఏ ॥ 738

తా॥ పరిహాస పూరితుడైన నారదమునీంద్రు డా నగరములోనికి జొచ్చెను నగరనివాసుల నా నగర విశేషములను గూర్చి యడిగెను వారు విశ్వమోహాని స్వయంవరము, ఇత్యాది విషయములను గూర్చి నారదునకు జెప్పిరి అన్ని విష యములను సమగ్రముగా దెలిసుకొన్నవాడై నారదుడు రాజభవనమునకు విచ్చేసెను రాజు మునిని సత్కరించి యుచితాసన మొసగెను

దో॥ ఆని దేఖాఈ నారదహి భూపతి రాజకుమారి ।
కహహు నాథ గున దోష సబ ఏహి కే హృదయఁ బిచారి॥ 739

తా॥ తదుపరి సద్గుణరాశియైన విశ్వమోహినిని బిలుచుకొనివచ్చి నారదు నకు నమస్కరింపజేసి యిట్లనెను- ఓ మునీంద్రా, మీరు బాగుగా నాలోచించి యీ కన్యక యొక్క గుణదోషములను జెప్పుడు'

చౌ॥ దేఖి రూపముని బిరతి బిసారీ
బడీ బార లగి రహే నిహారీ ।
లచ్ఛన తాసు బిలోకి భులానే ।
హృదయఁ హరష నహిఁ ప్రగట బఖానే ॥ 740

తా॥ ఆ రాజకుమారి సౌందర్యమును గాంచినోడనే మునీంద్రుడు తన వైరాగ్యమును మరచెను బహుకాల మామెసుఖపర్చస్సును తిలకించుచు ముగ్ధుడాయెను తన్ను తానే మరచిపోయెను అంత పరవశుడై ఆ రాజకుమారి సోయగమును మనంబున ప్రశంసించెను కాని ఆ శుభ లక్షణములను బాహ్యముగ ప్రకటింపడాయెను

చౌ॥ జో ఏహి బరఇ అమర సోఇ హోఈ ।
సమరభూమి తేహి జీత న కోఈ ॥
సేవహిఁ సకల చరాచర తాహీ ।
బరఇ సీలనిధి కన్యా జాహీ ॥ 741

తా॥ కాని ఆమె రూపలావణ్యాతిశయములను గూర్చి మనంబున నిట్లు తలపోసెను–"ఈమె నెవడు పరిణయమాడునో వా డమరుడగును రణరంగమునందు వాని నెవ్వరును జయింపలేరు ఇది నిశ్చయము ఈ శీలనిధి పుత్రికయైన విశ్వమోహిని నెవ్వడు వివాహమాడునో వానికి చరాచర ప్రాణులన్నియు సేవచేయును "

చౌ॥ లచ్ఛన సబ బిచారి ఉర రాఖే ।
కఛుక బనాఇ భూప సన భాషే ॥
సుతా సులచ్ఛన కహి నృప పాహీఁ ।
నారద చలే సోచ మన మాహీఁ ॥ 742

తా॥ ఇట్లు సర్వలక్షణములను తన మనమున చింతించుకొనెను రాజుతో మాత్రము రాజకుమారి సర్వలక్షణసంపన్నయని యొక్క మాటలో జెప్పి నారదుడు సత్వరముగ వెడలిపోయెను అచ్చటి నుండి వెడలెనే కాని అతని మనస్సు పరిపరివిధముల పోయెను చింతాక్రాంతుడై యిట్లు తలపోయసాగెను
(ముందు దోహతో అన్వయము)

చౌ॥ కరౌఁ జాఇ సోఇ జతన బిచారీ ।
జేహి ప్రకార మోహి బరై కుమారీ ॥
జప తప కచు న హోఇ తేహి కాలా ।
హే బిధి మిలఇ కవన బిధి బాలా ॥ 743

తా॥ "నేనిప్పుడే పోయి ఆ కన్యక నన్ను వరించు నుపాయమెద్దైన జేసె దను ఈ సమయమున జప, తపములతో నిమిత్త మెంత మాత్రములేదు

హే విధాతా, నా కా కన్య యే విధముగ లభించును ? (ఇందు దోహాతో అన్వయము)

దో॥ ఏహి అవసర చాహిఅ పరమ సోభా రూప బిసాల ।
జో బిలోకి రీఝై కుఅఁరి తబ మేలై జయమాల ॥ 744

తా॥ ఈ సమయమున సుందరరూప మత్యంతా వశ్యకముగదా। రాజకుమారి నన్ను జూచి, నా యందు మోహపరవశయై జయమాలను (పుష్పమాల) వేయు నటువంటి సుందర రూప మిప్పు డత్యంతావశ్యకము

చౌ॥ హరి సన మాగౌఁ సుందరతాఈ ।
హోఇహి గహరు అతి భాఈ ॥
మోరేఁ హిత హరి సమ నహిఁ కోఊ ।
ఏహి అవసర సహాయ సోఇ హోఊ ॥ 745

తా॥ కనుక నన్ను సౌందర్యవంతునిగ జేయుమని భగవంతుని ప్రార్థించెదను ఈ స్థితి యందు సుందరరూప మత్యంతావశ్యకము గాన భగవానుని దరిజేరి ఆయన వర్ధించుట కించుకాలవ్యమగునేమో। నాకు హితము చేకూర్చు వాడు శ్రీహరి యొక్కడే గనుక ఆతడే నాకు సహాయకారి యగుగాక

చౌ॥ బహు బిధి బినయ కీన్హ తేహి కాలా ।
ప్రగటేఉ ప్రభు కౌతుకీ కృపాలా ॥
ప్రభు బిలోకి ముని నయన జుడానే ।
హోఇహి కాజు హిఏఁ హరషానే ॥ 746

తా॥ ఇష్టార్థమును బడయుటకై నారదమునీంద్రుడు శ్రీహరిని పెక్కు భంగుల ప్రార్థించెను అప్పుడు లీలామయుడు కృపాసాగరుడైన శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమాయెను కనువిందొనర్చు ఆ దివ్యమంగళస్వరూపమును గాంచినంతనే నారదుని నయనారవిందములు చందనము వలె అతిశీతలము లాయెను

అష్టార్థసిద్ధి యగుననెడు గట్టి నమ్మిక మతని నావరింపగా నారదు డానంద పరవశుడాయెను

చౌ॥ అతి ఆరతి కహి కథా సునాఈ ।
కరహు కృపా కరి హోహు సహాఈ ॥
ఆపన రూప దేహు ప్రభు మోహీ ।
ఆన భాఁతి నహిఁ పావౌఁ ఓహీ ॥ 747

తా॥ నారదుడార్తుడై జరిగిన వృత్తాంతమంతయు శ్రీహరికి వినయముతో విన్నవించుకొని తన యభిలాష నెరవేర్పుమని వేడుచు శ్రీహరి నిట్లు సాహాయ్య మర్థించెను "ఓ ప్రభూ ! దీనవత్సలా ! నీ సుందరరూపమును నా కొసగుము సుందరరూపము లేనిదే రాజకన్యయైన విశ్వమోహినిని పొందుట దుర్లభము (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ జేహి బిధి నాథ హోఇ హిత మోరా ।
కరహు సో బేగి దాస మైఁ తోరా ॥
నిజ మాయా బల దేఖి బిసాలా ।
హియఁ హఁసి బోలే దీనదయాలా ॥ 748

తా॥ అట్లుగాకున్న నాకేది హితమని నీకు దోచునో అట్లొనర్పుము నేను నీ దాసుడను" అని యతి దీనముగా ప్రార్థించెను నారదుని ప్రవర్తన క్షణములో నీ విధముగ మారుట తన మాయా ప్రభావమని తలచినవాడై దీనదయాళుడైన శ్రీమన్నారాయణుడు మనంబున మురియుచు నగవులు నవ్వుచు నిట్లనియె —

(ముందు దోహాతో అన్వయము)

దో॥ జేహి బిధి హోఇహి పరమ హిత నారద సునహు తుమ్హార।
సోఇ హమ కరబ న ఆన కఛు బచన న మృషా హమార॥ 749

తా॥ "నారదా, నీకేది పరమహితమో దానిని గూర్చి చెప్పుము, అవశ్యమొనరింతును నేను సత్యవ్రతుడను కాన నా వచనము లెన్నటికి ననృతములు కానేరవు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ కుపథ మాగ రుజ బ్యాకుల రోగీ।
బైద న దేఇ సునహు ముని జోగీ॥
ఏహి బిధి హిత తుమ్హార మైఁ ఠయఊ।
కహి అస అంతరహిత ప్రభు భయఊ॥ 750

తా॥ ఓ నారదమునీంద్రా, శ్రద్ధతో నాలకింపుము వ్యాధిగ్రస్తుడై ప్రబల రోగముచేత పీడింపబడి వ్యాకులతనొందిన రోగి అపథ్యముచేయ నిచ్ఛగించినను వైద్యుడు దానిని నిరాకరించును నీకేది హితమో దానిని దృఢముగ నిశ్చయించితి" నని నుడువుచు శ్రీమన్నారాయణు డంతర్ధాన మాయెను

వి॥ "ఏహి బిధి హిత తుమ్హార మైఁ ఠయఊ" అనగా "ఏది హితమో, దానిని నేను నిశ్చయించితిని" అ మాటలో తపో నిమగ్నుడవైన నీకీ అల్పమైన కోర్కె తగదని శ్రీహరి నారదుని హెచ్చరించుచున్నాడు భగవానుడు భక్తుని హితము గోరి అఖండమైన జ్ఞానమొసగినను వైద్యుని సలహా పాటింపక అపథ్యము జేయు రోగి చందంబున తాత్కాలికముగ పతనము బొందుట కద్దన్న యొక మహత్తర భావమును కవి యిందు వ్యక్తపరచినాడు

చౌ॥ మాయా బిబస భఏ ముని మూఢా।
సముఝీ నహిఁ హరి గిరా నిగూఢా॥
గవనే తురత తహాఁ రిషిరాఈ।
జహాఁ స్వయంబర భూమి బనాఈ॥ 751

**తా॥ భగవానుని మాయకు వశీభూతుడైన కారణమున నారదుడు మూఢు డాయెను భగవానుని స్పష్టవాణినిగూడ దెలిసికొనలేకపోయెను ఋషివర్యుడైన నారదుడు స్వయంవర మేర్పాటయిన స్థానమునకు వెడలిపోయెను**

వి॥ శ్రీహరి మాయ బలవత్తరమైనది మాయాతీతుడు కావలయు నన్న శ్రీహరి కృప కలుగవలయును ఈ భావమునే శ్రీ తులసీదాసు 'వినయ పత్రిక' యను గ్రంథమున విశదముగ నిట్లు వ్యక్తపరచినారు

మాధవ! అసి తుమ్హారి యహ మాయా ।
కరి ఉపాయ పచి మరియ, తరియ నహి,
జబ లగి కరహు న దాయా ॥మాధవ॥
సునియ, గునియ, సముఝియ, సముఝాయియ,
దసా హృదయ నహి ఆవై
జేహి అనుభవ బిను మోహజనిత భవ
దారుణ బిపతి సతావై ॥మాధవ॥'

'మాధవా! నీమాయ ప్రబలమైనది దానిని దాటుటకు ఎన్ని ప్రయత్నములు చేసినను నీ దయ లేకపోయినచో నిరుపయోగ మగును ఎంత వినినను, విచారించినను, తెలిసికొన్నను, ఇతరులకు తెలియ జేసినను నీ యీ మాయయొక్క యథార్థ రహస్యమును దెలిసికొనలేక పోయినచో వాస్తవిక రహస్యమును దెలిసికొనలేము వాస్తవిక రహస్యము నుపలబ్ధి పొందనిచో ఈ మోహ జనితమైన జగత్తు మహా విపత్తులతో గూడి దుఃఖభాజనము గావించుచునే యుండును

'మాయా బిబస భయేముని మూఢ'

అని శ్రీ తులసీదాసు ఈ చౌపాయి (శ్లోకము) యందు జెప్పి నారు అహంకార పూరితుడై శ్రీహరి మాయకు లోబడిన కారణమున నారదుడు మూఢుడాయెను ఎంతటి యోగీంద్రులు గాని మాయకు

వశీభూతులగుదురేని వారి జపతపోనుష్ఠానములెల్లను బూడిదిలో పోసిన పన్నీరగును కనుక మాయ యెంత బలవత్తరమైనదో దానిని దాటుటకు శ్రీహరి దయ యెంత ముఖ్యమో, శ్రీ తులసీదాసు అత్యంతవిపులముగ చిన్నకథలలో జెప్పుచు వాస్తవిక సత్యములను నిరూపించినారు

చౌ॥ నిజ నిజ ఆసన బైఠే రాజా ।
బహు బనావ కరి సహిత సమాజా ॥
ముని మన హరష రూప అతి మోరేం ।
మోహి తజి ఆనహి బరిహిం న భోరేం ॥ 752

తా॥ ఆ స్వయంవరమునకు దేశ దేశములనుండి రాజులు విచ్చేయుండిరి పరివారసమేతముగ వారు తమకొసగబడిన యు న్నతాసనములపై ఆసీనులైరి శ్రీహరి కటాక్షమువలన తన సౌందర్య మతిశయించెనని తలచి నారదమునీం ద్రుడు తనలో తానే మురిసిపోవుచుండెను వివాహాకాంక్ష ప్రబలినందున తన్ను దప్ప రాజకన్యయైన విశ్వమోహిని ఇంకెవరిని వరింపదన్న దృఢనిశ్చయము కలవా డాయెను

చౌ॥ ముని హిత కారన కృపానిధానా ।
దీన్హ కురూప న జాఇ బఖానా ॥
సో చరిత్ర లఖి కాహుం న పావా ।
నారద జాని సబహిం సిర నావా ॥ 753

తా॥ కృపాసాగరుడైన శ్రీహరి మునిహితమును గోరియే కురూప మొస గెను దానిని వర్ణింప సాధ్యము కాదు కాని దీనిని గురించి యెవ్వరికిని దెలియదు అందరును నారదుడనియే భావించి ప్రణమిల్లిరి ఏలన బాహ్యరూప మున నారదుడుగానే కనపడు చుండెను

దో॥ రహే తహాం దుఇ రుద్ర గన తే జానహిం సబ భేఉ ।
బిప్రబేష దేఖత ఫిరహిం పరమ కౌతుకీ తేఉ ॥ 754

తా॥ అప్పటికి ఇరువురు శివగణములు బ్రాహ్మణవేషధారులై వచ్చియుండిరి ఈ భేదము వారికి దెలిసియుండెను బ్రాహ్మణవేషములో, జరుగబోవు లీలావిశేషములను జూచుచు తిరుగుచుండిరి వారు విలాసవంతులై ఆనందముగ నుండిరి

చౌ॥ జేహి సమాజ బైఠే ముని జాఈ।
హృదయఁ రూప అహమితి అధికాఈ॥
తహఁ బైఠే మహేస గన దోఊ।
బిప్రబేష గతి లఖఇ న కోఊ॥ 755

తా॥ అత్యంత సౌందర్యము గలదన్న యహంకారము మావరింపగా నారదుడు శివగణములు గూర్చున్న పంక్తియందాసీనుడాయెను బ్రాహ్మణవేషధారులైన శివగణముల నెల్లరు బ్రాహ్మణులుగ భావించిరి

చౌ॥ కరహిఁ కూటి నారదహి సునాఈ।
నీకి దీన్హి హరి సుందరతాఈ॥
రీఝహి రాజకుఅఁరి ఛబి దేఖీ।
ఇన్హహి బరిహి హరి జాని బిసేషీ॥ 756

తా॥ ఆ శివగణములు నారదునికి వినుపించునట్లు విధముగ వ్యంగ్యవచనములను పరిస్పరము చెప్పుకొనుచుండిరి

"భగవంతుడు వీనికి మంచిరూపమునే ప్రసాదించినాడు వీని రూపమును జూచినచో రాజకుమారి నిజముగా ప్రేమానురక్త యగును వానిరమనుకొని ముఖ్యమైన పద్ధతిలోనే వీనిని వరించును సుమా।"

చౌ॥ మునిహి మోహ మన హాథ పరాఏఁ।
హఁసహిఁ సంభు గన అతి సచు పాఏఁ॥
జదపి సునహిఁ ముని అటపటి బానీ।
సముఝి న పరఇ బుద్ధి భ్రమ సానీ॥ 757

తా॥ నారదమునీంద్రునకు మోహమావరించినది గనుక, వాని మనస్సు మాయకు వశీభూతమైనది. శివగణములు నారదుని పెక్కు భంగుల పరిహసించుచునే యుండిరి. అట్లున్నను వారాడుకొను వ్యంగ్యవచనములను వినుచునే యుండెను. మునీంద్రుడు సరిగా అర్థము చేసికొనలేక అవి ప్రశంసావచనములుగానే భావించెను (అజ్ఞాన మావరించినపుడు ఎంతటి వివేకవంతుడైనను విచక్షణాజ్ఞానమును కోల్పోవును గదా! ఆ స్థితియే శ్రీహరి మాయాప్రభావమువలన నారదునకు గలిగినది)

చౌ॥ కాహుఁ న లఖా సో చరిత బిసేషీ ।
సో సరూప నృపకన్యాఁ దేఖా ॥
మర్కట బదన భయంకర దేహీ ।
దేఖత హృదయఁ క్రోధ భా తేహీ ॥ 758

తా॥ కేవలము రాజకన్యకు తప్ప ఈ విశేషచరిత్రము గూర్చి యెవ్వరికిని తెలియదాయెను. వానరముఖముతోను భయంకర శరీరముతోనున్న విచిత్రమైన నారదునిరూపమును గాంచిన రాజపుత్రికయైన విశ్వమోహిని హృదయమున క్రోధ ముత్పన్న మాయెను.

దో॥ సఖీఁ సంగ లై కుఅఁరి తబ చలి జను రాజమరాల ।
దేఖత ఫిరఇ మహీప సబ కర సరోజ జయమాల ॥ 759

తా॥ రాజకుమారియైన విశ్వమోహిని సర్వాభరణభూషితయై సఖులను వెంటనిడుకొని స్వయంవర మండపమునకు బోవుచున్నప్పుడు రాజహంస విహరించుచున్నదా యనునట్లుండెను. ఆమె కరకమలములలో జయమాలనిడికొని స్వయంవరమునకు విచ్చేసిన రాజులను పరిశీలించుచు బోయెను.

చౌ॥ జేహి దిసి బైఠే నారద ఫూలీ ।
సో దిసి తేహిఁ న బిలోకీ భూలీ ॥
పుని పుని ముని ఉకసహిఁ అకులాహీఁ ।
దేఖి దసా హర గన ముసుకాహీఁ ॥ 760

తా॥ నారదుడు రూపగర్వముతో ఠీవిగా ఆసీనుడైయుండెను విశ్వమోహిని నారదునివైపు పొరపాటుననైనను జూడలేదు నారదుడు తన్నువరించునేమో యన్న భ్రమచే మాటిమాటికిని మునివ్రేళ్ళమీద నిలబడుచు, ఆత్రపడుచుండెను నారదుని ఎకసుగాంచి శివగణములు తమలోతాము నవ్వుకొనిరి

చౌ॥ ధరి న్రుపతను తహఁ గయుఉ కృపాలా ।
కుఅఁరి హరషి మేలేఉ జయమాలా ॥
దులహిని లై గే లచ్ఛినివాసా ।
నృపసమాజ సబ భయుఉ నిరాసా ॥ 761

తా॥ కరుణాకరుడైన విష్ణుభగవానుడు రాజరూపమును ధరించి యచటికేతెంచెను రాజకుమారి శ్రీహరిని గాంచినంతనే సంతసిల్లి జయమాలను శ్రీహరి కంఠమున నలంకరించెను శ్రీనివాసుడు పెండ్లికుమార్తెయైన విశ్వమోహినిని తన వెంట దీసికొనిపోయెను వారి నిష్క్రమణము తర్వాత స్వయంవరమునకు విచ్చేసిన తదితర రాజులందరు నిరాశాపూరితులైరి

చౌ॥ ముని అతి బికల మోహఁమతి నారీ ।
మని గిరి గఈ ఛూటి జను గాఁఠీ ॥
తబ హర గన బోలే ముసుకాఈ ।
నిజ ముఖ ముకుర బిలోకహు జాఈ ॥ 762

తా॥ మోహవశమున మునీంద్రుని బుద్ధి కూడ భ్రమించెను రాజకుమారి శ్రీహరిని వెంబడించుటను జూచిన ముని చాల వికలుడాయెను పొదిగిన మణి పట్టును వీడి క్రిందికుజారిన చందంబున ఆ మునీంద్రుని స్థితి శోచనీయ మయ్యెను

మునీంద్రుడిటువంటి దీనస్థితియందు ఖిన్నవదనుడైయుండ శివగణములు ముసిముసినగవులతో నిట్లు పరిహసింప దొడగిరి

"దర్పణమునందు నీ ముఖమును జూచుకొనుము"

చౌ॥ అస కహి దోఉ భాగే భయఁ భారీ ।
బదన దీఖ ముని బారి నిహారీ ॥
బేషు బిలోకి క్రోధ అతి బాఢా ।
తిన్హహి సరాప దీన్హ అతి గాఢా ॥ 763

తా॥ అట్లు చెప్పుచు నిరువురును భయకించుచు పరుగిడిరి నారదుడు కొంతదూరముపోయి జలాశయమునందు తన ముఖమును జూచుకొనెను తన్ను తాను జూచుకొన్న తరువాత నింకను క్రోధ మధికమాయెను నారదుడు శివగణ ముల కిట్లు కఠోరమైన శాపమిదెను (ముందు దోహాతో అన్వయము)

దో॥ హోహు నిసాచర జాఇ తుమ్హ కపటీ పాపీ దోఉ ।
హఁసేహు హమహి సో లేహు ఫల బహురి హఁసేహు ముని
కోఉ ॥ 764

తా॥ మీరిరువురును కపటాత్ములు, దుష్కర్మయుతులు గనుక రాక్షసులై జన్మింపుడు నన్ను ఎరిహసించినందులకు తగిన ఫలమును పొందుడు దీనివలన నికమీదట ఏ మునిని పరిహాసింపగూడదన్న యొకానొక చక్కని గుణపాఠము మీరు నేర్చుకొందురు గాక

చౌ॥ పుని జల దీఖ రూప నిజ పావా ।
తదపి హృదయఁ సంతోష న ఆవా ॥
ఫరకత అధర కోప మన మాహీఁ ।
సపది చలే కమలాపతి పాహీఁ ॥ 765

తా॥ మునీంద్రుడు మరల తనరూపమును జలాశయమున జూచుకొనెను క్షణములో నతనికి తన నిజరూపము వచ్చెను కాని అందులకు నారదుడెంత మాత్రము సంతసింపలేదు క్రోధావేశ మెట్టిపడ, నారదుడు కమలాధిపతియైన శ్రీమన్నారాయణుని చేరజేరెను

చౌ॥ దేహఉఁ శాప కి మరిహఉఁ జాఈ ।
జగత మోరి ఉపహాస కరాఈ ॥
బీచహిఁ పంథ మిలే దనుజారీ ।
సంగ రమా సోఇ రాజకుమారీ ॥ 766

తా॥ మార్గమధ్యమున మునీంద్రు డిట్లు తలంచెను "నేను భగవానునకు శాపమొసగినచో నన్ను బహుశః ప్రాణములతో నుండనీయడేమో ? అట్లు చేయ

కున్న నాకు మనశ్శాంతి కలుగదు ఏలన జగత్తునందు నాకు కురూపము నిచ్చి నన్ను నవ్వులాటకు గురిచేసెను" అని వాపోవుచుండ దైత్యులకు శత్రువైన భగవానుడు మార్గమధ్యముననే నారదుని గలిసికొనెను శ్రీహరితోపాటు లక్ష్మీదేవి, విశ్వమోహిని - ఇరువురు నుండిరి

చౌ॥ బోలే మధుర బచన సురసాఈం ।
మును కహాం చలే బికల కీ నాఈం ॥
సునత బచన ఉపజా అతి క్రోధా ।
మాయా బస న రహా మన బోధా ॥ 767

తా॥ సమస్తదేవతల కారాధ్యదైవమైన శ్రీమన్నారాయణుడు మధురముగ నిట్లనెను "ఓ మునీంద్రా, చింతాక్రాంతుడవై దుఃఖించుచు నెక్కడికి వేగు చున్నావు?" శ్రీమన్నారాయణుని పలుకులు విన్నతోడనే నారదునకు కోపము వచ్చెను మాయకు వశీభూతుడై నందువలన మనంబున చైతన్యము కలుగలేదు

చౌ॥ పర సంపదా సకహు నహిం దేఖీ ।
తుమ్హారేం ఇరిషా కపట బిసేషీ ॥
మథత సింధు రుద్రహి బౌరాయహు ।
సురన్హ ప్రేరి బిష పాన కరాయహు ॥ 768

తా॥ నారదు డీ విధముగా శ్రీహరిని తూలనాడెను "నీవు ఈర్ష్యాపరుడవు, కపటాత్ముడవు కనుకనే నీవు పరసంపదనుజూచి ఓర్వలేకున్నావు అమృతమును బడయుటకై దేవతలు అసురులు కలసి క్షీరసముద్రమును మథనముచేయు సమయమున నీవు శివుని వెఱ్ఱివానిగా చేసితివి దేవతల నందులకు ప్రేరేపించి శివునిచే విషపానము చేయించితివి" (క్రింది దోహాతో అన్వయము)

వి॥ పరమజ్ఞానియైన నారదుడు కూడ అజ్ఞానమావరించుటచేత శివుడు గరళమును సేవించుట లోకకల్యాణార్థమని భావింపక విష్ణువే దేవతలను ప్రేరేచెననియు, వారి ప్రోత్సాహమువలన శివుడు వెఱ్ఱివాడై గరళమును సైతము అమృత ప్రాయముగ భావించి సేవించె

ననియు చెప్పుచు శ్రీహరిని తూలనాడెను శ్రీహరిమాయ మిగుల బలవత్తరమైనది శ్రీహరి కృపలేనిదే దానిదాటు వశము కాదన్న మహత్తరభావము నిందు కవి సూచించుచున్నాడు

దో॥ అసుర సురా బిష సంకరహి ఆపు రమా మని చారు ।
స్వారథ సాధక కుటిల తుమ్హ సదా కపట బ్యవహారు ॥ 769

తా॥ అసురులకు మధుపానమును, శంకరునికి గరళము నొసగి నీవు మాత్రము లక్ష్మిని, కౌస్తుభమణిని స్వీకరించితివి నీవు చాల టక్కరివి స్వార్థ పరాయణుడవు నీవు అహర్నిశలు కపటవ్యవహారమునే వాంఛించుచుందువు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ పరమ స్వతంత్ర న సిర పరకోఈ ।
భావఇ మనహి కరహు తుమ్హ సోఈ ॥
భలేహి మంద మందేహి భల కరహూ ।
బిసమయ హరష న హియఁ కచు ధరహూ ॥ 770

తా॥ నీవు పరమస్వతంత్రుడవు నీకన్న మించినవాఁడు లేడని విఱ్ఱవీగు చున్నావు కనుకనే నీ యిచ్ఛకు వచ్చినట్లు ప్రవర్తించుచున్నావు మంచిని చెడుగా, చెడును మంచిగా నొనరించుచున్నావు నీ హృదయమున హర్షవిషాదములు కేమాత్రము తావులేదు

చౌ॥ డహకి డహకి పరిచేహు సబ కాహూ ।
అతి అసంక మన సదా ఉఛాహూ ॥
కరమ సుభాసుభ తుమ్హహి న బాధా ।
అబ లగి తుమ్హహి న కాహూఁ సాధా ॥ 771

తా॥ అందరిని మోసగించి మోసగించి మోసగించుట అభ్యాసము చేసికొన్నావు నీవు నిర్భయుడవు నన్ను మోసగించిన కారణముననే నీవు ఉత్సాహ పూరితుడవై యున్నావు శుభాశుభాచరణలు నీ కేమాత్రము బాధను కలిగింపవు

పరికించి చూడ నీ వింతటికి ఎవరిని దాగుంటునినావు గనుక : (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ భలే భవన అబ బాయన దీన్హా ।
పావహుగే ఫల ఆపన కీన్హా ॥
బంచేహు మోహి జవని ధరి దేహా ।
సోఇ తను ధరహు శాప మమ ఏహా ॥ 772

తా॥ నావంటి వానిని రెచ్చగొట్టి నీ యిల్లు నిలుపుకొంటివి నీవు చేసిన దానికిదే ఫలమును పొందుము ఏ శరీరమునుదాల్చి నీవు నన్ను మోసగించితివో ఆ శరీరమునే పొందెదవు ఇదే నా శాపము

చౌ॥ కపి ఆకృతి తుమ్హ కీన్హి హమారీ ।
కరిహహిఁ కీస సహాయ తుమ్హారీ ।
మమ అపకార కీన్హ తుమ్హ భారీ ।
నారి బిరహఁ తుమ్హ హోబ దుఖారీ ॥ 773

తా॥ నీవు వానరరూపమును నాకు ప్రసాదించితివి కనుక మరుజన్మమున నీవు మానవుడై జన్మించినపుడు, వానరులే నీకు సహాయకారులగుదురు గాక : నే నే వనితను వాంఛించితినో ఆ వనితను నాకు లేకుండజేసి వియోగమును గూర్చితివి గనుక నీవు పత్నీవియోగదుఃఖముచే పీడింపబడుదువు గాక :"

దో॥ శాప సీస ధరి హరషి హియ ప్రభు బహు బినతీ కీన్హి ।
నిజ మాయా కై ప్రబలతా కరషి కృపానిధి లీన్హి ॥ 774

తా॥ శాపమును శిరోధార్యము గావించుకొని హర్షించిన శ్రీహరి నారదుని పెక్కుభంగుల స్తుతించెను తదుపరి కరుణాసముద్రుడైన శ్రీహరి తన మాయా ప్రభావము నుపసంహరించుకొనెను

చౌ॥ జబ హరి మాయా దూరి నివారీ ।
నహిఁ తహఁ రమా న రాజకుమారీ ॥
తబ ముని అతి సభీత హరి చరనా ।
గహే పాహి ప్రనతారతి హరనా ॥ 775

తా॥ భగవానుడైన శ్రీహరి యెపుడు ఆ సమాయను దూరము జేసికొనెనో అప్పుడక్కడ లక్ష్మియు విశ్వమోహిని ఎవ్వరును లేకపోయిరి అప్పుడత్యంత భయభీతుడై నారదుడు శ్రీహరి పాదారవిందములను పట్టుకొని యిట్లనెను — "హే శరణాగతవత్సలా! న్ను రక్షింపుము (ముందు దోహాలో అన్వయము)

చౌ॥ మృషా హోఉ మమ శాప కృపాలా ।
మమ ఇచ్ఛా కహ దీనదయాలా ॥
మైం దుర్బచన కహే బహు తేరే ।
కహ ముని పాప మిటిహిం కిమి మేరే ॥ 776

తా॥ హే కృపాసాగరా! నా శాపము మిథ్య కానేరదు" అనెను అప్పుడు దీనజన సంరక్షకుడైన భగవాను డీవిధముగా నుడివెను "అంతయు నా ఇచ్ఛవలననే జరిగినది ఇందు నీ అపరాధ మేమియులేదు" అప్పుడ ముని స్వామీ! నేను మిమ్మనరాని మాటలంటినే; నా పాపమునకు పరిహారమేమి? అనెను

చౌ॥ జపహు జాఇ సంకర సత నామా ।
హోఇహి హృదయం తురత బిశ్రామా ॥
కోఉ నహిం సమాన ప్రియ మోరేం ।
అసి పరతీతి తజహు జని భోరేం ॥ 777

తా॥ అప్పుడు భగవానుడైన శ్రీహరి నారదునియెడ మిక్కిలి దయతో నిట్లనెను "నారదా! నీవు శంకర శతనామావళిని జపింపుము దానివలన నీకు మనశ్శాంతి కలుగును శివునితో సమానమైన దైవ మింకెవ్వరును లేరు ఈ విశ్వాసము నెట్టి స్థితిలో గూడ వీడకుము

చౌ॥ జేహి పర కృపా న కరహిం పురారీ ।
సో న పావ ముని భగతి హమారీ ॥
అస ఉర ధరి మహి బిచరహు జాఈ ।
అబ న తుమ్హహి మాయా నిఅరాఈ ॥ 778

తా॥ ఓ మునీశ్వరా, పురారి యెవరియందు కృపజూపడో వారు నా యందలి భక్తిని పొందలేరు ఈ విధమైన దృఢ నిశ్చయముతో ధరాతలమున సంచరింపుము అప్పుడు నీవు మాయ కతీతుడ వగుదువు"

దో॥ బహుబిధి మునిహి ప్రబోధి ప్రభు తబ భఏ అంతరధాన ।
సత్యలోక నారద చలే కరత రామ గున గాన ॥ 779

తా॥ అని పెక్కుభంగుల మునికి ప్రబోధించి, భగవానుడంతర్ధాని మాయెను నారదుడు హరినామ సంకీర్తనము జేయుచు సత్యలోకమునకు బోయెను

చౌ॥ హర గన మునిహి జాత పథ దేఖీ ।
బిగత మోహ మన హరష బిసేషీ ॥
అతి సభీత నారద పహిఁ ఆఏ ।
గహి పద ఆరత బచన సునాఏ ॥ 780

తా॥ మోహరహితుడై నిత్యానంద పరిపూర్ణుడైన నారదమునీంద్రుడు డరు దెంచుటను జూచి శివగణములు మిగుల భయకంపితులై మునీంద్రుని పాదపద్మ ములకు నమస్కారమొనరించి, శరణు వేడుచు దీనాతి దీనముగా నిట్లు నుడివిరి– (ముందు దోహతో అన్వయము)

చౌ॥ హర గన హమ న బిప్ర మునిరాయా ।
బడ అపరాధ కీన్హ ఫల పాయా ॥
శాప అనుగ్రహ కరహు కృపాలా ।
బోలే నారద దీనదయాలా ॥ 781

తా॥ "ఓ మునిరాజా! మేము బ్రాహ్మణులము కాము, శివగణములము మేము మీయెడ నపరాధ మొనర్చితిమి దాని ఫలమును బొందితిమి కృపాసాగరా ఇప్పుడు శాప విమోచన మేదో సెలవిండు" అప్పుడు దీనజనసంరక్షకుడై నారదుఁ డిట్లనెను—

చౌ॥ నిసిచర జాఇ హోహు తుమ్హ దోఊ ।
బైభవ బిపుల తేజ బల హోఊ ॥
భుజబల బిస్వ జితబ తుమ్హ జహిఆ ।
ధరిహహి బిష్ను మనుజ తను తహిఆ ॥ 782

తా॥ "మీ రిరువురు నా శాపానుసారము రాక్షసుల గండు మీకు ఐశ్వ ర్యము, తేజము, బలము ప్రాప్తించును మీ భుజ బల పరాక్రమముచే ఈ విశ్వ మంతట జయభేరి మ్రోగించెదరు అప్పుడు శ్రీమన్నారాయణుడు మానవా వతార మెత్తును (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ సమర మరన హరి హాథ తుమ్హారా ।
హోఇహహు ముకుత న పుని సంసారా ॥
చలే జుగల ముని పద సిర నాఈ ।
భఏ నిసాచర కాలహి పాఈ ॥ 783

తా॥ యుద్ధమునందు శ్రీహరి చేతులలో మీకు మృత్యువు కలుగును మీరు ముక్తిని బొందెదరు మరల మీరు జననమరణ చక్రమున బడరు "

ఇరువురును ముని పాద పద్మములకు నమస్కరించి వెడలి పోయిరి సమయ మేతెంచినతోడనే రాక్షసులైరి

దో॥ ఏక కలప ఏహి హేతు ప్రభు లీన్హ మనుజ అవతార ।
సుర రంజన సజ్జన సుఖద హరి భంజన భుబి భార ॥ 784

తా॥ దేవతలను ప్రసన్నము జేయువాడను, సజ్జనులకు సుఖమునిచ్చు వాడును, భూభారమును హరించువాడైన విష్ణుభగవాను ఒకయుగమున ఈ కార ణముచే మానవావతార మెత్తెను

చౌ॥ ఏహి బిధి జనమ కరమ హరి కేరే ।
సుందర సుఖద బిచిత్ర ఘనేరే ॥
కలప కలప ప్రతి ప్రభు అవతరహీం ।
చారు చరిత నానా బిధి కరహీం ॥ 785

తా॥ ఈ విధముగ భగవానుని అనేకములైన సుందరసుఖదాయక అలౌకిక జన్మకర్మము లెన్నియో గలవు ప్రత్యేకయుగములో భగవాను డవతారమెత్తి నపుడు నానాప్రకారములైన లీలలను జేయు చుండెను కనుకనే అతడు లీలా మానుషవేషదారి

చౌ॥ తబ తబ కథా మునీసన్హ గాఈ ।
పరమ పునీత ప్రబంధ బనాఈ ॥
బిబిధ ప్రసంగ అనూప బఖానే ।
కరహిం న సుని ఆచరజు సయానే ॥ 786

తా॥ అప్పుడప్పుడు మునీశ్వరులు పరమపవిత్రమైన కావ్యరచనను గావించి ఆ భగవత్కథలను సంకీర్తనముచేయుచు పెల్లరకును వినిపించినారు ఆ కథలయందు వివిధములైన అనుపమ ప్రసంగములను వర్ణించినారు వానిని విని వివేకవంతులైన వార లాశ్చర్యపడకుందురు గాక

చౌ॥ హరి అనంత హరికథా అనంతా ।
కహహిం సునహిం బహుబిధి సబ సంతా ॥
రామచంద్ర కే చరిత సుహాఏ ।
కలప కోటి లగి జాహిం న గాఏ ॥ 787

తా॥ శ్రీహరి అనంతుడు, శ్రీహరి కథలు అనంతములైనవి అనంతమైన, అగాధమైన హరికథలను సజ్జను లందరును బహువిధములుగా జెప్పెదరు మరియు వినెదరు శ్రీరామ సుందర చరిత్రమును కోట్లకల్పములలో గూడ గానము జేయుటకు వలనుగాదు

చౌ॥ యహ ప్రసంగ మైం కహా భవాని ।
హరిమాయాం మోహహిం ముని గ్యానీ ॥
ప్రభు కౌతుకీ ప్రనత హితకారీ ।
సేవత సులభ సకల దుఖ హారీ ॥ 788

తా॥ మహేశ్వరుడు జగజ్జననియైన పార్వతితో ఇట్లనుచున్నాడు "పార్వతీ, జ్ఞానులు, తపస్సంపన్నులు గూడ భగవానుని మాయకు లోబడి మోహమునకు వశీభూతు లగుదురు శ్రీరాముడు లీలామయుడు, శరణాగత వత్సలుడు, సేవాతత్పరులకు సులభసాధ్యుడు, దుఃఖమును హరింపజేయువాడు ఈ విషయమును దెలియ జేయుటకై నేను నారదమునీంద్రుని గూర్చిన ప్రసంగములను జెప్పితిని

సో॥ సుర నర ముని కోఉ నాహిఁ జేహిఁ న మోహ మాయా
ప్రబల ।
అస బిచారి మన మాహిఁ భజిఅ మహామాయా పతిహి॥789

తా॥ దేవతలు, మానవులు, మునులు సహితము భగవానుని బలపత్తర మైన మాయకు లోబడిరి ఆ మాయకు వశీభూతులుగానివా రెవ్వరును లేరని మనంబున ఎలంచి, మహామాయోపేతుడైన భగవానుని స్మరణజేయుచు భజింప వలయును

## మనువు శతరూప తపస్సు

చౌ॥ అపర హేతు సును సైలకుమారీ ।
కహఉఁ బిచిత్ర కథా బిస్తారీ ॥
జేహి కారన అజ అగున అరూపా ।
బ్రహ్మ భయఉ కోసలపుర భూపా ॥ 790

తా॥ గిరిజా! ఇప్పుడు భగవానుని అవతారమునకు రెండవ కారణమును వినుము నేనా విచిత్ర కథను విస్తరించి వినిపించెదను ఏ కారణమువలన జన్మరహితుడు, నిర్గుణుడు, రూపరహితుడు అవ్యక్తుడు, సచ్చిదానంద పరబ్రహ్మమైన శ్రీమహా విష్ణువు అయోధ్యా పురమునకు రాజైనాడో ఆ వివరమును జెప్పెదను వినుము

చౌ॥ జో ప్రభు బిపిన ఫిరత తుమ్హ దేఖా ।
బంధు సమేత ధరేఁ మునిబేషా ॥
జాసు చరిత అవలోకి భవానీ ।
సతీ సరీర రహిహు బౌరానీ ॥ 791

తా॥ లక్ష్మణ సమేతుడైన శ్రీరామచంద్రుడు మునివేషమునం బరణ్యమున దిరుగుచుండుటను నీవు గాంచితివి కదా? భవానీ నీవు పూర్వజన్మమున సతియను నామముతో విరాజిల్లునపుడు శ్రీరామచరితమును తలంచినదానవై వెఱ్ఱిదానవైతివి గదా!

చౌ॥ అజహుఁ న ఛాయా మిటతి తుమ్హారీ ।
తాసు చరిత సును భ్రమ రుజ హారీ ॥
లీలా కీన్హి జో తేహిఁ అవతారా ।
సో సబ కహిహఉఁ మతి అనుసారా ॥ 792

తా॥ ఇప్పటికి గూడ నీ వెఱ్ఱితనపు ఛాయలు నిన్ను వీడలేదు అటువంటి భ్రమరూపమైన రోగమును హరించు శ్రీరామ చరితమును గూర్చివినుము శ్రీ రామావతారమునందు భగవాను దొనర్చిన లీలలనుగూర్చి నా బుద్ధ్యను సారముగ నీకు వివరించి చెప్పెదను, శ్రద్ధగా నాలకింపుము

చౌ॥ భరద్వాజ సుని సంకర బానీ ।
సకుచి స ప్రేమ ఉమా ముసుకానీ ॥
లగే బహురి బరనై బృషకేతూ ।
సో అవతార భయఉ జేహి హేతూ ॥ 793

తా॥ [శ్రీరామకథను గూర్చి యాజ్ఞవల్క్యుడు భరద్వాజునకీ విధముగ జెప్పెను] ఓ మునీశ్వరా, భరద్వాజా, శంకరుని వాక్కును విని జగజ్జనని యైన పార్వతి పులకితయై అత్యంత ప్రేమతో మందహాసము జేసెను తర్వాత వృషకేతుడైన శంకరుడు శ్రీరామావతారకారణములను వర్ణన జేయమొదలిడెను

దో॥ సో మైఁ తుమ్హ సన కహఉఁ సబు సును మునీస మన లాఇ।
రామ కథా కలిమల హరని మంగల కరని సుహాఇ॥ 794

తా॥ యాజ్ఞవల్క్యుడు భరద్వాజునితో నిట్లనియె-ఓ భరద్వాజ మహామునీ, అనంతమైన శ్రీరామ కథనంతయు విపులముగ వివరించెదను సుమా। ఇంచుక శ్రద్ధ వహింపుము శ్రీరామకథ కలియుగములోని పాపములను హరించును మంగళము జేకూర్చును, మరియు వీనుల విందొనగును

చౌ॥ స్వాయంభూ మను అరు సతరూపా ।
జిన్హ తే భై నరసృష్టి అనూపా ॥
దంపతి ధరమ ఆచరన నీకా ।
అజహుఁ గాన శ్రుతి జిన్హ కై లీకా ॥ 795

తా॥ స్వాయంభువుడను మనువునకు శతరూపయనెడి భార్యయుండెను మానవులయం దటువంటి వారు పుట్టు టరుదు కనుక అది అనుపమ సృష్టియే అనవచ్చును ఆ దంపతు లిరువురును పరమధార్మికులు, సదాచార సంపన్నులు కనుకనే వారి చరిత్ర చిరస్థాయిగ నున్నది వేదములుగూడ వారి కీర్తిని గానము జేయుచున్నవి

చౌ॥ నృప ఉత్తానపాద సుత తాసూ ।
ధ్రువ హరిభగతి భయఉ సుత జాసూ ॥
లఘు సుత నామ ప్రియ వ్రత తాహీ ।
బేద పురాన ప్రసంసహిఁ జాహీ ॥ 796

తా॥ ఉత్తానపాదుడను రాజు వారి పుత్రుడు ఉత్తానపాదుని పుత్రుడు ధ్రువుడు ధ్రువుడు హరిభక్తికలవాడు వారి (మనువు) కనిష్ఠపుత్రుడు ప్రియ వ్రతుడు వీరి కీర్తి వేదపురాణములు చాటుచున్నవి

వి॥ స్వాయంభువ మనువుపుత్రుడైన యుత్తానపాదునకు సునీతి సురుచియను భార్యలుగలరు ఉత్తానపాదుడు సురుచి నతిగాఢముగా ప్రేమించుచుండెను సునీతి పుత్రుడు ధ్రువుడు సురుచి పుత్రుడుత్తముడు ఒకనాడు సురుచి సంభ్రమమున ఉత్తానపాదుని తొడపై తన తనయుడైన ఉత్తముని గూర్చుండజేసి ఆనందించుచుండెను ఆ సమయమున తండ్రితోడ జేరనెంచి ధ్రువుడు కూడ ఉత్తానపాదుని కడకేగుచుండ సురుచి ధ్రువుని చేయి పట్టుకొని ఈవలకు లాగివేసి ' నీవు నాతనయుడైన ఉత్తమునివలె సుఖము లనుభవింప గోరుదువేని తపమొనరించి నా గర్భమున జనించు వరము భగవంతుని వేడుకొనుమని పరుషముగ శాసించెను రాజుకూడ ఆ పసివాని నుపేక్షించెను ఈ విషయమును ధ్రువుడు తల్లియైన సునీతి కెఱిగించెను సునీతి దుఃఖించుచు "నాయనా! ధ్రువా! నీవు భగవానుని గూర్చి తపమొనరింపుము నీ యభిలాష పూరించు ' ననెను

తల్లి యాశీర్వాదమును ఎడసి ధ్రువుడు కాననమునకేగి తప మొనరించెను భగవానుడు ధ్రువునకు సాక్షాత్కరించి కటాక్షించెను

ఈ దోహాయందు హరిభక్తుడైన ధ్రువుని వంశమును గూర్చి కవి ప్రస్తుతించి యున్నాడు

చౌ॥ దేవహూతి పుని తాసు కుమారీ ।
జో ముని కర్దమ కై ప్రియ నారీ ॥
ఆదిదేవ ప్రభు దీనదయాలా ।
జఠర ధరేఉ జేహిఀ కపిల కృపాలా ॥ 797

తా॥ పునః దేవహూతి యను కన్యక వారికి జన్మించెను ఆమె కర్దమ మునికి ప్రియపత్ని ఆమె ఆదిదేవుని, ఆశ్రితజనవత్సలుని, సమర్థుని కృపా సాగరుని భగవానుడైన కపిలుని గర్భమున దాల్చెను

చౌ॥ సాంఖ్య సాస్త్ర జిన్హ ప్రగట బఖానా ।
తత్త్వ బిచార నిపున భగవానా ॥
తేహిఀ మను రాజ కీన్హ బహుకాలా ।
ప్రభు అయసు సబ బిధి ప్రతిపాలా ॥ 798

తా॥ తత్త్వవిచారము సల్పుటలో అత్యంత నిపుణుడైన కపిల భగవానుడు సాంఖ్య శాస్త్రమును ప్రకట రూపమున వర్ణించెను

ఆ స్వాయంభువమనువే చాలకాలము రాజ్యపరిపాలన మొనర్చెను ధర్మ శాస్త్రమును క్షుణ్ణముగా తెలిసినవా డగుటవలన కడు సమర్థనీయముగ రాజ్యమేలెను అన్నివిధముల భగవానుని ఆజ్ఞలను పాలన జేసెను

సో॥ హోఇ బిషయ బిరాగ భవన బసత భా చౌథపన ।
హృదయఀ బహుత దుఖ లాగ జనమ గయఉ హరిభగతి
బిను ॥ 799

తా॥ ఇట్లు భోగవిలాసములలోనే కాలము గడచిపోయెను కాని వైరాగ్యము కలుగలేదు తుదకువార్ధక్యము కూడ వచ్చుచున్నది ఐనను వైరాగ్యము కలుగదాయెనని మనుదంపతులు మిగుల వగచిరి శ్రీహరిభక్తి లేనిదే జన్మ సార్థకమగునా యన్న యథార్థమునకు ఎచ్చిరి

## శతరూపామనువుల తపస్సు

చౌ॥ బరబస రాజ సుతహి తబ దీన్హా ।
నారి సమేత గగన బన కీన్హా ॥
తీరథ బర నైమిష బిఖ్యాతా ।
అతి పునీత సాధక నిధి దాతా ॥ 800

తా॥ అప్పుడు మనువు తన పుత్రుని బలవంతముగ రాజ్యమును స్వీకరింపజేసి సతీ సమేతుడై అరణ్యమునకు వెడలెను అత్యంత పవిత్రమైనది సాధకులకు ఎద్ధినొసగునది, తీర్థములతో గూడినది, శ్రేష్ఠమైనది నైమిశారణ్యము

చౌ॥ బసహిం తహాం ముని సిద్ధ సమాజా ।
తహం హియం హరషి చలేఉ మను రాజా ॥
పంథ జాత సోహహిం మతిధీరా ।
గ్యాన భగతి జను ధరేం సరీరా ॥ 801

తా॥ ఆ నైమిశారణ్యము వాల ప్రసిద్ధి గాంచినది అది తపోధనులకు నివాసస్థానము సుఖసంపదలను తృణప్రాయముగ నెంచి వాటిని త్యజించి మనుదంపతులు కాననమునకుబోవ నిచ్చగించిన వారలై హృదయమున ఆనందముప్పొంగ పయనమైరి ధైర్యవంతులును, బుద్ధిమంతులునైన రాజదంపతులు మార్గమున బోవుచుండు తఱి జ్ఞానము, భక్తి శరీరములు దాల్చి పోవుచున్నవా యన్నటు లుండెను

చౌ॥ పహుంచే జాఇ ధేనుమతి తీరా ।
హరషి నహానే నిరమల నీరా ॥
ఆఏ మిలన సిద్ధ ముని గ్యానీ ।
ధరమ ధురంధర నృపరిషి జానీ ॥ 802

తా॥ అట్లు పోయిపోయి వారు గోమతీనదీ తీరమును జేరిరి నిర్మలమైన నదీజలములలో స్నానమాచరించిరి వారు ధర్మధురంధరులు, రాజర్షి దంపతులని యెఱిగిన సిద్ధులు మరియు మునులు వారిని గలియ వచ్చిరి

చౌ॥ జహఁ జహఁ తీరథ రహీ సుహాఏ ।
మునినిన్హ సకల సాదర కరవాఏ ।
కృస సరీర మునిపట పరిధానా ।
సత సమాజ నిత సునహిఁ పురానా ॥ 803

తా॥ ఎక్కడెక్కడ తీర్థరాజములున్నవో మును లాదర పూర్వకముగ ఆ దంపతులను ఆ తీర్థములన్నిటిలోను స్నానము జేయించిరి అంత వారి శరీరములు దుర్బలములాయెను వారు మునులవలె వల్కల వస్త్రములు ధరించియుండిరి నిత్యము సజ్జనసమాజమున జరుగుచున్న పురాణములను వినుచుండిరి

దో॥ ద్వాదస అచ్ఛర మంత్ర పుని జపహిఁ సహిత అనురాగఁ।
బాసుదేవ పద పంకరుహ దంపతి మన అతి లాగ ॥ 804

తా॥ ద్వాదశాక్షరి మంత్రమును (ఓం నమో భగవతే వాసుదేవాయ) భక్తి తాత్పర్యములచే అనుక్షణము జపించుచుండిరి అట్లు జప, తపోనుష్ఠానములచే రాజదంపతుల మనస్సు స్థిరపడెను వారి మనస్సు వాసుదేవుని చరణకమలముల కంకితమాయెను

చౌ॥ కరహిఁ అహార సాక ఫల కందా ।
సుమిరహిఁ బ్రహ్మ సచ్చిదానందా ॥
పుని హరి హేతు కరన తప లాగె ।
బారి అధార మూల ఫల త్యాగే ॥ 805

తా॥ వారు ఆకులలములు, కందమూలఫలములను ఆహారముగా గైకొని సచ్చిదానందబ్రహ్మను స్మరణచేయు చుండిరి అట్లు కొంతకాలముండిన తరువాత శ్రీహరిని సాక్షాత్కరింపజేసి కొనుటకు తప మాచరించిరి తదుపరి కంద మూలఫలములను కూడ విడచి కేవలము జలాధారమునసే యుండసాగిరి

చౌ॥ ఉర అభిలాష నిరంతర హోఈ ।
దేఖిఅ నయన పరమ ప్రభు సోఈ ॥
అగున అఖండ అనంత అనాదీ ।
జేహి చింతహిఀ పరమారథబాదీ ॥ 806

తా॥ నిరంతరము భగవానుని గాంచవలయునని అపేక్షించు చుండిరి శ్రీమన్నారాయణుని కన్నులార ఎప్పుడు చూచెదమో। భగవానుడు, నిర్గుణుడు, అఖండుడు, అనంతుడు, అనాది, పరమార్థవాది (బ్రహ్మజ్ఞాని, తత్త్వవేత్త) యని భక్తజనులు సదా తత్త్వచింతనలో నుందురు కదా (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ నేతి నేతి జేహి బేద నిరూపా ।
నిజానంద నిరుపాధి అనూపా ॥
సంభు బిరంచి బిష్ణు భగవానా ।
ఉపజహి జాసు అంస తేఀ నానా ॥ 807

తా॥ భగవానుని వేదములు 'నేతి-నేతి (ఇది కాదు ఇది కాదు) అని చెప్పుచు నిరూపణ చేయు చున్నవి భగవాను డానందస్వరూపుడు, ఉపాధి రహితుడు, అనుపమపురుషుడు వాని అంశములే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ ఐసేఉ ప్రభు సేవక బస అహఈ ।
భగత హేతు లీలాతను గహఈ ॥
జౌఀ యహ బచన సత్య శ్రుతి భాషా ।
తౌ హమార పూజిహి అభిలాషా ॥ 808

తా॥ అటువంటి మహానుభావుడైన ప్రభువు భక్తులవశములోనుండును భక్తుల శ్రేయస్సుకొఱకై లీలా శరీరములను ధరించుచున్నాడు వేదములలో జెప్పిన ఈ విషయమే సత్యమైనచో అవశ్యముగ మా యభిలాష పూరించబడును

దో॥ ఏహి బిధి బీతే బరష షట సహస బారి అహార ।
సంబత సప్త సహస్ర పుని రహే సమీర అధార ॥ 809

తా॥ ఇట్టి దృఢమైన ఏక్మాగ్రమతులవారై, వారు జలమునే ఆహారముగా గొని ఆరువేల సంవత్సరములు గడిపిరి ఏడువేల సంవత్సరములు కేవలము వాయువునే ఆధారముగా గొనియుండిరి

చౌ॥ బరష సహస దస త్యాగేఉ సోఊ ।
ఠాఢే రహే ఏక పద దోఊ ॥
బిధి హరి హర తప దేఖి అపారా ।
మను సమీప ఆఏ బహు బారా ॥ 810

తా॥ పదివేలసంవత్సరములు వారు వాయువనెడి ఆధారమునుగూడ విడచిపెట్టిరి ఇరువురును ఒంటికాలిపై తపమును చేసిరి వారి అపారమైన, అఖండమైన తపమునుగాంచి బ్రహ్మవిష్ణుమహేశ్వరు లెన్నిమారులో మనుదంపతులను సమీపించిరి

చౌ॥ మాగహు బర బహు భాంతి లోభాఏ ।
పరమ ధీర నహిఁ చలహిఁ చలాఏ ॥
అస్థిమాత్ర హోఇ రహే సరీరా ।
తదపి మనాగ మనహిఁ నహిఁ పీరా ॥ 811

తా॥ ఆ త్రిమూర్తులు వలయు వరమును వేడుడని రాజదంపతుల కెన్ని విధములుగనో చెప్పిరి కాని, స్థిరచిత్తముగలవారైన ఆ మనుదంపతులు తపమును వీడలేదు వారి శరీరములు ఎముకలగూడై పోయెను తనువు శిథిలావస్థలో నుండినను వారి కే బాధయు కలుగలేదు (దివ్యజ్ఞానపరిపూర్ణులకు శరీరముతో నిమిత్తములేదు శరీరబాధలు వారి నంటవు)

చౌ॥ ప్రభు సర్బగ్య దాస నిజ జానీ ।
గతి అనన్య తాపస నృప రానీ ॥
మాగు మాగు బరు భై నభ బానీ ।
పరమ గభీర కృపామృత సానీ ॥ 812

తా॥ సర్వజ్ఞుడైన ప్రభువు తపస్సంపన్నులైన రాజదంపతులను నిజభక్తులని తెలిసికొనెను అప్పుడు పరమగంభీరమైన, కృపారూపమైన అమృతమయమైన ఆకాశవాణి ఏవరము వేడు డని పలికెను

చౌ॥ మృతక జిఆవని గిరా సుహాఈ ।
శ్రవన రంధ్ర హోఇ ఉర జబ ఆఈ ॥
హృష్ట పుష్ట తన భఏ సుహాఏ ।
మానహుఁ అబహిఁ భవన తే ఆఏ ॥ 813

తా॥ మరణించువానిని గూడ బ్రతికించు దివ్యమైన ఆకాశవాణి యెప్పుడు వీనులను ఛేదించుకొని హృదయాంతరమును బ్రవేశించెనో అప్పుడు రాజదంపతుల శరీరములు పుష్టినొంది వారప్పుడే గృహమునుండి యేతెంచినట్లుండెను (నిర్మలాత్ములై మనోహరులై భాసిల్లిరని భావము )

దో॥ శ్రవన సుధా సమ బచన సుని పులక ప్రఫుల్లిత గాత ।
బోలే మను కరి దండవత ప్రేమ న హృదయఁ సమాత॥814

తా॥ అమృతమయమైన వాక్కులను వినినంతనే వారి శరీరములు పులకరించి వదనములు ప్రఫుల్లము లాయెను అప్పుడు మనువు ప్రణామము లాచరించుచు ప్రేమపూరిత హృదయముతో నిట్లనెను - (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ సును సేవక సురతరు సురధేనూ ।
బిధి హరి హర బందిత పద రేనూ ॥
సేవత సులభ సకల సుఖ దాయక ।
ప్రనతపాల సచరాచర నాయక ॥ 815

తా॥ ఓ ప్రభూ! నీవు భక్తులకు కల్పవృక్షమువంటివాడవు కామధేనువుతో సమానమైనవాడవు నీ పాదధూళికి బ్రహ్మవిష్ణుమహేశ్వరులు సహితము వందన మాచరించెదరు సేవయొనర్చినచో సులభసాధ్యుడవు నీవే। ఓ సర్వసంపత్ప్రదాతా! ఓ శరణాగతవత్సలా! చరాచరనాయకా! (జడ చేతనములకారాధ్యుడైనవాడని భావము )

చౌ॥ జౌఁ అనాథ హిత హమ పర నేహూ ।
తౌ ప్రసన్న హోఇ యిహ బర దేహూ ॥
జో సరూప బస సివ మన మాహీఁ ।
జేహి కారన ముని జతన కరాహీఁ॥ 816

తా॥ దీనజనసంరక్షకా! నీ యనుగ్రహమునకు మేము పాత్రులమైనచో నీవు మాయందు ప్రసన్నుడవై ఏ స్వరూపము శివుని మనోమందిరమున ప్రజ్వరిల్లుచుండునో, ఎవని ప్రాప్తికై మునిబృందములు నిరంతరము యత్నము గావించెదరో, (ముందు దోహతో అన్వయము)

చౌ॥ జో భుసుండి మన మానస హంసా ।
సగున అగున జేహి నిగమ ప్రసంసా ॥
దేఖహిఁ హమ సో రూప భరి లోచన ।
కృపా కరహు ప్రనతారతి మోచన ॥ 817

తా॥ ఏ స్వరూపము కాకభుశుండిని మనోరూపమైన మానససరోవరమునందు హంసయో, ఏ మహత్తరమైన స్వరూపమును వేదములు నిరంతరము సగుణుడు, నిర్గుణుడని ఘోషించుచున్నవో, ఓ శరణాగతవత్సలా! అటువంటి మనోహరమైన నీ దివ్యమంగళస్వరూపము మేము కన్నులపండువుగా తిలకింపగోరుచున్నాము ఆ వరమును మాకు దయచేయు డని వేడకొనిరి (ముందు దోహతో అన్వయము)

చౌ॥ దంపతి బచన పరమ ప్రియ లాగే ।
మృదుల బినీత ప్రేమ రస పాగే ॥
భగత బఛల ప్రభు కృపానిధానా ॥
బిస్వబాస ప్రగటే భగవానా ॥ 818

తా॥ రాజదంపతుల కోమల, వినయభరిత, ప్రేమరసపూరితవచనములు భగవానున కత్యంత ప్రీతికరమాయెను భక్తవత్సలుడు, కృపాసాగరుడు, సంపూర్ణ విశ్వమున కాధారభూతుడు సర్వసమర్థుడు నగు భగవానుడు ప్రత్యక్షమాయెను

దో॥ నీల సరోరుహ నీలమని నీల నీర ధర స్యామ ।
లాజహిఁ తన సోభా నిరఖి కోటి కోటి సత కామ ॥ 819

తా॥ నీలకమలములు, నీలమణి, నీలమేఘముతో సమానమైన కోమల శ్యామాంగుడు కోట్లకొలది మన్మథులనుకూడ లజ్జాన్వితులుగ గావించు నటు లుండెను

చౌ॥ సరద మయంక బదన ఛబి సీఁవా ।
చారు కపోల చిబుక దర గ్రీవా ॥
అధర అరున రద సుందర నాసా ।
బిధుకర నికర బినిందక హాసా ॥ 820

తా॥ శ్రీమన్నారాయణుని ముఖారవిందము పూర్ణచంద్రునితో సమానముగ నుండెను మహాబాహుడై, కంబుగ్రీవుడై (శంఖమువంటి మెడ కలిగినవాడ), సులలాటముతోను, చక్కనినాసికతోను విరాజిల్లుచుండెను భగవానుని దరహాసము చంద్రుని కిరణములను కించపఱచు నట్లుండెను

చౌ॥ నవ అంబుజ అంబక ఛబి నీకీ ।
చితవని లలిత భావఁతీ జీ కీ ॥
భ్రుకుటి మనోజ చాప ఛబి హారీ ।
తిలక లలాట పటల దుతికారీ ॥ 821

తా॥ నయనప్రకాశ మప్పుడే వికసించిన కమలములతో సమానముగ నుండెను ఆ చూపు, ఆ వైఖరి మనస్సున కెంతయో ఆనందము నొసగునట్లుం డెను భ్రుకుటీవిలాసము మన్మథుని బాణపుశోభను హరించునదిగా నుండెను లలాటమునందు ప్రకాశవంతమైన తిలక మత్యంత శోభ నిచ్చుచుండెను.

చౌ॥ కుండల మకర ముకుట సిర భ్రాజా ।
కుటిల కేస జను మధుప సమాజా ॥
ఉర శ్రీబత్స రుచిర బనమాలా ।
పదిక హార భూషన మనిజాలా ॥ 822

తా॥ మకరకుండలధరుడై ప్రకాశించుచుండెను శిరమున మకుటము సుశోభిల్లుచుండెను ఉంగరములవలె జుట్టుకొన్న అలకలు (నల్లని వెంట్రుకలు) తుమ్మెదల బారువలె నల్లగ నుండినవి హృదయమున శ్రీవత్స చిహ్నము, మెడలో వైజయంతిమాల యలరారుచుండెను భగవానుడు రత్నహారములను, మణిభూషణములను ధరించియుండెను సర్వాంగభూషితుడై, శుభలక్షణములతో విష్ణుభగవానుడు సుశోభిల్లుచుండెను

చౌ॥ కేహరి కంధర చారు జనేఊ ।
బాహు బిభూషన సుందర తేఊ ॥
కరి కర సరిస సుభగ భుజదండా ।
కటి నిషంగ కర సర కోదండా ॥ 823

తా॥ సింహసదృశుడైన భగవానునిమెడలో సుందరమైన జన్నిదమత్యంత శోభాయమానముగ నుండెను బాహువులయందు ధరించిన ఆభరణములు ధగధగ మెరయుచుండెను ఏనుగుతొండముతో సదృశముచై భుజదండము లుండెను కరమున ధనుర్బాణము లలరారు చుండెను

దో॥ తడిత బినిందక పీత పట ఉదర రేఖ బర తీని ।
నాభి మనోహర లేతి జను జమున భవఁర ఛబి ఛీని ॥ 824

తా॥ భగవానుడు ధరించిన పీతాంబరము ప్రకాశవంతమై మెరుపునుకూడ దిగదీయు నట్లుండెను ఉదరమున మూడు రేఖలుండెను నాభి మనోహరమై యుండి యమునానదిపద్ద నుండిన తుమ్మెదలకాంతిని హరించునట్లుండెను

చౌ॥ పద రాజీవ బరని నహి జాహీఁ ।
ముని మన మధుప బసహిఁ జేన్హ మాహీఁ ॥
బామ భాగ సోభతి అనుకూలా ।
ఆదిసక్తి ఛబినిధి జగమూలా ॥ 825

తా॥ ఎవ్వనియందు ముని మనోభ్రమరములు వాసముచేయునో, ఆ భగవానుని చరణకమలములు వర్ణనాతీతములు భగవానుని వామభాగమున అత్యంత

శోభ కాటపట్టయిన, జగత్తునకు మూలకారణరూపమైన ఆదిశక్తి జానకిదేవి విలసిల్లుచుండెను

చౌ॥ జాసు అంస ఉపజహిఁ గునఖానీ ।
అగనిత లచ్ఛి ఉమా బ్రహ్మానీ ॥
భ్రుకుటి బిలాస జాసు జగ హోఈ ।
రామ బామ దిసి సీతా సోఈ ॥ 826

తా॥ ఎవరి అంశముచేత సకలగుణరాశులైన అగణిత, లక్ష్మీ-పార్వతీ-సరస్వతు లుత్పన్న మగుదురో, ఏ మహాశక్తి సంకల్ప మాత్రముననే ఈ జగత్తు త్రుటిలో నిర్మింప బడునో, ఆమెయే భగవానుని స్వరూపశక్తి సీతాదేవి ఆ సీతాదేవి శ్రీరామచంద్రుని వామ భాగమున నలరారు చుండెను

చౌ॥ ఛబిసముద్ర హరి రూపబిలోకీ ।
ఏకటక రహే నయన పట రోకీ ॥
చితవహిఁ సాదర రూప అనూపా ।
తృప్తి న మానహిఁ మను సతరూపా ॥ 827

తా॥ శోభాసముద్రుడైన శ్రీహరి రూపమును జూచి మనువు, శతరూప రెప్పవాల్పకుండ జూచుచు స్తబ్ధులైరి ఆ అనుపమరూపమును ఆదరసహిత ముగ జూచుచునే ఉండిరి ఎంత చూచినను వారికి తనివి తీరలేదు

చౌ॥ హరష బిబస తన దసా భులానీ ।
పరే దండ ఇవ గహి పద పానీ ॥
సిర పరసే ప్రభు నిజ కర కంజా ।
తురత ఉఠాఏ కరునాపుంజా ॥ 828

తా॥ ఆనందాతిశయమున మనుదంపతులు వారి దేహములను మఱచిరి వారు తమకరములతో భగవానుని చరణకమలములను బట్టుకొని, దండమువలె భూమిపై సాగిలబడిరి కరుణాసముద్రుడైన భగవానుడు తన కరకమలముతో వారి నాశీర్వదించి వారిని వెంటనే లేవనెత్తెను

దో॥ బోలే కృపానిధాన పుని అతి ప్రసన్న మోహి జాని ।
మాగహు బర జోఇ భావ మన మహాదాని అనుమాని ॥829

తా॥ కృపానిధియైన భగవానుడు వారితో నిట్లనెను - "నన్నత్యంత ప్రసన్నునిగా భావించి, దానపరుడని తలచి మీమనస్సులోనున్న కోరికయేదియో నాకు జెప్పుడు దాని నవశ్యము నేను పూరింతును "

చౌ॥ సుని ప్రభు బచన జోరి జుగపానీ ।
ధరి ధీరజు బోలీ మృదు బానీ ॥
నాథ దేఖి పద కమల తుమ్హారే ।
అబ పూరే సబ కామ హమారే ॥ 830

తా॥ ప్రభువు వచనములను విని రెండు చేతులను జోడించి రాజు మృదు మధురముగ నిట్లనెను - ఓ ప్రభూ మీ చరణకమలములను జూచిన తరువాత మా మనోవాంఛలు పూరింప బడినవి

చౌ॥ ఏక లాలసా బడి ఉర మాహీం ।
సుగమ అగమ కహి జాతి సో నాహీం ॥
తుమ్హహి దేత అతి సుగమ గోసాఈం ।
అగమ లాగ మోహి నిజ కృపనాఈం ॥ 831

తా॥ ఐనను మనస్సులో ఒకేఒక కోరిక యున్నది దాని సఫలత సుగమమేఐనను, అగమమైనందు వలన దానిని గూర్చి మీకు వివరింపలేకున్నాము ఓస్వామీ। మా కోరిక పూరించుట నీకు సుగమమే యైనను మా కృపణత్వ (దీనత్వము) కారణమున అది అత్యంతము అగమమనియే తెలియుచున్నది

చౌ॥ జథా దరిద్ర బిబుధతరు పాఈ ।
బహు సంపతి మాగత సకుచాఈ ॥
తాసు ప్రభాఉ జాన నహిం సోఈ ।
తథా హృదయం మమ సంసయ హోఈ ॥ 832

తా॥ ఎరిద్రుడు కల్పవృక్షమును పొందినవు డధిక ద్రవ్యమునడుగుటకు సంకోచపడును, ఏలన దాని ప్రభావము తెలియదు గనుక అటుల సంకోచపడును అటువంటి సంశయములే మాకును గలుగు చున్నవి

చౌ॥ సో తుమ్హ జానహు అంతరజామీ ।
పురవహు మోర మనోరథ స్వామీ ॥
సకుచ బిహాఇ మాగు నృప మోహీ ।
మోరే నహిఁ అదేయ కఛు తోహీ ॥ 833

తా॥ స్వామీ! నీవు అంతర్యామివి, కాన మా మనోరథ మెఱిగియే యుందువు మా మనోరథ మీడేర్పుము, అనిన భగవానుడు రాజా, ఏ విధ మైన సందేహమును లేక వలయు వరమును వేడుము మీ కివ్వకూడనిది నావద్ద ఏమియులేదు

దో॥ దాని సిరోమని కృపా నిధి నాథ కహఉఁ సతిభాఉ ।
చాహఉఁ తుమ్హహి సమాన సుత ప్రభు సన కవన దురాఉ॥
834

తా॥ అప్పుడు రాజిట్లనియె - ఓ దాసశిరోమణీ, కృపానిధీ, నేను నా మనస్సునందున్న కోరికను సత్యముగా చెప్పుచున్నాను నాకు నీతో సమానుడైన పుత్రుడు కావలెను ప్రభువు సాన్నిధ్యమున సద్భావమును దాచకూడదు కదా!

చౌ॥ దేఖి ప్రీతి సుని బచన అమోలే ।
ఏవమస్తు కరునానిధి బోలే ॥
ఆపు సరిస ఖోజౌఁ కహఁ జాఈ ।
నృప తవ తనయ హోబ మైఁ ఆఈ ॥ 835

తా॥ రాజు యొక్క ప్రీతిని జూచి ఆతని అమూల్యమైన వచనములను విని కరుణాసాగరుడైన భగవాను డిట్లనెను - అట్లే అగుగాక, ఓరాజా, నాతో సమానమైన వాని నింకొకని నేనెచ్చట నన్వేషింతును స్వయముగా నేనే మీకు పుత్రుడుగా జన్మించెదను

చౌ॥ సతరూపహి బిలోకి కర జోరేఁ ।
దేబి మాగు బరు జో రుచి తోరేఁ ॥
జో బరు నాథ చతుర నృప మాగా ।
సోఇ కృపాల మోహి అతి ప్రియ లాగా ॥ 836

తా॥ శతరూప చేతులు జోడించుకొని యుండుటను గాంచి భగవాను డిట్లన్నాడు. ఓ దేవీ నీ ఇచ్ఛ ఏదియో తెలుపుము, ఏలయు వరమును వేడుము అప్పుడు శతరూప స్వామీ! చతురుడైన నాపతి ఏ వరమును గోరెనో అదియే నాకుగూడ అత్యంత ప్రియమై నట్టిది (ముందు దోహతో అన్వయము )

చౌ॥ ప్రభు పరంతు సుఠి హోతి ఢిఠాఈ ।
జదపి భగతహిత తుమ్హహి సోహాఈ ॥
తుమ్హ బ్రహ్మాది జనక జగ స్వామీ ।
బ్రహ్మ సకల ఉర అంతరజామీ ॥ 837

తా॥ ఓ ప్రభూ! భక్తవత్సలా! నీవు బ్రహ్మాది దేవతల నుత్పన్న మొనర్చిన వాడవు, జగదీశ్వరుడవు, అంతర్యామివి నీ సమక్షమున మే మవినయముగ ప్రవర్తించితిమి ఐనను, మా ప్రవర్తన నీకు బాగుగనేయున్నది కదా!

చౌ॥ అస సముఝత మన సంసయ హోఈ ।
కహా జో ప్రభు ప్రవాన పుని సోఈ ॥
జే నిజ భగత నాథ తవ అహహీఁ ।
జో సుఖ పావహిఁ జో గతి లహహీఁ ॥ 838

తా॥ అని తెలిసికొన్నను మనంబున నాకొక సందేహము కలుగుచున్నది మరల ప్రభువేమి చెప్పెనో అదంతయు సత్యమని తెలియుచున్నది ఓ స్వామీ, అఖండ, అలౌకిక సుఖమును ప్రాప్తింప జేసికొన్న నీ నిజదాసుల కే పరమగతి ప్రాప్తించునో— (ముందు దోహతో అన్వయము)

దో॥ సోఇ సుఖ సోఇగతి సోఇ భగతి సోఇ నిజ చరన సనేహు ।
సోఇ బిబేక సోఇ రహని ప్రభు హమహి కృపా కరి దేహు॥839

తా॥ ఓ ప్రభూ! ఆ పరమసుఖము, పరమగతి, అనన్యభక్తి నీ పాద పద్మములపై ప్రేమానురాగములు కలిగి జ్ఞానమునందేయుండి జ్ఞానోప లబ్ధినొందు నట్లు మమ్మనుగ్రహింపు డనెను

చౌ॥ సుని మృదు గూఢ రుచిర బర రచనా ।
కృపాసింధు బోలే మృదు బచనా ॥
జో కఛు రుచి తుమ్హారే మన మాహీఁ ।
మైఁ సో దీన్హ సబ సంసయ నాహీఁ ॥ 840

తా॥ రాణి యొక్క కోమల, గూఢ, మనోహర శ్రేష్ఠ వాక్చురిని విని కరుణాసముద్రుడైన భగవాను డతికోమలముగ నిట్లనెను- "నీ మనస్సునం దే యిచ్ఛగలదో దానిని నీకొసగితిని సందేహింపకుము" (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ మాతు బిబేక అలౌకిక తోరేఁ ।
కబహుఁ న మిటిహి అనుగ్రహ మోరేఁ ॥
బంది చరన మను కహేఉ బహోరీ ।
అవర ఏక బినతీ ప్రభు మోరీ ॥ 841

తా॥ ఓ మాతా! నా కృపాకటాక్షముచే నీ అలౌకిక జ్ఞానమున కెన్న డును భంగము కలుగదు"

అని భగవానుడు నుడివినంతనే మనువు భగవానుని చరణ కమలములకు ప్రణమిల్లి యిట్లనెను —

ఓ ప్రభూ! ఇదే నా ముఖ్యమైన మనవి (ముందు దోహాతోఅన్వయము)

చౌ॥ సుత బిషఇక తవ పద రతి హోఉ ।
మోహి బడ మూఢ కహై కిన కోఊ ॥
మని బిను ఫని జిమి జల బిను మీనా ।
మమ జీవన తిమి తుమ్హహి అధీనా ॥ 842

తా॥ ఏ విధముగ పుత్రునిపై తండ్రికి ప్రేమ వాత్సల్యము సహజముగ నుండునో అదేవిధముగ నీ పాదపద్మములపై అటువంటి ప్రీతి నాకుండున ట్లను గ్రహింపుము ఈ విషయమున నెవ్వరును నన్ను మూర్ఖునిగా భావింపకుందురు గాక।

ఏ విధముగ మణిలేకుండ సర్పము జీవింపజాలదో, నీరు లేకుండ మత్స్యము లుండజాలవో, ఆ విధముగ నా జీవనము నీ యధీనముననుండు గాక "

చౌ॥ అస బరు మాగి చరన గహి రహేఊ ।
ఏవమస్తు కరునానిధి కహేఊ ॥
అబ తుమ్హ మమ అనుసాసన మానీ ।
బసహు జాఇ సురపతి రజధానీ ॥ 843

తా॥ అని చెప్పుచు రాజు భగవానుని పాదములను బట్టుకొనెను అప్పుడు దయా సముద్రుడైన భగవానుడు "అట్లే యగుగాక। ఇప్పుడు మీరు నా ఆజ్ఞాను సారము ఇంద్రుని రాజధానియైన అమరావతికి బోయి అచ్చట వాసము జేయుడు

సో॥ తహఁ కరి భోగ బిసాల తాత గఏఁ కఛు కాల పుని ।
హోఇహహు అవధ భుఆల తబ మైఁ హోబ తుమ్హార సుత॥ 844

తా॥ వత్సా। స్వర్గసుఖముల ననుభవించిన తరువాత కొంత కాలము నకు నీవు అయోధ్యానగరమునకు రాజయ్యెదవు అప్పుడు నేను నీ పుత్రుడ నయ్యెదను

చౌ॥ ఇచ్ఛామయ నరబేష సఁవారేఁ ।
హోఇహఉఁ ప్రగట నికేత తుమ్హారేఁ ॥
అంసన్హ సహిత దేహ ధరి తాతా ।
కరిహఉఁ చరిత భగత సుఖదాతా ॥ 845

తా॥ ఇచ్ఛా నిర్మిత మానవ రూపమున నేను మీ గృహమున జన్మింతును నేను నా అంశలతో గూడ దేహ ధారణ గావించుకొని భక్తులకు సుఖ శ్రేయస్సు లను కలిగించు కార్యముల నొనర్చెదను

చౌ॥ జే సుని సాదర నర బడభాగీ ।
భవ తరిహహిఁ మమతా మద త్యాగీ ॥
ఆదిసక్తి జేహిఁ జగ ఉపజాయా ।
సోఉ అవతరిహి మోరి యహ మాయా ॥ 846

తా॥ ఈ చరిత్రను చాల భాగ్యశాలులైన వారలు అత్యాదరముతో నాల కించి మమతా మదములను త్యాగమొనర్చి భవసాగరము నుండి తరింతురు నా స్వరూప శక్తియైన జగత్తు నుత్పన్న మొనర్చిన ఆదిశక్తికూడ అవతరించును

చౌ॥ పురఉబ మైఁ అభిలాష తుమ్హారా ।
సత్య సత్య పన సత్య హమారా ॥
పుని పుని అస కహి కృపానిధానా ।
అంతరధాన భఏ భగవానా ॥ 847

తా॥ ఈ విధముగ మీ అభిలాష పూరించెదను నా ప్రతిజ్ఞసత్యము, ముమ్మాటికిని సత్యము" అని చెప్పి కృపానిధియైన భగవాను డంతర్హితుడాయెను

చౌ॥ దంపతి ఉర ధరి భగత కృపాలా ।
తేహిఁ ఆశ్రమ నివసే కఛు కాలా ॥
సమయ పాఇ తను తజి అనయాసా ।
జాఇ కీన్హ అమరావతి బాసా ॥ 848

తా॥ ఆ మనుదంపతులు భక్తులను కనికరించు భగవానుని స్మరించుచు ఆశ్రమముననే యుండిరి అవసానకాలము వచ్చినపుడు సహజముగా అనాయాసముగా శరీరమును వదలి ఇంద్రపురియైన అమరావతికిబోయి వాసము జేసిరి

దో॥ యహ ఇతిహాస పునీత అతి ఉమహి కహీ బృషకేతూ ।
భరద్వాజ సును అపర పుని రామ జనమ కర హేతూ॥849

తా॥ ఓ భరద్వాజా ! ఈ అత్యంత పవిత్రేతిహాసమును శివుడు పార్వతికి మునుపు చెప్పియుండెను ఇప్పుడు శ్రీరామావతారమునకు మరియొక కారణమును గూర్చి వినుము —

## ప్రతాపభానుని వృత్తాంతము

చౌ॥ సును ముని కథా పునీత పురానీ ।
జో గిరిజా ప్రతి సంభు బఖానీ ॥
బిస్వ బిదిత ఏక కైకయ దేసూ ।
సత్యకేతు తహఁ బసఇ నరేసూ ॥ 850

తా॥ ఓ మునీశ్వరా। ఈ పవిత్రమైన ప్రాచీన కథను వినుము ఈ కథను శంకరుడు పార్వతికి జెప్పెను (ఆ కథను గూర్చి నేను నీకు వివరింతును, శ్రద్ధగా నాలకింపుము)

ప్రపంచమున ప్రసిద్ధిగాంచిన కేకయ దేశముండెను దానిని సత్యకేతు డను రాజు పాలించు చుండెను

చౌ॥ ధరమ ధురంధర నీతి నిధానా ।
తేజ ప్రతాప సీల బలవానా ॥
తేహి కేఁ భఏ జుగల సుత బీరా ।
సబ గున ధామ మహా రనధీరా ॥ 851

తా॥ సత్యకేతుడు ధర్మాత్ముడు, నీతిపరుడు, తేజోవంతుడు, ప్రతాప వంతుడు, సచ్ఛీలుడు, మరియు బలవంతుడు ఆతనికి ఇరువురు వీరపుత్రులు గలరు వారిరువురును సకల గుణముల కాటపట్టయిన వారు, రణ ధీరులు

చౌ॥ రాజ ధనీ జో జేఠ సుత ఆహీ ।
నామ ప్రతాపభాను అస తాహీ ॥
అపర సుతహి అరిమర్దన నామా ।
భుజ బల అతుల అచల సంగ్రామా ॥ 852

తా॥ రాజ్యమునకు ఉత్తరాధికారి జ్యేష్ఠపుత్రుడు ఆతని పేరు ప్రతాప భానుడు రెండవ పుత్రుని పేరు అరిమర్దనుడు, బలపరాక్రమోపేతుడు, యుద్ధము నందు పర్వతము వోలె చలనములేక శత్రువుల నెదిరించు వా

చౌ॥ భాఇహి భాఇహి పరమ సమీతీ ।
సకల దోష ఛల బరజిత ప్రీతీ ॥
జేఠే సుతహి రాజ నృప దీన్హా ।
హరి హిత ఆపు గవన బన కీన్హా ॥ 853

తా॥ అన్నదమ్ము లిరువురును పరస్పరము ప్రేమానురాగములు కలిగి యుండిరి ఈర్ష్యారహితులై, దోషరహితులై విరాజిల్లుచుండిరి రాజు జ్యేష్ఠ పుత్రుడైన ప్రతాపభానునికి రాజ్యమొసగి తపమునకై అరణ్యమున కేగెను

దో॥ జబ ప్రతాపరబి భయఉ నృప ఫిరీ దోహాఈ దేస ।
ప్రజాపాల అతి బేదబిధి కతహుఁ నహీఁ అఘ లేస ॥ 854

తా॥ ఎప్పుడు ప్రతాపభానుడు రాజ్యమును స్వీకరించెనో అప్పుడు దేశము నెందంతటను అతని కీర్తి వ్యాపించెను ప్రతాపభానుడు వేద విధ్యనుసారముగ ఉత్తమరీతి ప్రజలను పాలింప దొడగెను ఆ రాజ్యములో పాపమునకు తావు లేదు (పాపము లేశమాత్రము కూడ నుండలేదని భావము)

చౌ॥ నృప హితకారక సచివ సయానా ।
నామ ధరమరుచి సుక్ర సమానా ॥
సచివ సయాన బంధు బలబీరా ।
ఆపు ప్రతాపపుంజ రనధీరా ॥ 855

తా॥ రాజునకు హితము చేకూర్చెడి వాడును, శుక్రాచార్యు నంతటివాడైన ధర్మరుచియను నామధేయము గలవాడు ప్రతాపభానునకు మంత్రి బుద్ధి సూక్ష్మత గల మంత్రియు, బలవంతుడైన సహోదరుడును రాజునకు కుడి భుజముగ నుండిరి అంతియేగాక, రాజు స్వయముగ పరాక్రమవంతుడు, రణధీరుడు

చౌ॥ సేన సంగ చతురంగ అపారా ।
అమిత సుభట సబ సమర జుఝారా ॥
సేన బిలోకి రాఉ హరషానా ।
అరు బాజే గహగహే నిసానా ॥ 856

తా॥ రాజుకడ చతురంగ సేన యుండెను అసంఖ్యాకులైన యుద్ధవీరులును ఉండిరి అందరును రణరంగమున యుద్ధముజేసి వీరస్వర్గము నలంకరించు వారే గాని శత్రువులకు భయపడి పారిపోవువారు గాదు బలపరాక్రమ ముట్టిపడు తన సేనను జూచి ప్రతాపభానుడు చాల సంతోషించి రణభేరి మ్రోగించెను

చౌ॥ బిజయ హేతు కటకఈ బనాఈ ।
సుదిన సాధి నృప చలేఉ బజాఈ ॥
జహఁ తహఁ పరీఁ అనేక లరాఈఁ ।
జీతే సకల భూప బరిఆఈఁ ॥ 857

తా॥ దిగ్విజయమునకై సేనను సమకూర్చుకొని రాజు శుభముహూర్తమును నిశ్చయించుకొని రణభేరి మ్రోగించి, కదన రంగమునకు బోయెను అక్కడక్కడ చాలపలకు యుద్ధములు చేసెను తన బల పరాక్రమముల రాజులతో బోరి విజయసంపదతో తిరిగి వచ్చి విజయలక్ష్మిని చేకూర్చెను

చౌ॥ సప్త దీప భుజబల బస కీన్హే ।
లై లై దండ ఛాడి నృప దీన్హే ॥
సకల అవని మండల తేహి కాలా ।
ఏక ప్రతాపభాను మహిపాలా ॥ 858

తా॥ ప్రతాపభానుడు తన భుజబలముచే సప్తద్వీపములను వశము గావించుకొనెను రాజులను దండించి విడచి పెట్టెను ఆ కాలమున సంపూర్ణ పృథ్వీ మండలమునకు ఏకైక చక్రవర్తి ప్రతాపభానుడే।

దో॥ స్వబస బిస్వ కరి బాహుబల నిజ పుర కీన్హ ప్రబేసు ।
అరథ ధరమ కామాది సుఖ సేవఇ సమయఁ నరేసు ॥859

తా॥ తన బాహుబల పరాక్రమముల ప్రపంచమును వశము చేసికొని మరల ప్రతాపభానుడు తన నగరమును ప్రవేశించెను మహారాజు ధర్మార్థకామాది సుఖములను సమయాను సారముగ పాటించు చుండెను

చౌ॥ భూప ప్రతాపభాను బల పాఈ ।
కామధేను భై భూమి సుహాఈ ॥
సబ దుఖ బరజిత ప్రజా సుఖారీ ।
ధరమసీల సుందర నర నారీ ॥ 860

తా॥ ప్రతాపభానుని బాహుబలముచే పృథ్వీమండలము కామధేనువాయెను (అనగా మనోవాంఛిత ఫలమునొసగు చుండెనని భావము) ఆ రాజ్యములోని ప్రజలు దుఃఖరహితులై సుఖముగ నుండిరి స్త్రీ పురుషులెల్లరును ధర్మాత్ములై యుండిరి

చౌ॥ సచివ ధరమరుచి హరి పద ప్రీతీ ।
నృప హిత హేతు సిఖవ నిత నీతీ ॥
గుర సుర సంత పితర మహిదేవా ।
కరఇ సదా నృప సబ కై సేవా ॥ 861

తా॥ మంత్రియైన ధర్మరుచికి శ్రీహరి పాదపద్మములపై భక్తితాత్పర్యములు గలవు రాజుహితమును గోరినవాడై ధర్మరుచి నిరంతరము రాజునకు నీతి మార్గమును బోధించుచుండెను అట్లు బోధించుటవలన రాజు గురువులను, దేవతలను, సజ్జనులను, బ్రాహ్మణులను సేవించు చుండెను

చౌ॥ భూప ధరమ జే బేద బఖానే ।
సకల కరఇ సాదర సుఖ మానే ॥
దిన ప్రతి దేఇ బిబిధ బిధి దానా ।
సునఇ సాస్త్ర బర బేద పురానా ॥ 862

తా॥ వేదములందు ఏ యే ధర్మ మార్గములను జెప్పియుండిరో, రాజు వాటిని పాలన జేయు చుండెను వేదములలో జెప్పిన రీతిగా ప్రతిదినము రాజు దానము లిచ్చుచుండెను వేద, శాస్త్ర పురాణాదులను భక్తి శ్రద్ధలతో నాలకించు చుండెను

చౌ॥ నానా వాపీం కూప తడాగా ।
సుమన బాటికా సుందర బాగా ॥
బిప్రభవన సురభవన సుహాఏ ।
సబ తీరథన్హ బిచిత్ర బనాఏ ॥ 863

తా॥ ప్రతాపభానుడు అనేకములైన లోతైనచెఱువులను బావులను చిన్న కొలనులను త్రవ్వించెను ఉద్యానవనములను, బ్రాహ్మణులకు గృహములను, దైవారాధనకు దేవాలయములను పవిత్రనదుల గట్టున నిర్మింపజేసెను

దో॥ జహం లగి కహే పురాన శ్రుతి ఏక ఏక సబ జాగ ।
బార సహస్ర సహస్రనృప కిఏ సహిత అనురాగ ॥ 864

తా॥ వేదములందు ఎన్ని విధములైన యజ్ఞములను జెప్పియున్నారో ఆ యజ్ఞములను రాజు ఒక్కొక్కదానిని వేయి-వేయి మారు లొనరించెను

చౌ॥ హృదయు న కఛు ఫల అనుసంధానా ।
భూప బిబేకీ పరమ సుజానా ॥
కరఇ జే ధరమ కరమ మన బానీ ।
బాసుదేవ అర్పిత నృప గ్యానీ ॥ 865

తా॥ మహారాజు బుద్ధిమంతుడు, జ్ఞాని యైనందువలన అతని హృదయము నిర్మలమై కామనరహితమై యుండెను ఆ ధర్మానురక్తుడైన ప్రతాపభాను దే ధర్మకార్యమొనర్చినను త్రికరణశుద్ధిగా నొనర్చుచు సర్వమును భగవానుడైన వాసుదేవున కర్పణము గావించి కార్యనిర్వాహణమం చిడుగిడు చుండెను

చౌ॥ చఢి బర బాజి బార ఏక రాజా ।
మృగయా కర సబ సాజి సమాజా ॥
బింధ్యాచల గభీర బన గయఊ ।
మృగ పునీత బహు మారత భయఊ ॥ 866

తా॥ ఒకసారి మహారాజు ఉత్తమాశ్వము నెక్కి వేటాడుటకై సామగ్రిని సమకూర్చుకొని వింధ్యాచలముయొక్క అరణ్య ప్రాంతమునకు బోయెను అచ్చట ఉత్తమోత్తమములైన పెక్కు హరిణములను సంహరించెను

చౌ॥ ఫిరత బిపిన నృప దీఖ బరాహూ ।
జను బన దురేఉ ససిహి గ్రసి రాహూ ॥
బడ బిధు నహిఁ సమాత ముఖ మాహీఁ ।
మనహుఁ క్రోధ బస ఉగిలిత నాహీఁ ॥ 867

తా॥ అరణ్యప్రాంతమున దిరుగాడు ప్రతాపభాను దొక వరాహమును జూచెను అమితముగా ఇక్కట్టుల పాలు జేయుటకు వచ్చినది గనుక ఆ వరాహము చంద్రునిమ్రింగిన రాహువే అరణ్యమునకు విచ్చేసి దాగుకొని యుండెనా యనునట్లుండెను చంద్రుడు ఆకారమున పెద్దగ నుండుటచే నోటియందిముడకుండెను క్రోధవశమున వమనము జేసికొనలేకుండెను

చౌ॥ కోల కరాల దసన చబి గాఈ ।
తను బిసాల పీవర అధికాఈ ॥
ఘురుఘురాత హయ ఆరౌ పాఏఁ ।
చకిత బిలోకత కాన ఉఠాఏఁ ॥ 868

తా॥ ఆ వరాహమునకు భయంకరమైన దంతములుండెను దాని శరీరము విశాలముగ నుండెను అశ్వపు జాడను దెలిసి కొన్నదై అది గుఱ్ఱు గుఱ్ఱు మనుచు చెవులను పైకెత్తెను, ఒకే వైపు దృష్టి సారించెను

దో॥ నీల మహీధర సిఖర సమ దేఖి బిసాల బరాహు ।
చపరి చలేఉ హయ సుటుకి నృప హాఁకి న హోఇ నిబాహు॥
869

చౌ॥ ఆవత దేఖి అధిక రవ బాజీ ।
చలేఉ బరాహ మరుత గతి భాజీ ॥
తురత కీన్హ నృప సర సంధానా ।
మహి మిలి గయఉ బిలోకత బానా ॥ 870

తా॥ అధికశ్రమముతో అశ్వము తనవైపు వచ్చుచుండుటను జూచి, వరాహము వాయువేగమున పరుగిడెను అది అట్లు పరుగిడుట జూచి రాజు వెంటనే దానిని హత మార్చుటకు ధనుర్బాణములను గైకొనెను వరాహము బాణములను జూచుచు భూమిలోనికి జొచ్చెను

చౌ॥ తకి తకి తీర మహీస చలావా ।
కరి ఛల సుఅర సరీర బచావా ॥
ప్రగటత దురత జాఇ మృగ భాగా ।
రిస బస భూప చలేఉ సంగ లాగా ॥ 871

తా॥ మహారాజు ఎడతెగక బాణములను వేయుచునేయుండెను కాని వరాహము మోసగించుచు తన్ను తాను కాపాడుకొనుచు బోవుచుండెను అది ఒక సారి కనుపించి మరల అదృశ్యమగు చుండెను, మరల పరుగిడు చుండెను రాజు కూడ కోపావేశముతో దానిని వెంబడించు చుండెను

చౌ॥ గయఉ దూరి ఘన గహన బరాహూ ।
జహఁ నాహిన గజ బాజి నిబాహూ ॥
అతి అకేల బన బిపుల కలేసూ ।
తదపి న మృగ మగ తజఇ నరేసూ ॥ 872

తా॥ వరాహము దట్టమైన అడవిలో బోవుచునేయుండెను తుద కశ్వములు గజములు పోవుటకు దారిలేని ప్రదేశమునకు బోయెను రాజు చాల దూరము పయనించుటచే ఒంటరివాడాయెను అధిక క్లేశమునకు బాల్పడవలసి వచ్చెను పరిస్థితి చాల విషమించినను రాజు ఆ వరాహమును వెంటాడుట మానలేదు

చౌ॥ కోల బిలోకి భూప బడ ధీరా ।
భాగి పైఠ గిరిగుహాఁ గభీరా ॥
అగమ దేఖి నృప అతి పఛితాఈ ।
ఫిరేఉ మహాబన పరేఉ భులాఈ ॥ 873

తా॥ రాజు చాల ధైర్యవంతుడని తెలుసుకొన్నదై వరాహమొక కొండ గుహలోనికి బోయెను అట్టితటి, ఆ గుహలోనికి బోవ రాజునకు శక్యము గాకుండుటచే అతడు మిగుల వ్యాకులత నొంది వెనుకకు మరలి వచ్చెను కాని ఆ ఘోరారణ్యమున దారి ఒప్పెను

దో॥ ఖేద ఖిన్న ఛుద్ధిత తృషిత రాజా బాజి సమేత ।
ఖోజత బ్యాకుల సరిత సర జల బిను భయఉ అచేత ॥874

తా॥ ఎక్కువగా తిరుగుట వలన రాజలం పోయెను అశ్వముకూడ అదే స్థితి యందుండెను అశ్వమునకు ఆహారము నీరు అవశ్యకమై యుండెను రాజుకూడ ఆకలి దప్పులకు గురియైనందున అశ్వసమేతుడై దాహము దీర్చుకొనుటకై నదులను తటాకముల నన్వేషించుచు బోయెను ఆ యన్వేషణమున నీటిని గాంచక నిరాశజెందెను

చౌ॥ ఫిరత బిపిన ఆశ్రమ ఏక దేఖా ।
తహఁ బస నృపతి కపట మునిబేషా ॥
జాసు దేస నృప లీన్హ ఛడాఈ ।
సమర సేన తజి గయఉ పరాఈ ॥ 875

తా॥ రాజరణ్యమున దిరుగుచు దిరుగుచు ఒక ఆశ్రమమును గాంచెను అక్కడ కపట వేషధారియైన మునిని కూడ సందర్శించెను

అతడు రాజ్యమును గోల్పోయిన రాజు కాని ముని యెంత మాత్రమును కాడు కపటత్వమును మనస్సు నందుంచుకొని బాహ్యారముగ ముని వేషము ధరించి యుండెను ఆ రాజు రాజ్యమును, వేటకై వచ్చిన ఈ ప్రతాపభానుడే తన వశముగావించుకొని యుండెను రణరంగమున తన సేనను విడచి అతడు పారిపోయి యుండెను

చౌ॥ సమయ ప్రతాపభాను కర జానీ ।
ఆపన అతి అసమయ అనుమానీ ॥
గయఉ న గృహ మన బహుత గలానీ ।
మిలా న రాజహి నృప అభిమానీ ॥ 876

తా॥ ప్రతాపభానునివి మంచి రోజులనియు తనవి మంచి రోజులు కావనియు ఎలచి రాజ్యభ్రష్ఠుడైన రాజు తన పరిస్థితిని దలచుకొని నిరుత్సాహపరుడై దుఃఖించెను అందువలన అతడు గృహమున కేగలేదు అహంకారపూరితుడై ఎందుచేత ప్రతాపభానుని మరల గలియలేదు

చౌ॥ రిస ఉర మారి రంక జిమి రాజా ।
బిపిన బసఇ తాపస కేఁ సాజా ॥
తాసు సమీప గవన నృప కీన్హా ॥
యహ ప్రతాపరబి తేహిఁ తబ చీన్హా ॥ 877

తా॥ దరిద్రునివలె మనంబున క్రోధావేశము కలవాడై అరణ్యమున సంచరించు చుండెను ప్రతాపభానుడాతని పద్దకు బోయెను కపట మునివేషధారియై ఆ రాజు ప్రతాపభానుని గుర్తుపట్టగలిగెను (ముని వేషధారియైన ఆ రాజును ప్రతాపభానుడు గుర్తింప జాలక పోయెను )

చౌ॥ రాఉ తృషిత నహిఁ సో పహిచానా ।
దేఖి సుబేష మహాముని జానా ॥
ఉతరి తురగ తేఁ కీన్హ ప్రనామా ।
పరమ చతుర న కహేఉ నిజనామా ॥ 878

తా॥ ప్రతాపభానునకు దాహ మధిక మాయెను ప్రయాణపు బడలిక చేత రాజు మిగుల వ్యాకులత నొంది యుండెను వ్యాకులత నొందిన కారణమున ఆ కపట మునివేషధారియైన ఆ రాజును గుర్తుపట్ట జాలక పోయెను ఆ రాజును మహామునిగానే భావించి అశ్వము నవరోహించి ప్రణమిల్లెను ప్రతాపభానుడు చతురుడు కాన తన నామధేయము మాత్రమతనికి చెప్పలేదు

దో॥ భూపతి తృషిత బిలోకి తేహిఁ సరబరు దీన్హ దేఖాఇ ।
మజ్జన పాన సమేత హయ కీన్హ నృపతి హరషాఇ ॥ 879

తా॥ ప్రతాపభాను దధిక దాహముతో నుండుటను గాంచి కపటముని సరోవరమును జూపించెను రా జందులకు సంతసించి, అశ్వసమేతుడుగా ఆ సరోవరమున స్నానమాచరించి, దప్పిక దీర్చుకొనెను

చౌ॥ గై శ్రమ సకల సుఖీ నృప భయఊ ।
నిజ ఆశ్రమ తాపస లై గయఊ ।
ఆసన దీన్హ అస్త రబి జానీ ।
పుని తాపస బోలేఉ మృదు బానీ ॥ 880

తా॥ ప్రతాపభానుడు అలసట దీరెను భయము నుండి విడివడి సుఖశాంతుల నుపొందెను. సూర్యుడస్తమించి సంధ్యాసమయము సమీపించి నందువలన ఆ కపటముని ప్రతాపభానుని ఆశ్రమములోనికి దీసుకొని పోయెను. ఉచితాసన మిచ్చి గౌరవించి మృదు మధురముగ ఆ రాజుతో నిట్లనెను– (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ కో తుమ్హ కస బన ఫిరహు అకేలేఁ ।
సుందర జుబా జీవ పరహేలేఁ ॥
చక్రబర్తి కే లచ్ఛన తోరేఁ ।
దేఖత దయా లాగి అతి మోరేఁ ॥ 881

తా॥ "నీ వెవరవు? యౌవన పరిపూర్ణుడవైన యువకుడవై, జీవితముపై ఆశను గూడ వదలి, అరణ్యమున ఒంటరిగ నేల దిరుగుచున్నావు? నీయందు చక్రవర్తి లక్షణములు పొడ చూపుచున్నవి. కాన నిన్ను జూచి నా కెంతయో జాలి కలుగు చున్నది"

చౌ॥ నామ ప్రతాపభాను అవనీసా ।
తాసు సచివ మైఁ సునహు మునీసా ॥
ఫిరత అహేరేఁ పరేఉఁ భులాఈ ।
బడే భాగ దేఖేఉఁ పద ఆఈ ॥ 882

తా॥ అంతట రాజిట్లనియె "మునీశ్వరా! ప్రతాపభానుడను రాజొకడు కలడు, నేనాతని మంత్రిని. వేటకై వచ్చి అటు ఇటు దిరుగుచు దారి తప్పితిని. నా భాగ్యవశమున ఇచ్చటికి వచ్చి మీ చరణ కమలములను దర్శించితిని

చౌ॥ హమ కహఁ దుర్లభ దరస తుమ్హారా ।
జానత హౌఁ కచు భల హోనిహారా ॥
కహ ముని తాత భయఉ అఁధిఆరా ।
జోజన సత్తరి నగరు తుమ్హారా ॥ 883

తా॥ మావంటి వారికి మీ దర్శనము దుర్లభము కాని ఆ దర్శన భాగ్యము నేడు నాకు కలిగినది గావున నాకు దీని వలన శ్రేయస్సు కలుగుననుటలో సందియము లేదు "

అప్పుడు ముని యిట్లనెను "నాయనా! అంధకార మగుచున్నది మీ నగరం మిక్కిడికి డెబ్బది యోజనముల దూరమున నున్నది

దో॥ నిసా ఘోర గంభీర బన పంథ న సునహు సుజాన ।
బసహు ఆజు అస జాని తుమ్హ జాఏహు హోత బిహాన ॥884

తా॥ సజ్జనుడా దట్టమైన యీ అరణ్యమునందు గాఢాంధకార మావరించియుండ నీవు మార్గమును కనుగొన జాలవు కావున నీ వీ రాత్రి యిచ్చటనే యుండుము రేపు ఉదయమున పయనింప వచ్చును

దో॥ తులసీ జసి భవతబ్యతా తైసీ మిలఇ సుహాఇ ।
ఆపును ఆవఇ తాహి పహిఁ తాహి తహాఁ లై జాఇ ॥ 885

తా॥ శ్రీ తులసీదా సీ విధముగ జెప్పుచున్నారు - భవిష్యత్తు సుగమము సుఖమయమగు ప్రాప్తి యుండినచో అట్లే జరుగును ఎటువంటి భవితవ్యమున కటువంటి సహాయమే లభించును నీకు నీవే దాని వద్దకు వచ్చితివి, అదే నిన్నచటి జేర్చును "

చౌ॥ భలేహిఁ నాథ ఆయసు ధరి సీసా ।
బాఁధి తురగ తరు బైఠ మహీసా ॥
నృప బహు భాఁతి ప్రసంసేఉ తాహీ ।
చరన బంది నిజ భాగ్య సరాహీ ॥ 886

తా॥ మీ యాజ్ఞను శిరసావహించెదను స్వామి! యని నుడివి ప్రతాప భానుడు అశ్వమును వృక్షమునకు గట్టివేసి ఒకచో ఆసీను డాయెను పెక్కు విధ ముల మునిని ప్రశంసించెను ఆ ముని పాదపద్మములకు సాష్టాంగ నమస్కా రము జేసెను అటువంటి మహా మునిని సందర్శించిన తన భాగ్యమే భాగ్యమనెను

చౌ॥ పుని బోలేఉ మృదు గిరా సుహాఈ ।
జాని పితా ప్రభు కరఉఁ ఢిఠాఈ ॥
మోహి మునీస సుత సేవక జానీ ।
నాథ నామ నిజ కహహు బఖానీ ॥ 887

తా॥ మరల కోమలమైన వాణితో నిట్లనెను-ఓ ప్రభూ! నేను మీతో చనవుగా మాటలాడుట నా సాహసమే ఏలనన మిమ్ము నా తండ్రిగా భావించి నాను మునీశ్వరా! నన్ను మీ పుత్రునిగాను, సేవకునిగాను భావించి, మీ నామధేయమేదో తెలుపుడు మీ యునికిని గూర్చి విపులముగా నాకు తెలియ జేయుడు

చౌ॥ తేహి న జాన నృప నృపహి సో జానా ।
భూప సుహృద సో కపట సయానా ॥
బైరీ పుని ఛత్రీ పుని రాజా ।
ఛల బల కీన్హ చహఇ నిజ కాజా ॥ 888

తా॥ ప్రతాపభానుడు కపట మునిని గుర్తింప జాలకుండెను కాని మహా రాజైన ప్రతాపభానుని కపట మునివేషధారియైన రాజు గుర్తుపట్ట గలిగెను అతని మనస్సు నిర్మల మయ్యెను ప్రతాపభానుని నట్ల కడుమలినమే యయ్యెను పరి కించి చూడ అతడు వైరి మరియు క్షత్రియకుల సంజాతుడు అంతకుమించి రాజు అతడు మోసమనెడు ఆ నె బలముతో తన మనోవాంఛితమును సఫలముజేయ నుద్యుక్తుడాయెను

చౌ॥ సమిుఝి రాజసుఖ దుఖిత అరాతీ ।
అవాఁ అనల ఇవ సులగఇ ఛాతీ ॥
సరల బచన నృప కే సుని కానా ।
బయుర సంభారి హృదయఁ హరషానా ॥ 889

తా॥ ఆ సమయమున మునివేషధారియైన శత్రురాజు తన రాజ్యవైభవమును జ్ఞప్తికిదెచ్చుకొని దుఃఖితుడాయెను వాని హృదయము కుమ్మరి ఆవము వలె, లోలోన రగులుకొనుచుండెను మహారాజుయొక్క సరళ వచనములను విని అతడు వైరమును మరల జ్ఞప్తికి దెచ్చుకొని మనమున హర్షించెను

దో॥ కపట బోరి బానీ మృదుల బోలేఉ జుగుతి సమేత ।
నామ హమార భిఖారి అట నిర్ధన రహిత నికేత ॥ 890

తా॥ ఈర్ష్యను కపటత్వమును మనస్సునందుంచుకొని, కపటముని యుక్తిపూరితములైన వచనములను కోమలమైన వాణితో నిట్లనియె- "అప్పుడు నా పేరు భిక్షుకుడు ఎలాగా నేను నిర్ధనుడను (ధనహీనుడనని భావము) అనికేతుడను (ఇల్లు - వాకిలి లేనివాడని అర్థము)

చౌ॥ కహ నృప జే బిగ్యాన నిధానా ।
తుమ్హ సారిఖే గలిత అభిమానా ॥
సదా రహహిం అపనపౌ దురాఏఁ ।
సబ బిధి కుసల కుబేష బనాఏఁ ॥ 891

తా॥ అప్పుడు ప్రతాపభాను డిట్లనియె - "ఎవరు విజ్ఞాన పరిపూర్ణులో వారు సర్వదా అభిమానరహితులుగా నుందురు వారు తమ స్వస్వరూపమును సదా మరుగు పరచియే యుందురు అమంగళ వేషధారులైనను వారే అన్ని విధముల మంగళకరులు

చౌ॥ తేహి తేఁ కహహిం సంత శ్రుతి టేరేఁ ।
పరమ అకించన ప్రియ హరి కేరేఁ ॥
తుమ్హ సమ అధన భిఖారి అగేహా ।
హోత బిరంచి సివహి సందేహా ॥ 892

తా॥ అందువలననే వేదములు ఎలుగెత్తి యేమని చెప్పుచున్నవనగా పరమనిర్ధనుడు, సర్వదా అహంకార మమతా మానరహితుడే భగవానునకు ప్రియమైనవాడు అని ఒక వేదవాక్యమేకాదు సజ్జన వాక్యము నదియే ।

సీతో సమానమైన నిర్ధనుని, భిక్షుకుని గృహహీనుని, గాంచినచో బ్రహ్మ, శివుడు గూడ సందేహింతురు వాస్తవముగ సజ్జనుడా లేక భికారియా యని సందేహాస్పదులై దిగ్భ్రమ జెందెదరు

చౌ॥ జోసి సోసి తవ చరన నమామీ ।
మో పర కృపా కరిఅ అబ స్వామీ ॥
సహజ ప్రీతి భూపతి కై దేఖీ ।
ఆపు బిషయ బిస్వాస బిసేషీ ॥ 893

తా॥ మీ రెవరైన నౌదురు గాక నేను మీ పాదపద్మములకు ప్రణమిల్లు చున్నాడను ఓ స్వామీ, నా యందు కృపజూపుదురు గాక, " అన్న ప్రతాపభానుని విన్నపము నాలకించి, అతని సహజమైన ప్రీతి నభినందించుచు తన యందలి అధిక విశ్వాసమును గాంచి- (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ సబ ప్రకార రాజహి అపనాఈ ।
బోలేఉ అధిక సనేహ జనాఈ ॥
సును సతిభాఉ కహఉఁ మహిపాలా ।
ఇహాఁ బసత బీతే బహు కాలా ॥ 894

తా॥ అన్ని విధములుగా ప్రతాపభానుని తన వానిగా జేసికొని, అధిక స్నేహ వాత్సల్యముల గనపరచుచు కపటతపస్వి యిట్లనియె- "ఓ రాజా ! నేను నీతో సత్యమునే నుడివెదను నేనిక్కడ చాల కాలము నుండి వాసము జేయుచున్నాను

దో॥ అబ లగి మోహి న మిలేఉ కోఉ మైఁ న జనావఉఁ కాహుఁ।
లోకమాన్యతా అనల సమ కర తప కానన దాహు ॥ 895

తా॥ ఇంతవరకు నన్ను గలిసినవారు లేరు ఒకవేళ ఎవరైన వచ్చినను వారికి నేను కనపడను ఏలన లోకములో ప్రతిష్ఠ అగ్నితో సమానమైనది అది తపోరూపమైన అరణ్యమును భస్మము జేయ వైచును

సో॥ తులసీ దేఖి సుబేషు భూలహి మూఢ న చతుర నర ।
సుందర కేకిహి పేఖు బచన సుధా సమ అసన అహి ॥896

తా॥ శ్రీ తులసీదాసీ విధముగా జెప్పుచున్నారు-సుందర వేషమునుజూచి మూఢాతిమూఢులే- కాదు చతురులై వారు గూడ మోసపోయెదరు అత్యంత సుందరముగనున్న మయూరమును (నెమిలి) జూడుడు దాని యలుపులు అమృత మయములు కాని దాని ఆహారము సర్పము

చౌ॥ తాతే గుపుత రహఉఁ జగమాహీఁ ।
హరి తజి కిముపి ప్రయోజన నాహీఁ ॥
ప్రభు జానత సబ బినహి జనాఏఁ ।
కహహు కవని సిధి లోక రిఝాఏఁ ॥ 897

తా॥ కపట తపస్వి మరియు నిట్లనెను- అందువలన నేను జగత్తులో అజ్ఞాతవాసము జేయుచున్నాను శ్రీహరితప్ప నింకెవ్వరును నాకు హితకారులు కారు శ్రీవారి సర్వాంతర్యామి గనుక నా మేమియు దెలుపకియే ప్రభు వంతయు దెలిసికొనును నేనొక విషయమడిగెదను-ప్రాపంచికచింతలలోనుండు వారికి సిద్ధికలుగునా?

చౌ॥ తుమ్హ సుచి సుమతి పరమ ప్రియ మోరేఁ ।
ప్రీతి ప్రతీతి మోహి పర తోరేఁ ॥
అబ జౌఁ తాత దురావఉఁ తోహీ ।
దారున దోష ఘటఇ అతి మోహీ ॥ 898

తా॥ నీవు పవిత్రుడవు వివేకవంతుడవు, గనుకనే నాకు ప్రీతి పాత్రుడవైతివి నీకు గూడ నాయందు ప్రీతి, విశ్వాసములు గలవు నాయనా! ఇంతటి పరమపవిత్రుడవైన నీవద్ద నేనేమైన విషయములు చెప్పక దాచిన చొ భయంకర దోషములు సన్నాహరించును

చౌ॥ జిమి జిమి తాపసు కథఇ ఉదాసా ।
తిమి తిమి నృపహి ఉపజ బిస్వాసా ॥
దేఖా స్వబస కర్మ మన బానీ ।
తబ బోలా తాపస బగ ధ్యానీ ॥ 899

తా॥ ఎన్నెన్ని ఉదాసీనవాక్యములను తాన్వు చెప్ప దొడగెనో ఆ యా మాటలపై రాజు కట విశ్వాసము, సద్భావము పెంపొందెను కొంగజపము చేయు ఆ కపటముని మనోవాక్కాయ కర్మలతో తపసునము గావించుకొని మరల నిట్లనియె - (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ నామ హమార ఏకతను భాఈ ।
సుని నృప బోలేఉ పుని సిరు నాఈ ॥
కహహు నామ కర అరథ బఖానీ ।
మోహి సేవక అతి ఆపన జానీ ॥ 900

తా॥ నాయనా, నా పేరు ఏకతనువు అని విని రాజు మరల నమస్కరించి యిట్లనెను - "నన్ను మీ దాసాను దాసునిగా భావించి మీ నామమున కర్థమును విశదీకరింపుడు"

దో॥ ఆదిసృష్టి ఉపజీ జబహిం తబ ఉతపతి భై మోరి ।
నామ ఏకతను హేతు తేహి దేహ న ధరీ బహోరి ॥ 901

తా॥ రాజాడిన వినయపూర్వకవచనముల నాలకించి కపటముని రాజున కిట్లు ప్రత్యుత్తర మొసగెను - "ఆది సృష్టిప్రారంభమున నేను జన్మించితిని అప్పటినుండి నే నా శరీరములో నున్నాను ఇంకొక జన్మ నాకు కలుగలెదు, కనుక నా పేరు ఎకతనువు

చౌ॥ జని ఆచరజు కరహు మన మాహీం ।
సుత తప తేం దుర్లభ కఛు నాహీం ॥
తపబల తేం జగ సృజఇ బిధాతా ।
తపబల బిష్ణు భఏ పరిత్రాతా ॥ 902

తా॥ ఓ పుత్రుడా, నేనిట్లుండుటను జూచి ఆశ్చర్యపడకుము తపోధనులకు దుర్లభమైన దేదియును లేదు తపోబలముచే బ్రహ్మ సృష్టి జేయుచున్నాడు, తపోబలముచే విష్ణువు ఈ జగత్తును పాలించుచున్నాడు

చౌ॥ తపబల సంభు కరహిఀ సంఘారా ।
తప తేఀ అగమ న కఛు సంసారా ॥
భయుఉ నృపహి సుని అతి అనురాగా ।
కథా పురాతన కహై సో లాగా ॥ 903

తా॥ తపోబలముచే శంకరుడు సంహారమును జేయును ప్రపంచమున తపో బలముతో సాధింపరాని దేదియులేదు " ఇది విన్న తరువాత రాజనకా మునిపై అత్యంతానురాగము భక్తి తాత్పర్యములు కలిగెను అప్పుడా ముని రాజు తనకు వశుడైనాడని యెంచి పురాణగాథలను జెప్పఁదొడగెను

చౌ॥ కరమ ధరమ ఇతిహాస అనేకా ।
కరఇ నిరూపన బిరతి బిబేకా ॥
ఉదభవ పాలన ప్రలయ కహానీ ।
కహేసి అమిత ఆచరజ బఖానీ ॥ 904

తా॥ కర్మము, ధర్మము తో కూడిన అనేకప్రకారములైన ఇతిహాసము లను చెప్పెను వైరాగ్యమును జ్ఞానమును నిరూపణ గావించెను సృష్టిస్థితి లయములకు సంబంధించిన ఆశ్చర్యయుక్తమైన, అపారమైన కథలను విస్తార ముగ జెప్పెను

చౌ॥ సుని మహీప తాపస బస భయుఊ ।
ఆపన నామ కహన తబ లయుఊ ॥
కహ తాపస నృప జానఉఀ తోహీ ।
కీన్హేహు కపట లాగ భల మోహీ ॥ 905

తా॥ కపటముని చెప్పిన దంతయు శ్రద్ధగా విని, అతడు కపటవేషధారి యని యెఱుంగక రాజాతనికి వశుడై తన యథార్థనామము నాతనికి జెప్పెను

అది విన్నవాడై కపటముని దివ్యదృష్టితో తానంతయు దెలిసికొన్న తపస్వివలె నటించుచు పలు నిట్లనియె—

"రాజా, నిన్ను నే నెఱుగుదును నీవు నన్ను మోసగించితివని నాకు తెలి యును నీవు నన్ను మోసగించినను, నాకు నీపై కోపమెంతమాత్ర మును లేదు నీవు చేసినదంతయు మంచిదేయని నాకు దోచుచున్నది నీ చాతుర్య మునకు నేను ఎంతయెల్లి నిన్ను శ్లాఘించుచున్నాను

సో॥ సును మహీస అసి నీతి జహఁ తహఁ నామ న కహహిఁ
నృప।
మోహి తోహి పర అతి ప్రీతి సోఇ చతురతా బిచారి తవ॥
906

తా॥ రాజా, రాజులైనవారలు తమ నామధేయముల నెచ్చటను జెప్పరని ప్రతీతి నీవు కూడ అందుల కనుగుణముగ ప్రవర్తించితివి కాదోలు, నీ చాతు ర్యము నన్నెంతయో ఆకర్షించినది అంతేగాక నీపై ప్రేమానురాగము లుదయించినవి

చౌ॥ నామ తుమ్హార ప్రతాప దినేసా।
సత్యకేతు తవ పితా నరేసా॥
గుర ప్రసాద సబ జానిఅ రాజా।
కహిఅ న అపన జాని అకాజా॥ 907

తా॥ నీ నామధేయము ప్రతాపభానుడు, నీవు సత్యకేతు మహారాజు పుత్రుడవు రాజా, గురు కృపవలన నాకు సర్వము విదితమైనది కాని నీకు హానియగునని తలచి చెప్పుటలేదు సుమా।

చౌ॥ దేఖి తాత తవ సహజ సుధాఈ।
ప్రీతి ప్రతీతి నీతి నిపునాఈ॥
ఉపజి పరీ మమతా మన మోరేఁ।
కహఉఁ కథా నిజ పూఛే తోరేఁ॥ 908

తా॥ నాయనా, నీ స్వాభావికమైన సరళత్వము, ప్రేమ, విశ్వాసము నీతి నైపుణ్యములను జూచిన తర్వాత నామనంబున నీయందమిత ప్రీతి జనించినది అందుకే నీ వడిగినతోడనే అతిగోప్యమైన నా ఆత్మకథను నీకు వివరించుచున్నాను

చౌ॥ అబ ప్రసన్న మై సంసయ నాహీం ।
మాగు జో భూప భావ మన మాహీం ॥
సుని సుబచన భూపతి హరషానా ।
గహి పద బినయ కీన్హి బిధి నానా ॥ 909

తా॥ ఇప్పుడు నీయందు ప్రసన్నుడనై తిని, ఇక నీవు సంశయింప వలదు రాజా నీ మనోఽభీష్టము నా కెఱింగింపుము "

ఇట్లు ప్రీతి ప్రియవచనములను ముని చెప్పగా విని, రాజ మిగుల హర్షించి ముని పాదములను బట్టుకొని బహు ప్రకారములుగ స్తుతించెను

చౌ॥ కృపాసింధు ముని దరసన తోరేం ।
చారి పదారథ కరతల మోరేం ॥
ప్రభుహి తథాపి ప్రసన్న బిలోకీ ।
మాగి అగమ బర హోఉం అసోకీ ॥ 910

తా॥ "ఓ దయాసాగరా, నీ సందర్శన భాగ్యమువలననే నాకు నాల్గు పదార్థములు - ధర్మార్థకామమోక్షములు కరతలామలకములైనవి స్వామి నీవు నాయందు ప్రసన్నుడవైనను, నేను దుర్లభవరము నే దైనను కోరి యెందులకు శోకరహితుడను కాకూడదు

దో॥ జరా మరన దుఖ రహిత తను సమర జితై జని కోఉ ।
ఏక ఛత్రి రిపుహీన మహి రాజ కలప సత హోఉ ॥ 911

తా॥ నేను వార్ధక్యమొందక యుండెదను గాక; మృత్యుంజయుడను, శోక రహితుడ నగుదును గాక; అజేయుడ నగుదును గాక; పృథ్వియందు శతయుగ ముల పర్యంతము నిష్కంటకమైన ఏకఛత్రాధిపత్యము వహింతునుగాక "

చౌ॥ కహ తాపస నృప ఐసెఇ హోఊ ।
కారన ఏక కఠిన సును సోఊ ॥
కాలఉ తుఅ పద నాఇహి సీసా ।
ఏక బిప్రకుల ఛాడి మహీసా ॥ 913

తా॥ అంత తపస్వి యిట్లనియె- "రాజా, అట్లేయగుగాక, కాని, యింటిలో ఒకటి మాత్రము కఠినమైనది, దానిని గూడ జెప్పెదను వినుము

మహీపాలా, కేవలము బ్రాహ్మణులు దప్ప, కాలుడు (యముడు) కూడ నీ పాదములకు నమస్కరించును

చౌ॥ తపబల బిప్ర సదా బరిఆరా ।
తిన్హ కే కోప న కోఉ రఖవారా ।
జౌఁ బిప్రన్హ బస కరహు నరేసా ।
తౌ తుఅ బస బిధి బిష్ను మహేసా ॥ 913

తా॥ బ్రాహ్మణులు బ్రహ్మతేజముతో వెలరారుచుందురు తపోబలముచే బ్రాహ్మణులు బలవంతులైనారు వారి ఆగ్రహమునకు గురియైనచో, రక్షించువారెవ్వరును లేరు

రేశా కనుక నీవు ప్రథమమున బ్రాహ్మణుల నెట్లయినను వశము చేసికొనుము నీ కృపవలనను చాతుర్యము వలనను బ్రాహ్మణులను నీ వశము గావించుకొంటివేని, ఇక బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నీ అధీనులై నట్లే

చౌ॥ చల న బ్రహ్మకుల సన బరిఆఈ ।
సత్య కహఉఁ దోఉ భుజా ఉఠాఈ ॥
బిప్ర శాప బిను సును మహిపాలా ।
తోర నాస నహిఁ కవనేహుఁ కాలా ॥ 914

తా॥ బ్రాహ్మణకులముతో వైరము బూనకుము వారిని ఇష్టానుసారము శాసింపకుము వారిపై నీ యాధిపత్యమే మాత్రము సాగదు నేను నా రెండు భుజముల నెత్తి సత్యమునే వచించుచున్నాను రాజా, బ్రాహ్మణుల శాపమునకు నీవు గురియైన తప్ప నీ నాశము ఏకాలమున మరెవ్వరివలన గాదు ఇది ముమ్మాటికిని సత్యము"

చౌ॥ హరషేఉ రాఉ బచన సుని తాసూ ।
నాథ న హోఇ మోర అబ నాసూ ॥
తవ ప్రసాద ప్రభు కృపా నిధానా ।
మో కహుఁ సర్బ కాల కల్యానా ॥ 915

తా॥ కపటముని వచనములను విని రాజు ఆశ్చర్యచకితుడై మరల నిట్లు చెప్పఁ దొడగెను

"ఓ స్వామి, కృపానిధీ, నా నాశ మిప్పుడు కలుగకుండుగాక, మీ కృప వలన సర్వకాల సర్వావస్థలయందు నాకు మంగళమే యగును"

దో॥ ఏవమస్తు కహి కపటముని బోలా కుటిల బహోరి ।
మిలబ హమార భులాబ నిజ కహహు త హమహి న ఖోరి॥916

తా॥ అట్లే యగుగాక యని చెప్పి కపటముని మరియు నిట్లనియె- "కాని రాజా, నీవు నాతో గలిసిన విధానమును, నీవు అరణ్యమున వేటకువచ్చి దారితప్పి పైనమును ఎవ్వరితోనైన జెప్పిన, అది నా తప్పేమియు గాదు

చౌ॥ తాతేఁ మైఁ తోహి బరజఉఁ రాజా ।
కహేఁ కథా తవ పరమ అకాజా ॥
చఠేఁ శ్రవన యహ పరత కహానీ ।
నాస తుమ్హార సత్య మమ బానీ ॥ 917

తా॥ రాజా, ఈ ప్రసంగము నితరులకు జెప్పినచో నీకు హాని కలుగునని తలచి దీని నతి గోప్యముగా నుంచుకొనుమని నీకు హెచ్చరిక చేయుచున్నాను

ఇతరుల శ్రవణములం దీవాక్కులు పడినచో నీకు హాని కలుగును నా వచనములు ముమ్మాటికిని సత్యము సుమా।

చౌ॥ యహ ప్రగటేఁ అథవా ద్విజశాపా ।
నాస తోర సును భానుప్రతాపా ॥
ఆన ఉపాయఁ నిధన తవ నాహీఁ ।
జౌఁ హరి హర కోపహిఁ మన మాహీఁ ॥ 918

తా॥ ఓ ప్రతాపభానుడా, నీవు నన్ను గలిసిన వైనము గూర్చి యితరులకు జెప్పినచో లేక బ్రాహ్మణుల శాపముచే గాని నీకు పతనము కలుగును. అంతేకాని శివ బ్రహ్మదు లాగ్రహించినను నీకు మృత్యువు సంభవింపదు."

చౌ॥ సత్య నాథ పద గహి నృప భాషా ।
ద్విజ గుర కోప కహహు కో రాఖా ॥
రాఖఇ గుర జౌఁ కోప బిధాతా ।
గుర బిరోధ నహిఁ కోఉ జగ త్రాతా ॥ 919

తా॥ అపిన రాజు ముని చరణకమలములకు ప్రణమిల్లి యిట్లనెను—
"స్వామీ, మున్మాటికిని సత్యమే బ్రాహ్మణులు గురువులు—వారి ఆగ్రహమునకు గురియైనచో రక్షింపగలవారుండురా విధాత ప్రతికూలుడైనను లేక ఆగ్రహపూరితుడైనచో, గురువు నాశ్రయించిన గురువు రక్షించును కాని గురువుతోడ వైరముబూనిన జగత్తునందు నెవ్వరును రక్షింపరు, రక్షింపబోరు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ జౌఁ న చలబ హమ కహే తుమ్హారేఁ ।
హోఉ నాస నహిఁ సోచ హమారేఁ ॥
ఏకహిఁ డర డరపత మన మోరా ।
ప్రభు మహిదేవ శాప అతి ఘోరా ॥ 920

తా॥ స్వామి, మీ యాదేశానుసారము నేను నడచుకొనలేక పోయినచో, నా నాశము తప్పదు అందులకు నేను చింతిల్లుటలేదు బ్రాహ్మణులు కోపించినచో అది భయంకరమే యన్న విషయము నా మనస్సును పీడించుచున్నది కేవలము భయము తప్ప నాకింకేమియును లేదు

దో॥ హోహిఁ బిప్ర బస కవన బిధి కహహు కృపా కరి సోఉ ।
తుమ్హ తజి దీనదయాల నిజ హితూ న దేఖఉఁ కోఉ ॥921

తా॥ ఆ బ్రాహ్మణులను వశపరచుకొను విధానమును గూర్చి నాకు తెలియజేయుడు ఓ దీనదయాళా మీరు తప్ప నా హితము కోరువారింకెవ్వరును లేరు"

చౌ॥ సును నృప బిబిధ జతన జగ మాహీఁ ।
కష్ట సాధ్య పుని హోహిఁ కి నాహీఁ ॥
అహఇ ఏక అతి సుగమ ఉపాఈ ।
తహాఁ పరంతు ఏక కఠినాఈ ॥ 922

తా॥ అప్పుడా తపస్వి యిట్లనియె— "రాజా, ప్రపంచములో ఎన్నియో యుపాయములున్నవి. అవి కష్టసాధ్యములు. ఒకవేళ కష్టపడినను సిద్ధికలుగునో లేదో యన్న సంశయము నాకు కలుగుచున్నది. కనుక కార్య సఫలత నిశ్చిత మగుటలేదు. కాని ఒక యుపాయమున్నది, అది కూడ చాల కఠినమైనదియే.

చౌ॥ మమ ఆధీన జుగుతి నృప సోఈ ।
మోర జాబ తవ నగర న హోఈ ॥
ఆజు లగేఁ అరు జబ తేఁ భయఉఁ ।
కాహూ కే గృహ గ్రామ న గయఉఁ ॥ 923

తా॥ రాజా, యుక్తిసూత్రము నా యధీనమైనది. దానిని నీకు తెలియ జేసెదను. కాని నీ నగరమునకు నేను వచ్చుట సిద్ధింపదు. ఎలనన నేను జన్మించి నప్పటినుండి యింతవరకు ఎవరి గృహమునకు, అథవా గ్రామమునకు గాని పోయియుండలేదు.

చౌ॥ జౌఁ న జాఉఁ తవ హోఇ అకాజూ ।
బనా ఆఇ అసమంజస ఆజూ ॥
సుని మహీస బోలేఉ మృదుబానీ ।
నాథ నిగమ అసి నీతి బఖానీ ॥ 924

తా॥ ఇప్పుడు పోకయుండినచో నీకార్యము చెడిపోవును. నా కిది అసమంజసమే యైనది" అనిన విని, రాజు మృదుమధురముగ నిట్లనియె— "స్వామీ, వేదములలో గూడ ఇటువంటి నీతినే చెప్పెదరు.

చౌ॥ బడే సనేహ లఘున్హ పర కరహీఁ ।
గిరి నిజ సిరని సదా తృన ధరహీఁ ॥
జలధి అగాధ మౌలి బడ పేనూ ।
సంతత ధరని ధరత సిర రేనూ ॥ 925

తా॥ పెద్దవారు చిన్నవారితో స్నేహము సల్పుచుండెదరు అది ఎట్లన పర్వతము తన శిరస్సుపై సదా తృణమును ధరించియుండును, అగాధమైన సముద్రము తన మస్తకముపై నురుగును ధరించియుండును, ధరణి తన శిరస్సుపై సదా ధూళి నుంచుకొనియే యుండును "

దో॥ అస కహి గహే నరేస పద స్వామీ హోహు కృపాల ।
మోహి లాగి దుఖ సహిఅ ప్రభు సజ్జన దీనదయాల ॥926

తా॥ అని చెప్పుచు రాజు మరల ముని పాదములను బట్టుకొని యిట్లనెను- "ఓ స్వామి, నాయందు కృపజూపుడు, మీరు సజ్జనులు దీనదయాళురు, నాకోసమెంతటి కష్టపరంపరలైనను తమరు అవశ్యముగ సహించియే తీరవలయును "

చౌ॥ జాని నృపహి అపన ఆధీనా ।
బోలా తాపస కపట ప్రబీనా ॥
సత్య కహఉఁ భూపతి సును తోహీ ।
జగ నాహిన దుర్లభ కఛు మోహీ ॥ 927

తా॥ రాజన్నివిధముల తనకు అధీనమగుట గాంచి కపటవ్యాపారమందు ప్రవీణుడైన తపస్వి యీ విధముగ నుడివెను-

"ఓ రాజా, నేను నీతో సత్యమునే వచించుచున్నాను ఈ జగత్తునందు నాకు దుర్లభమైన దేదియును లేదు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ అవసి కాజ మైఁ కరిహఉఁ తోరా ।
మన తన బచన భగత తైఁ మోరా ॥
జోగ జుగతి తప మంత్ర ప్రభాఊ ।
ఫలఇ తబహిఁ జబ కరిఅ దురాఊ ॥ 928

తా॥ నీవు మనోవాక్కాయకర్మలతో నా భక్తుడవు కావున నీ కార్యమవశ్య మునెరవేరును. జప తపో, యోగ యుక్తి, మంత్రములు రహస్యముగ ఒనర్చి నచో ఫలవంతమగును వాటి ప్రభావమప్పుడే గానవచ్చును

చౌ॥ జౌఁ నరేస మైఁ కరౌఁ రసోఈ ।
తుమ్హ పరుసహు మోహి జాన న కోఈ ॥
అన్న సో జోఇ జోఇ భోజన కరఈ ।
సోఇ సోఇ తవ ఆయసు అనుసరఈ ॥ 929

తా॥ ఓ నరేశా నేను వంట చేసినచో ఆ వడ్డింపబడిన అహారమును గాని నన్ను గాని నీవు తెలిసికొన జాలవు. ఇంకను, ఆ అన్నము నెవరెవరు భుజింతురో, వారందరును నీ ఆజ్ఞాకారులగుదురు నీ అధీనములో నుందురు

చౌ॥ పుని తిన్హ కే గృహ జేవఁ ఇ జోఊ ।
తవ బస హోఇ భూప సును సోఊ ॥
జాఇ ఉపాయ రచహు నృప ఏహూ ।
సంబత భరి సంకలప కరేహూ ॥ 930

తా॥ అంతేకాదు ఆ భోజనశాల యందెవ్వరు భుజింతురో, వారందరు గూడ నీ యధీనమౌదురు కనుక రాజా, సంవత్సర పర్యంతము అన్నదానము జేయుటకు సంకల్పము జేయుము

దో॥ నిత నూతన ద్విజ సహస సత బరేహు సహిత పరివార ।
మైఁ తుమ్హరే సంకల్ప లగి దినహిఁ కరబి జేవనార ॥ 931

తా॥ నిత్యము ఒక లక్ష బ్రాహ్మణులను కుటుంబ సహితముగా భోజన సంతర్పితులను చేయుము నీ సంకల్పము నెరవేరువరకును సంవత్సరకాలము ప్రతిదినము భోజనము తయారు చేయించు చుండెదను

చౌ॥ ఏహి బిధి భూప కష్ట అతి థోరేం ।
హోఇహహిం సకల బిప్ర బస తోరేం ॥
కరిహహిం బిప్ర హోమ మఖ సేవా ।
తేహిం ప్రసంగ సహజేహిం బస దేవా ॥ 932

తా॥ ఈ ప్రకారము కొలది పరిశ్రమతోనే బ్రాహ్మణులందరును నీకు వశులయ్యెదరు బ్రాహ్మణులు యజ్ఞ, హవన, సేవా పూజాదులు నిత్యమొనర్చెదరు గావున వారే వశమైనచో, ఆ సంబంధమువలన దేవతలు గూడ నీ వశమయ్యెదరు

చౌ॥ ఔర ఏక తోహి కహఉం లఖాఊ ।
మైం ఏహిం బేష న ఆఉబ కాఊ ॥
తుమ్హరే ఉపరోహిత కహుం రాయా ।
హరి ఆనబ మైం కరి నిజ మాయా ॥ 933

తా॥ ఎన్నడును నే నీ రూపములో అచ్చటికి రాను గనుక నన్ను గుర్తుపట్టు విధానమును గూర్చి నీకు జెప్పెదను

రాజా, నేను నా మాయాజాలముచే నీ పురోహితుని హరించి తెచ్చెదను

చౌ॥ తపబల తేహి కరి ఆపు సమానా ।
రఖిహఉం ఇహాం బరష పరవానా ॥
మైం ధరి తాసు బేషు సును రాజా ।
సబ బిధి తోర సంవారబ కాజా ॥ 934

తా॥ తపోబలముచే వానిని నాయంతటి వానిగా నొనర్చి, ఒక సంవత్సరము వఱకు ఇక్కడే యుంచుకొనెదను రాజా, నేను వాని రూపము ధరించి నీ కార్యము సఫల మొనర్తును

చౌ॥ గై నిసి బహుత సయన అబ కీజే ।
మోహి తోహి భూప భేంట దిన తీజే ॥
మైం తపబల తోహి తురగ సమేతా ।
పహుంచైహఉం సోవతహి నికేతా ॥ 935

తా॥ రాజా, ఈ రాత్రి చాలగడచిపోయి ది నీ వికశయనింపుము ఈ రోజుమొదలు తరువాతి మూడు దినములకు నిన్ను మరల నేను గలియుదును

ఇప్పు — అపోబలముచే శయినించిన నిన్ను మ నీ యశ్వమును నీ ఖవ ము జేర్చె ప

దో॥ మైం ఆఉబ సోఇ బేషు ధరి పహిచానేహు తబ మోహి ।
జబ ఏకాంత బోలాఇ సబ కథా సునావౌం తోహి ॥ 936

తా॥ నేను పురోహితుని రూపము ధరించి నీ నగరమునకు వచ్చెదను ఎప్పుడు నిన్ను విలిచి యేకాంతముగా జరిగిన కథయంతియు వినిపింతునో అప్పుడు నీవు నన్ను గుర్తు పట్టుము ”

చౌ॥ సయన కీన్హ నృప ఆయసు మానీ ।
ఆసన జాఇ బైఠ ఛలగ్యానీ ॥
శ్రమిత భూప నిద్రా అతి ఆఈ ।
సో కిమి సోవ సోచ అధికాఈ ॥ 937

తా॥ రాజు ముని వచనముల నాలకించి, ముని అజ్ఞను పొంది, అంతట జెందినవాడగుట గాఢనిద్ర అవరింప శయినించెను

కపట ని తన ఆసనమున మరల తాసీనుడాయెను అలసట జెంది యుం ట వల రాజు నిద్రాదేవి యొడిలో విశ్రాంతి నొందెను కాని కపటమే జీవితముగా గవానికి నిద్ర యెట్లు వచ్చును? చింతాక్రాంతునకు నిద్ర కరవే! ఈ కపటముని డు చింతాక్రాంతుడై యుండుట వలన వాని మనస్సు పరి పరి విధముల బోయెను

చౌ॥ కాలకేతు నిసిచర తహం ఆవా ।
జేహిం సూకర హోఇ నృపహి భులావా ।
పరమ మిత్ర తాపస నృప కేరా ।
జానఇ సో అతి కపట ఘనేరా ॥ 938

తా॥ అప్పుడు కాలకేతుడను రాక్షసు డచ్చటికి వచ్చెను ఆ కాలకేతుడను రాక్షసుడే వరాహరూపము ప్రతాపభానుని భ్రాంతిపరచినట్లు చేసినది వాడు కపటమునికి మిత్రుడు మోసమునం దారితేరిన వాడు

చౌ॥ తేహి కే సత సుత అరు దస భాఈ ।
ఖల అతి అజయ దేవ దుఖదాఈ ॥
ప్రథమహిఁ భూప సమర సబ మారే ।
బిప్ర సంత సుర దేఖి దుఖారే ॥ 939

తా॥ వానికి నూరుగురు పుత్రులు, పదిమంది అన్నదమ్ములుండిరి వారు మిక్కిలి దుష్టులు వారిని జయింప దేవతలకు సాధ్య మగాకుండెను

బ్రాహ్మణులు, సజ్జనులు, దేవత లమితదుఃఖము నొందుటఁ గాంచి ప్రతాపభానుడు ఆ రాక్షసులందరిని యుద్ధమున హతమొనర్చియుండెను

చౌ॥ తేహిఁ ఖల పాఛిల బయరు సఁభారా ।
తాపస నృప మిలి మంత్ర బిచారా ॥
జేహిఁ రిపు ఛయ సోఇ రచేన్హి ఉపాఊ ।
భావీ బస న జాన కఛు రాఊ ॥ 940

తా॥ ఆ దుష్టుడు పూర్వ వైరమును పురస్కరించుకొని, కపటమునితో శత్రునాశ మే విధముగ జరుగునో ఆ యుపాయము నాలోచించెను

శత్రువును నాశముచేయు నుపాయమును ఇరువురును చర్చిరి విధి వశమున, దానిని గూర్చి ప్రతాపభానుడు ఇసుమంతయు దెలిసికొనలేక పోయెను

దో॥ రిపు తేజసీ అకేల అపి లఘు కరి గనిఅ న తాహు ।
అజహుఁ దేత దుఖ రబి ససిహి సిర అవసేషిత రాహు॥941

తా॥ అమిత పరాక్రమవంతుడు, తేజస్వియైన శత్రువు ఒంటరిగా చిక్కిననో, అది సామాన్యమైన కష్టమని భావింపకుడు రాహువు శిరస్సు మాత్రము చైతన్యవంతమై యిప్పటికిని సూర్యచంద్రులను బాధించుచు దుఃఖితులుగ నొనరించుచున్నాడు కనుక శత్రుశేషము డిన ఏనాటికైనను పతనము తప్పదు

చౌ॥ తాపస నృప నిజ సఖహి నిహారీ ।
హరషి మిలేఉ ఉఠి భయఉ సుఖారీ ॥
మిత్రహి కహి సబ కథా సునాఈ ।
జాతుధాన బోలా సుఖ పాఈ ॥ 942

తా॥ కపటముని తనమిత్రుని సంతోషముగా గలసి ఆదరించి గౌరవించెను అతడు మిత్రునికి జరిగినదంతయు వివరించెను అప్పుడు రాక్షసు డానందము పొంది యిట్లనెను (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ అబ సాధేఉఁ రిపు సునహు నరేసా ।
జౌఁ తుమ్హ కీన్హ మోర ఉపదేసా ॥
పరిహరి సోచ రహహు తుమ్హ సోఈ ।
బిను ఔషధ బిఆధి బిధి ఖోఈ ॥ 943

తా॥ "రాజా, నా యాదేశానుసారము నీవింతటి యుపకారము నొనర్చితివి ఆ శత్రువు చేజిక్కినట్లే। నీ విక చింతించుట మాని సుఖముగా నిద్రింపుము బాధను కలిగించు నిమిత్తము లేకియే దైవము వ్యాధిలేకుండ జేసెను (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ కుల సమేత రిపు మూల బహాఈ ।
చౌథే దివస మిలబ మైఁ ఆఈ ॥
తాపస నృపహి బహుత పరితోషీ ।
చలా మహాకపటీ అతిరోషీ ॥ 944

తా॥ (వృక్షమును వేరుతో సహా పెకలించు నట్లు) శత్రువును, శత్రుకులమును నాశనమొనర్చి ఇంక నాలుగుదినములలో నిన్ను గలియుదును —"

అని కపటమునికి జెప్పి, మహామాయావియు అత్యంత క్రోధావేశపరుడై ఆ రాక్షసుడు వెడలిపోయెను

చౌ॥ భాను ప్రతాపహి బాజి సమేతా ।
పహుఁచాఏసి ఛన మాఝ నికేతా ॥
నృపహి నారి పహిఁ సయన కరాఈ ।
హయగృహఁ బాఁధేసి బాజి బనాఈ ॥ 945

తా॥ క్షణములో రాక్షసుడు అశ్వసమేతముగ ప్రతాపభానుని ఆతని భవనమున జేర్చెను రాజును అంతఃపురమున రాణి శయనించు శయనమందిరమున జేర్చి అశ్వమును అశ్వశాలలో గట్టి వేసెను

దో॥ రాజా కే ఉపరోహితహి హరి లై గయఉ బహోరి ।
లై రాఖేసి గిరి ఖోహ మహుఁ మాయాఁ కరి మతి భోరి ॥ 946

తా॥ తరువాత రాజపురోహితుని దెచ్చెను. తన మాయచేత వాని బుద్ధి భ్రమించునట్లు చేసి వానిని కొండ గుహలో దాచెను.

చౌ॥ ఆపు బిరచి ఉపరోహిత రూపా ।
పరేఉ జాఇ తేహి సేజ అనూపా ॥
జాగేఉ నృప అనభఏఁ బిహానా ।
దేఖి భవన అతి అచరజు మానా ॥ 947

తా॥ తాను స్వయముగా పురోహితుని రూపమును ధరించి, ప్రతాపభానుని నగరమున సుందరమైన పాన్పుపై శయనించెను.

ప్రతాపభానుడు ఉషఃకాలమున మేల్కాంచి తాను లోని భవనమునం దుండుటను గాంచి మిగుల ఆశ్చర్యము నొందెను.

చౌ॥ ముని మహిమా మనమహుఁ అనుమానీ ।
ఉఠేఉ గవఁహిఁ జేహిఁ జాన న రానీ ॥
కానన గయఉ బాజి చఢి తేహీఁ ।
పుర నర నారి న జానేఉ కేహీఁ ॥ 948

తా॥ తా నంతఃపురమున శయనమందిరమునం దుండుట ముని మహిమ వలననే సంభవించినదని రాజు తనమనంబున తలపోసినవాడై రాణికి దెలియకుండునట్లు మెల్లగా పాన్పునుండి లేచెను. మరల తానెక్కి వచ్చియున్న అశ్వము నారోహించి కాననమున కేగెను. ఈ విషయము రాణికి గాని నగర నివాసులకు గాని తెలియదాయెను.

చౌ॥ గఏఁ జామ జుగ భూపతి ఆవా ।
ఘర ఘర ఉత్సవ బాజి బధావా ॥
ఉపరోహితహి దేఖి జబ రాజా ।
చకిత బిలోక సుమిరి సోఇ కాజా ॥ 949

తా॥ పురోహితుడు వేదములో వర్ణించిన రీతిగా షడ్రసోపేతమునైన చతుర్విధ ఎనైన భోజన పదార్థములను తయారు చేసెను తన మాయాజాలముచే వంటకములను తయారు చేసెను ఎన్నిరకములైన పదార్థములను జేసెనో, అవి యెన్న సాధ్యము కావు

చౌ॥ బిబిధ మృగన్హ కర ఆమిష రాంధా ।
తేహి మహుఁ బిప్ర మాఁసు ఖల సాఁధా ॥
భోజన కహుఁ సబ బిప్ర బోలాఏ ।
పద పఖారి సాదర బైఠాఏ ॥ 953

తా॥ అనేకప్రకారములైన పశువుల మాంసమును తయారు చెసెను ఆ దుష్టుడు భోజన పదార్థములలో మాంసమును మిశ్రితము జేసెను బ్రాహ్మణులను భోజనమునకు అత్యాదరముతో నాహ్వానించెను వారి పాదము లు గడిగి సగౌరవముగ వారి నాసీనులను గావించెను

చౌ॥ పరుసన జబహిఁ లాగ మహిపాలా ।
భై అకాసబానీ తేహి కాలా ॥
బిప్రబృంద ఉఠి ఉఠి గృహ జాహూ ।
హై బడి హాని అన్న జని ఖాహూ ॥ 954

తా॥ భోజన పదార్థములు వడ్డించబడెను రాజ గూడ వడ్డించు సమయమున కాలకేతుకృత ఆకాశవాణి యిట్లు పలికెను— "ఓ బ్రాహ్మణోత్తములారా లేచి మీ మీ గృహములకు పొండు ఈ అన్నమును వెంతమాత్రమును భుజింపకుడు దీనిని దిన్నచో మీకు హాని కలుగును (ముందు దోహతో అన్వయము)

చౌ॥ భయఉ రసోఈఁ భూసుర మాఁసూ ।
సబ ద్విజ ఉఠే మాని బిస్వాసూ ॥
భూప బికల మతి మోహఁ భులానీ ।
భావీ బస న ఆవ ముఖ బానీ ॥ 955

తా॥ ఏలని వంటకములు మాంసముచే తయారుచేయబడినవి

ఉది ఆకాశవాణి యని విశ్వసించి బ్రాహ్మణులు దిగ్గున లేచిరి ప్రతాప భానుడు వ్యాకులత నొందెను అట్లుండినను వాని బుద్ధి మోహముతో గూడినదై యుండెను భావి ననుసరించి ఆ రాజు నోటినుండి యొక మాటైనను వెలువడ లేదు

దో॥ బోలే బిప్ర సకోప తబ నహిం కఛు కీన్హ బిచార ।
జాఇ నిసాచర హోహు నృప మూఢ సహిత పరివార ॥956

తా॥ అప్పుడు బ్రాహ్మణులు కోపావేశముతో గూడిన వారలైన కారణ ... ముందువెనుక లాలోచించక యిట్లనిరి – "ఓరీ మూర్ఖుడా, నీవు పరివార సహా... గ రాక్షసుడ వగుదువు గాక ।

చౌ॥ ఛత్రిబంధు తైం బిప్ర బోలాఈ ।
ఘాలై లిఏ సహిత సముదాఈ ॥
ఈశ్వర రాఖా ధరమ హమారా ।
జైహసి తైం సమేత పరివారా ॥ 957

తా॥ ... క్షత్రియుడా, నీవు పరివారముగ బ్రాహ్మణులను బిలిపించి వారికి కీడెంచితివి కాని, దైవము మాయందయనుపాలించి, మా ధర్మమును రక్షించెను ... – నీవు పరివారయుక్తముగ నాశమగుదువు గాక ।

చౌ॥ సంబత మధ్య నాస తవ హోఊ ।
జలదాతా న రహిహి కుల కోఊ ॥
నృప సుని శాప బికల అతి త్రాసా ।
భై బహోరి బర గిరా అకాసా ॥ 958

తా॥ ఒక సంవత్సరములోన నీ నాశము జరిగి తీరును నీ వంశములో కొక జలదాత (నీరిచ్చువాడు) గూడ నుండబోడు " ఆ శాపమును విని రాజు భయములో కంపించి అత్యంత వ్యాకులత నొందెను అప్పుడు ఆకాశవాణి యిట్లు ... లికెను (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ బిప్రహు శాప బిచారి న దీన్హా ।
నహిఁ అపరాధ భూప కఛు కీన్హా ॥
చకిత బిప్ర సబ సుని నభబానీ ।
భూప గయఉ జహఁ భోజన ఖానీ ॥ 959

తా॥ "బ్రాహ్మణులారా మీరు బాగుగా ఆలోచించి శాపమొసంగలేదు ఇందు రాజు చేసిన అపరాధ మేమియు లేదు."

అని ఆకాశవాణి పలికినంతనే బ్రాహ్మణులు ఆశ్చర్యపడిరి అప్పుడు రాజు భోజనశాలకు పోయి చూచెను

చౌ॥ తహఁ న అసన నహిఁ బిప్ర సుఆరా ।
ఫిరేఉ రాఉ మన సోచ అపారా ॥
సబ ప్రసంగ మహిసురన్హ సునాఈ ।
త్రసిత పరేఉ అవనీ అకులాఈ ॥ 960

తా॥ అచ్చట వడ్డించిన భోజనపదార్థములు గాని వంటకములు గాని బ్రాహ్మణులు గాని లేరు అట్టితఱి రాజు మనంబున అపారమైన చింతవొడమ అటులే తిరిగి వచ్చెను రాజు దుఃఖితుడై జరిగిన వృత్తాంతమును బ్రాహ్మణులకు వినిపించెను తదుపరి భయకంపితుడై వ్యాకులతనొంది గిరగిర దిరుగుచు నేలం బడియెను

దో॥ భూపతి భావీ మిటఇ నహిఁ జదపి న దూషన తోర ।
కియేఁ అన్యథా హోఇ నహిఁ బిప్రశాప అతి ఘోర ॥ 961

తా॥ "రాజా నీ దోష మేమియు లేకున్నను, కానున్నది కాకపోదు బ్రాహ్మణుల శాపము భయంకరమైనది దానిని తొలగింప నెవ్వరికిని శక్యము గాదు"

చౌ॥ అస కహి సబ మహిదేవ సిధాఏ ।
సమాచార పురలోగన్హ పాఏ ॥
సోచహిఁ దూషన దైవహి దేహీఁ ।
బిరచత హంస కాగ కియ జేహీఁ ॥ 962

చౌ॥ సత్యకేతు కుల కోఉ నహి బాంచా ।
బిప్రశాప కిమి హోఇ అసాంచా ॥
రిపు జీతి సబ నృప నగర బసాఈ ।
నిజ పుర గవనే జయ జసు పాఈ ॥ 965

తా॥ సత్యకేతు కులమునందెవ్వరును బ్రతుకలేదు బ్రాహ్మణులశాపము వ్యర్థమగునా !

శత్రువుల జయించి రాజులందఱును విజయలక్ష్మితో యశముతో వారి వారి నగరములకు వెళ్ళిరి

## రావణుని జననము

దో॥ భరద్వాజ సును జాహి జబ హోఇ బిధాతా బామ ।
ధూరి మేరుసమ జనక జమ తాహి బ్యాలసమ దామ ॥966

తా॥ యాజ్ఞవల్క్యమహాముని భరద్వాజునితో ఇట్లనుచున్నాడు —

భరద్వాజ, విధాత యెవరికి విపరీతమగునో, (ప్రతికూలించక పోయినచో) వారలకు ధూళి మేరుపర్వతముతో సమానమగును తండ్రి కాల యముడగును త్రాడు సర్పమై కఱచును

చౌ॥ కాల పాఇ ముని సును సోఇ రాజా ।
భయఉ నిసాచర సహిత సమాజా ॥
దస సిర తాహి బీస భుజదండా ।
రావన నామ బీర బరిబండా ॥ 967

తా॥ ఓ మునీశ్వర ! శ్రద్ధగా వినుము సమయము రాగా పరివారసమేతముగ ప్రతాపభానుడు రావణుడను రాక్షసుడై జన్మించెను అతనికి పదితలలు ఇరువది చేతులుండెను అతడు ప్రచండవీరుడు మరియు శూరు

చౌ॥ భూప అనుజ అరిమర్దన నామా ।
భయఉ సో కుంభకరన బలధామా ॥
సచివ జో రహా ధరమరుచి జాసూ ।
భయఉ బిమాత్ర బంధు లఘు తాసూ ॥ 968

తా॥ ప్రతాపభానుని సహోదరుడైన అరిమర్దనుడు బలాతిబలుడై కుంభకర్ణుడుగ జన్మించెను. ప్రతాపభానుని మంత్రియగు ధర్మరుచి రావణుని కనిష్ఠ సహోదరుడుగా జనించెను.

చౌ॥ నామ బిభీషన జేహి జగ జానా ।
బిష్ణుభగత బిగ్యాన నిధానా ॥
రహే జే సుత సేవక నృప కేరే ।
భఏ నిసాచర ఘోర ఘనేరే ॥ 969

తా॥ అతని నామధేయము విభీషణుడు. జగమంతయు లోకప్రసిద్ధుడైనదే. విభీషణుడు విష్ణుభక్తుడు, జ్ఞానవిజ్ఞానముల కాటపట్టయినవాడు.

ప్రతాపభానుని పుత్రులును సేవకులెల్లరును భయంకర రాక్షసులుగ ప్రభవించిరి.

చౌ॥ కామరూప ఖల జినస అనేకా ।
కుటిల భయంకర బిగత బిబేకా ॥
కృపా రహిత హింసక సబ పాపీ ।
బరని న జాహిం బిస్వ పరితాపీ ॥ 970

తా॥ ఆ రాక్షసులందరును అనేకజాతులలో కామరూపులు దుష్టులు, కుటిలులు భయంకరులు వివేకరహితులు, నిర్దయులు, హింసాకాండ కాటపట్టయినవారు, పాపులు, ప్రపంచమునకు దుఃఖమునొసగు వారలునైరి. ఆ రాక్షసులను వర్ణించుట కే మాత్రము సాధ్యముగాదు.

దో॥ ఉపజే జదపి పులస్త్యకుల పావన అమల అనూప ।
తదపి మహీసుర శాప బస భఏ సకల అఘరూప ॥ 971

తా॥ అట్టివారైనను వారందరును పులస్త్యఋషి పవిత్రమైన, నిర్మలమైన అనుపమమైన కులమునందు పుట్టిరి కాని బ్రాహ్మణుల శాపకారణమున అంద రును పాపాత్ములైరి

చౌ॥ కీన్హ బిబిధ తప తీనిహుఁ భాఈ ।
పరమ ఉగ్ర నహిఁ బరని సో జాఈ ॥
గయఉ నికట తప దేఖి బిధాతా ॥
మాగహు బర ప్రసన్న మై తాతా ॥ 972

తా॥ సహోదరులు ముగ్గురును కఠోరమైన తపము నాచరించిరి దానిని వర్ణించుటకు తరముగాదు వారొనరించెడు అఖండమైన తపమును గాంచి బ్రహ్మదేవుడు వారిని సమీపించి యిట్లనియె - "నాయనలారా! నేను ప్రసన్నుడ నైతిని, వలయు వరమును వేడుడు"

చౌ॥ కరి బినతీ పద గహి దససీసా ।
బోలేఉ బచన సునహు జగదీసా ॥
హమ కాహు కే మరహి న మారేఁ ।
బానర మనుజ జాతి దుఇ బారేఁ ॥ 973

తా॥ అనిన రావణు డత్యంత వినయముతో బ్రహ్మపాదములను బట్టు కొని యిట్లనియె - "ఓ జగదీశ్వరా! వానరులు, మానవులు ఈ రెండు జాతుల తప్ప మాకు ఎవరివలనను మరణము సంభవింప కుండునట్లు వరమును ప్రసా దింపుము"

చౌ॥ ఏవమస్తు తుమ్హ బడ తప కీన్హా ।
మైఁ బ్రహ్మాఁ మిలి తేహి బర దీన్హా ॥
పుని ప్రభు కుంభకరన పహి గయఉ ।
తేహి బిలోకి మన బిసమయ భయఉ ॥ 974

తా॥ (శివుడు పార్వతి కీవిధముగ జెప్పుచున్నాడు) "పార్వతీ! నేనును బ్రహ్మయు కలిసి అటులే నీ తపస్సు ఫలించును గాక!" యనిచెప్ప

ఆ వరము నొసగితిమి తరువాత బ్రహ్మ కుంభకర్ణుని కడకేగెను వానిని గాంచి బ్రహ్మ విస్మయ మొందెను

చౌ॥ జౌం ఏహిం ఖల నిత కరబ అహారూ ।
వ్హోఇహి సబ ఉజారి సంసారూ ॥
సారద ప్రేరి తాసు మతి ఫేరీ ।
మాగేసి నీద మాస షట కేరీ ॥ 975

తా॥ ఈ దుష్టుడు నిత్యము ఆహారమును గైకొన్నచో ప్రపంచమంతయు నిడగును అని మనుకొని ఎలది బ్రహ్మ వాని బుద్ధిని మార్చుమని సరస్వతిని ప్రేరేపించెను అందువలన కుంభకర్ణుడు ఆరుమాసముల నిద్రను గోరెను

దో॥ గఏ బిభీషన పాస పుని కహేఉ పుత్ర బర మాగు ।
తేహిం మాగేఉ భగవంత పద కమల అమల అనురాగు ॥976

తా॥ తర్వాత బ్రహ్మ విభీషణుని కడకేగి, ఓ పుత్రా! నీలయు వరమును వేడు" మనెను అప్పుడు విభీషణుడు భగవానుని చరణకమలములపై నిర్మలము, నిష్కామము, అయిన అనన్య ప్రేమ నొసగు మని వేడెను ఇట్లు విభీషణుడు పరమభక్తిని గోరెను

చౌ॥ తిన్హహి దేఇ బర బ్రహ్మ సిధాఏ ।
హరషిత తే అపనే గృహ ఆఏ ॥
మయ తనుజా మందోదరి నామా ।
పరమ సుందరీ నారి లలామా ॥ 977

తా॥ విభీషణు నభీష్టము నెరవేర్చి బ్రహ్మ వెడలిపోయెను ముగ్గురన్న దమ్ములును ఎంతో సంతోషములతో స్వగృహములకు విచ్చేసిరి

మయుడను దానవు డొకడుండెను మయుని పుత్రికయే మందోదరి ఆమె అత్యంతసౌందర్యవతి, సుగుణవతి, నారీలలామ

చౌ॥ సోఇ మయఁ దీన్హ రావనహి ఆనీ ।
హోఇహి జాతుధానపతి జానీ ॥
హరషిత భయఉ నారి భలి పాఈ ।
పుని దోఉ బంధు బి ఆహేసి జాఈ ॥ 978

తా॥ మయుడు తన పుత్రికయైన మండోదరిని రావణునకిచ్చి వివాహము జేసెను రావణుడు రాక్షసులకు రాజగునని మయునకు దెలిసియుండెను

అత్యంత వినయవతి, సుశీలయైన భార్యను పొంది, రావణుడు మిగుల హర్షించెను రావణుడు తన సహోదరులకుఁ గూడ తగు కన్యలను దెచ్చి శుభ ముహూర్తమున వివాహమహోత్సవమును జరిపించెను

చౌ॥ గిరి త్రికూట ఏక సింధు మఝారీ ।
బిధి నిర్మిత దుర్గమ అతి భారీ ॥
సోఇ మయ దానవఁ బహురి సఁవారా ।
కనక రచిత మనిభవన అపారా ॥ 979

తా॥ సముద్రమును నడుమ బ్రహ్మచే స్వయముగ నిర్మింపబడిన త్రికూట పర్వతముపై నొక్క విశాలమైన కోటయుండెను మహామాయావియు అత్యంత శిల్పకళా నైపుణ్యముగల మయదానవుడు దాని నిర్మాత అందులో మణులతో గూడిన అసంఖ్యాకములైన సువర్ణశాల లెన్నియో గలవు

చౌ॥ భోగావతి జసి అహికుల బాసా ।
అమరావతి జసి సక్రనివాసా ॥
తిన్హ తే అధిక రమ్య అతి బంకా ।
జగ బిఖ్యాత నామ తేహి లంకా ॥ 980

తా॥ నాగకులమునకు నివాసయోగ్యమైన పాతాళలోకములో భోగవతీపుర మెటులో, ఇంద్రునికి నివాసయోగ్య ప్రదేశము స్వర్గలోకములో అమరావతీ పుర మెటులో, అటులే అంతకంటెను సుందరమైనది లంకాపురి ఇది జగత్తునందు సుప్రసిద్ధమైనది

దో॥ ఖాఈ సింధు గభీర అతి చారిహుఁ దిసి ఫిరి ఆవ ।
కనక కోటి మని ఖచిత దృఢ బరని న జాఇ బనావ ॥981

తా॥ ఆ లంకకు నలుదిక్కుల లోతైన సముద్రమున్నది. ఆ నగరము చుట్టూ బంగారుతో చేయబడి మణిమయమై బలిష్ఠమైన ప్రాకారము గలదు. ఆ ప్రాకార నిర్మాణ విచిత్రత్వమును వర్ణించుటకు సాధ్యముగాదు.

దో॥ హరి ప్రేరిత జేహిఁ కలప జోఇ జాతుధానపతి హోఇ ।
సూర ప్రతాపీ అతులబల దల సమేత బస సోఇ ॥ 982

తా॥ భగవానుని ప్రేరణచే ఏ కల్పములో, ఎవడు రాక్షసరాజైన రావణాసురుడుగా జన్మించెనో అతడు శూరవీరప్రతాపులు, అతులితబల ధాములైన తన పరిజనులతో ఆ పురమున వాసముజేయఁ దొడగెను.

## రావణుని అత్యాచారములు

చౌ॥ రహే తహాఁ నిసిచర భట భారే ।
తే సబ సురన్హ సమర సంఘారే ॥
అబ తహఁ రహహిఁ సక్ర కే ప్రేరే ।
రచ్ఛక కోటి జచ్ఛపతి కేరే ॥ 983

తా॥ పూర్వమచ్చట మహాకాయులైన రాక్షస వీరులుండిరి. దేవతలు వారందరిని యుద్ధమున సంహారించి యుండిరి. ప్రస్తుతము ఇంద్రుని ప్రేరణచే అక్కడ ఒక కోటి రక్షకులు (యక్షులు) నివసించుచుండిరి.

చౌ॥ దసముఖ కతహుఁ ఖబరి అసి పాఈ ।
సేన సాజి గఢ ఘేరేసి జాఈ ॥
దేఖి బికట భట బడి కటకాఈ ।
జచ్ఛ జీవ లై గఏ పరాఈ ॥ 984

తా॥ రావణునకా సమాచారము తెలిసి, సేనను సమకూర్చుకొని ఆ దుర్గమును (త్రికూట పర్వతమును) ముట్టడించెను. అతికాయులతో కూడిన ఆ గొప్పసేనను గాంచి, యక్షులు ప్రాణముల నరచేతిలో బెట్టుకొని పలాయనమైరి.

చౌ॥ ఫిరి సబ నగర దసానన దేఖా ।
గయఉ సోచ సుఖ భయఉ బిసేషా ॥
సుందర సహజ అగమ అనుమానీ ।
కీన్హి తహాఁ రావన రజధానీ ॥ 985

తా॥ అప్పుడు రావణుడు ఆ నగరము నంతయు పరికించెను ఆ స్థానమునకు సంబంధించిన వారెవ్వరును లేరైరి యుద్ధము చేయకయే రాజ్యము స్వాధీనమయ్యెను అతనికి స్థానసంబంధుల చింత గూడ లేక జీవితము సుఖప్రదమాయెను ఆ నగరము స్వాభావికముగా సుందరమైనది రావణాసురుడు ఆ దుర్గమున కాపలివాండ్రను నియమించి, ఆ నగరమును తన రాజధానిగా జేసికొనెను

చౌ॥ జేహి జస జోగ బాఁటి గృహ దీన్హే ।
సుఖీ సకల రజనీచర కీన్హే ॥
ఏక బార కుబేర పర ధావా ।
పుష్పక జాన జీతి లై ఆవా ॥ 986

తా॥ వారివారి యోగ్యతననుసరించి రాక్షసులకందరికిని రావణుడు గృహముల నేర్పాటు చేసి వారు సుఖముగా నివసించుటకు వసతులు కల్పించెను ఒకసారి రావణుడు కుబేరపురముపై ఒండెత్తి, అతని జయించి పుష్పకవిమానమును దెచ్చెను

దో॥ కౌతుకహీఁ కైలాస పుని లీన్హేసి జాఇ ఉఠాఇ ।
మనహుఁ తౌలి నిజ బాహుబల చలా బహుత సుఖ పాఇ॥ 987

తా॥ ఒకసారి రావణుడు కైలాస పర్వతమును గాంచి, ఆ పర్వత భారమును మోయ నిచ్ఛగించి, వినోదపూర్వకముగ ఆ పర్వతమును తన బాహువులలో చిక్కించుకొని, యవలీలగా పైకెత్తి సులువుగా క్రిందనుంచెను తన భుజబల మపార మనుకొని, సంతసించినవాడై అక్కడనుండి వెడలి పోయెను

చౌ॥ సుఖ సంపతి సుత సేన సహాఈ ।
జయ ప్రతాప బల బుద్ధి బడాఈ ॥
నిత నూతన సబ బాఢత జాఈ ।
జిమి ప్రతిలాభ లోభ అధికాఈ ॥ 988

తా॥ సుఖ సంపదలు, పుత్రులు సేన, జయము, ప్రతాపము బుద్ధి, బలము, గొప్పతనము – ఇత్యాదులు నిత్యనూతనముగ పెంపొందుచుండెను ఏ విధముగ ప్రత్యేకలాభమున లోభము పెంపొందునో అట్లు సకలసంపదలు దినదినాభివృద్ధి గాంచినవి

చౌ॥ అతిబల కుంభకరన అస భ్రాతా ।
జేహి కహుఁ నహిఁ ప్రతిభట జగ జాతా ॥
కరఇ పాన సోవఇ షట మాసా ।
జాగత హోఇ తిహూఁ పుర త్రాసా ॥ 989

తా॥ అత్యంత బలవంతుడగు కుంభకర్ణుడాతని సహోదరుడు అతనికి సరివచ్చు యోధుడు జగమున జన్మించనేలేదు వాడు మద్యపానముజేసి, ఆరు మాసముల వరకు నిద్రపోయెడివాడు అతడు మేల్కొనినంతనే ముల్లోకములు గడగడలాడి అల్లకల్లోల మగు చుండెను

చౌ॥ జౌఁ దిన ప్రతి అహార కర సోఈ ।
బిస్వ బేగి సబ చౌపట హోఈ ॥
సమర ధీర నహిఁ జాఇ బఖానా ।
తేహి సమ అమిత బీర బలవానా ॥ 990

తా॥ వాడు ప్రతిదినము భోజనము చేసినచో విశ్వమంతయు, శీఘ్రముగా సర్వనాశమగును లంకానగరము అసంఖ్యాకులైన బలపరాక్రమోపేతులకు నిలయమాయెను ఆ రణధీరులను వర్ణింప సాధ్యమా !

చౌ॥ బారిదనాద జేర సుత తాసూ ।
భట మహుఁ ప్రథమ లీక జగ జాసూ ॥
జేహి న హోఇ రన సనముఖ కోఈ ।
సురపుర నితహిఁ పరావన హోఈ ॥ 991

తా॥ మేఘనాదుడు రావణుని జ్యేష్ఠపుత్రుడు అతడు జగత్ప్రసిద్ధ యోధులలో ప్రథముడు రణరంగమున మేఘనాదునితో పోరుట కెవ్వరికిని శక్తి సామర్థ్యములు లేకుండెను స్వర్గములో అతని పేరు చెప్పిన చాలును, నిత్యము భయముచేత దేవతలెల్లరును హాహాకారములు చేయుచు నలువైపులకు పరుగిడు చుండిరి

దో॥ కుముఖ అకంపన కులిసరద ధూమకేతు అతికాయ ।
ఏక ఏక జగ జీతి సక ఐసే సుభట నికాయ ॥ 992

తా॥ రావణుని సేనలో, దుర్ముఖుడు, అకంపనుడు వజ్రదంతుడు, ధూమకేతుడు, అతికాయుడు మొదలుగా యోధులుండిరి వారొక్కొక్కరే విశ్వమంతయు జయించ గలిగిన వారు

చౌ॥ కామ రూప జానహిఁ సబ మాయా ।
సపనెహుఁ జిన్హ కే ధరమ న దాయా ॥
దసముఖ బైఠ సభాఁ ఏకబారా ।
దేఖి అమిత ఆపన పరివారా ॥ 993

తా॥ రాక్షసులందరును కామరూపులు, మాయాజాలము నెరింగినవారలు దయాధర్మములను స్వప్నములో గూడ నెరుగరు ఒకసారి రాజసభయందు, రావణాసురుడు సింహాసనాసీనుడై యుండి అగణిత పరివారముపై దృష్టి సారించెను

చౌ॥ సుత సమూహ జన పరిజన నాతీ ।
గనై కో పార నిసాచర జాతీ ॥
సేన బిలోకి సహజ అభిమానీ ।
బోలా బచన క్రోధ మద సానీ ॥ 994

తా॥ పుత్రపౌత్రాదులు కుటుంబవారులు, సేవకులు, అపారముగ నుండిరి ఆ రాక్షస జాతిని లెక్క పెట్టుటకు శక్యమా? ఆ సేనను నొక్కమారు కన్నులపండువుగ దిలకించి, సహజముగ అహంకారపూరితుడైన రావణుడు క్రోధముతో, గర్వముతో గూడిన మాటల నీవిధముగ బల్కెను

చౌ॥ సునహు సకల రజనీచర జూథా ।
హమరే బైరీ బిబుధ బరూథా ॥
తే సనముఖ నహిఁ కరహిఁ లరాఈ ।
దేఖి సబల రిపు జాహిఁ పరాఈ ॥ 995

తా॥ సమస్త రాక్షస సమూహములారా! సమస్త రజనిచరులారా! దేవతాగణములు మనకు వైరులు వారు, ఎదుట నిలబడి, యుద్ధము జేయుటకు వెనుదీయుదురు బలవంతులైన శత్రువును గాంచినచో పారిపోయెదరు

చౌ॥ తేన్హ కర మరన ఏక బిధి హోఈ।
కహఉఁ బుఝాఇ సునహు అబ సోఈ॥
ద్విజ భోజన మఖ హోమ సరాధా।
సబ కై జాఇ కరహు తుమ్హ బాధా॥ 996

తా॥ వారి మరణము ఒకే యుపాయముతో సాధ్యమగును దానిని మీకు తెలియజేసెదను, శ్రద్ధగా వినుడు వారి కత్యంత బలము నిచ్చునది బ్రాహ్మణ సంతర్పణ యజ్ఞము, హోమము - వీటిని మీరు ధ్వంసమొనరించి, అవి చేయు వారలను బాధింపుడు

దో॥ ఛుధా ఛీన బలహీన సుర సహజేహిఁ మిలిహహిఁ ఆఇ।
తబ మారిహఉఁ కి ఛాడి హఉఁ భలీ భాఁతి అపనాఇ॥997

తా॥ క్షుద్బాధచే దేవతలు పీడింపబడి తుదకు బలహీనులయ్యెదరు సహజముగా నన్ను జూడ వచ్చెదరు అప్పుడు వారిని నేను సులభముగా హత మార్చెదను లేదా వారిని బలహీనులనుగా నా యధీనుల గావించుకొని, సర్వదా పరాధీనులను జేసి విడచి పెట్టెదను "

చౌ॥ మేఘనాద కహుఁ పుని హఁకరావా।
దీన్హి సిఖ బలు బయరు బఢావా॥
జే సుర సమర ధీర బలవానా।
జిన్హ కేఁ లరిబే కర అభిమానా॥ 998

తా॥ అని చెప్పి తర్వాత మేఘనాదుని పిలిపించెను, దేవతలకు శత్రుత్వము పెంపొందునట్లు వానికిఁ జెప్పి యుత్తేజితునిఁ జేసెను మరియు నిట్లనెను —

పుత్రుడా! దేవతలు యుద్ధము జేయుటలో నిపుణులు, అంతేగాక ధీరులు బలవంతులు సమరగర్వము వారికి మెండు (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ తిన్హహి జీతి రన అనేసు బాంధీ ।
ఉరి సుత పితు అనుసాసన కాంధీ ॥
ఏహి బిధి సబహీ అగ్యా దీన్హీ ।
ఆపును చలేఉ గదా కర లీన్హీ ॥ 999

తా॥ వారిని యుద్ధమున జయించి బంధితులను గావించి తీసికొనిరమ్ము ”

అంత పుత్రుడైన మేఘనాదుడు తండ్రి యాజ్ఞను శిరసావహించెను లన్నినుసరింపుడని పరివారమునకనుజ్ఞయొసగి తాను గదాధరుడై రాజ్యవిస్తరణకై బయలుదేరెను

చౌ॥ చలత దసానన డోలతి అవనీ ।
గర్జత గర్భ స్రవహిం సుర రవనీ ॥
రావన ఆవత సునేఉ సకోహా ।
దేవన్హ తకే మేరు గిరి ఖోహా ॥ 1000

తా॥ రావణుడు పృథ్విపై నడచునపుడు భూమి గడ గడలాడెను అతని గర్జన వినిన దేవతాస్త్రీలకు గర్భస్రావము గలిగెను రావణుడాగ్రహభరితుడై వచ్చుచుండెనన్న వార్త విని దేవతలు సుమేరు పర్వత గుహాలలో దాగుకొనిరి

చౌ॥ దిగపాలన్హ కే లోక సుహాఏ ।
సూనే సకల దసానన పాఏ ॥
పుని పుని సింఘనాద కరి భారీ ।
దేఇ దేవతన్హ గారి పచారీ ॥ 1001

తా॥ రావణుడు నిర్మానుష్యమైన సమస్తసుందర, దిక్పాలలోకములనెల్ల పొందెను అతడు మాటి మాటికిని సింహగర్జనము చేయుచు, దేవతలను కయ్యమునకు పిలుచుచు వారిని పరుషముగా మాటలాడు చుండెను

చౌ॥ రన మద మత్త ఫిరఇ జగ ధావా ।
ప్రతిభట ఖోజత కతహుం న పావా ॥
రబి ససి పవన బరున ధనధారీ ।
అగిని కాల జమ సబ అధికారీ ॥ 1002

తా॥ ఏకో్న్మత్తుడై తన సాటివీరుని వెదకుచు జగమంతయు దిరిగెను, కాని ఒకనితో సమానుడైన వీరు డెందును గానరాలేదు

మానవులు, ఇంద్రుడు, వాయుదేవు, వరుణు, కుబేరుడు, అగ్ని దేవు, కాలుడు, యముడు మున్నగునధికారులను రావణుడు వెంబడించెను (ముందు దోహాలో వ్యాయము)

చౌ॥ కింనర సిద్ధ మనుజ సుర నాగా ।
హఠి సబహి కే పంథహిం లాగా ॥
బ్రహ్మసృష్టి జహఁ లగి తనుధారీ ।
దసముఖ బసబర్తీ నర నారీ ॥ 1003

తా॥ అంతేగాక కిన్నరులను, సిద్ధులను, మానవులను, దేవతలను రావణుడు వెంబడించెను బ్రహ్మసృష్టిలో శరీరధారులైన స్త్రీపురుషులెంతమంది యున్నారో అందరను రావణుని కధీనులైరి

చౌ॥ ఆయసు కరహిం సకల భయభీతా ।
నవహిం ఆఇ నిత చరన బినీతా ॥ 1004

తా॥ భయముచే అందరును రావణుని యాజ్ఞను పాలించుచుండిరి విధిగా వచ్చి వినయముతో అతని చరణములకు నమస్కరించుచుండిరి (భయముచే నమస్కరించుటయేగాని భక్తితో గాదు)

దో॥ భుజబల బిస్వ బస్య కరి రాఖేసి కోఉ న సుతంత్ర ।
మండలీక మని రావన రాజ కరఇ నిజ మంత్ర ॥ 1005

తా॥ రావణుడు తన భుజబలపరాక్రమములచే సమస్త జగత్తును తన వశము చేసికొని ఎవరిని స్వేచ్ఛగ నుండనీయలేదు ఈ విధముగ మండలీక రాజుల శిరోమణియై, (సార్వభౌముడై) రావణుడు తన ఇచ్ఛను సారముగ రాజ్యమేలె

దో॥ దేవ జచ్ఛ గంధర్బ నర కింనర నాగ కుమారి ।
జీతి బరీఁ నిజ బాహుబల బహు సుందర బర నారి ॥ 1006

తా॥ దేవతాయక్షగంధర్వమానవకిన్నర నాగకన్యలను ఉత్తమస్త్రీలను, అన్యసౌందర్యవతుల నెందఱనో, తన భుజబలముచే జయించి రావణుడు వారలను వివాహమాడెను

చౌ॥ ఇంద్రజీత సన జో కఛు కహేఊ ।
సో సబ జను పహిలెహి కరి రహేఊ ॥
ప్రథమహిం జిన్హ కహుం ఆయసు దీన్హా ।
తిన్హ కర చరిత సునహు జో కీన్హా ॥ 1007

తా॥ మేఘనాదుని కొసగిన అనుజ్ఞప్రకార మితడు నడచుకొనెను అన్నియు ముందుగనే చేసెను (రావణాసురుని ఆజ్ఞాపాలనము నందు మేఘనాదుడు కొంచెమైనను ఆలస్యము చేయలేడని భావము )

ప్రథమమున రావణుడు మేఘనాదుని కనుజ్ఞ యొసంగెను కదా దానిని అతడు పాలించిన విధానమును గూర్చి వినుడు

చౌ॥ దేఖత భీమరూప సబ పాపీ ।
నిసిచర నికర దేవ పరితాపీ ॥
కరహిం ఉపద్రవ అసుర నికాయా ।
నానా రూప ధరహిం కరి మాయా ॥ 1008

తా॥ రాక్షససేన, చూచుట కతి భయంకరముగ నుండెను వారు పాపాత్ములై దేవతలకు దుఃఖము కలిగించువారలుగ నుండిరి ఆ యసురసేన ఉపద్రవములను దెచ్చి పెట్టుచుండి, మాయచే అనేక విధములైన రూపములను ధరించుటకు శక్తిమంతమై యుండెను

చౌ॥ జేహి బిధి హోఇ ధర్మ నిర్మూలా ।
సో సబ కరహిం బేద ప్రతికూలా ॥
జేహిం జేహిం దేస ధేను ద్విజ పావహిం ।
నగర గాఉం పుర ఆగి లగావహిం ॥ 1009

తా॥ ధర్మమునకు హాని కలిగించుచుండిరి వేద విరుద్ధములైన పనులను జేయుచుండిరి ఏ యే స్థానములలో బ్రాహ్మణులను, గోవులను గాంచిరో, అ

నగరములను, గ్రామములను పురములను దహించుచుండిరి (అగ్నిజ్వాలల నాహుతి జేయుచుండిరని భావము)

చౌ॥ సుభ ఆచరన కతహుఁ నహిఁ హోఈ।
దేవ బిప్ర గురు మాన న కోఈ॥
నహిఁ హరి భగతి జగ్య తప గ్యానా।
సపనేహుఁ సునిఅ న బేద పురానా॥ 1010

తా॥ రాక్షసుల భయము వలన, శుభకార్యములైన బ్రాహ్మణభోజన సంతర్పణలు యజ్ఞములు సక్రమముగ జరుగలేదు దేవతలను, గురువులను, బ్రాహ్మణులను ఎవ్వరును భక్తితో గొల్వకుండిరి హరిభక్తికిని యజ్ఞయాగాదులకును జపతపములకును తావులేకుండెను వేద పురాణములు స్వప్నములో వినుట గూడ తటస్థింపలేదు

ఛం॥ జప జోగ బిరాగా తప మఖ భాగా శ్రవన సునఇ దససీసా।
ఆపును ఉఠి ధావఇ రహై న పావఇ ధరి సబ ఘాలఇ ఖీసా॥
అస భ్రష్ట అచారా భా సంసారా ధర్మ సునిఅ నహిఁ కానా।
తేహి బహుబిధి త్రాసఇ దేస నికాసఇ జో కహ బేద పురానా॥ 1011

తా॥ జప, తపో యోగ వైరాగ్యాదులను గూర్చి గాని, దేవతలు యజ్ఞయాగాదులలో హవిర్భాగమును స్వీకరించుటను గూర్చి రావణాసురుడు వినుట తటస్థించినచో, అప్పుడతడు స్వయముగా యజ్ఞయాగాదులను ధ్వంసమొనరించుటకు పరుగిడుచుండెను

హవనసామగ్రిని, యజ్ఞవాటికలను, నామరూపములు లేకుండ జేయుచుండెను ఋష్యాదులను బంధించి బాధించుచుండెను ఇట్లు చేయుటవలన, యావత్సాంసారిక ప్రపంచములో భ్రష్టాచరణలు మితిమీరెను ధర్మాచరణ కానరాలేదు దానిని గురించి వినిపించుటలేదు వేదములు నెవరైన చెప్పినచో, పురాణములు పఠించినచో వారిని పెక్కువిధములఁ బాధించి, రావణుడు వారిని దేశబహిష్కృతుల గావించుచుండెను (కనుక రావణాసురుడు రాజ్యము చేయునపు వేదఘోష పురాణకాలక్షేపములు—ఇత్యాది సత్కార్యము లస్తమించెను)

సో॥ బరని న జాఇ అనీతి ఘోర నిసాచర జో కరహిం ।
హింసా పర అతి ప్రీతి తిన్హ కే పాపహి కవని మితి॥ 1012

తా॥ రాక్షసులు చేసెడి అత్యాచారములను వర్ణించుట కెంతమాత్రమును సాధ్యము గాదు హింసాకాండయే వారికి ప్రీతి పాత్రము పాపమే వారి కాశ్రయము మరియు గతి కనుక పాపము చేయ కుందురా?

చౌ॥ బాఢే ఖల బహు చోర జుఆరా ।
జే లంపట పరధన పరదారా ॥
మానహిం మాతు పితా నహిం దేవా ।
సాధున్హ సన కరవావహిం సేవా ॥ 1013

తా॥ పరధనాసక్తులును, పరస్త్రీవ్యామోహ పరులును, దుష్టులును, జూదరులును విశేషముగ పెంపొందిరి మాతాపితల ఆజ్ఞను శిరసావహించువారలు లేరైరి దేవతార్చన చేయువారెందును గానరైరి సాధువులకును, సన్న్యాసులకును సేవచేయుటకు బదులు వారిచే సేవజేయించు కొనుచుండిరి

చౌ॥ జిన్హ కే యహ ఆచరన భవానీ ।
తే జానేహు నిసిచర సబ ప్రానీ ॥
అతిసయ దేఖి ధర్మ కై గ్లానీ ।
పరమ సభీత ధరా అకులానీ ॥ 1014

తా॥ [శంకరుడు పార్వతితో నిట్లనుచున్నాడు] ఓ భవానీ! ఇటు వంటి హింసాకాండ కొడిగట్టు ప్రాణులెల్లరిను రాక్షసులుగానే భావింపవలయును సుమా! ధర్మమార్గమునకు ప్రతికూలురగు నడచు వారలను అతిశయించిన చెడు పరిస్థితిని గాంచి, భూదేవి అత్యంత భయభీతయై యిట్లు దుఃఖింప సాగెను

## భూదేవి పరితాపము—బ్రహ్మ ఓదార్పు

చౌ॥ గిరి సరి సింధు భార నహిం మోహీం ।
జస మోహి గరుఅ ఏక పరద్రోహీ ॥
సకల ధర్మ దేఖఇ బిపరీతా ।
కహి న సకఇ రావన భయబీతా ॥ 1015

తా॥ భూదేవి యిట్లు పరితపించెను - పర్వతములు, సముద్రములు- వీని భారము నాకు భార మనిపించుటలేదు పరద్రోహులు, పాపాత్ములు మొదలగువారే నాకు భారభూతులు

భూదేవి ధర్మమునకు విపరీతమైన హాని కలుగుచుండుట, చూచుచునే యుండెను కాని ఆమె రావణునకు జడిసినదై యేమియు వ్యక్తపఱచలేకుండెను

చౌ॥ ధేను రూప ధరి హృదయ బిచారీ ।
గఈ తహాఁ జహాఁ సుర ముని ఝారీ ॥
నిజ సంతాప సునాఏసి రోఈ ।
కాహూ తేఁ కఛు కాజ న హోఈ ॥ 1016

తా॥ ఆలోచించి, ఆలోచించి తుదకు భూదేవి గోరూపమును ధరించి, దేవతలు, మునులు దాగియుండు స్థానమునకుఁ బోయెను భూదేవి యేడ్చుచు తన దుఃఖమును గూర్చి వారికి జెప్పుకొనెను కాని యెవరివలనను కార్యము సిద్ధింపలేదు

ఛం॥ సుర ముని గంధర్బా మిలి కరి సర్బా గే బిరంచి కే లోకా।
సఁగ గోతనుధారీ భూమి బిచారీ పరమ బికల భయ సోకా॥
బ్రహ్మాఁ సబ జానా మన అనుమానా మోర కఛూ న బసాఈ।
జా కరి తైఁ దాసీ సో అబినాసీ హమరేఉ తోర సహాఈ॥ 1017

తా॥ అప్పుడు దేవతలు, మునులు, గంధర్వులందరును గలిసి బ్రహ్మలోకమునకు (సత్యలోకము) వెడలిరి పాపము భయశోకములచే వ్యాకులత జెందిన గోరూపధారిణియైన భూదేవిగూడ వారివెంట నుండెను వీరెందుకు వచ్చిరో సర్వాంతర్యామియైన బ్రహ్మదేవుడు తెలిసికొని ఈ కార్యము సిద్ధింపజేయుట తన కెంత మాత్రము సాధ్యపడదని మనంబున నెఱిఁగిన వాడై భూదేవితో ఇట్లనియె- నీవెవరికి దాసురాలవో, ఆ అవినాశియైన భగవంతుడే మాకును నీకును సహాయకారి— (యిందు దోహాతో అన్వయము)

సో॥ ధరని ధరహి మన ధీర కహా బిరంచి హరి పద సుమిరు ।
జానత జన కీ పీర ప్రభు భంజిహి దారున బిపతి ॥ 1018

తా॥ భూదేవీ! ధైర్యము వహించి శ్రీహరి పాదపద్మములను స్మరింపుము ప్రభువు, దయాళువు, దాసులకు గలిగిన విపత్తుల నెఱిఁగినవాఁడు, నీకుఁ గలిగిన ఆపదలను దూరీకరించును.

చౌ॥ బైఠే సుర సబ కరహిఁ బిచారా ।
కహఁ పాఇఅ ప్రభు కరిఅ పుకారా ॥
పుర బైకుంఠ జాన కహ కోఈ ।
కోఉ కహ పయనిధి బస ప్రభు సోఈ ॥ 1019

తా॥ (ఇట్లు బ్రహ్మ భూదేవికి ధైర్యము చెప్పి అమెను సమాధాన పరచెను)

దేవతలందఱును ఒకచో ఆసీనులై, ప్రభువు నెచ్చట నెట్లు (భగవానుని) పొందుట అని ఆలోచింపసాగిరి ఒకరు వైకుంఠమున కేగినచో ప్రభువును గాంచవచ్చుననిరి ఇంకొకరు క్షీరసముద్రమున విష్ణుభగవానుడు నివాసము జేయు ననిరి

చౌ॥ జాకే హృదయఁ భగతి జసి ప్రీతీ ।
ప్రభు తహఁ ప్రగట సదా తేహిఁ రీతీ ॥
తేహిఁ సమాజ గిరిజా మైఁ రహేఉఁ ।
అవసర పాఇ బచన ఏక కహేఉఁ ॥ 1020

తా॥ ఎవరి హృదయాంతరాళమునందు భక్తి, ప్రేమ లెట్లుండునో భగవానుడు వారి కారీతిగనే సాక్షాత్కరించును [శంకరుడిట్లు నుడువుచున్నాడు]

పార్వతీ! ఆ సమాజమున నేను గూడ ఉంటిని సమయము జూచికొని నేనొకమాట యీ విధముగ నుడివితిని. (ముందు దోహాతో అన్వయము)

చౌ॥ హరి బ్యాపక సర్బత్ర సమానా ।
ప్రేమ తేఁ ప్రగట హోహిఁ మైఁ జానా ॥
దేస కాల దిసి బిదిసిహు మాహీఁ ।
కహహు సో కహాఁ జహాఁ ప్రభు నాహీఁ ॥ 1021

తా॥ 'నాకు తెలిసిన విషయ మేమని భగవంతుడు సర్వకాలములందును, సర్వస్థానములందును, సమానరూపముగ సర్వవ్యాపకుడు ఏదేశము ఏకాలము, ఏదిశ ఏస్థానమునందు భగవంతుడు లేడో నాకు జెప్పుడు

వి॥ హిరణ్యకశిపుడు 'హరి యెచ్చట నున్నాడో చూపింతువా? ఈ స్తంభమునందు గలడా?' యని ప్రశ్నించినపుడు ప్రహ్లాదుడు ప్రత్యుత్తర పూర్వకముగ 'ఇందుగల డందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకి చూచిన నందందే గల' డని చెప్పి 'భగవంతుడు సర్వవ్యాపకు' డన్న భావము కవి స్ఫురింపజేసెను

శ్రీ తులసీదాసు 'హరి బ్యాపక సర్వత్ర సమానా'— 'హరి సర్వవ్యాపకుడు' అని చెప్పి 'సర్వం బ్రహ్మమయం' అన్న మూల సూత్రమును పండితులకే గాక పామరులకు గూడ అర్థమగునట్లు చిన్నమాటలలో విశదీకరించినారు

చౌ॥ అగ జగమయ సబ రహిత బిరాగీ ।
ప్రేమ తేఁ ప్రభు ప్రగటఇ జిమి ఆగీ ॥
మోర బచన సబ కే మన మానా ।
సాధు సాధు కరి బ్రహ్మ బఖానా ॥ 1022

తా॥ భగవానుడు చరాచరములలో వ్యాప్తినొందినవాడు అన్నిటిని విడచి విరక్తుడు మరియు వైరాగ్యసంపన్నుడు కాని ప్రేమానురాగముల వలన భగవానుడు సాక్షాత్కరించును [అగ్ని అవ్యక్తరూపముగా సర్వత్ర వ్యాప్తి జెంది యుండును కాని యెక్కడ అరణి మంథనాది సాధనలుండునో, అచ్చట ప్రకటమగును ఆ విధముగనే సర్వవ్యాపకుడైన భగవానుడు గూడ ప్రేమచేతనే ప్రకటమగును]

నే పలికిన పలుకు లందరికిని ఇష్టము లాయెను బ్రహ్మగూడ సాధు- (బాగు) అనిచెప్పనన్ను ప్రశంసించెను

